శ్రీరామ శ్శరణం మమ.

# ఆశ్చర్యరామాయణము

## బాలకాండ ద్వితీయభాగము

(ఆంధ్రతాత్పర్యసహితము)

ఇయ్యది

శ్రీరామకథావైచిత్ర్యములం దెలిసికొనంగోరువారల

కత్యంతోపయుక్త మగునట్టుల

రామపుత్రగ్రామనివాసులును బెజవాడ హిందూహైస్కూలులో

ప్రధానసంస్కృతపండితులును రామాయణకేసరీత్యాది

బిరుదాంకితులు నగు బ్రహ్మశ్రీ

## లక్కావఝల వేంకటకృష్ణశాస్త్రిచే

నలుబది రామాయణములనుండి

సమకూర్పంబడి

పండితులచే పరిష్కృతమై గ్రంథకర్తచే ప్రకటింపంబడినది.

ది ౮–౧౦–౧౯౩౬



[ వెల రు [illegible]-౦-౦

## పోషకుల వివరము.

# మహారాజపోషకులు.

| | | |
|---|---|---|
| మ.రా.శ్రీ | శిష్టా సోమయాజులు అసిస్టెంటు సర్జను గారి జ్ఞాపకార్థము వారికుమారుడు గోపాలకృష్ణమూర్తిగారు L. M. P., జగన్నాథపురఅగ్రహారం. | 50 0 0 |
| ,, | చెన్నూరు వేంకటనరసింహారావుగారు దేశముఖులు, పెదవీడు. | 30 0 0 |
| ,, | చుండూరి వేంకటరెడ్డిగారు, B.A., ఆంధ్రఇంజనీరింగుకంపెనీ, బెజవాడ. | 25 0 0 |
| ,, | దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, బెజవాడ. | 20 0 0 |
| ,, | రాజా మంత్రిప్రగడ వేంకటహనుమంతరావుగారు, లింగగిరి. | 20 0 0 |
| ,, | గుళ్ళపల్లి రామదాసు అనే రామబ్రహ్మం గారు, భూస్వాములు, కురుమద్దాలి. | 20 0 0 |
| ,, | ఘడియారం కామయ్యగారు, బెజవాడ. | 20 0 0 |

# అంకితసమర్పణమ్



శ్రీభద్రాచలరామచంద్ర! చరణద్వంద్వే త్వదీయే మయా
లక్కావఝుల కృష్ణనామకభవద్దాసేన సంగుంభితం
భక్త్యా చాంకితరూపతో ఽర్పిత మిదం త్వాశ్చర్యరామాయణం
జీయా దారవిచంద్రతారక మలం మచ్ఛ్రేయసే భూయసే.

# ఆద్యవచనం.

ఆశ్చర్యరామాయణ నామకో ఒయం గ్రంథః ప్రాక్తన కవిగృహీత కథాసందర్భ వైచిత్ర్య సంయుతో ఒపూర్వ విషయనిరూపణప్రమాణపదవీ మధిరూఢః అనేకరామాయణ కథావిశేషై ర్మృదుమధురశయ్యయా మయోపనిబద్ధ శ్లోకైశ్చిత్రై ర్యుక్తో జనహృదయంగమః విదుషాం ప్రమోద మాతనోతీ త్యభిప్రైమి. ఏతద్గ్రంథ నిర్మాణస్య ముఖ్యోద్దేశాః

1. నానారామాయణాంతర్గతకథావైచిత్ర్య నివేదనం.
2. వాల్మీకిరామాయణస్థితశ్లోకానాం ధర్మతాత్పర్యకత్వ నివేదనం.
3. రామాయణాంతర్గతసందేహ నివారణం.
4. రామాయణాంతర్గత పాత్ర పూర్వజన్మవృత్తాంత నివేదనం.

ఏతాదృ గయం గ్రంథః మహాశయానా మాదరాభిమానా వాస్వాదయిష్యతీతి సాహసేన.

ఏతద్గ్రంథాంతర్గత కథావిశేషా స్సమరసభావేన సమన్వయదృష్ట్యా చ పఠతాం శృణ్వతాం చ పరమం శ్రేయో భవిష్యతీతి విశ్వాసేన చాహ మిమం గ్రంథం విరచితవా నస్మి. పురాణ మిత్యేవ న సాధు సర్వమితి కవికులగురువచనం సమ్యగనుసంధాయార్వాచీనరామాయణ మిత్యనుపేక్ష్య చ మయాచోప నిబద్ధ మిమ మామూలచూడం సంపఠ్య మదీయశ్రమం సఫలం కుర్వం త్వితి ప్రార్థయే.

ఇత్థం గ్రంథరచయితా,
లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రీ.

శ్రీ గణేశాయనమః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీరస్తు

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# ఆశ్చర్యరామాయణమున

# బాలకాండమున

# ద్వితీయభాగప్రారంభము

తా॥ శౌనకాది మహర్షులు సూతునిచేఁ జెప్పఁబడిన శ్రీరామ జననము మొదలగు కథలను విని సూతునితో నివ్విధముగఁ బలికిరి. (ఏమన) ఓరోమహర్షణుడా! శ్రీరామ జననము శ్రీరామ లీలలు మొదలగు సత్కథలను నీవలన మేము విని ధన్యులమైతిమి. అని, (సూతునకే రోమహర్షణుడని నామాంతరము).

తా॥ మహర్షులు మఱియు నివ్విధముగఁ బలికిరి. ఓ సూతుడా! శ్రీరామ జనన కథయను నమృతమును శ్రోత్రములనెడు దోసిలలతోఁ బానముఁజేసినను సీతా జనన వృత్తాంతమునుఁగూడ విననిదే మా మనస్సులకుఁ దృప్తిలేకుండయుండెను. మఱియు రామచరితమునకు సీత మూలకారణము కాన మొదట సీతాజన్మ వృత్తాంతమునుఁ జెప్పి పిమ్మట శుభప్రదమగు రామకథనుఁ జెప్పుమని మహర్షులు సూతునిఁ బ్రార్థించిరి.

సూతః ॥శ్లో॥ ధన్యాయూయంహివిప్రేంద్రాః తే,షాంశ్రో
మతిరీదృశీ।

పురైవం పార్వతీ ప్రశ్న మకరో త్పరమేశ్వరం।
శివేనకథితం దేవ్యై వక్ష్యేహం శృణుత ద్విజాః॥ ౪-౫
1 పద్మాక్షనామా నృపతిః పురా కల్ప దభూ ద్ద్విజాః॥
సదృష్ట్వా సకలా న్లోకా న్లక్ష్మీకామైకతత్పరః।
చింతయామాస మనసి లక్ష్మీం కన్యాం కరోమ్యహం।
ఇతి నిశ్చిత్య మనసి తప స్తీవ్రం చకార సః॥ ౬-౭
తతః ప్రసన్నా కమలా సా[illegible]బ్రవీత్।
పరతంత్రాస్మ్యహం రాజన్ శ్రీహరిం ప్రార్థయ[illegible]
సచే ద్దాస్యతి తే మాం హి భవేయం దుహితా తవ।
ఇత్యుక్త్వాఽంతర్దధే రాజా తప స్తీవ్రం చకార తం॥ ౮-౯

తతః ప్రసన్నం వరదం నత్వా ప్రాహ హరిం నృపః।

దేహికన్యాంరమాంత్వంమే ప్రసన్న శ్చేద్భవాన్మయి॥ ౧౦

పద్మాక్షాయ వితీర్యాథ మాతులుంగఫలం హరిః।
స్వాయు మంతర్దధే పశ్చా త్ఫలం భిత్వా నృపాలకః।
కన్యాందదర్శస్వర్ణాభాంమేనేతాంనృపతిస్సుతాం॥ [illegible]౪
సాఽవర్ధత నృపస్యాంకే యథా చంద్రకలా శు[illegible]।
శుక్లపక్షే చ తాం దృష్ట్వా పద్మాక్షోఽచింతయద్ధృది॥ ౧౫

1 ౭॥ గా

౪ ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! సీతాజననాది వృత్తాంతమును గూడ
౫ వినవలయుననెడి బుద్ధి మీకు కలిగినందున మీరలు ధన్యాత్ములరు.
మీరు ప్రశ్నించిన విధముననే పూర్వము పార్వతి పరమేశ్వరుని
ప్రశ్నింపగా శంకరుడు పార్వతికిఁ జెప్పియుండెను. దానినే
మీకుఁ జెప్పెదను వినుడని సూతుడు చెప్పనారంభించెను.

౬ తా॥ ఓ మహర్షులారా! పూర్వకాలమునందు పద్మాక్షుడను రాజు
౭ సంపత్కాముఁడగు జనులనందఱినిఁ జూచి తానుకూడ నైశ్వర్య
కాముఁడై సాక్షాల్లక్ష్మీదేవినే తనకుఁ బుత్రికనుగాఁ బొందఁదలచి
యా లక్ష్మినిగూర్చి తీవ్రమైన తపమునుఁ జేసెను.

౮ తా॥ పిదపఁ గొంతకాలమునకుఁ బద్మాక్ష మహారాజునకు లక్ష్మీ
దేవి ప్రత్యక్షమై యీక్రిందివిధముగఁ బలికెను. ఓ పద్మాక్ష మహా
రాజా! నన్నుఁ బుత్రికనుఁ గాఁగోరి నీవు తపము చేయుచుంటివి యని
యెఱుగుదును. కాని నేను పరాధీనురాలను. కాన నీవు శ్రీహరినిఁ
బ్రార్థింపుము. ఆ శ్రీహరి నన్ను నీకిచ్చినచో నీకుఁ బుత్రికనుగా
నగుదునని చెప్పి లక్ష్మీదేవి యంతర్ధానముకాగాఁ బిదప పద్మాక్ష
మహారాజును శ్రీహరినిగూర్చి తీవ్రమైన తపమునుఁ జేసెను.

౯ పిమ్మట శ్రీహరి ప్రత్యక్షముకాగాఁ బద్మాక్షమహారాజు శ్రీ
హరికి నమస్కరించి యివ్విధముగఁ బలికెను. ఓ భగవానుడా; నా
విషయమై నీవు ప్రసన్నుడవైనచో లక్ష్మీదేవిని నాకుఁ బుత్రికనుగా
నిమ్మనెను.

అనంతరము శ్రీహరియును పద్మాక్షమహారాజున కొక మాతీఫలము
నిచ్చి తానంతర్ధానముకాగా నారాజు మాతీఫలమును విచ్చుదీసి
చూడ నందులో సువర్ణచ్ఛాయగల యొక కన్యక యుండెను. ఆ
కన్యకను తన కొమరితనుగా భావించుకొనెను.

శుక్లపక్షమునందుఁ జంద్రకళ యభివృద్ధియగునట్టుల నాకన్యక
పద్మాక్షుని యింటఁ దినదినమునకుఁ బెఱుగుచుండగా నా పద్మాక్షుడును
మనస్సునందిట్టుల నాలోచించెను.

కస్మై దేయా మయా కన్యాహ్యస్యై యోగ్యోవరస్త్వితః।
ఇతిసంమంత్ర్య నృపతి స్స్వయంవర మథాఽదిశత్ ॥౧౩॥
స్వయంవరాయ పద్మాక్షః పత్త్రై రాకారయ న్నృపాన్।
యయు శ్శృంగారసంయుక్తా నృపాలా స్తు స్వయంవరం।
యయు ర్దేవా స్సగంధర్వా దానవా మానవాః ఖగాః।
సర్వాన్సమాగతాన్దృష్ట్వాపద్మాక్షః ప్రాహతాన్నృపతి౧౪-౧౫॥
ఆకాశనీలవర్ణేన య స్స్వాంగం పరిలేపయేత్।
దదామి తస్మై కన్యాం మే సత్యం జ్ఞేయం వచో మమ॥౧౬॥
తద్రాజవచనం శ్రుత్వా పద్మాసౌందర్యమోహితాః।
తాం హర్తుం తేసముద్యుక్తాః దానవాదుష్టబుద్ధయః॥౧౭॥
చకార సంగరం తైస్స పద్మాక్షో రోమహర్షణః
తదా నిహతో దైత్యైః పద్మాక్షో సమరే నృపః॥౧౮॥
తత స్తే మిళితా స్సర్వే తాం ధర్తుం దుద్రువు ర్జవాత్
సా దృష్ట్వా ధర్తుముద్యుక్తా న్జుహావాఽగ్నౌ కళేబరం॥౧౯॥
పద్మాక్షనృపతే ర్లక్ష్మీసంగా జ్జాతేదృశీ దశా
తస్మాన్నమునయో లక్ష్మీం కామయంతి కదాచన॥౨౦॥
లక్ష్మ్యై చిత్తస్య చాంచల్యం భయం శోకో వధోఽపి చ।
భవత్యేవ మహాద్దుఃఖం తస్మాత్తాం పరివర్జయేత్ ॥౨౧॥

ఆశ్చర్యరామాయణ బాలకాండ పారాయణాదౌ

# ధ్యానశ్లోకాః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥

సంసారతాపయుక్తానాం జంతూనాం హతచేతసాం
శ్రీమద్రామాయణాఖ్యానపీయూషం భేషజం స్మృతం॥

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్।

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజంవానరయూథముఖ్యంశ్రీరామదూతంశిరసానమామి॥

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపం
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి॥

మాతా రామో మత్పితా రామభద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః
సర్వస్వం మే రామచంద్రో దయాళు
ర్నాన్యం దైవం నైవ జానే న జానే॥

శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాత స్సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో నిరంతరం మంగళ మాతనోతు॥

# విజ్ఞప్తిః



భో భో మహాశయా స్సావధానా మదీయా మిమాం విజ్ఞప్తిం శృణుతే త్యభ్యర్థయే. యదనాదిపరమేశ్వరో నిజేచ్ఛయా జగ దుత్పాద్య తస్య శిక్షాప్రదగ్రంథా వేదశాస్త్రాదీని ప్రావర్తయత్, యస్య శాసనం యథావిధ్యనుసృత్య ప్రజా స్స్వస్వజనీ స్సఫలా శ్చక్రు, స్తస్య శాసనరూపా [illegible] స్సర్వః గతేషు యుగేషు క్రమా ద్వినశ్యే దితి కలిదోషేణ మందబుద్ధయో జనా ఉత్పత్స్యం తీతి చ మత్వా పరమకృపాళునా వాల్మీకినా మహర్షిణా కలిమలాపనోదనాయ రామాయణం తద్వినిర్మితం యత్సేవయా సర్వేషా మైహికాముష్మికసుఖప్రాప్తిః కరతలామలకవ ద్భవేత్, యస్మిన్ శ్రీరామకథా [illegible] పరా సోపానశ్రేణీవ సువిస్తృతా ఽస్తి, యస్యా ఆశ్రయేణ జనా ముక్తిసౌధ మధిరుహ్యు రితి, ఏవ మేవ మార్కండేయాగస్త్యదూర్వాసాదయో ఽపి స్వస్వనామభిః ప్రసిద్ధా న్యవాంతరకథావైచిత్ర్యయుక్తాని రామాయణాని కృతా నీతి తత్ర భవద్భిర్భవద్భి ర్విదిత మే వైతత్.

తాదృశేషు రామాయణేషు సత్సు కిమర్థ మపూర్వో ఽయమారంభ ఇత్యాశంకాయాం సమాధీయతే. యత ఆంగ్లవిద్యాబలేనాధునాతనానాం నవనవప్రీతిమతాం పురాతనేషు రామాయణాదిష్వనాదరో ధర్మవిచ్ఛేద శ్చేత్యేవ మాదయో దోషవిశేషాః ప్రతిదినం వివర్ధమానా దరీదృశ్యంతే. యత ఏకరామాయణ

# విజ్ఞప్తి



ఓమహాశయులారా! నావిజ్ఞప్తిని సావధానముగ వినుడని ప్రార్థించుచున్నాడను. ఆద్యంతరహితుడగు నే పరమేశ్వరుడు నిజేచ్ఛచే జగత్తును బుట్టించి యా జగచ్ఛిక్షణమునకై వేదశాస్త్రాదులను బ్రవర్తింపఁ జేసెనో, యెవని శాసనమును యథావిధిగ ననుసరించి ప్రజలు తమ జన్మములను సార్థకములనుఁగా జేసికొనిరో యా పరమేశ్వరుని శాసనరూపమగు వైదికధర్మము యుగములు గతించినకొలది క్రమముగ నశింపఁగలదనియుఁ గలిదోషముచే మందబుద్ధిగల జనులు పుట్టగలరనియుఁ దలచి కలిమలాపనోదనమునకై పరమకృపాళుడగు వాల్మీకిమహర్షి యేరామాయణమును సేవించుటచే జనుల కండఱకు నైహికాముష్మిక సుఖప్రాప్తి కరతలామలకము కాగలదో, యేరామాయణమునందు రామకథాపరంపర మిక్కిలి విస్తృతముగా నుండెనో, యేకథాపరంపర యనెడి నిచ్చెనయొక్క సహాయముచే మోక్షసౌధమును జను లెక్కఁగలరో యారామాయణమును నమ్మహర్షి రచించెననియు, నిర్విఘ్నముగనే మార్కండేయాగస్త్యదూర్వాసాది మహర్షులును దమతమ నామములచేఁ బ్రసిద్ధములగు నవాంతరకథావైచిత్ర్యములుగల రామాయణములను రచించిరనియు మీకెల్లరకుఁ దెలిసిన విషయమే.

ఆరామాయణములన్నియు నుండగ నీక్రొత్త యుద్యమ మేలయని యాశంక కలుగును. అందులకు సమాధానము చెప్పఁబడుచున్నది.— క్రొత్త క్రొత్త వానియందుఁ బ్రీతిగల యాధునికుల కాంగ్లవిద్యాబలముచేఁ బురాతనములగు పురాణరామాయణాదులం దనాదరము కలుగుచుండుట వలనను, నొక రామాయణమును గూడ సాంగముగ జూచుటకు నసమర్థులగు జనులకు సర్వరామాయణములనుఁ జూచుభాగ్యము లభింపదను కారణము వలనను

మపి సాంగతయా నిరీక్షితు మశక్తానాం జనానా మనేకరామా యణదర్శనభాగ్యం నసంభవేత్, అతః కాలానుసారేణ రామా యణాదిష్వపి కించి త్పరివర్తన మవశ్యం కరణీయ మితి తత్త ద్రామాయణాంతర్గతకథావిశేషా నేకత్ర సంగ్రథ్య ప్రకా శీకరణం భక్తజనోపయుక్త మితిచ మత్వా చత్వారింశద్రామ కథానకసారభూత మిద మాశ్చర్యరామాయణం మయా వినిర్మి తమ్. అస్మిన్ గ్రంథే క్వచి దన్యత్ర సంక్షిప్తతయా వర్ణితా న్కథాభాగా న్విపులీకృత్య, క్వచి దన్యత్ర విస్తృతతయా వర్ణితా న్కథాభాగా న్సంగ్రహీకృత్యచ, క్వచి త్తత్తద్రసపోషణార్థం మహాకవికృతానేవ శ్లోకా నుపనిబధ్య, క్వచి త్స్వతంత్రేణ మదాశయా నపి ప్రదర్శయిత్వా, క్వచి ద్వాల్మీకిరామాయణ శ్లోకానాం ధర్మతాత్పర్యకత్వం ప్రకాశయిత్వా క్వచి త్పరా క్షేపా న్పరిహృత్య, తత్రత త్రేతివృత్తసంధానార్థ మర్థాధికా న్శ్లోకా న్స్వయం విరచయ్యచ, యథా మదీయగ్రంథనామ సార్థకం భవే త్తథా ఽఽశ్చర్యకథాశ్చ సంయోజ్యచ మహతా ప్రయాసే నేమం గ్రంథం సాంద్రతాత్పర్య ముపనిబద్ధవా నహ మితీమం గ్రంథ మామూలచూడం పశ్యతా మేవ స్ఫుటీభవిష్య తీతి నాస్తి మే విశేషతః కథనీయావసరః.

ఏతాదృశి ప్రయాసే కృతేఽపి పోషకసహాయాభావే త్వేత న్ముద్రాపణ భక్తజనసమర్పణ తత్పాఠన రూప దేశసేవాకరణ భాగ్యం మమ న సంభవే దేవ. తత్తత్పోషకమహాశయానాం భూరివిరాళదానేనైవ ముద్రితోఽభూ దితి కథయితు మధునా ఽవకాశో లబ్ధ ఇతి మహా నానందో బోభవీతి.

# రాజపోషకులు (రు 15 లు)

మ.రా.శ్రీ వద్దిరాజు వేంకటరంగారావుదొరగారు, మట్టెవాడ.
,, తంగెళ్ళ నాగేశ్వరరావుగారు
బొంబాయిట్రేడింగుకంపెనీ, బెజవాడ.
,, వేము సుబ్రహ్మణ్యంగారు, భూస్వాములు, ఏలూరు.
,, మాజేటి శేషగిరిరావుగారు మర్చెంటు యేలూరు.
,, శ్రీకృష్ణా అండ్ గోపాలకృష్ణా నావిగేషన్
కంపెనీ గుమాస్తాలసంఘంవారు, బెజవాడ.
,, సుంకు సత్యనారాయణగారు, మర్చెంటు, బెజవాడ.
,, కంకిపాటి సీతారామారావుగారు, నేలకొండపల్లి.
,, నేతి వేంకటాద్రియయ్యగారు, వకీలు, రాజమండ్రి.
,, నేమశెట్టి సూర్యనారాయణగారు, తల్లాడ.
,, హరి రామయ్యగారు, చిలుమూరు.
,, రుమాళ్ళ కుమారస్వామిగారు, సికిందాబాదు.
,, కందిబండ యోగానందరావుగారు, కంభంమెట్టు.
కొమరగిరి రాఘవరావుగారు, గండేపల్లి.
,, కొంపెల్ల హనుమంతరావుగారు, కంభంమెట్టు.



# ప్రధానపోషకులు (రు 10 లు)

మ.రా.శ్రీ పిసిపాటి వేంకటేశ్వర్లుగారు, బెజవాడ.
,, కనుమూరు సింహాద్రిరాజుగారు,
మునిసిపల్ కంట్రాక్టరు, బెజవాడ.

మ.రా.శ్రీ మాశెట్టి హనుమయ్యగారు, వకీలు, సికింద్రాబాద్.
,, మంత్రిప్రగడ రాఘవరావుగారు, లింగగిరి.
,, దేవస్థానం అర్చకసంఘమువారు, చిన్నతిరుమల.
,, వానపాల బసవరాజుగారు, ముత్యాలంపాడు.



## పోషకులు (రు 5 లు)

మ.రా.శ్రీ దశిక సూర్యనారాయణగారు, బెజవాడ.
,, ములుకుట్ల వేంకటలక్ష్మీనరసింహంగారు, Cashier Imperial Bank of India, Bezwada.
,, దొంతరాజు హనుమంతరావుగారు, బెజవాడ.
,, యల్లంరాజు ఉమామహేశ్వరావుగారు బెజవాడ.
,, కొత్తూరు ఉమామహేశ్వరావుగారు, బెజవాడ.
,, శలాక రామయ్యగారు, బెజవాడ.
,, భాగవతుల సుబ్రహ్మణ్యంగారు, బెజవాడ.
,, కశిలంక వెంకటావుగారు ,,
,, రుద్రంరాజు సూర్యనారాయణరాజుగారు ,,
,, తిరుమలశెట్టి రామారావుగారు, బెజవాడ.
,, భాగవతుల కోనమ్మగారు, బెజవాడ.
,, తూతిక రామానుజయ్యగారు, ఏలూరు.
,, గూటాల సత్యనారాయణగారు, Deputy Inspector of Schools, Ellore.
,, శ్రీధర రంగారావుదొరగారు, కంభంమెట్టు.
,, తుర్లపాటి వెంకటేశ్వరావుగారు, కంభంమెట్టు.
,, కలవల రాజారామ్‌గారు, వకీలు, కంభంమెట్టు.

మ.రా.శ్రీ గొట్టిపర్తి సుబ్బారావుగారు, శింగరేణికాలరీస్.
,, మోటమర్రి రాఘవులు అండ్ బ్రదర్సు, పేరాల.
,, మంత్రిప్రగడ వేంకటరామారావుగారు, లింగగిరి.
,, కొండపల్లి సీతారామారావుగారు, బొమ్మకల్లు.
,, పలివెల శేషగిరిరావుగారు, బొమ్మకల్లు.
,, రావులపాటి గోపాలరావుగారు, నేలకొండపల్లి.
,, చలసాని వేంకటసుబ్బయ్యగారు, ఉప్పలూరు
,, తీగవరపు సీతారామయ్యగారు, రాఘవపురం.
,, దేవినేని కాకుళస్వామిగారు, పెదముత్తేవి.
,, సామంతపూడి కృష్ణంరాజుగారు, బొబ్లాపల్లి.
,, గుండావఝుల రాఘవయ్యగారు, పుణ్యపూరు,
,, వనం కృష్ణమూర్తిగారు, వకీలు, మానుకోట.
,, కొమరగిరి వేంకటేశ్వరరావుగారు, వకీలు ,,
,, గోవిందాచార్యులుగారు, వకీలు, మానుకోట.
,, ఆలూరు చలపతిరావుగారు, మానుకోట.
,, చీమకుర్తి నాగభూషణంగారు, మానుకోట.
,, గుడిపాటి సుబ్రహ్మణ్యంగారు, తేలప్రోలు.
,, పర్సా పట్టాభిరామయ్యగారు, దేశముఖ్, కారేపల్లి.
,, పర్సా రామనాథంగారు, దేశముఖ్, కారేపల్లి.
,, కోలేటి సీతారామానందరావుగారు, పెంగోలను.
,, పూటుకూరు వేంకటాద్రిమారావుగారు, పెంగోలను.

పై పోషకవర్గమువారిలో విరాళముల నీయనివారలు విశేషముగా గలరు. కాన వెంటనే యీయ ప్రార్థితులు.

# పండితాభిప్రాయాః

శ్రీ సనాతనమతప్రచారిణీపత్రికాప్రచారం కుర్వాణో మమ హస్తే కశ్చన గ్రంథరాజః ప్రవిష్టస్తం తు దృష్ట్వా కో ఽయం గ్రన్థరాజ ఇతి సవిమర్శం దృష్టవానస్మి.

తద్దర్శనమాత్రేణాశ్చర్యప్రవాహస్సంజాతస్తదను కిం వా ఽస్య నామ? కో వా రచయితేతి ముఖపత్రసందర్శనేన విశయో నివృత్తః. ఏతద్గ్రంథాన్తర్గతకల్పనాచాతుర్యం కస్య చేతసి తోషాకరం న భవతి, వినా పశుఘ్నాత్.

పూర్వస్మిన్వాల్మీకి రేవ రామచరితవర్ణనే సమర్థ ఆసీ ద్గైర్వాణ్యా వాణ్యా తదాది తాదృశగ్రంథరచయితా తత్రాప్యే తాదృశవిశేషసంయోజయితా న హ్యేతావద్దృష్టః, అహో! ఏతద్గ్రంథమాధుర్యం రసపోషణమానందయితృత్వం చ.

కిము వర్ణనీయమేతద్గ్రంథపాఠకానామనవద్యం పురుషార్థచతుష్టయసంబన్ధో భవిష్యతీతి.

గ్రంథస్యాస్యాశ్చర్యరామాయణస్య రచయితారో రామాయణకేసరీ రామాయణతీర్థేత్యాది బిరుదావళీవిరాజమానాః బ్ర. వే. లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిణః నవీనవాల్మీకిన ఇత్యపి వక్తవ్యాః. ఏవమేవ పరాక్షేపపరిహారపూర్వకం విరోధాభాసాన్పరిహరంతో హ్యేతాదృశగ్రంథరాజాన్విరచయన్తస్సనాతనమతప్రచారం కుర్వన్తశ్చిరం జీయాసురితి శ్రీరామచంద్రం సప్రణామమభ్యర్థయే.

భట్నవిల్లి,
అమలాపురం తాలూకా,
గో॥ జిల్లా, 28-12-35.

ఇతి సనాతనమతప్రచారిణీపత్రికాసంపాదకః,
న్యాయవేదాన్తవిద్యాపారీణః,
బులుసు అప్పన్నశాస్త్రీ.



# పండితాభిప్రాయములు. (తర్జుమా)

శ్రీసనాతనమతప్రచారిణీపత్రికాప్రచారమును జేయుచున్న నా యొక్క హస్తమున నొక గ్రంథరాజము ప్రవేశించెను. ఆ గ్రంథమును జూచి యీ గ్రంథరాజ మేమి యని సవిమర్శముగాఁ జూచితిని.

దానిని జూచినమాత్రముననే యాశ్చర్యప్రవాహము కలిగినది. ఈ గ్రంథము పేరేమి? ఈ గ్రంథరాజమును రచించినవా రెవరు? అను సంశయము ముఖపత్రమును జూచుటచేతనే నివర్తించెను. ఈ గ్రంథములోని కల్పనాచాతుర్యము కటికివానికిఁ దప్ప యితరున కెవనికి సంతోషకరము కాకుండ నుండును?

పూర్వము వాల్మీకియే సంస్కృతమున రామచరిత్రమును వర్ణింప సమర్థుఁ డయ్యెను. తదాదిగ నట్టిగ్రంథమును రచించువారును, నందునను నిట్టి విశేషములను సమకూర్చినవారును నింతదనుక కన్పడి యుండలేదు. ఈ గ్రంథమాధుర్యము, రసపోషణము ఆనందజనకమై యాశ్చర్యకర మైనది.

ఈగ్రంథపాఠకుల కవశ్యము పురుషార్థచతుష్టయము కలుగు నని వేఱుగఁ జెప్పున దేమి?

రామాయణకేసరీత్యాది బిరుదాంకితులును నీ గ్రంథరాజమును రచించినవారు నగు బ్రహ్మశ్రీ లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిగారు నవీనవాల్మీకు లనియుఁ జెప్పఁ దగియున్నారు. శ్రీశాస్త్రులవారు ఈ ప్రకారముగఁ బరాక్షేపములను బరిహరించుచు, విరోధాభాసములను బరిహరించుచు నిట్టి గ్రంథంరాజములను రచించుచు సనాతనమతప్రచారమును జేయుచుఁ జిరకాలము సర్వోత్కర్షముచే నుండుదురుగాత యని నమస్కారపూర్వకముగ శ్రీరామచంద్రమూర్తిని బ్రార్థించుచున్నాఁడను.

భట్నవిల్లి,
అమలాపురం తాలూకా,
గోదావరిజిల్లా,
28—12—35.

ఇట్లు
సనాతనమతప్రచారిణీ సంపాదకులును,
న్యాయవేదాంత విద్యాపారీణులు నగు
బులుసు అప్పన్నశాస్త్రి.

శ్రీమద్భిః విజయవాటికాపురస్థిత హిందూస్నత పాఠశాలాప్రధానసంస్కృతోపాధ్యాయైః రామాయణ కేసరీత్యాది బిరుదాంకితైః లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిభిః పరిశోధ్య నితరాం సర్వేషు రామాయణేషు గతాః కథాః మహతా ప్రయత్నేన తత్తత్కథామూలభూతకథావిశేషాంశ్చ బహుపురాణేభ్యశ్చ సంగృహ్య అతికోమలయా మృద్వ్యా శయ్యయా విరచితో ఽయ మాశ్చర్యరామాయణనామకో ఽయం గ్రంథః మయా సమ్యక్పరిశీలితః, పఠితశ్చ, తత్ర తత్ర శ్రుతశ్చ శ్రీమద్భిః శాస్త్రిభి రావేదితః పరమాం ప్రీతి మజీజనత్. తైః పండితవర్యైః తత్తత్కథాసందర్భసంధాయకా శ్చ గీర్వాణ్యా వాణ్యా విరచితాః అనుష్టుబాదిఛందోబద్ధాః శ్లోకాః తత్తదితివృత్తసంధానచతురాః దరీదృశ్యంతే. ఏభి ర్గుణైః పరిపూర్ణో ఽయం గ్రంథః విదుషాం సంతస మాతనోతీతి మ మాభిప్రాయః. స ఏష గ్రంథః ముద్రాపితః శాస్త్రిమహాశయానాం కీర్తిం వైదుష్యం ప్రకాశయతీతి అధ్యేతౄణాం శ్రోతౄణాం చ ప్రమోదం వితర తీతి నిశ్శంకం వక్తుం న కో ఽపి సందేహః.

బందరు, 2—4—36.

శిష్టా నరసింహశాస్త్రీ,
న్యాయవేదాంతశాస్త్రపారీణః,
బందరు రిటైర్డు నోబిల్ కలాశాలా సంస్కృతోపన్యాసకః.



మ.రా.శ్రీ యాతవాకిళ్ళ బలరామయ్యగారు, కంభంమెట్టు.
,, వేముగంటి రామకృష్ణారావుగారు, వకీలు ,,
,, జమలాపురపు వేంకటేశ్వరరావుగారు ,, ,,
,, బూరుగడ్డ రామానుజాచార్యులుగారు ,, ,,
,, పెరవల్లి అనంతరామయ్యగారు ,,
,, సర్వదేవరభొట్ల వేంకటరాజయ్యగారు, ,,
,, యాతవాకిళ్ళ వేంకటనారాయణరావుగారు ,,
,, రెండుచింతల వెంకటపతిగారు, ,,
,, గుట్ట్యాల అచ్యుతరామారావుగారు, కంభంమెట్టు.
,, కేతముక్కల సుబ్రహ్మణ్యంగారు, కంభంమెట్టు.
,, సుగ్గల వేంకటనాగలింగంగారు, మర్చంటు ,,
,, సుగ్గల పురుషోత్తంగారు, మర్చంటు ,,
,, సుగ్గల అక్షయలింగంగారు, మర్చంటు ,,
,, పెండ్యాల యజ్ఞనారాయణగారు ,,
,, నెలమంగళం సీతారామారావుగారు, డాక్టరు ,,
,, అంబడిపూడి రామకృష్ణశాస్త్రిగారు, మాటూరు.
,, తమ్మా రంగారెడ్డిగారు, Vakil, గుంటూరు.
,, పాటిబండ రాజేశ్వరరావుగారు, గుంటూరు.
,, మాజేటి హనుమంతరావుగారు ,,
,, వేలూరు శివావధానులుగారు ,,
,, అవ్వారి శేషగిరిరావుగారు ,,
,, తుర్లపాటి వీరరాఘవయ్యగారు, పామర్రు.
,, వడ్డి లక్ష్మీనరసింహంగారు Sub-Registrar ,,
,, వి. సుబ్బరామయ్యగారు, డాక్టర్, పామర్రు.

మ.రా.శ్రీ ఏరువు మాచమ్మగారు, పామర్రు.
,, పుళ్ళకండం సత్యనారాయణగారు, మధిర.
,, అకినేని పుల్లయ్యగారు, మర్చంటు, మధిర.
,, కందిబండ వేంకటపురుషోత్తమరావుగారు, మధిర.
,, మాటూరు రంగారావుగారు, ,,
,, అయనాపురపు వేంకటరమణయ్యగారు, ,,
,, శివరాజు వీరభద్రరావుగారు, మడిపల్లి.
,, గురిజాల రామచంద్రరావుగారు, తల్లాడ.
,, గురిజాల వేంకటేశ్వరావుగారు ,,
,, తేరాల అంతయ్యగారు ,,
,, నేరెళ్ల నరసింహంగారు ,,
,, వరవరరావుగారు, పేష్కారు, గార్ల.
,, చిలుకూరు శ్రీరాములుపంతులుగారు, గార్ల.
,, బోనగిరి కనకయ్య అండ్ బ్రదర్సువారు, గార్ల.
,, పుల్లకండం సత్యనారాయణ గారు,
,, చందా సత్యనారాయణగారు ,,
,, వద్దిరాజు రామరంగారావుగారు, మట్టెవాడ.
,, చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికింద్రాబాద్.
,, బూరుగుల మహాదేవుగారు, శ్రీమంతులు ,,
,, ముత్యాల వేంకటకృష్ణయ్యగారు, ,, ,,
,, అమ్మనబ్రోలు రామస్వామిగారు ,, ,,
,, చీకోటి వీరన్నగారు,షావుకారు ,,
,, డాక్టరు సుందరంగారు ,,

బెజవాడపురమునందలి హిందూహైస్కూల్‌లో ప్రధాన సంస్కృత పండితులును, రామాయణకేసరీత్యాది బిరుదాంకితులు నగు బ్రహ్మశ్రీ లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిలవారు సర్వరామాయణములయందలి కథలను మిక్కిలి పరిశోధించియు, గొప్పప్రయత్నముచే నాయాకథలకు మూలభూతమగు కథావిశేషములను బహుపురాణములనుండి సంగ్రహించియు మిక్కిలి మృదుశయ్యతో రచించిన యాశ్చర్యరామాయణ మను గ్రంథమును నేను పరిశీలించితిని; చదివితిని; మఱియు శాస్త్రిలవారి ముఖమునుండి కూడఁ గొన్ని భాగముల నచ్చటచ్చట వినియుంటిని. ఈగ్రంథము నాకు మిక్కిలి సంతోషమును గలిగించెను. ఆయాకథాసందర్భములను సమకూర్చుటకును, నితివృత్తానుసంధానమునకును సంస్కృతమున శాస్త్రిలుగారిచే రచింపఁబడిన యనుష్టుప్ఛందోబద్ధములగు శ్లోకములు నీగ్రంథమున మిక్కిలిగాఁ గన్పడుచున్నవి. ఇట్టి సద్గుణములచేఁ బరిపూర్ణమయిన యీగ్రంథము పండితులకు సంతోషమును గూర్ప సమర్థమైన దని నా యాశయము. ఆ యీగ్రంథము ముద్రింపఁబడినదై శ్రీశాస్త్రిమహాశయుల కీర్తిని, వైదుష్యమును బ్రకాశింపఁజేయఁగలదనియుఁ, జదువువారికిని వినువారికిని సంతోషమును గలుగఁజేయుననియు నిశ్శంకముగాఁ జెప్పుట కెట్టి సందేహమును లేదు.

బందరు,
2—4—36.

శిష్ట్లా నరశింహశాస్త్రి,
తర్కవేదాంత శాస్త్రపారంగతులు,
నోబిల్ కాలేజీ రిటైర్డు సంస్కృతోపన్యాసకులు.



రామాయణకేసరీత్యాది బిరుదభూషితబ్రహ్మశ్రీ లక్కా-వఝుల వేంకటకృష్ణశాస్త్రిభి రుపనిబద్ధ మాశ్చర్యరామాయణం కార్యవశా ద్విజయవాటికా ముపగతేన మయా ఖిస్తీయ 1936 ఆగస్టుమాసే ఏకవింశే దివసే గ్రంథకర్తు ర్మహాదేవా శ్రావిషి కేషుచిద్భాగేషు, బహుధా పరిశోధనేన పురాణానా ముపనిబద్ధత్వేన గ్రంథ స్యాస్య పామరాణాం పండితానా మపి అనాయాసేన బహువిషయసమర్పకత్వేన ఉపయుక్త తేతి విశ్వసిమి. కథాసంవిధానాదిసప్రమాణం సోపపత్తికం చ దృశ్యతే. గ్రంథానా మేతాదృశా మాదరః దేశాభ్యుదయ మభిలషతాం సర్వేషా మావశ్యక మి త్యభిప్రైమి.

నెల్లూరు, 21—8—36. } గాజులపల్లి హనుమచ్ఛాస్త్రీ,
ప్రిన్సిపాల్, వేదసంస్కృత కళాశాలా.



రామాయణకేసరీత్యాది బిరుదావళీ విరాజమానై ర్లక్కా-వఝుల వేంకటకృష్ణశాస్త్రిభి ర్విరచిత మాశ్చర్యరామాయణ మిద మామూలచూడం సమద్రాక్షం ప్రబంధే ఽస్మిన్ శాస్త్రిచరణై శ్శ్రవణమాత్రేణ భక్త్యుద్బోధకానాం నానావిధాఖ్యాయికానాం గ్రథనేన మహీయా న్విచిత్రవిశేష స్సమదర్శి. శ్రీశాస్త్రిణాం ప్రబోధమహిమ్నా కలిమలా దజ్ఞా స్సంతరిష్యం త్యేవేతి విశ్వసిమి. ఏతేషాం సముద్యమస్య భగవా నంబికానాథః సహాయో బోభవీ త్వితి పరం ప్రార్థయామి.

పైడిమఱ్ఱి చంద్రశేఖరశాస్త్రీ,
శ్రీజగద్గురు విరూపాక్ష సంస్థానవిద్వాన్.

రామాయణకేసరీత్యాది బిరుదభూషితు లగు బ్రహ్మశ్రీ లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిగారిచే నుపనిబద్ధమైన యాశ్చర్యరామాయణమును కార్యవశముచే బెజవాడపురమునకు వచ్చిన నేను 1936 ఆగష్టుమాసమున నిరువదియొకటవ దినమున గ్రంథకర్తసుఖమునుండియే కొన్నిభాగములను వినియుంటిని. ఈగ్రంథము అనేకవిధములుగఁ బురాణములను బరిశోధించి కూర్పఁబడినదియగుటచేతను, ననాయాసముగ బహువిషయములను సమర్పించునది యగుటచేతను బండితులకును, పామరులకును నుపయుక్త మని విశ్వసించుచున్నాను. కథాసంవిధానాదికము సప్రమాణముగను, సోపపత్తికముగను గన్పడుచున్నది. దేశాభ్యుదయమును గోరు జనులందఱకును నిట్టి గ్రంథములయం దాదరణ మావశ్యక మని యభిప్రాయపడుచున్నాను.

నెల్లూరు,
21—8—36.

గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి,
ప్రిన్సిపాల్, వేదసంస్కృతకళాశాల.



రామాయణకేసరీత్యాది బిరుదావళీవిరాజమానులగు లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రులవారిచే రచింపఁబడిన యీ యాశ్చర్యరామాయణమును నామూలాగ్రముగఁ జూచితిని. శ్రవణమాత్రముచేతనే భక్త్యుద్బోధకములగు నాఖ్యాయికల నీగ్రంథమునందు శాస్త్రులవారు సమకూర్చుటచేతను, గొప్పయాశ్చర్యవిశేషమును జూపించిరి. శ్రీశాస్త్రులవారిప్రబోధముచే నజ్ఞానులు కలిమలమునుండి విముక్తులు కాగల రని విశ్వసించెదను. శ్రీశాస్త్రులవారి యుద్యమమునకు భగవంతుఁ డగు నంబికానాథుఁడు సహాయుఁ డగుఁ గాక యని మిక్కిలి ప్రార్థించుచున్నాఁడను.

పైడిమఱ్ఱి చంద్రశేఖరశాస్త్రి,
శ్రీజగద్గురు విరూపాక్షసంస్థానవిద్వాంసులు.



బ్రహ్మశ్రీ లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిగారి

# ఆశ్చర్యరామాయణ ప్రశంస.

శ్రీమత్పరదేవతాయై నమః.

దృష్టం మయా కృష్ణబుధప్రణీత
మాశ్చర్యరామాయణకావ్య మేతత్
సంపాదితం లోకవిధేరివాగ్రం
స్థాలీపులాకా దిహ తత్ర తత్ర.

ఈ మెయి మీరు బుద్ధిబల మెంతయు వర్ధిలఁ గూర్చినట్టి శ్రీ
రామకథాచరిత్రను గరం బనురక్తి ముడంబు గాంచినా
మే మల గీష్పతినాయులకు నీఁగిన మానవజిహ్వికుడౌ గనం
బో; మఱి పోయినో; యొసఁగనోపు హిమామోదకభంగి గ్రోలుటన్.

ఇట్లు,
సత్యదుర్గేశ్వరకవులు,
శతావధానులు, కడియం.



మ॥ కర మాశ్చర్యముఁ గూర్చు సంగతుల సంగత్యా, సార్థకాఖ్యంబుఁ గానం
గ రచింపంబడె మీనుకావ్యము సుధీగణ్యంబు, మాన్యంబు భా
స్కరచంద్రంబుగ డంబు గాంచుతను, విశ్వస్తోత్రపాత్రంబునౌ
గరిమం గాంచియుఁ గృష్ణశాస్త్రికవి! శక్యంబే నిను న్మెచ్చఁగన్.

చ॥ చదివిన విన్న యంతకును సంతస మెక్కుడు గూర్చు నుండెఁ బ్రాఁ
జదువుల మెప్పుఁ గొన్న బుధసత్తము రాము గణించు మంట ని
య్యది యిహాముం బరంబును రయంబున నిచ్చుతఁ బాతకాళిచే
ముదమిడె మాకు, నిట్లె యశముం గొనుమా కృతకార్యదీక్షతన్.

బెజవాడ,
17—10—36.

ఇట్లు ఆశుకవిసమ్రాట్టులు, శతావధానులు,
కొప్పరపు సోదరకవులు.



గాలానుసారముచే రామాయణాదులయందును మార్పుచేయుట సమంజస
మనియు నాయా రామాయణాంతర్గతకథావిశేషముల నొక్కచో సంగ్ర
హముగఁ గూర్చి ప్రకటనచేయుట భక్తజనోపయుక్తమనియుఁ దలచి
నలుబది రామకథానకముల సారమైన యీ యాశ్చర్యరామాయణము నాచే
నిర్మింపబడియె. ఈగ్రంథమునందుఁ గొన్ని స్థలములలో నితర రామాయణ
ములలో సంక్షిప్తముగ వర్ణింపఁబడిన కథాభాగములను విస్తరింపఁజేసియు,
నితర రామాయణములయందు విస్తృతముగ వర్ణింపఁబడిన కథాభాగములను
నీరామాయణమున సంగ్రహింపఁజేసియు, మఱికొన్ని స్థలములయందు
రసపోషణార్థమై మహాకవులచే రచింపఁబడిన శ్లోకముల నుపనిబంధిం
చియుఁ, గొన్నిస్థలములయందు స్వతంత్రాశయములను జూపియు, నొక్కొక
స్థలమున వాల్మీకిరామాయణశ్లోకములకు ధర్మతాత్పర్యమును బ్రకటన
చేసియు, మఱికొన్నిస్థలములయందుఁ బరాక్షేపములను బరిహరించియు,
నచ్చటచ్చట నితివృత్తానుసంధానార్థమై సగముకంటె నెక్కుడుగ స్వీయ
ముగ శ్లోకములను రచించియు, నాగ్రంథనామము నిరర్థకముకాకుండ నుండు
నటుల నాశ్చర్యకథలను సమకూర్చియుఁ గొప్ప ప్రయాసముచే నేనీ గ్రంథ
ము నాంధ్రతాత్పర్యయుతముగ నిర్మించితి ననువిషయ మీగ్రంథము
నామూలాగ్రముగఁ జూచినవారలకు స్పష్టము కాగలదు కాన నేను విశేష
ముగఁ జెప్పవలసిన యవసరములేదు.

నే నింత ప్రయాసపడి యీగ్రంథమును నిర్మించినను బోషకుల సహా
యములేనిచో నేనీ గ్రంథమును ముద్రింపించుట, భక్తజనులకు సమర్పించుట,
భక్తజనులచేఁ జదివింపఁ జేయుట యను దేశసేవచేయు భాగ్యము నాకు
సంభవింపకపోవును. ఆయాపోషకమహాశయుల భూరివిరాళదానముచేత నే
యీగ్రంథము ముద్రితమైనదని చెప్పుటకు నిప్పు డవకాశము లభ్యమైనందున
గొప్పసంతసముగా నున్నది.

ఏతద్భాగముద్రాపణే త్వనివార్య కారణాంతరవశేన కించిత్కాలవిళంబో ఽభవ దితి వక్తు మహా మేన లజ్జితో భవామి. బాలకాండ ద్వితీయభాగ స్యైతస్యాపి విపశ్చిదాం నూతనబహువిషయసమర్పకత్వేన ప్రమోదావహత్వం భవే దితి విశ్వసిమి. అస్మి న్భాగే సీతాపూర్వజన్మవృత్తాంతవర్ణనం, సీతాలీలాదివర్ణనం, సీతాకర్తృకకన్యాతులసీవ్రతాచరణవర్ణన, మరుంధతీశాప తత్పరిహారవర్ణనం, రామరావణయోః కలహబీజ సంస్థాపనార్థం దేవైః పరస్పరం సమాలోచనవర్ణనం, రావణం ప్రతి దేవై ర్నారదప్రేషణవర్ణనం, నారదప్రేరితేన దశవదనేన కౌశికాధ్వరవిఘాతాయ సుబాహుమారీచాది ప్రేషణవర్ణనం, తాటకాపూర్వజన్మవృత్తాంతవర్ణన, కరాళమారీచసంవాదవర్ణన, మహాల్యోత్పత్తితద్వివాహవర్ణనం గుహపూర్వజన్మవృత్తాంత వర్ణనం, ధనురుద్ధరణార్థ మాగతస్య రావణస్య పరాభవవర్ణనం, ముద్గలాశ్రమవృత్తాంతవర్ణన మిత్యాదయో బహవో ఽభినవా విశేషా స్సంతీతి ప్రాక్తనరచనాభ్యః ప్రకృతరచనాయాం విశేషో ఽస్తీతి విజ్ఞాప్యతే. అస్మి న్భాగే తత్రతత్ర ముద్రణప్రమాదా న్మత్ప్రమాదాద్వా యది దోషా దృశ్యేరన్ గుణదోషపత్రికావలోకనేన శుద్ధా న్కృత్వా సంపఠ్య మామకీనాపరాధం క్షమధ్వ మి త్యభ్యర్థయే.

పోషకమహాశయానాం విజ్ఞాపనీయ మన్య దస్తి. బాల కాండప్రథమభాగముద్రాపణస్య షట్ఛతరూపికాపర్యాప్తం ముద్ర

ఈ భాగమును ముద్రింపించుటలో ననివార్య మగు కారణములవలన గొంచెము కాలవిళంబము కలిగెనని చెప్పుటకు నేనే లజ్జించుచుంటిని. ఈ బాలకాండ ద్వితీయభాగము పండితులకు నూతనబహువిషయము లను సమర్పించునది యగుటచేఁ బ్రమోదకరమగునని విశ్వసించుచుంటిని. ఈభాగమున సీతాపూర్వజన్మవృత్తాంతవర్ణనము, సీతా లీలావర్ణనము, సీత కన్నెతులసీవ్రతము నాచరించుటయు, నరుంధతి సీతను శపించుటయుఁ, దిరిగి యనుగ్రహించుటయు మొదలగు వర్ణనము, రామరావణులకుఁ గలహబీజ మును స్థాపింపఁజేయుటకు దేవతలు పరస్పర మాలోచించుటయు నారదుని బంపుటయు నారదుడు లంక కేగి రావణుని బ్రేరేపింప రావణుడు విశ్వా మిత్రియాగవిఘాతమునకై సుబాహుమారీచాదులఁ బంపుటయు మొదలగు వర్ణనము, తాటకాపూర్వజన్మవృత్తాంతవర్ణనము, కరాళమారీచుల సంవాద వర్ణనము, అహల్యోత్పత్తి తద్వివాహ వర్ణనము, గుహపూర్వజన్మవృత్తాంత వర్ణనము, ధనుర్భంగసమయమున రావణుని పరాభవవర్ణనము, ముద్గలాశ్రమ వృత్తాంతవర్ణనము మొదలగు ననేకములగు నూతనాంశములు ప్రకృత గ్రంథమునం దుండుటవలనఁ బూర్వరామకథానకములకంటె దీనియందు విశేష మున్నదని విన్నపము. ఈభాగమున నచ్చటచ్చట ముద్రణప్రమా దము వలనగాని, నాప్రమాదము వలనఁగాని దోషములు కన్పడినచోఁ దప్పొప్పులపట్టికను జూచి శుద్ధములనుగా జేసికొని చదివి నాయపరాధమును క్షమింపనలయునని ప్రార్థించుచున్నాడను.

పోషక మహాశయులకు విన్నవింపఁదగినది మఱియొకటి కలదు. (ఏమన) బాలకాండ ప్రథమభాగమును ముద్రింపించుటకు నాయువందల

ణవ్యయో ఽభూత్. తస్మి న్పోషకేభ్య స్సమాగతాని చతు
శ్శతరూప్యాణి. శేషవ్యయస్తు మచ్ఛ్రయాదేవ సంవృత్తః. ద్వితీ
యభాగ స్యైత స్యాపి వ్యయస్తు తస్మా దధిక ఏవాభూత్. పోషక
మహాశయై ర్వాగ్దత్తాని విరాళాని షట్ఛతరూప్యపర్యంతకాని
సంతి. పరంతు ఏతావత్తు దత్తాని చతుశ్శతరూప్యా ణ్యేవ. ఏతే
ష్వపి మార్గవ్యయో ఽపి సంమిళిత ఏవాస్తి. దాతవ్యాని విరాళాని
పోషకమహాశయై స్సత్వరం యది దీయేర న్నాగిభాగముద్రణ
స్యావకాశ స్సత్వరం భవే దిత్యభ్యర్థయే. విజ్ఞాపనీయ మిద
మన్య చ్చాస్తి. భావిభాగానా మపి పోషకమహాశయా స్సహాయం
కృత్వా మదీయోద్యమం సఫలం కుర్వం త్వితి చ సంప్రార్థయే.

## కృతజ్ఞతానివేదనమ్.

ఏత ద్భాగముద్రణార్థం ప్రథమతః హస్తావలంబన
ప్రదానాం మహారాజపోషకపదాశ్రితానాం శిష్టా గోపాల
కృష్ణమూర్తి చుండూరు వేంకట రెడ్డి ప్రభృతీనాం, రాజపోషక
పదాశ్రితానాం తంగెళ్ళ నాగేశ్వరరావు ప్రభృతీనా, మవ
శిష్టానాం ప్రధానపోషక పోషకపదాశ్రితానాంచ శ్రీరామ
చంద్రప్రసాదేన బహూని శ్రేయాంసి భవం త్వితి శ్రీరామ
చంద్రం సప్రణామం సంప్రార్థ్య విరమ్యతే.

ఇత్థం గ్రంథరచయితా,
లక్కావఝుల వేంకట కృష్ణశాస్త్రీ.



రూప్యముల పర్యంతము ముద్రిణవ్యయమయ్యెను. అందులోఁ బోషకులవలన నాలుగువందల రూప్యముల పర్యంతము వసూలైనది. మిగిలినది నాచేతినుండి పెట్టఁబడినది. ద్వితీయ భాగమునకును ముద్రిణాదివ్యయ మంతకంటె నధిక మయ్యెను. పోషకమహాశయులు వాగ్దత్తముచేసిన విరాళముల మొత్తము ఆఱువందలపర్యంత ముండునుకాని, యింత పర్యంతము వసూలైనది నాలుగువందలపర్యంతమే యై యున్నది. ఇందునను మార్గవ్యయము మిళితమై యున్నది. ఈయవలసిన విరాళములను పోషకమహాశయులు సత్వరముగ నిచ్చినచో ముద్రింపఁదగిన భాగములను దొందరగ ముద్రించుట కవకాశము సంభవించు నని ప్రార్థించుచున్నాఁడను. మఱియొక విన్నపముకూడఁ గలదు. ముద్రింపఁబోయెడి భాగములకును పోషకమహాశయులు సహాయమును జేసి నాయుద్యమమును సఫలమును జేయుదురుగాత యని ప్రార్థించుచున్నాను.

## కృతజ్ఞతానివేదనము.

ఈభాగమును ముద్రింపించుటకు మొదలు నాకు జేయూతనొసగిన వారను మహారాజ పోషకపదము నాశ్రయించిన వారు నగు శిష్ట్లా గోపాల కృష్ణమూర్తి, చుంచూరు వేంకటరెడ్డి మొదలగు మహారాజపోషకులకును, రాజపోషకస్థానీయు లగు తంగెళ్ళ నాగేశ్వరరావు మొదలగు రాజపోషకులకును, మిగిలిన ప్రధానపోషకులకును, బోషకులకును శ్రీరామచంద్రుని యనుగ్రహముచే సకలశ్రేయస్సులు కలుగు గాక యని శ్రీరామచంద్రమూర్తిని నమస్కారపూర్వకముగఁ బ్రార్థించుచు విరమించుచున్నాఁడను.

ఇట్లు గ్రంథరచయిత,

లక్కావఝుల వేంకట కృష్ణ శాస్త్రి.



శ్రీమదాశ్చర్యరామాయణ బాలకాండ ద్వితీయభాగమందు

# విషయానుక్రమణిక.



| సర్గ. | విషయము. | పుట మొదలు—వరకు. |
| --- | --- | --- |

శ్రీ రా మ

శు భ మ స్తు

అ వి ఘ్న మ స్తు

గ ణే శా య న మః.

# ఆశ్చర్యరామాయణే బాలకాండే

# ద్వి తీ య భా గ ప్రా ర ం భః

ఋషయః॥శ్లో॥రోమహర్షణ!సర్వజ్ఞశ్రుత్వాతవముఖాంబుజాత్

ధన్యా వయ మభూమ శ్రీరామ జన్మాది సత్కథాః॥ ౧

శ్రోత్రాంజలిభ్యాంపీత్వాఽపి శ్రీరామజననామృతం।
న తృప్తిం యాంతి చిత్తాని సీతాజన్మశ్రుతిం వినా॥ ౨

కించ శ్రీరామచరితే యత్సీతా మూలకారణం।
తత్సీతాజన్మకర్మాణి ప్రోక్త్వాఽథా రోమహర్షణ
పశ్చాద్రామకథాంబ్రూహిపూర్వోక్తానంతరీంశుభాం॥ ౩౪

౧౩½ (ఏమనగా) నేనీకన్య నెవనికీయుదును. ఈ చిన్నదానికిఁ దగినవరు డెవడు! అనివిచారించి పద్మాక్షుడు స్వయంవరము నేర్పాటుచేసెను.

౧౪ ఆ స్వయంవరమునకుఁ బద్మాక్షమహారాజు శుభలగ్న పత్రికలచే
౧౫½ రాజులనందఱను నాహ్వానింపగా నారాజులందఱును, అలంకారములనుఁజేసికొని స్వయంవరమంటపమున కేగిరి. మఱియు నచ్చటకు దేవతలు గంధర్వులు, దానవులు, మానవులు మొదలగువారందఱును వచ్చిరి. ఇట్లు స్వయంవరమునకు వచ్చినవారినందఱితో పద్మాక్షుడిటులఁబల్కెను.

౧౬½ ఓసభ్యులారా! మీలో నెవడు నీలమేఘచ్ఛాయతో సమానమగు శరీరకాంతి కలిగియుండునో వానికి నాకన్యక నిచ్చెదను. నావాక్యమును సత్యముగా నమ్ముడని పద్మాక్షుడు పలికెను.

౧౭½ దుష్టబుద్ధిగల దానవులు, ఆపద్మాక్షుమహారాజు చెప్పిన వాక్యమును విని యాకన్యకయొక్క సౌందర్యముచే మోహితులై యాకన్యకను హరింప నుద్యుక్తులైరి.

౧౮½ అప్పుడు పద్మాక్షమహారాజు దానవులతో యుద్ధమునుఁజేసి యాయుద్ధములో దైత్యులచే సంహరింపఁబడెను.

౧౯½ అనంతరము వారలందఱు నేకమై యాపద్మాక్షుని కన్యకనుఁ బట్టుకొనుటకుఁ బరుగిడగాఁ దననుఁ బట్టుకొనుటకు నుద్యుక్తులగు నాదానవులను నాకన్యక చూచి వారివశమగుటకు నిష్టములేక వెంటనే తానగ్నిలోఁ బ్రవేశించెను.

౨౦½ పద్మాక్షమహారాజు లక్ష్మిని కోరినందుననే యతనికి నిట్టి యవస్థ సంభవించెను. కావుననే మహర్షులెప్పుడును లక్ష్మినిఁ గోరరని చెప్పఁబడుచున్నది. తెలియఁగనగును.

౨౧½ లక్ష్మినిఁగోరువారికి చిత్తచాంచల్యము, భయము, శోకము, మహాదుఃఖము, మృతియును గలుగును. కాన లక్ష్మినిఁ బరిత్యజింపవలయును.

కదాచి త్సా మాతులుంగీ కుశధ్వజతపస్వినః ।
వేదపాఠం కుర్వత శ్చ ప్రాదుర్భూతా పుర స్తతః॥ ౨౨

తాం పుత్రికాభావనయా ప్రేమ్ణా రక్షతి స్మై మునిః ।
నామ్నా వేదవతీ సాఽపి వవృధే తస్య వేశ్మని॥ ౨౩

సాఽప్యాశ్రమం కల్పయిత్వా కామయంతీ హరిం పతిం।
తప శ్చరంతీ తీవ్రం స్మై తస్థౌ వేదవతీ ద్విజాః॥ ౨౪
ఏతస్మి న్నంతరే తత్ర సమాగత్య దశాననః।
తపశ్చరంతీంతాందృష్ట్వాప్రాహతాంకామమోహితః॥ ౨౫

1 నహీదృశోపమా త్వన్యా దృశ్యతే భువి సువ్రతే।
సంపూర్ణకాంతిమ ద్భద్రే వదనం తే వరాననే।
నకలంకేన చంద్రేణ కథ మాప్నోతి మర్త్యతాం ౨౬-౨౭
జటామాలాజినధరా కిమర్థం త్వం తపస్యసి
వృణుష్వ మాం వరారోహే పతిత్వే వరవర్ణిని
ఆక్రమ్యాఽక్రమ్యలోకాంస్త్రప్రధానా యా మయాహృతాః
స్త్రియః కురుష్వ సర్వాసాం తాసాం స్వామ్య మనిందితే॥
విక్రమే త్రిషు లోకేషు న మే కుమ న విద్యతే౨౮-౨౯

---

1 విష్ణు॥ ధ॥ పు॥

౨౨॥ పద్మాక్షుని పుత్రికయును లక్ష్మ్యంశ సంభూతురాలు నగు మాతు
లుంగియను నాకన్యక యగ్నిలోఁ గొంతకాలము దాగియుండి
యొకప్పుడు బృహస్పతికుమారుడగు కుశధ్వజమహర్షి వేదపాఠ
మునుఁ జేసికొనుచుండ నామహర్షి ముందట శిశురూపముతోఁ
బ్రాదుర్భవించెను.

౨౩॥ ఆకుశధ్వజమహర్షియును తనకు సంతానములేనందున నాకన్యకను
బుత్రికాభావనతోఁ బెంచుకొనుచుండెను ఆకుశధ్వజుడు వేదపాఠ
మునుఁ జేయుసమయమున నాకన్యక యావిర్భవించినందున వేదవతి
యని యాకన్యకకు నామకరణముచేసెను. ఆ వేదవతి యను కన్యక
కుశధ్వజమహర్షి గృహమునందుఁ బెఱుగుచుండెను.

౨౪॥ ఆ వేదవతియును నొక యాశ్రమమునుఁ గల్పించుకొని శ్రీహరినిఁ
బతినిగాఁగోరి తీవ్రమగు తపమునుఁ జేయుచుండెను.

౨౫॥ ఈ సమయమున రావణుడెచ్చటనుండియో యచ్చటకు వచ్చి
తపస్సునుఁ జేయుచున్న యా వేదవతినిఁ జూచి కామమోహితుడై
యామెతో నిట్లుఁ బలికెను.

౨౬-౨౭-౨౮-౨౯ ఓ వ్రతశీలురాలా! భూలోకమున నీతో సమానమగు సౌంద
ర్యవతిని నెచ్చటను జూచియుండలేదు. ఓ మంగళప్రదురాలా! నీముఖము
సంపూర్ణ కాంతి గలిగియుండెను. కలంక సహితమగు చంద్రునితో
నీముఖమెట్లుఁ బోల్పఁదగును. (అనగాఁ బోల్పదగదని భావము).
నీవు జడలను లేడి చర్మమును ధరించి యేల తపము చేయుచుంటివి!
ఓ శ్రేష్ఠురాలా! నన్ను భర్తనుఁగాఁగోరుమా. నేను లోకముల
నన్నిటిని జయించి ప్రధానులుగా నుండెడి స్త్రీలనుఁ దీసికొని వచ్చి
తిని. వారలందఱకు నీవధ్యక్షురాలవుగా నుండుము. మఱియు పరా
క్రమములో నాతో సమానుడు ముల్లోకములయందును లేడని
యెఱుంగుము. (అని రావణుడు వేదవతితోఁ బలికెను)

వేదవతి॥ పతిం కామయమానాఽహం శ్రీహరిం రజనీచర

నాఽన్యం వృణోమి గచ్ఛత్వం వ్యర్థాలాపాంశ్చవర్జయ॥ ౩౦

1రావణః॥సర్వథా మే వరారోహే న సమో హి జనార్దనః

జన్మ తస్య న జానంతి పరేభ్యో యే పరే జనాః

తేన త్వ మకులీనేన కిం కరిష్యసి సుందరి॥ ౩౧-౩౨

విశ్వరూపధర శ్చేతి కథయంతి బుధా స్తు తం

శేషాహిభోగపర్యంకే తేన త్వం శయితా సహ

సవిషై ర్భోగనిశ్వాసైః పరాం గ్లాని ముపైష్యసి॥ ౩౩

కంఠగ్రాహేణ నిహతౌ యేన వై మధుకైటభౌ

కథం కంఠగ్రహం తస్య సముపైష్యసి సుందరి

హిరణ్యకశిపు ర్యేన నఖై రుత్కృంతజీవితః

కథం రత్యంతరే తస్య నఖాఘాతం సహిష్యసి

తస్మా ద్భావం సముత్సృజ్య చారుగాత్రి జనార్దనే

భజస్వ భజమానం మాం చిరం ప్రీతి మవాప్నుహి॥
౩౪-౩౫-౩౬

వేద॥ గుణాఏవ సురేశస్య దోషా స్తే రజనీచర

జగత్ప్రకాశకా భానో రులూకస్యైవ రక్షసః॥

కిం త్వయాసహ వాదేనవరణీయ స్స మే ప్రభుః॥ ౩౭-౩౮

1వి॥ ధ॥ పు॥

30౫ వేదవతి రావణునితోఁ దిరిగి యీ క్రిందివిధముగఁ బలికెను. ఓ రావణా! నేను శ్రీహరినిఁ బతినిఁ గాఁ గోరి తపము చేయుచుంటిని. నే నితరుని వరింపను. వృద్ధపరిసంగములను మానుమనియెను.

3౧-3౨ రావణుడా వాక్యములను విని వేదవతితోఁ దిరిగి యిటులఁ బలికెను, ఓ యుత్తమురాలా! నీచేఁ గోరబడిన జనార్దనుడు సర్వవిధముల నాతో సమానుఁడు కానేరడు. పూర్వులలో (బూర్వులు సైతము శ్రీహరి జన్మవృత్తాంతము నెఱుంగరు. కులగోత్రములు లేని యా శ్రీహరితో నీకేమి ప్రయోజనమనియెను.

33౫ మఱియు నా శ్రీహరిని విశ్వరూపధరుని గాఁ దెలిసినవారు చెప్పుదురు. (అనగా ననేక వేషములు వేయువాడని బాహ్యార్థము, అంతరార్థమేమన ప్రపంచస్వరూపుడని) మఱియు నతఁడు సర్పపు పాన్పుమీద శయనించును. వానితోఁ గూడి నీవు శేషశయ్యయందు శయనించినచో విషజ్వాలలచే గొప్ప కష్టమునుఁ బొందఁగలవు.

3౪ ఓ వేదవతి! ఎవనికంఠగ్రహణముచేత మధుకైటభులను రాక్షసులు
3౫ హతమయిరో వాని కంఠము నెటుల నాలింగమునుఁ జేసికొనె
3౬ దవు. (అనగా కఠినమైన కంఠముగలవాడని భావము) మఱియు నెవని గోళ్ళచేత హిరణ్యకశిపుడు హతముచేయబడెనో అట్టివాని నఖక్షతములను రతికాలమున నీవెటుల సహింపఁగలవు? కావున జనార్దనునియందు భావమును మార్చుకొని నన్ను సేవింపుచున్న నాయందుఁ బ్రేమ భావమును జూపుమని, (రావణుడు వేదవతితోఁ బలికెను)

3౭. 3౮-4౫ వేదవతి రావణునితో నిటులఁ జెప్ప నారంభించెను. ఓ రావణుడా! సకలదేవాధిపతియగు విష్ణుమూర్తియందు నీచేతఁ జెప్పఁబడిన దోషములన్నియు బాగుగ విచారించిన గుణములేగాని దోషములు కానేరవు. జగత్తునుఁ బ్రకాశింపఁజేయు సూర్యకిరణములు గుడ్లగూబకు సరిపడనట్లు సర్వలోకేశ్వరుని యొక్క గుణములు నీకాకనికి దోషములుగాఁ గనఁబడుచున్నవి. నీతోడ నాకు వివాదమేల, ప్రభువగు శ్రీహరియే నాచే వరింపఁదగినవాడు కాని యన్యుడు కాడని స్పష్టముగ వేదవతి రావణునితో జెప్పెను.

ఇతి వేదవతీవాక్యం శ్రుత్వా కోపసమన్వితః
కామేన రాక్షసేంద్ర స్తాం కేశపాశే పరామృశత్॥ ౩౯

వే॥ త్వయా సంఘర్షితా పాప ప్రవేక్ష్యామి హుతాశనం
అయోనిజా భవిష్యామి వధార్థం చ తథా తవ
ఇత్యుక్త్వా సాఽగ్నికుండే తు ముమోచ స్వకళేబరం॥౪౦॥

1 జలకుంభై స్స్నిషేచాఽగ్నిం రావణో లోకరావణః
యావ త్పశ్యతి కుండే తు తావ త్తత్ర దదర్శ సః
పంచరత్నాని దివ్యాని గృహీత్వా తాని రావణః
కరండికాయాం సంస్థాప్యవిమానేనయయౌపురీం॥౪౧-౪౨॥

రాత్రౌ మండోదరీం ప్రాహ మంచకస్థాం రహఃస్థితః
హేమండోదరి రత్నాని మయా నీతాని తేఽధునా
కరండికాయాంవర్తంతేగచ్ఛగృహీత్వాతానిహి।౪౩-౪౪

కరండికాం తత్ర దృష్ట్వా సా నేతుం ప్రతిపన్నధా
యావ దున్చాలయామాస న చచాల తదా భువః.
తదా సా లజ్జితా గత్వా రావణాయ న్యవేదయత్॥౪౫॥

1 అ॥ శా॥

౩౯౹ రావణుడు వేదవతి చెప్పిన వాక్యములను విని కామక్రోధములతో వేదవతికేశపాశమునుఁ బట్టుకొనెను.

౪౦౹ వేదవతి రావణునితో నిటులఁ జెప్పెను. ఓ పాపాత్ముఁడా! నీ చేత నేను స్పృశింపఁబడితిని కాన, ఈ శరీరముతో నుండను. అగ్ని కుండములో ప్రవేశించుచున్నాను, నిన్ను సమూలకముగా నశింపఁ జేయఁగలందులక యోనిజురాలనై పుట్టెదను. అని యివ్విధముగ రావణునితోఁ జెప్పుచుఁ దన కళేబరమును అగ్నికుండములో ప్రవేశపెట్టెను. (అనగా అగ్నిలోఁబడి దగ్ధమయ్యెను)

౪౧-౪౨౹ లోకములను నేడ్పించుచున్న రావణుడు కలశోదకముచే నగ్ని హోత్రమునుఁ జల్లార్చి యాయగ్నికుఁడమునుఁ బరిశీలించి వెదుకగా నైదు రత్నములు కుండములోఁ గన్పడెను. ఆ రత్నములను నొక పెట్టెలోనుంచుకొని విమానారూఢుడై తన లంకాపురమునకేగెను.

౪౩-౪౪ లంకాపట్టణమునకు వెళ్లినరాత్రి రావణుడు తన పడకగదిని సమీపించినమండోదరితో నిటులఁ జెప్పెను. ఓ ప్రియురాలా! నేను నీనిమిత్తమై దివ్యరత్నములనుఁ దెచ్చియుంటిని. నా పెట్టెలో నున్నవి. వానిఁదెచ్చుకొనుమని రావణుడు మండోదరితో చెప్పెను.

౪౫౹ మండోదరి వెంటనే పెట్టెనుఁ దన భర్తసాన్నిధ్యమునకుఁ దీసికొని రావలయునని రెండు చేతులతోఁ దెట్టెను నెత్తవలయునని యత్నించెను. కాని యా పెట్టె భూమినుండి కదలకపోయెను. అప్పుడు మండోదరి యా పెట్టెను లేవనెత్తలేనందునకు సిగ్గుపడి రావణునితో నాసంగతి జెప్పెను.

తచ్ఛ్రుత్వా స ప్రహస్యాఽథ స్వయం నేతుం యయౌ తదా
తాం సోఽప్యచ్చాలయామాస న చచాల కరండికా
తత్తైః ప్రోద్ఘాటయామాస రావణ స్తాం కరండికాం
దృష్ట్వా చ తత్ర పంక్త్యాన్యాః కన్యాం సూర్యప్రభోపమాం
తదా మండోదరీం ప్రాహ తస్యా వృత్తం యథాతథం॥
౪౬-౪౭-౪౮

క్రోధా న్మండోదరీ ప్రాహ భయభీతా దశాననం

ఇయం కృత్యా ప్రచండా చ కులప్రధ్వంసకారిణీ

లంకాం కిమర్థ మానీతా త్యజైనాం సత్వరం వనే॥ ౪౯

ఇత్యుక్తోఽథ దశాస్య స్తు విచార్య మనసి స్వయం
మంత్రిభి శ్చాఽపి సంమంత్ర్య దూతా నాజ్ఞాపయ త్ప్రభుః
కరండికేయం త్యక్త్వా వనే గచ్ఛత వేగతః॥ ౫౦-౫౧
దశాస్యపత్నీ తా నాహ కార్యా భూమిగతా త్వియం
తత స్సా పేటికా నీతా దూతై ర్యానేన వై జవాత్
కృతా భూమిగతా ప్రాంత్యే మిథిలాయా స్తు కాననే॥ ౫౨

తతో యయుః పున ర్లంకాం దూతా స్తే రావణస్య చ
న్యవేదయన్ దశాస్యాయ సర్వం వృత్తం యథాకృతం
నిర్భయోస్మీతి లంకేశ స్సంతోషేణాఽవసత్సుఖం॥ ౫౩-౫౪

౪౬-౪౭-౪౮ రావణుడు మండోదరి వాక్యమును విని చిఱునగవు నవ్వి, చుఁ దాను స్వయముగా నాపేటికనుఁ దెచ్చుటకు వెళ్లి పెట్టెనుఁ దీసికొని వచ్చుటకు ప్రయత్నించెను. కాని రావణునకును పెట్టె కదలనందున నచ్చటనే పెట్టెనుఁ దెఱచిచూడగా నందులో సూర్యతేజస్సుతో సమానమైన తేజస్సుగల యొకకన్యక యుండెను. అప్పుడు మండోదరి యాశ్చర్యమునొందగా నాకన్యకయొక్క వృత్తాంతమునంతను జరిగినది జరిగినట్లుగా రావణుడు మండోదరితో జెప్పెను.

౪౯ ఆకన్యకవృత్తాంతమునంతను రావణునివలన మండోదరి విని భయపడి రావణునితో నిట్లుఁజెప్పెను. ఓ నాథా! ఇది యొకానొక శక్తి, ప్రచండురాలు మనవంశమును నశింపఁజేయునదిగా నున్నది. ఆ వేదవతిని నీవు బలాత్కరింపనేల. ఆమె దగ్ధముకానేల. ఆ రత్నములను నీ వెంమనకిచ్చుటకుఁ దేవలసివచ్చినది! వెంటనే యేయడవిలోనైనను నీకన్యకను విడిచిపెట్టిరమ్మని (మండోదరి రావణునితోఁ జెప్పెను)

౫౦-౫౧ ఈవిధముగ మండోదరిచెప్పగా రావణుడు తనమనమున విచారించి మంత్రులతోఁగూడ విచారించియు దూతలకు నాజ్ఞయిచ్చెను. ఓ దూతలారా మీరలీపెట్టెనుఁ దీసికొనిపోయి వనములో వదలిపెట్టవలసినది. వేగముగా వెళ్లుడని (దూతలను రావణుడు చెప్పెను.)

౫౨ మండోదరి దూతలతో నివ్విధముగఁ జెప్పెను. ఓదూతలారా! ఈ పెట్టెను నడవిలో విడిచిపెట్టివచ్చుటకాదు. అచ్చట గొయ్యిత్రవ్వి పాతిపెట్టవలసినదని చెప్పగా దూతలు నవ్విధముగానే చేయుదుమని యాపెట్టెను బలవంతముగా నెత్తుకొనిపోయి మిథిలాపట్టణ ప్రాంతమున నొక యడవియందు భూస్థాపితముచేసిరి.

౫౩-౫౪ అనంతరము రాక్షసదూతలు తిరిగిలంకాపట్టణమునకేగి రావణునకు తాముచేసినపని నంతయుఁ విన్నవించిరి. రావణుడును తనకివ్విధము యిన భయములేదని మిక్కిలి సంతోషముతో నుండెను.

## ద్వితీయసర్గప్రారంభః.

ఆనంతరీం కథాంవక్ష్యేయాయం శ్రుణుత సద్ద్విజాః
విదేహవిషయే రాజా జనకో నామ వీర్యవాన్ ॥ ౧
బభూవ సర్వలోకానాం పితేవ పరిపాలకః
తస్య రాజ్ఞ స్సుతో నాభూత్ నృప స్తచ్చింతయాఽవసత్ ॥ ౨
ఏకదా నారద స్తస్య సమీపం ప్రాప భూపతేః
తదా మునిముఖా ద్రాజా శుశ్రావైక ముదంతకం ॥ ౩
అపుత్రో నృపతి ర్వృద్ధో నామ్నా దశరథో మహాన్
పుత్రా న్లేభే మహాసత్వా నధ్వరేణ మహామతిః ॥
త్వమధ్వరం కురు స్యాత్తే సంతతి స్త్విత్యగాన్మునిః ॥ ౪

తచ్ఛ్రుత్వా జనకో రాజా ప్రవిశ్యాంతఃపురం నిజం
స్వభార్యాభి ర్మంత్రయిత్వా యజ్ఞదీక్షాపరోఽభవత్ ॥ ౫
తతః పురోధసం రాజా శతానందం మునీశ్వరం
ద్విజాంశ్చాన్యా న్సమానీయ యజ్ఞభూమి ముపాగతః ॥ ౬
నారదస్యోపదేశేన యజ్ఞభూమిం తతో నృపే
హాలేన స్వర్ణవర్ణేన జనకే కర్షతి ద్రుతం ॥
ఘణంఘణనినాదోఽభూ త్కిమేత దితి విస్మితః ॥ ౭-౮
పరిశీల్య నృపోఽపశ్యద్యజ్ఞవాట్యాం తు పేటికాం ॥
తా ముద్ఘాట్య సువర్ణాభాం కన్యాం తత్ర సమీక్ష్య చ
సుదినం దినమేవేద మితి మత్వా ముమోద సః ॥ ౯

## ద్వితీయసర్గ ప్రారంభము.

౧-౨ తా॥ సూతుడు శౌనకాదిమహర్షులతో నివ్విధముగఁ జెప్పనారంభించెను. ఓమహర్షులారా! అనంతరకథనుఁ జెప్పెదను సావధానులై వినుడు. విదేహదేశమున జనకుడనురాజు సమస్తజనులను తండ్రివలెఁ బోషించుచుండెను. కాని యారాజునకు సంతానము లేకుండుటవలనఁ గడువిచారముతోనుండెను.

౩-౪ ఒకానొకప్పుడు నారదమహర్షి జనకమహారాజసమీపమునకు వచ్చి సంతానములేని విచారముతోనున్న యారాజునకు నొకవృత్తాంతమునుఁ జెప్పెను ఓజనకుడా! నీవు సంతానవిషయమై విచారింపవలదు, నీకును సంతానము కలుగును. వృద్ధుడైన దశరథమహారాజును సంతానములేనివాడై యశ్వమేధక్రతువునుఁ జేయుటవలన మహాబలపరాక్రమశాలులగు నల్వురు పుత్రులు కలిగిరి నీవును క్రతువును జేయుము. నీకును సంతానము కలుగగలదని చెప్పి నారదుడు స్వర్గలోకమున కేగెను.

౫ జనకుడు నారదుడు చెప్పిన వాక్యమునువిని తనయంతఃపురమునుఁ బ్రవేశించి తనభార్యలతో నాలోచించి యజ్ఞదీక్షకలవాడయ్యెను.

౬ అనంతరము జనకమహారాజు తన పురోహితుడును మునీశ్వరుడునగు శతానందుని మఱికొందఱి నితరమహర్షులను వెంట నిడుకొని యజ్ఞభూమికి వెళ్లెను.

౭-౮ జనకమహారాజు నారదుడు చెప్పినప్రకారము సువర్ణపు నాగలిచే యజ్ఞభూమిని ప్రథమముగ దున్నుచుండగా ఘణిల్లుమని శబ్దము విన్పడగా నిదియేమని జనకు డాశ్చర్యము నొంది పరిశీలింపగా నాభూమిలోపల నొకపెట్టె కన్పడెను.

౯ ఆజనకమహారాజు పెట్టెనుఁ దెఱచిచూడగా నచ్చట సువర్ణచ్ఛాయతో నొప్పుచున్న యొక కన్యక కన్పడెను. ఈదినము మంచి సుదినమని రాజు సంతోషించెను.

కన్యాయాం లబ్ధమాత్రాయాం పృథివ్యంతర్హితా స్వయం
జగాద వచనం చేదం తదానీం జనకం నృపం॥ ౧౦
ఏషా సుతా మయా దత్తా తవ రాజన్మనోహరా
గృహాణ సుభగాం కన్యాం కులద్వయశుభావహాం॥ ౧౧
అనయా మే మహాభార స్త్వత్తో హేతుభూతయా
క్షయం యాస్యతి భారార్తిం మోచయిష్యామి దారుణాం॥ ౧౨
రావణాద్యా మహావీరాః కుంభకర్ణాదయో వరే
నాశం యాస్యంతి దుర్ధర్షాః కృతేఽస్యాః రాక్షసావరే॥ ౧౩
అవాప్స్యసి సురాణాం చ పితౄణా మృణశోధనం
ఇతి పృథివ్యా వచనం శ్రుత్వా రాజా ముదాఽన్వితః
ప్రణమ్య పృథివీం ప్రాహ జనకోఽధికవిస్మయః॥ ౧౪-౧౫
యది త్వం బ్రూషే జగద్ధాత్రి కరిష్యే తద్వచ స్తవ
దేవి ప్రత్యక్షతో రూపం ద్రష్టు మిచ్ఛామ్యహం తవ॥ ౧౬
ఇత్యుక్త్వా పృథివీ తస్మై దర్శయామాస చాఽకృతిం
నీలోత్పలదళశ్యామా మక్షమాలాబ్జధారిణీం
బాహుయుగ్మేన శుభ్రేణ మృణాళాయతలోచనాం
సుందరీం లోకధాత్రీం తాం దృష్ట్వా శశ్వ న్నృపోఽ
నమత్॥ ౧౭-౧౮

౧౦½ ఇవ్విధముగ జనకమహారాజునకు కన్యక సంప్రాప్తమగుటతోడనే భూదేవి యంతర్ధానమునొందిరయే జనకునిగూర్చి యీక్రింది వాక్యమునుఁ బలికెను.

౧౧½ ఓజనకమహారాజా! ఈమనోహరమైన యీకన్యకను నేను నీకిచ్చితిని. మహాసౌందర్యవతియును పుట్టినింటిని నత్తయింటిని రెండు వంశములనుఁ దరింప జేయునదియునగు నీకన్యకను గ్రహింపుము, అని భూదేవిపలికెను.

౧౨½ భారనివారణమునకుఁ గారణభూతురాలగు నీచిన్నదానివలన నా భూభారమంతయు తొలగిపోవును. మహాదారుణమైన భూభార రూపకమైన కష్టమును నేను విడిచిపెట్టగలను.

౧౩½ (ఎందువలననగా) మహావీరులగు రావణ కుంభకర్ణాది రాక్షసులు సైతము, ఈచిన్నదానిమూలకముగ నశింపఁగలరు. (దుష్టరాక్షస నాశమగుటవలన నాభారము తొలుగునని భావము)

౧౪-౧౫ ఓజనకమహారాజా! ఈచిన్నదానిని నీవు పుత్రికనుఁగాఁ బొందినందున నీవు దేవతాఋణమును పితృఋణమునుకూడ తీర్చుకొనెదవు. అని భూదేవి యదృశ్యరాలై చెప్పినవాక్యమునువిని జనకమహారాజు సంతోషాశ్చర్యములనొందినవాడై భూదేవి నుద్దేశించి యిటులఁ బల్కెను.

౧౬ ఓభూదేవి! ఓలోకజనని! నీవుచెప్పినప్రకారముగ నేనుచేయఁగలను. ఓదేవి! నీదురూపమునుఁ బ్రత్యక్షముగఁ జూచుటకు, నిచ్ఛయించుచున్నాడను.

౧౭-౧౮ ఇవ్విధముగ జనకుడుచెప్పినవాక్యములను భూదేవి విని యారాజునకుఁ దననిజరూపమునుఁ జూపించెను. నల్లకలువరేకులవంటి శరీరకాంతిగలిగినదియు నొకచేతితోఁ బద్మమును మఱియొకచేతితో జపమాలను ధరించినదియు త్రిలోకసుందరియును లోకమాతయు నగు నాభూదేవినిఁజూచి జనకుడు నమస్కరించెను,

తత స్సా పృథివీ దేవీ సీతాం జాతాం నృపాత్మజాం
కరేణ కర్ష్వ త్సంస్పృశ్య వచనం చేద మబ్రవీత్॥ ౧౯

ఇయం కన్యా జగద్ధాత్రీ మానుషం రూప మాశ్రితా
తవపుత్ర్యభవ ద్రాజ న్గోపనీయ మిదం త్వయా॥
ఇతి సంభాష్య సా దేవీ తత్రైవాంతరధీయత॥ ౨౦

జనకోపి సుతాం లబ్ధ్వా సర్వలక్షణశాలినీం
స్వకీయజనసంయుక్త స్స్వగృహం ముదితో యయౌ॥ ౨౧

అథ రాజా స్వభార్యాయై దదౌ తాం తుష్టమానసః
సాఽపి స్వర్ణాసనే కన్యాంనివేశ్యాస్నాపయచ్ఛుభాం॥ ౨౩

ఆర్ద్రితా మపనోద్యాంగే స్వర్ణభూషాంబరాదిభిః
అలంకృత్య చ సా కన్యాండోలికాయాం నివేశ్య తాం
లాలనాగీతికా స్త్రీభి రగాపయ దనేకథా
సుమేధాఽపి స్వయంగీతిర్గాయతిస్మ నృపాంగనా॥ ౨౪-౨౫

లాలన మిదం తవ లలామభూతాయాః పాలనకరి!
త్రిజగతాం చ సుదతీనాం। శాలినవపల్లవలసచ్ఛుభకరాబ్జే
పాలితశ్రితాళి తవ లాలన మిదం హి ౨౬

జనకోఽథ ముదా తస్యా స్సీతానామ చకార సః
క్రమా ద్వృద్ధిం గతా సీతా సీతా క్రీడార్థ మాళిభిః
కదాచి త్కందుకక్రీడాం కరోతి స్మ ధనుర్గృహే॥ ౨౭

౧౯ అనంతరము భూదేవి యాకన్యకను చేతితోఁ దాకుచు ముద్దిడుకొనుచు నివ్విధముగఁ బలికెను.

౨౦½ ఓజనకమహారాజా! లోకజననియే యీమానుషీరూపమును ధరించినది యీకన్యక నీపుణ్యముచే నీకుఁ బుత్రికయయ్యెనని తెలిసికొనుము. కాని యీవిషయము బహు రహస్యముగా నుంచదగినది. అని భూదేవి జనకునితోఁజెప్పి యంతర్ధానమొందెను.

౨౧-౨౨ జనకమహారాజును సర్వలక్షణములచే నొప్పుచున్న యాకన్యకనుఁ దీసికొని తనపరివారముతోఁగూడ స్వగృహమునకువచ్చెను.

౨౩ అనంతరము జనకమహారాజు సంతోషముతో నాకన్యకనుఁ దన భార్యకీయగా నాజనకుని భార్యయును శుభప్రదమగు నాకన్యను సువర్ణాసనమునందుఁ గూర్చుండఁబెట్టి స్నానము చేయించెను.

౨౪-౨౫ మఱియు నాజనకునిభార్య చిన్నదానిశరీరమునుఁ దుడిచి వస్త్రాలంకారాములచేత నలంకరించి యుయ్యలయందుఁ గూర్చుండఁబెట్టి స్త్రీలచే ననేకవిధములఁగా లాలిపాటలనుఁ బాడించెను. మఱియు జనకుని భార్యయగు సుమేధాదేవియును స్వయముగా నీక్రిందివిధముగ లాలిపాటలనుఁ బాడెను.

౨౬ ముల్లోకములనుఁ బరిపాలించు నోచిన్నదానా! స్త్రీజాతికంతకు నలంకారమైనదానా! ఆశ్రితులనుఁ బరిపాలించుదానా! లేతచిగురుటాకులవలెఁ బ్రకాశించు పాదపద్మములుకలదానా! నీకు లాలనమగుకాక" (అని లాలిగీతములనుఁ బాడెను.)

౨౭½ అనంతరము జనకమహారాజును నాచిన్నదానికి సీతయను నామకరణమునుఁజేసెను, (సీతయనగా నాగేటిచాలులో బుట్టినది యని భావము) ఆసీతయుఁ గ్రమముగా నభివృద్ధినిఁ జెందినదై చెలికత్తెలచే నాటలకుఁ దీసికొనిపోబడుచు నొకప్పుడు శివధనస్సుయుంచెడి గృహములోఁ జెలికత్తెలతో బంతులాట నాడుకొనుచుండ

తత్కందుకం చ తద్ధస్తా త్పతితం ధనురాలయే
ధనుర్భిత్త్యో రంతరాళే దృఢం లగ్న మభూ త్తదా॥ ౨౮॥
అయతంతాఽతయ స్తస్యా స్తదా నేతుమనేకథా
పరంతు విఫలా స్సర్వా కందుకానయనేఽభవ౯॥ ౨౯॥
మందహాసం ప్రకుర్వాణా సీతా శీతాంగనచ్ఛవిః
తద్ధను శ్చాలయిత్వా చ వామహస్తాగ్రత స్తతః
తత్కందుకంసమాదాయవయస్యేభ్యోదదాముదా॥ ౩౦-౩౧

సఖ్యోఽబ్రువ న్సుమేధాయై కందుకానయనక్రియాం
నహి సా బాలికావాక్యే విశ్వాసం కృతవత్యభూత్॥ ౩౨

కదాచి దాళిభి స్సీతా స్వర్ణడోలావిహారిణీ
అన్యదా సా సాలభంజవివాహాకరణోద్యతా
కదాచనాఽల్పప్రహస్తాని ప్రతా న్యాచరతి స్మసా॥ ౩౩॥

ఇత్థం సా శైశవక్రీడారతిభిః పితరౌ సదా
చకార ముదితౌ సీతా జనకస్య గృహే స్థితా॥ ౩౪॥

మృషావ్రతకరీం కన్యాం సుమేధాపి నిశామ్య తాం
అంకేనిధాయ సీతాంతాంపరిచుంబ్యాఽబ్రవీద్వచః॥ ౩౫॥

మతల్లి! కన్యాతులసీవ్రత మద్య త్వయాపునః
కారయిష్యామి తన్వంగి వ్రతం కురు ఫలాధికం॥ ౩౬॥

౨౮॥ ఆబంతి సీతచేతినుండి యాధనుర్గృహమునందు ధనస్సునకు గోడకు మధ్యలో బడిపోయి గోడ ధనుస్సులకు మధ్యయందిరుక్కొని పోయెను.

౨౯॥ ఆసందులో నిరుక్కొనిపోయిన యాబంతినిఁ దీసికొనివచ్చుటకు సీత చెలికత్తెలు ప్రయత్నించిరి. కాని బంతినిఁదెచ్చుటకు వారు విఫలులైరి అనగా దీయలేకపోయిరని భావము,)

30-3౧ అప్పుడు సువర్ణచ్ఛాయగల సీత మందహాసము చేయుచు నాధనువును నెడమచేతితో నవతలకు నెట్టివేసి యాబంతినిఁ దీసికొనివచ్చి చెలికత్తెలకు నిచ్చెను.

3౨ ఆబాలికలు జనకునిభార్యయగు సుమేధాదేవితో సీత శివధనస్సును నెత్తి బంతినిఁదీసికొనివచ్చిన వృత్తాంతమునుఁ జెప్పిరి. కాని యాసుమేధాదేవి యాబాలికలవాక్యమును విశ్వసింపకపోయెను.

33॥ సీత సఖురాండ్రతోఁగూడ నొకప్పుడు బంగరు తూగుటుయ్యాలయందు విహరించుచు మఱియొకప్పుడు బొమ్మలపెండ్లిండ్లకు వివాహమునుఁజేయుచు మఱియొకప్పుడు చిట్టిపొట్టినోములనుఁ జేయుచుండెను.

3౪॥ ఈప్రకారముగ సీత బాల్యక్రీడలచేఁ దల్లిదండ్రులను సంతోషపెట్టుచు జనకమహారాజ గృహమునందుండెను.

3౫॥ జనకమహారాజు భార్యయగు సుమేధాదేవి యివ్విధముగ నబద్ధపువ్రతముల నాచరించుచున్న సీతనుఁజూచి, తన తొడయందుఁ గూర్చుండబెట్టుకొని ముద్దుపెట్టుకొని యివ్విధముగఁ బలికెను.

3౬॥ ఓపుత్రికారత్నమా! నీచేత నేను కన్యలకుచితమగు నోమును నోపించెదను అధికఫలప్రదమైన యానోమును నోయుమనియె.

ఇత్యుక్త్వా సా శుభతిథౌ సమాహూయ శుభాంగనాః
సీతాం తాం మంగళస్నానం కారయిత్వాఽక్షియుగ్మకే
అంజనం ధారయిత్వా చ కస్తూరీతిలకం ముఖే
నివేశ్య రత్నభూషాభి ర్భూషయిత్వా తదంగకే
పీతాంబరం ధారయిత్వా సువర్ణప్రతిమానమాం
సీతాం స్వర్ణాసనే సద్యశ్చోపవేశ్య సఖీయుతా
గాయంతీ గీతికా స్తత్ర ప్రదదౌ మంగళారతీః॥
౩౭-౩౮-౩౯-౪౦

పశ్చాన్మతల్లికారంగవల్లీభిః పరిశోభితే
బృందావనం స్త్రియ స్సీతాం నిన్యుస్తూర్యపురస్సరం॥ ౪౧
అరుంధత్యాదిదేవ్యోఽపి సమాహూతా స్సమాగతాః
దృష్ట్వా వ్రతోద్యతాం సీతాం వీక్ష్య తాం విస్మయం
యయుః॥ ౪౨

భూషణై ర్భూషితాం సీతాం స్వర్ణకాలతటిన్నిభాం
తదా ప్రాహ సుమేధా చ పీతాంబరధరాం శుభాం॥ ౪౩
ఆదావరుంధతీదేవ్యై నత్వా ప్రాప్య తదాశిషం
పరిగృహ్య తదాస్యే తు కుంకుమం చ వినిక్షిప॥ ౪౩
తత శ్చాఽపరనారీణాం లలాటేషు యథావిధి
విన్యస్య తిలకం పశ్చా త్ప్రణమ్య తులసీ మిమాం
వ్రతారంభం కురు సుతే సర్వసిద్ధిప్రదాయకం॥ ౪౪-౪౫

౩౮-౩౯-౩౯-౪౦ ఇవ్విధముగ సుమేధాదేవి సీతతోఁజెప్పి యొక శుభతిథి యందు పుణ్యస్త్రీలనందఱ నాహ్వానించి సీతకు మంగళస్నానమునుఁ జేయించి నేత్రములయందుఁ గాటుకనుంచి కస్తూరీతిలకమును ముఖమునందుఁబెట్టి రత్నాలంకారములచే నాకన్యక నలంకరింపఁ జేసి పీతాంబరమునుఁ గట్టి బంగరవుబొమ్మవంటి సీతను నొక సువర్ణాసనమునందుఁ గూర్చుండఁబెట్టి సఖురాండ్రతోఁగూడఁ బాటలనుఁబాడుచు మంగళారతుల నిచ్చెను.

౪౧ అనంతరము స్త్రీలు తులసీబృందావనమును రంగవల్లికలతో నలంకరింపఁజేసి యాతులసీబృందావనమునొద్దకు సీతను వాద్యఘోష పురస్సరముగఁ దీసికొనిపోయిరి.

౪౨ అరుంధతి మొదలగు పుణ్యస్త్రీలును నాహ్వానింపఁబడి యావ్రతము నకువచ్చి వ్రతపరురాలగు నాసీతనుఁజూచి యాశ్చర్యమొందిరి.

౪౩ వర్షాకాలపు మెఱపుతో సమానురాలును నలంకారములచే నలంకృతురాలును పీతాంబరధారిణియునగు సీతనుగూర్చి సుమేధాదేవి యివ్విధముగఁ బలికెను,

౪౪ ఓపుత్రి! వ్రతారంభమునకుఁ బూర్వము నీవరుంధతీదేవికి నమస్కరించి యామె యాశీర్వాదమునొంది యామెముఖమున బొట్టును గూడఁ బెట్టుము.

౪౫ అనంతర మితరపుణ్యాంగనల ముఖములందు బొట్టునుంచి యనంతరము ఈతులసీదేవిని నమస్కరించి సర్వాభీష్టప్రదమగు తులసీ వ్రతము నారంభింపుము.

ఇతి మాత్రా బోధితయా సీతయా వీతభీకయా
మధ్యమాంగుళ్యంచలేన త్వరుంధత్యా ముఖే దృఢం
ప్రోతే కుంకుమవిన్యాసే సుస్రావ రుధిరం బహు॥ ౪౬-౪౭
శివేతి వీప్సయా ఉక్త్వా సాంగకంప మరుంధతీ
భూమౌ పపాత సీతాఽపి భీత్యా వేపథు మాప సా॥ ౪౮
తతో భూమిసుతాయాస్తు మాతా వీతమతిః క్షణం
స్వాంబరాగ్రేణ తద్దేవీలలాటే రుధిరం స్రవత్
పరిమృజ్యారుంధతీం ఉత్థాపయామాస వై స్వయం॥ ౪౯
కోపారుణితనేత్రాంతా ప్రాహ సీతా మరుంధతీ
పురా శచీరమాగౌరీభాషాద్యా శ్శాల్యసంస్థితాః
ఈదృశంమాదృశీంచక్రుఃకిమకృత్యంవబాఽబలే॥ ౫౦-౫౧
ధిగస్తు బాలే భవతీం త్వద్దుష్కృతవశాత్పునః
పూర్వజ్ఞానవిహీనస్స్యాత్త్వత్పతిశ్చిత్స్వరూపవ్యపి
ఇతి శాపం దదౌ క్రోధా దరుంధత్యవిచారిణీ॥ ౫౨
ఇతి సూతముఖేనోక్తాం కథాం శ్రుత్వా మహర్షయః
భృశం సందిగ్ధచిత్తాస్తే పప్రచ్ఛూ రోమహర్షణం॥ ౫౩
అహో కృత్యమరుంధత్యాః యత్సీతాఽకృత్యమాలతః
తత్పతిం యా శశాపేతి కుత్రాప్యేవం భవేద్వద
ఇత్యేవంమునిభిఃపృష్టోఽవదత్తాన్సర్వసూక్ష్మతాం॥ ౫౪-౫౫

౪౭-౪౮ ఇవ్విధముగ సుమేధాదేవి బోధింపగ నిర్భయురాలగు సీత యరుంధతీముఖమునందు బొట్టుపెట్టుసమయమునఁ దన నడిమివ్రేలు చివరచే నామెముఖమున దృఢముగా నదుముటచే గోరు తగిలి యెక్కుడుగా నెత్తురు స్రవించెను.

౪౯ ఆయరుంధతియు శివశివయనుచు శరీరకంపముకలిగి భూమియందుఁ బడెను. అప్పుడు సీతయును వణకిపోయెను.

౪౯½ అనంతరము సీతయొక్కతల్లి క్షణకాలము మతిలేనిదై పిదప స్మృతి కలిగి తన పయిటచెంగుతో నాయరుంధతీదేవి ముఖమునందు స్రవించుచున్న రక్తమునుఁ దుడిచి యామెను స్వయముగా లేవనెత్తెను.

౫౦-౫౧ అప్పుడరుంధతీదేవి కోపముచే నేత్రముల నెఱ్ఱఁజేసి సీతనుగూర్చి యిటులఁ బల్కెను. ఓదుష్టురాలా! పూర్వమునందు శచీదేవియు లక్ష్మీదేవియు గౌరీదేవియు సరస్వతీదేవియు మొదలగువారెంద రేని బాల్యమునందున్నవారు కలరుకాని నీవలె నిట్టి యకృత్యమును మాబోంట్లకుఁ జేసినవారుండిరా! (లేరనిభావము)

౫౨½ ఓబాలికరాలా! నీవు నింద్యురాలవగుదాన. నీవుచేసిన దుష్కృత్యమువలన నీభర్త జ్ఞానస్వరూపుడయ్యును పూర్వజ్ఞానములేనివాడగుగాక యని యరుంధతి యవిచారితముగ సీతను శపించెను.

౫౩½ ఇవ్విధముగ సూతునిచేఁ జెప్పబడిన యరుంధతీ శాపవృత్తాంతమును శౌనకాదిమహర్షులు విని సంశయము కలవారలై రోమహర్షణుని (అనగా సూతుని) నిటులఁ బ్రశ్నించిరి.

౫౪-౫౫ ఓసూతుడా! సీతయకృత్యమూలకముగ ముందుకానున్న యామె భర్తను శపించుటయనునది మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. ఎక్కడనైనను నిట్టి వింతయుండునా! (అని శౌనకాదిమహర్షులు ప్రశ్నింపగా నప్పుడు సూతుడు ధర్మసూక్ష్మమును వారలకుఁ జెప్పెను.

పతిపుణ్యార్ధభాగ్నారీ న హి పత్యఘభాగభాక్
న పత్నీపుణ్యభాగ్భర్తా భవేత్పాపార్ధభాగ్భవేత్॥
తత్సీతాదుష్కృతాత్పూర్వజ్ఞానహీనోఽపి తత్పతిః
ఇత్యుక్త్వానంతరీం ప్రాహ కథాం తాం రోమహర్షణః॥
౧౬-౧౭

అరుంధతీకృతం శాపం శ్రుత్వా వై జనకస్తతః
సమాగత్య చ తాం నత్వా ప్రోవాచేద మరుంధతీం॥౧౮
బాలయా లీలయా కార్యే కృతే క్రోధో నయుజ్యతే
క్షీరకంఠ్యై చ సీతాయై శాపదానం న తే క్షమం॥౧౯
తచ్ఛ్రుత్వాఽరుంధతీ ప్రాహ జనకం తు శనైర్వచః
అహో రాజంస్తవ సుతా బాలా వాఽకృత్యకారిణీ
దీపోఽల్పోఽపి మహాంతం చ చుంబకం దాహయేన్న
వా॥ ౨౦
ముదం తే త్వత్సుతాకృత్యం కుర్యాన్న మమ వై నృప
అహం! సర్వేశ్వరీ చేతి త్యక్త్వా వినయ మద్య మే
నిర్ధనాయా గతి నాఽస్తీత్యేవం వై త్వత్సుతాఽకరోత్।
౨౧-౨౨
త్వత్సుతాచేష్టితాన్యేవం భవంతు తవ వై ముదే
మమ ప్రమాదహేతూని తాని జానీహి మైథిల॥ ౨౩
ఇత్యుక్తస్తాం నృపః ప్రాహ ప్రసన్నా భవ సువ్రతే
అపరాధం క్షమస్వాఽద్య మత్పుత్ర్యా ఇత్యసాంత్వయత్॥౨౪

౫౬-౫౭ ఓమహర్షులారా! భార్య, భర్తృపుణ్యమున సగపాలును పైగొనును కాని భర్త చేసినపాపములోమాత్రము భార్యకు భాగములేదు. భర్తకు భార్యచేసినపుణ్యమున భాగములేదు కాని భార్యచేసిన పాపమున భర్తకు భాగముకలదు. కాన సీతచేసిన దుష్కృతమువలన సీతాపతి, పూర్వజ్ఞానవిహీనుడయ్యెనని చెప్పి శౌనకాదిమహర్షులతో సూతుడనంతర కథావృత్తాంతమునుఁ జెప్పనారంభించెను.

౫౮ పైవిధముగ నరుంధతి సీతకుఁబెట్టినశాపమును జనకుడువిని యరుంధతియొద్దకువచ్చి యామెను నమస్కరించి యిటుల నామెతోఁ బలికెను.

౫౯ ఓయరుంధతి! బాలికలచే విలాసముగాఁ జేయబడిన కార్యమునకు నీవు కోపగించుట యుక్తముకాదు. మఱియు క్షీరకంఠియగు సీతకు శాపమునిచ్చుట నీకుఁ దగినపనికాదు. (అని జనకుడు పలికెను)

౬౦ ఆయరుంధతి జనకవాక్యమునువిని యిట్లుచెప్ప నారంభించెను. ఓజనకమహారాజా! అకార్యమునుఁజేసిన నీకొమరిత బాలికకాలనియా నీయాశయము. దీపము చిన్నదేయని ముద్దుపెట్టుకొనినచోఁ బెద్దవానినైననుఁగాల్పకుండనుండునా! (కాల్చునేకాల్చునని భావము.

౬౧-౬౨ ఓరాజా! నీకొమరితయొక్క చేష్టలు నీకు సంతోషకరములు కావచ్చునుకాని నాకుమాత్రము సంతోషకరములు కానేరవు. నేనే సర్వేశ్వరినియనియుఁ దానేమిచేసినను నాకిచ్చుట నెవ్వరు దిక్కు లేరనియు గర్వముతో వినయవిధేయతలను వదలి యివ్విధముగ నీకొమరిత చేసెను.

౬౩ ఈప్రకారముగ నీకొమరితచేసిన చేష్టలు నీకు సంతోషదాయకములుకానిమ్ము. నాకుమాత్రము ప్రమాదకరములనియే తెలిసికొనుము. (అని అరుంధతి జనకునితో చెప్పెను.)

౬౪ ఆయరుంధతి వాక్యములను జనకుడు విని తిరిగి యామెతో నిటులఁ బలికెను. ఓయరుంధతీదేవి! నీవు శాంతింపుము. నాకొమరితచేసిన తప్పును క్షమింపుమని యామెను బ్రతిమాలుకొనెను.

సీతా బాలలతేవేయం వర్తతేఽద్య త్వరుంధతి
తస్యాం తవ మహాక్రోధః శుకే బ్రహ్మాస్త్రవద్భవేత్ ॥ ౬౫
నివర్తయ పున శ్శాపం బాలికాయా మహావ్రతే
ఇత్థం భూపతినా ప్రోక్తాఽరుంధతీ ప్రాహ జానకీం॥ ౬౬
త్వత్క్రీడానిలయం శైవం ధను రానయ భూమిజే
ఇత్యుక్తా జానకీ శీఘ్రం ప్రధావ్య ధను రుత్తమం
పాణిభ్యామున్నమయ్యాఽథ చాఽనయామాస తాం సతీ॥ ౬౭
రాజా పురంధ్ర్య స్సర్వా శ్చ ధనురానయనం తదా
దృష్ట్వా ఽశ్చర్యనిమగ్నాశ్చనంబభూవుర్నృపాలహే ॥ ౬౮
అరుంధతీ తదా ప్రాహ నృపంవిస్మయసంయుతం
రాజ స్తవ సుతా బాలా ప్రధావా దేవతా వద ॥ ౬౯
ఇత్యుక్తో నృపతిః ప్రాహ వద సత్య మరుంధతి
కేయం మతల్లికా బాలా మహైశ్వర్యబలాన్వితా॥ ౭౦

తదాఽబ్రవీ న్నృపం దేవీ నవక్తవ్య మిదం నృప
ఇదం దేవరహస్యం తు జానీహి త్వంనృపోత్తమ॥
యత్రేయం సంస్థితాకన్యాతత్ర శ్రీస్స్యాన్నృపోత్తమ॥
వరంతు భూమిజాయా స్తు వరం దద్యాం నృపోత్తమ
పూర్వజ్ఞానం భవేత్సీతాపతేరస్యసుతస్యచ॥ ౭౩

౨౫ ఓయరుంధతి! పసికూనగానున్న యీసీతమీదను నివాగ్రహించుట పిచ్చికమీదను బ్రహ్మాస్త్రమునుఁ బ్రయోగించుటవంటిదిగానున్నది

౨౬ ఓమహావ్రతురాలా! నా బాలికకిచ్చిన శాపమును మరలింపుమని జనకుడు ప్రార్థింపగా నరుంధతీదేవి తనసమీపములోనున్న సీతతో నిట్లు పలికెను.

౨౭ ఓజానకి! నీవప్పుడప్పుడాడుకొనెడి శివధనస్సు నొకపర్యాయమిచ్చుటకుఁ దీసికొనిరమ్మని యరుంధతి చెప్పగా సీతయును పరుగిడుచు వెళ్ళి యామహత్తరమైన శివధనుస్సునుఁ జేతులతో నెత్తి యరుంధతీదేవి సమీపమునకుఁ దీసికొనివచ్చెను.

౨౮ జనకమహారాజును రాజగృహమునందలి స్త్రీలందఱును సీత ధనుస్సునెత్తి తీసికొనివచ్చుటనుఁజూచి యాశ్చర్యనిమగ్నులైరి.

౨౯ ఆశ్చర్యరసనిమగ్నుడైయున్న జనకమహారాజుతో నరుంధతి యివ్విధముగఁ బలికెను. ఓరాజా! నీకొమరిత బాలికయా ప్రౌఢయా లేక దేవతయా! నీవే యాలోచించి చెప్పుమనియెను.

౩౦ అరుంధతి యివ్విధముగఁ జెప్పగా జనకుడు తిరిగి యామెతో నిట్లుఁ బలికెను. ఓయరుంధతి! మహాశ్చర్యకరమైన బలముతోఁ గూడిన యీయుత్తమబాలికయొక్క వృత్తాంతమును సత్యముగా నీవు చెప్పుము. అని యరుంధతిని జనకు డడిగెను.)

౩౧ అప్పుడు జనకునితో నరుంధతి యిటులఁ బలికెను. ఓ జనకమహారాజా! నీవడిగినవిషయము దేవరహస్యము కావునఁ జెప్పదగినది కాదనియెఱుంగుము. ఈకన్యక యెచ్చటనుండునో యచ్చట సిరి యున్నదనియే భావింపుము.

౩౨ ఓరాజా! సీతాదేవికి వరము నిచ్చెదను వినుము. ఇతరులెవ్వరైనను సీతాపతిని స్తోత్రము చేసినచో వెంటనే సీతాపతికిఁ బూర్వజ్ఞానము కలుగును.

ఏషా కన్యా మహాభాగ భాగధేయవశా త్తవ
ప్రాప్తేతి మనుథా రాజ న్నర్హాయేమాం సమర్పయ॥ ౨౪
అనర్హాయ సుతాం దాతుః పితుర్నాన్యపరో రిపుః
ఇత్యుక్తో జనకో రాజా ప్రాహ వై తామరుంధతీం॥ ౨౫
మాత ర్నహి త్వదజ్ఞాతనృపపుత్రా భవంతి కా
సీతార్హం వీర్యసంపన్న మేకం బ్రూహి మహావ్రతే॥ ౨౬
అరుంధతీ తదా ప్రాహ జనకం మధురం వచః
రాజన్ తవ సుతాయాస్తు వరమర్హం నృపాత్మజం
విధాతర్యత్ర మే వక్తు మహం తు స్యాం కథంక్షమా॥ ౨౭
తథాపి త్వత్సుతాయాస్తు సమానేతుం పతిం క్షమం
సమీచీన ముపాయం తు బ్రవీమ్యేక మహం శృణు॥ ౨౮
నిటలాక్షేణ సాక్షాద్ధి పురా ధృత మిదం ధనుః
లీలయోద్ధృత్య పాణిభ్యా మానీతం సుతయా తవ
ధనురారోపణం యస్తు కరిష్యతి నృపాత్మజః
తస్మై కన్యామిమాం దేహి త్వత్సుతార్హో వరశ్చ సః॥ ౨౯-౩౦
తథాస్త్వితి నృపః ప్రాహ పణరూప మిదం వచః
ధనురారోపయే ద్యస్తు తస్మై దద్యామిమా మహం॥ ౩౧

౨౪ ఓ జనకమహారాజా! నీపుణ్యవిశేషముచే నీకన్యక నీకు సంప్రాప్తమైనదని తలంపుము. ఈచిన్నదానినిఁ దగినవరునకుమాత్రమీయుము.

౨౫ ఓ జనకా! అహల్యనికానివానికిఁ గొమరిత నిచ్చినతండ్రికంటె వేఱుశత్రువుడు లేడని యెఱుంగుము, అని యరుంధతి చెప్పఁగా జనకు డరుంధతితోఁ దిరిగి యిటులఁ బలికెను.

౨౬ ఓ తల్లియగు నరుంధతి! భూమియందు నీకుఁదెలియని రాజపుత్రులు లేరు. కాన సీతకుఁ దగినవాడును మహావీర్యవంతుడునగు నొక రాజపుత్రునిఁ జెప్పుమని జనకు డరుంధతినిఁ బ్రశ్నించెను.

౨౭½ అప్పు డరుంధతి జనకునితో మధురముగ నిటులఁ బలికెను. ఓ జనకా! నీకుమారికిఁ దగిన రాజపుత్రునిఁ జెప్పుటకు బ్రహ్మకూడ సమర్థుడు కాడన నేనెంతదానను.

౨౮½ అయినను నీపుత్రికకుఁ దగినవరునిఁ దీసికొనివచ్చుటకు నొక యుపాయమునుఁ జెప్పెదను వినుమనియె.

౨౯½-౩౦ ఓ జనకమహారాజా! పూర్వకాలమందు శంకరునిచే ధరింపఁబడిన యాశివధనుస్సును నవలీలగాఁ జేతులతో నెత్తి నీకొమరిత తీసికొనివచ్చినది, కావున నెవ్వడీ ధనువును నెక్కుపెట్టఁగలడో వానికి నీకొమరిత నీయుము. నీకుమారికిఁ దగినవరుడతడని (యరుంధతి చెప్పెను.)

౩౧½ జనకమహారాజు నవ్విధమునసే యగుగాక యనిచెప్పి వెంటనే పణరూపమగు వాక్యమునుఁ బలికెను. (ఏమనగా) ఈశివధనుస్సు నెవ్వడెక్కుపెట్టునో వానికే నాపుత్రికనిచ్చెదను. (అని జనకుడు పలికెను.)

తత స్సీతా వ్రతం కర్తుం సమారభ్య యథావిధి
శ్రీకన్యాతులసీదేవీ ముపచారై స్తు సర్వశః
సమభ్యర్చ్య సుధూపై శ్చ ధూపయిత్వా నివేదనం
కృత్వా నీరాజనం దత్వా కృత్వా తస్యై ప్రదక్షిణం
భూమిజా హృదయే దధ్యౌ దేవీం తాంతులసీంతతః॥
౮౨-౮౩-౮౪

శ్రీ కన్యాతులసీదేవీవ్రతపూర్తిం విధాయ సా
అరుంధత్యాదిదేవీ స్తు మానయామాస భూమిజా॥ ౮౫

అథ పుణ్యస్త్రియ స్సర్వా స్సన్మానం ప్రాప్య భూమిజాం
ఆశీర్భి రభినంద్య స్వాన్నివాసా న్ప్రతిపేదిరే॥ ౮౬

సూతః॥ భూమిజాజన్మలీలాదిచరిత్రం పావనంద్విజాః
యథాప్రశ్నంమయోక్తంవఃపశ్చాచ్ఛృణుతతత్కథాం
యత్కథాశ్రవణాద్భూయ నమాతుః స్తన్యపోనరః॥ ౮౭౪

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే
ద్వితీయభాగే ద్వితీయస్సర్గ స్సమాప్తః.

౨౨-౨౩-౨౪ అనంతరము సీత వ్రతారంభమునుజేసి కన్నెతులసిని షోడశోపచారములచేఁ బూజించి ధూపదీపనైవేద్యాదుల నిచ్చి నీరాజనములిచ్చి ప్రదక్షిణనమస్కారములనుఁజేసి కన్యాతులసీదేవినిఁ దనహృదయఫలకమున ధ్యానించెను.

౨౫ అనంతరము సీతాదేవి కన్నెతులసీ వ్రతమును సమాప్తిచేసి యరుంధతి మొదలగు పుణ్యస్త్రీలనుఁ దగినటుల సత్కరించెను.

౨౬ అనంతరము పుణ్యాంగన లందఱు సన్మానితులై సీత నాశీర్వదించి తమతమ నివాసముల కేగిరి.

౨౭ సూతుడు మహర్షులతో నిట్లు చెప్పెను.

౨౮ ఓ మహర్షులారా! మీరలడిగిన విధముగఁ బవిత్రమైన సీతాదేవి జన్మ లీలాది విచిత్రచరిత్రమును మీకుఁ జెప్పితిని. ఏ రామకథను వినుటవలనఁ దిరిగి మనుష్యు డెన్నటికి మాతృస్తన్యపానమునుఁ జేయడో యా రామకథనుఁ బూర్వోక్తానంతరమైనదానినిఁ జెప్పెదను వినుడనిఁ సూతుడు మహర్షులతో జెప్పెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున
ద్వితీయభాగమున ద్వితీయసర్గము సమాప్తము.

---

## తృతీయసర్గ ప్రారంభః.

అథ సర్వే సుమనసోఽమంత్రయ న్మిళితాః క్వచిత్
దశాస్యాదివధాయైవ రామనామ్నాఽజని ర్హరిః॥ ౧
లక్ష్మీ స్సీతాఖ్యయా భూమ్యా మవాతరదమానుషీ
కించిత్కలహబీజం తు రామరావణయో ర్హృది
పయుం సంస్థాపయామ శ్చేత్తద్భవే త్తరురూపతః॥ ౨౹
ఏవ మాలోచ్య తే దేవా స్తత్కర్తుం నారదం వినా
న సమర్థోఽపర శ్చేతి మత్వా నారద మబ్రువన్॥ ౩౹
మహర్షే! దేవకార్యార్థం గత్వా రామదశాస్యయోః
సంస్థాప్య స్వాంతయో రీర్ష్యాబీజ మాగచ్ఛతా ద్భవాన్
ఇత్యుక్త్వా ప్రేషయామాసుర్నారదం త్రిదశా స్తదా॥ ౪-౫౹
అథ సంతుష్య దేవర్షి ర్లంకా మాగత్య సత్వరం
రావణేనాఽర్చిత స్సమ్య గ్వ్రాహ తం రజనీచరం॥ ౬౹

భగవా న్నామరూపేణ జాత స్తవ వధాయ హై
ఇత్యహం తేఽవదం పూర్వం తస్మి న్కిం చింతితం
త్వయా॥ ౭౹

## తృతీయసర్గము ప్రారంభము

౧ అనంతరము దేవతలందఱు నొకచోటఁ గలసి క్రిందివిధముగ నాలోచింపఁ దొడగిరి. (ఏమన)
శ్రీహరి, రావణుఁడు మొదలగు దుష్టరాక్షసులను సంహరించుటకుఁ గదా భూమియందు రాముఁడను నామముతో నవతరించెను.

౨౹ మఱియు లక్ష్మీదేవియును సీతయను నామముతో భూమియం దవతరించి యుండెను. రామరావణుల హృదయములం దిప్పటినుండియుఁ గొంచెము కలహబీజమును మనము నాటింపఁజేసినచో నదియే వృక్షరూపముగాఁ బరిణమించును. (అని దేవతలందఱు నాలోచించిరి.)

౩౹ ఈ ప్రకారముగ దేవతలాలోచించి యాకలహబీజమును నాటి వచ్చుటకు నారదమునికంటె నితరు డెవ్వఁడును సమర్థుఁడు కాఁడని తలచినవారలై యచ్చటనున్న నారదమహర్షితో నివ్విధముగఁ బలికిరి.

౪-౫౹ ఓ నారదమహర్షీ! దేవకార్యార్థమై నీవు భూలోకమున కేగి రామరావణుల హృదయములందుఁ గలహబీజమును నాటి తిరిగి రావలసినదిగా దేవతలు నారదునితోఁ జెప్పి యమ్మహర్షిని భూలోకమున కంపిరి.

౬ అనంతరము దేవర్షియగు నారదుఁడును సంతోషించి (సంతోషమేల ననగా నారదుఁడు కలహభోజనుఁడు కానఁ దనకు నాహారము దొటికినదని సంతోషించెనని భావము) శీఘ్రముగ లంకాపట్టణమునకు వచ్చి రావణునిచేఁ బూజింపబడినవాఁడై యారాక్షసేశ్వరునిగూర్చి యివ్విధముగఁ బలికెను.

౭౹ ఓ రావణుఁడా! నిన్ను వధించుటకు భగవంతుఁడగు శ్రీహరి రాముడుగా నవతరించెనని నీకు నేను పూర్వమే చెప్పియుంటినిక దా! ఆవిషయమై యేమి యాలోచించితివి. (అని నారదుఁడు రావణునితోఁ బలికెను.)

ఇత్యుక్తోఽథ దశాస్యోఽపి ప్రాహ తం నారదం మునిం॥
విశ్వాస్య తు భవద్వాక్యం పురాఽయోధ్యాం మహాంగతః
పరిశీలితవా న్నాహం శిక్షురూపేణ నారద॥
ప్రాకృతా త్ప్రాకృతో దృష్ట స్తత్ర రామోఽభవ న్మయా
న హి విశ్వసనీయం మే స్తావకం వచనం తవ॥౮-౯-౧౦
ఇత్యుక్తో నారదోఽప్యాహ రావణం లోకరావణం
దేవమాయావిమోహితోఽసి నోచే న్నేత్థం త్వయోచ్యతే॥ ౧౧॥
అద్యవా మే వచ శ్శ్రుత్వా రోచతే చే త్తథా కురు
సిద్ధాశ్రమే కౌశిక స్తు బ్రహ్మేష్టించ కరిష్యతి॥
రామ స్తత్ర క్రతురక్షార్థే సమాగచ్ఛే ద్దశానన॥ ౧౨॥
కౌశికేష్టి విఘాతాయ బలిష్ఠా న్రాక్షసా న్నునః
సంప్రేషయ తదా రామో హతవాన్రాక్షసాన్యది
తదా రామం పరాత్మానం జానీహి తవమారకం॥
ఏవముక్తో దశాస్యోపి తథేత్యాహ మునిం ప్రతి॥౧౩-౧౪॥
అథ దేవముని స్తూర్ణం ప్రాప్య సిద్ధాశ్రమం శుభం
కౌశికేన యథాన్యాయం పూజితశ్చాఽబ్రవీ ద్వచః॥౧౫॥
దేవతాకార్య సిద్ధ్యర్థం క్రతుమేకం సమాచర
తద్విఘాతంతు కుర్యుశ్చే ద్రాక్షసా రావణేరితాః
క్రతుపూర్త్యైభవా న్నామమానయేద్రాక్షసాంతకం॥౧౬-౧౭

౮-౯-౧౦ అనంతరము నారదునితో రావణుడిటులఁ జెప్పెను.

ఓ నారదా! నీమాటను నమ్మి యింతకు పూర్వ మొకప్పుడు నేను బిచ్చగాని వేషముతో నయోధ్యకువెళ్ళి రామునిఁ బరిశీలించితిని. ఆరాముడు సామాన్యులలో సామాన్యుడుగాఁ గన్పడెను. అట్టి సామాన్యబాలకుడు నాకు మారకుడా? ఓ నారదా! నీస్తుతివాక్యములను నేనెప్పటికి నమ్మను. (అని నారదునితో రావణుడు చెప్పెను.)

౧౧ రావణుని వాక్యములను నారదుడువిని తిరిగి యారావణునితో నిటులఁ జెప్పనారంభించెను. ఓ రావణా! నీవు దైవమాయచే మోహితుడవై యిటులఁ బలుకుచున్నావు. లేకపోయినచో నిటులఁ బలుకవు.

౧౨½ ఓ రావణా! ఇప్పుడైనను నేను చెప్పెడిమాట నీకు రుచించినయెడల నివ్విధముగా జేయుము. సిద్ధాశ్రమమునందు విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యను క్రతువునుఁ జేయఁగలడు. రామచంద్రమూర్తి కూడ నాకౌశిక యాగసంరక్షణార్థమై సిద్ధాశ్రమమునకు రాగలడు.

౧౩-౧౪½ విశ్వామిత్రుని యజ్ఞమునుఁ బాడుచేయుటకు బలవంతులగు రాక్షసులనుఁ బంపుము, నీచేఁబంపబడిన రాక్షసులను రాముడు సంహరించినయెడల నప్పుడు నీవు రామునిఁ బరాత్పరునిగాను నీకు మారకునిఁగానుఁ దెలిసికొనుము. అని నారదుడు రావణునితోఁ జెప్పగా రావణుడు, నేనట్లేపంపి రామునిఁ బరిశీలించెదనని నారదునితోఁ జెప్పెను.

౧౫½ అనంతరము నారదుడు శీఘ్రముగ సిద్ధాశ్రమమునకువచ్చి కౌశికునిచేఁ బూజింపఁ బడినవాడై యా కౌశికునితో నిటులఁ బలికెను.

౧౬-౧౭½ ఓ విశ్వామిత్రుడా! దేవకార్యార్థమై నీవొక క్రతువు నారంభింపుము. ఆక్రతువునకు విఘాతము చేయుటకు రాక్షసులు వచ్చినచో వెంటనే యయోధ్యకువెళ్లి రాక్షసాంతకుడైన రామచంద్రమూర్తిని నీక్రతుపూర్తికై తీసికొనిరమ్ము. (అని నారదుడు విశ్వామిత్రునిఁ బ్రేరేపించెను.)

కౌశికః॥ శ్లో॥ జ్ఞానమార్గస్థితం మాం త్వం కిమర్థం కామ్యకర్మణి
ప్రోత్సాహయసి సర్వజ్ఞ నేదం తే నస్తు మత్ప్రియం॥ ౧౮

ఇత్యుక్తో నారదః ప్రాహ కౌశికం మునిసత్తమం॥ ౧౮౹

గోదేవద్విజకార్యేషు స్వార్థహీనోఽపి సజ్జనః
యతతేతేతి పురాణాని ప్రవదంతి మునే యతః
తత స్త్వత్ఫలాభావేఽప్యవశ్యం కౌశికాఽద్య వై
దేవకార్యార్థ సిద్ధ్యర్థం కర్మ కర్తుం యతస్వ సత్॥
ఇత్యుక్త్వాఽంగీకృతిం తేన కారయిత్వా చ నారదః
అవాప్య కౌశికానుజ్ఞాం మిథిలాం సముపాగతః॥ ౧౯-౨౦-౨౧౹

జనకేనార్చిత స్సమ్యగ్దేవర్షి స్తం నృపం ప్రతి
దేవకార్యం సమీక్ష్యార్థం ప్రోవాచ వచనం మిథః॥ ౨౨౹
సీతాస్వయంవరం కర్తుం యతస్వాద్య త్వ మైథిల
శుభం భవతు తే రాజన్ కాలోఽయం మంగళప్రదః॥ ౨౩౹
ధనురారోపణం శుల్కమితః పూర్వం త్వయా కృతం
ఇతి శ్రుతం మయా రాజన్ తన్నిర్వర్తయ సాంప్రతం॥ ౨౪౹
ధనుర్యాగాఖ్యయా సర్వాన్ రాజపుత్రా న్సమాహ్వయ
సంప్రేషయ శుభాం తూర్ణం కౌశికాయ చ పత్రికాం॥ ౨౫౹

౧౮ (విశ్వామిత్రుడు నారదునితో నిటులఁ జెప్పెను;) నారదా! జ్ఞాన మార్గములోనున్న నన్ను కామ్య కర్మవిషయమై యేలఁ బ్రోత్స హించెదవు. నీవు సర్వజ్ఞుడవై యుండియు నన్నిటుల కర్మమార్గ మునఁ దిరిగి ప్రవేశ పెట్టఁదలచుట తగినపని కాదని (కౌశికుడు నారదునితో చెప్పెను.)

౧౮½ ఈ ముగ విశ్వామిత్రుడు చెప్పిన వాక్యమును నారదుడు విని యమ్మహర్షితోఁ దిరిగి యిట్లు చెప్పెను.

౧౯-౨౦-౨౧ ఓ కౌశికుడా! సత్పురుషుడైనవాడు తనకుఁ బ్రయోజనము లేకపోయినను గోబ్రాహ్మణ దేవతా కార్యముల విషయమై ప్రయ త్నింపవలయునని పురాణములు ఘోషించుచున్నవి. నీకు ఫలము లేకపోయినను నిప్పుడు దేవతా కార్యార్థమై కర్మను జేయుమని నారదుడు చెప్పి విశ్వామిత్రునిచే నంగీకరింపఁజేసి యమ్మహర్షి యనుజ్ఞనొంది మిథిలాపట్టణమునకు నారదుడు వెళ్లెను.

౨౨½ జనకమహారాజునొద్దకు నారదుడు వెళ్ళి యారాజుచేఁ బూజింపఁ బడినవాడై దేవకార్యమును జక్కఁబరచుటకు జనకునితో రహస్య ముగా నిటులఁ జెప్పెను.

౨౩½ ఓజనకమహారాజా! సీతాస్వయంవరమునిమిత్తము నీవిప్పుడే ప్రయ త్నింపుము. ఓరాజా! నీకు మేలుకలుగును. ఈసమయము శుభప్రద మని చెప్పెను.

౨౪½ ఓజనకమహారాజా! నీవింతకుఁ బూర్వము ధనుస్సు నెవడెక్కు పెట్టునో వానికి సీతనిచ్చెదనని కన్యాశుల్కము నేర్పరచితివని వింటిని దానినిప్పుడు సమకూర్చుము.

౨౫½ ఓరాజా! ధనుర్యాగమనే పేరుతో రాజపుత్రులనందఱ నాహ్వానిం పుము. విశ్వామిత్రునకును శుభపత్రికనుఁ బంపుము.

విశ్వామిత్రప్రసాదేన శుభం తవ భవే న్నృప
ఇతఃపరం న వక్తవ్య మిత్యుక్త్వాఽగా ద్దివం మునిః॥ ౨౭

జనకోఽపి ముదావిష్టః ధనుర్యాగప్రయత్నవాన్
ఉవాస మిథిలాయాం తు నారదేన ప్రచోదితః॥ ౨౮

సిద్ధాశ్రమే కౌశికోఽపి సమారభ్య క్రతుంపునః
రక్షోకల్పితతద్విఘ్నః రామ మానీయ వై పునః
క్రతుపూర్తింవిధాతుం తత్ప్రియ త్నే సంస్థితోఽవసత్॥ ౨౯

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే
ద్వితీయభాగే తృతీయస్సర్గ స్సమాప్తః.

---

౨౬౹ ఓరాజా! విశ్వామిత్రుని యనుగ్రహముచే నీకుఁ దప్పక మేలు కలుగును. ఇంతకంటె నితరవిషయము చెప్పఁదగినదికాదని చెప్పి నారదమహర్షి దేవలోకమున కేగెను.

౨౭౹ మిథిలాపట్టణమున నైవిధముగ నారదునిచే బ్రోత్సహింపబడిన జనకమహారాజు సంతోషముతో ధనుర్యాగ సీతాస్వయంవరములను జరుపు ప్రయత్నములో నుండెను.

౨౮౹ సిద్ధాశ్రమమునందు విశ్వామిత్రుడును నారదుడు చెప్పినవిధముగ నొక క్రతువునుఁజేయ నారంభించి, రావణునిచేఁ బంపఁబడిన సుబాహుమారీచులు మొదలగు రాక్షసులచేఁ గల్పింపఁబడిన క్రతువిఘ్నముకలవాఁడై యారాక్షససంహారార్థమై క్రతుపూర్తికై రామచంద్రమూర్తినిఁ దీసికొనివచ్చు ప్రయత్నములోనుండెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున
ద్వితీయభాగమున తృతీయసర్గము సమాప్తము.

---

# చతుర్థసర్గప్రారంభః

ఋషయః॥ ఆస్మాతకం రామకథా కథితా నస్త్వయా పురా
ఆనంతరీం కథాంబ్రూహి సూతనశ్శ్రోతు మిచ్ఛతాం॥౧

1సూతః॥విద్యాగృహాద్వినిష్క్రమ్య రామో రాజీవలోచనః
దివసాన్యనయ ద్గేహే లీలాభి రకుతోభయః॥ ౨

అథ గచ్ఛతి కాలే తు పాలయ త్యవనిం నృపే
ప్రజాసు వీతశోకాసు స్థితాసు విగతజ్వరం॥
తీర్థపుణ్యాశ్రమశ్రేణిం దృష్ట్వు ముత్కంఠితం మనః
రామస్యాఽభూ ద్భృశం తత్ర కదాచిద్గుణశాలినః ౩-౪
రాఘవ శ్చింతయిత్వైన మువాచ పితరం ప్రతి
తీర్థాని దేవసద్మాని వనా న్యాయతనాని చ
ద్రష్టు ముత్కంఠితం తాతమ మేదం నాథ మానసం॥ ౫
ఇతి సంప్రార్థితో రాజా వసిష్ఠేన సమం తదా
విచార్యాఽముంచ దైవైనం రామం ప్రథమ మర్థినం॥౬

శుభే దివస నక్షత్రే భ్రాతృభి స్సహ రాఘవః
వసిష్ఠప్రహితై ర్విప్రై శ్శాస్త్రజ్ఞై శ్చ సమన్వితః
నిరగాత్స్వగృహా త్మస్మాత్తీర్థయాత్రార్థ ముద్యతః॥౭-౮

1, వా॥ సి॥ రా॥

## చతుర్థసర్గప్రారంభము.

౧. మహర్షులు సూతుని నివ్విధముగఁ బ్రశ్నించిరి. ఓరోమహర్షణుఁడా! రామచంద్రమూర్తి విద్యపూర్తిచేసినంతదనుక పూర్వము రామకథనుఁ జెప్పియుంటివి. పిమ్మటఁ గథావృత్తాంతమును వినవలయునని కోరికగా నున్నందున అనంతర రామకథనుఁ జెప్పుమనియడిగిరి.

౨ తా॥ మహర్షులతో సూతుడప్పుడు జెప్పనారంభించెను. (ఏమన) ఓమహర్షులారా! శ్రీరాముడు బ్రహ్మచర్యోచితమగు గురుకులవాసమువలన సర్వవిద్యలను గ్రహించి బయలువెడలి నిర్భయుఁడై యింటియందు విహరించుచు దినములను వెళ్ళబుచ్చుచుండెను,

3-౪ ఇట్లు రాముఁడు కాలమును గడుపుచుండగా, తండ్రి రాజ్యమును పరిపాలింపుచుండగా, ప్రజలేవిధమగు తాపమునులేక సుఖముగ నుండగా, నొకప్పుడు రామునిమనస్సు పుణ్యతీర్థములను పవిత్రాశ్రమములను చూచుటకు మికిలి యుత్సహించెను.

౫ రాముఁడీరీతిగ నాలోచించి తండ్రితో నీవిధముగ బలికెను. ప్రభువగు నాతండ్రీ! నామనస్సు పుణ్యతీర్థాదిసేవనము చేయుటకు కుతూహలము కలదియైయున్నది. శలవిమ్మనియె.

౬ దశరథుఁడును, ఈలాగున రామునిచే బ్రార్థింపఁబడి గురువగు వసిష్ఠునితో నాలోచించి రాముని యాప్రథమప్రార్థన నంగీకరించి తీర్థయాత్రలను సేవించుటకు నతని కనుజ్ఞ నిచ్చెను.

౭-౮ రాముఁడు యోగ్యమగు తిథివారనక్షత్రములయందు సోదరులతోడను వసిష్ఠునిచే పంపఁబడిన పండితులతోడను గూడుకొనివాడై తీర్థయాత్రోద్యుక్తుఁడై తనయింటినుండి బయలుదేరెను.

అథాఽరభ్య స్వకా త్తస్మా త్కమా త్కోసల మండలాత్
నదీతీరాణి పుణ్యాని వనా న్యాయతనాని చ
మందాకినీ మిందునిభాం కాళిందీం చోత్పలామలాం
సరస్వతీం శతద్రూం చ చంద్రభాగా మిరావతీం॥
వేణీం చ కృష్ణవేణీం చ నిర్వింధ్యాం సరయూం తథా
చర్మణ్వతీం వితస్తాం చ విపాశాం బాహుదా మపి
ప్రయాగం నైమిశం చైవ ధర్మారణ్యం గయాం తథా
వారాణసీం శ్రీగిరిం చ కేదారం పుష్కరం తథా॥
అగ్నితీర్థం మహాతీర్థ మింద్రద్యుమ్నసర స్తథా
దేవానాం బ్రాహ్మణానాం చ పావనా నాశ్రమా న్శుభాన్
షాణ్మాసాభ్యంతరే స్నానదానపూర్వం దదర్శ సః॥
౯-౧౦-౧౧-౧౨-౧౩

అమరకిన్నరమానవమానిత స్సమవలోక్య మహీం
మఖిలా మిమాం। ఉపయయౌ స్వగృహం రఘునం
దనో విహృతది క్పవలోక మివేశ్వరః॥ ౧౪

రామః పుష్పాంజలిప్రాతై ర్వికీర్ణః పురవాసిభిః
ప్రవివేశ గృహం శ్రీమాన్ జయంతో విష్టపం యథా॥౧౫

ప్రణనామాఽథ పితరం వసిష్ఠం మాతృబాంధవాన్
బ్రాహ్మణా న్కులవృద్ధాం శ్చ రాఘవః ప్రథమాగతః॥౧౬

బభూవాఽథ దినా న్యష్టౌ రామాగమన ఉత్సవః
సుఖం మ త్తజనో న్మత్త కలకోలాహలాకులః॥ ౧౭

౯-౧౦-౧౧-౧౨-౧౩౹౹ తరువాత శ్రీరాముడు తనకోసలదేశమునుండి క్రమముగ పవిత్రములగు నదీతీరములను దీర్ఘములగు వనములను చంద్రునివలె తెల్లనికాంతిగల గంగానదిని, నల్లకలువలవంటి కాంతిగల యమునానదిని, సరస్వతీనదిని, శతద్రూనదిని, చంద్రభాగానదిని, ఇరావతీనదిని, కృష్ణవేణీనదిని, నిర్వింధ్యానదిని, చర్మణ్వతీనదిని, సరయూనదిని, వితస్తయనునదిని, విపాశయనునదిని బాహుదానదిని, ప్రయాగక్షేత్రమును నైమిశారణ్యమును, ధర్మారణ్యమును, గయను, కాశీక్షేత్రమును, శ్రీశైలమును, కేదారమును, పుష్కరక్షేత్రమును, అగ్నితీర్థమును, మహాతీర్థమును, నింద్రద్యుమ్నతీర్థమును పవిత్రములగు దేవబ్రాహ్మణాశ్రమములను స్నానదానాది పూర్వకముగ నాలుమాసములలో సందర్శించెను.

౧౪౹౹ త్రిలోకపూజితుఁడగు నా శ్రీరామచంద్రుఁడు సమస్త భూమండలమును జూచి యీశ్వరుఁడు దిగ్విహారమునుజేసి కైలాసమును ప్రవేశించినట్లు స్వస్థానమగు నయోధ్యను ప్రవేశించెను.

౧౫౹౹ తీర్థయాత్రనుండితిరిగివచ్చిన శ్రీరాముఁడు పట్టణజనులచే,నంజలులచే చల్లబడిన పుష్పములుకలవాడై యిందప్రుత్రుడగు జయంతుఁడు స్వర్గమునువలె తనగృహమును ప్రవేశించెను.

౧౬౹౹ తరువాత, దేశాంతరములనుండి వచ్చిన శ్రీరాముఁడు, తండ్రిని, గురువులను తల్లులను బంధువులను బ్రాహ్మణులను కులవృద్ధులను గూర్చి నమస్కరించెను.

౧౭౹౹ తరువాత, రాముని రాకచేత సంతోషించిన జనులచేత జేయబడిన, గంభీరకోలాహలధ్వనులచే వ్యాప్తమగు నుత్సవము సుఖముగ నెనిమిదిరోజులు జరిగెను.

ఉవాస సుసుఖం గేహే తతః ప్రభృతి రాఘవః
వర్ణయ న్వివిధాకారా న్దేశాచారా నిత స్తతః॥ ౧౮
ప్రాత రుత్థాయ రామోఽసౌ కృత్వా సంధ్యాం యథావిధి
సభాయాం సంస్థితం పశ్చా న్నిరీక్ష్య పితరం గురుం
గత్వా పిత్రా త్వనుజ్ఞాతో మహాత్మా సేనయా వృతః
వరాహమహిషాకీర్ణం వన మాఖేటకేచ్ఛయా
తత ఆగత్య సదనే కృత్వా స్నానాదికం క్రమం
సమిత్రబాంధవో భుక్త్వా నినాయ ససుహృ న్నిశాం।
౧౯-౨౦-౨౧-౨౨
ఏవం ప్రాయదినాచార స్సమువాస పితు ర్గృహే। ౨౩

కృతాయాం తీర్థయాత్రాయాం రామో నిజగృహేస్థితః
జగామాఽనుదినం కార్శ్యం శరదీవాఽమలం సరః॥ ౨౪
కుమారస్య విశాలాక్షం పాండుతాం ముఖ మాదదౌ
కృశాంగ శ్చింతయా యుక్తః ఖేదీ పరమదుర్మనాః
నోవాచ కస్యచి త్కించి ల్లిపిక ర్మార్పితోపమః॥ ౨౫
ఖేదా త్పరిజనేనాఽసౌ ప్రార్థ్యమానః పునః పునః
చకార నిత్యకృత్యాని పరిమ్లానముఖాంబుజః॥ ౨౬
కా తే పుత్ర ఘనా చింతేత్యేవం రామం పునః పునః
అపృచ్ఛ త్స్నిగ్ధయా వాచా నైవాఽకథయ దస్య సః॥ ౨౭

౧౮½ ఆరాముఁ డదిమొద లచ్చటచ్చటఁజూడఁబడిన వివిధములగు దేశాచారములను వర్ణించుచు నింటియందు సుఖముగా నివసించెను.

౧౯-౨౦-౨౧-౨౨½ ఈరాముఁడు ప్రతిదినమందు నుదయమందునలేచి శాస్త్రోక్తముగ సంధ్యావందనము నెఱవేర్చి తరువాత సభయందున్నటువంటి గురువగు తండ్రినిఁజూచి, తండ్రియనుజ్ఞనొంది గొప్పదియగు సేనను వెంటఁబెట్టుకొని వేటయందలి కుతూహలముచే నడవిపందులు నడవిదున్నలు మొదలగు మృగములతో నిండిన యరణ్యమునకు వెళ్ళి వేటాడినతరువాత రాముడింటికివచ్చి స్నానాదిక్రమమును నెరవేర్చి మిత్రులతోను బంధువులతోను భుజించి స్నేహితులతోగూడ రాత్రిని గడపుచుండెను.

౨౩ తీర్థయాత్రనుండి తిరిగి వచ్చినతరువాత రాము డీరీతిగ నప్పుడప్పుడు చేయబడుచున్న వేటఁల దినకృత్యములను నెఱవేర్చుచు లక్ష్మణాదులతో తండ్రిగృహమునందు సుఖముగ నుండెను.

౨౪ తీర్థయాత్ర నెరవేరగా రాముఁడు తనగృహమందున్నవాఁడై, ప్రతిదినము శరత్కాలమునందు నిర్మలమగు సరస్సువలె కృశత్వమును బొందెను.

౨౫½ విశాలమగు నేత్రములుగల రామునియొక్క ముఖము వెలవెలఁబోయెను. కృశించినశరీరము కలవాఁడై దుఃఖించుచు నత్యంతవికలమనస్సుగలవాఁడై చిత్తరువునందు వ్రాయబడినవానివలె నెవ్వనితోను నేమియు మాట్లాడకుండెను.

౨౬½ ఈప్రకారముగ నారాముడు వాడిన ముఖకమలము కలవాడై సేవకులచే మాటిమాటికిఁ బ్రార్థింపఁబడుచు నిత్యకృత్యముల నతికష్టముచే నెరవేర్చుచుండెను.

౨౭½ "కుమారా! నీ కీగొప్పదియగు విచార మెందుకు" అని, తండ్రిచే మాటిమాటికి మృదువగు మాటలచే నడుగబడినవాఁడైనప్పటికి ప్రయోజనములేదను నిశ్చయముచే నారాముఁడు చెప్పడాయెను

న కించి త్తాత మే దుఃఖ మిత్యుక్త్వా పితు రంకగః
రామో రాజీవపత్రాక్ష స్తూష్ణీ మేవ స్మ తిష్ఠతి॥ २८५

తతో దశరథో రాజా రామః కిం ఖేదవానితి
అపృచ్ఛ త్సర్వకార్యజ్ఞం వసిష్ఠం వదతాం వరం॥ २९५

ఇత్యుక్త శ్చింతయిత్వా స వసిష్ఠమునినా నృపః
అస్త్యత్ర కారణం శ్రీమ న్న రాజ న్దుఖ మస్తు తే। ३०५

కోపం విషాదకలనాం వితతం చ హర్షం
నాల్పేన కారణవశేన వహంతి సంతః
సర్గేణ సంసృతిజవేన వినా జగత్యాం
భూతాని భూప న మహాంతి వికారవంతి॥ ३१५

శృణు తత్కారణం రాజ న్తీర్థసేవావశా త్పునః
విరక్త్యా లబ్ధయా రామో నివృత్తిపథ మాశ్రితః
యథా ప్రవృత్తిస్స్యా త్తస్య తథా యత్నం కురు ద్రుతం॥ ३२-३३

ఇత్యుక్తో మునినా రాజా లోకవృత్తే నిజం సుతం
ప్రవర్త యితుకామేన సభాయాం మంత్రిభి స్సహ
కరోత్యాలోచనం రామవివాహవిషయే పునః॥ ३४५

౨౮॥ పద్మదళాక్షుఁడగు నారాముఁడు, తండ్రీ! నాకు కొంచెమైనను విచారము లేదని పలికి తండ్రితొడమీదఁ గూర్చున్నవాడై యూరకుండెను.

౨౯॥ తరువాత, రాజగు దశరథుఁడు, రాముడే కారణముచే దుఃఖము కలవాడని సమస్తకార్యముల నెఱింగినట్టియు, వక్తలలో శ్రేష్ఠుడైనట్టియు వసిష్ఠమహాముని నడిగెను.

౩౦॥ ఈలాగు నడుగబడిన యావసిష్ఠమహర్షి కొంతసేపాలోచించి "ఓ రాజా! ఈవిషయమునఁ గారణము కలదు. నీవు విచారింపవలదు" అని రాజునుగూర్చి పలికెను.

౩౧॥ ఓ దశరథమహారాజా! పృథివ్యాదిమహాభూతములు సృష్టిసంహారవేగములు లేక, లోకమునందెట్లుగా వికారము నొందవో యట్లే సత్పురుషులును నల్పకారణములచే విస్తారమగు కోపమును సంతోషమును పొందరు. గొప్పకారణముచేతనే పొందుదురు. కనుక యీవిషయమున గొప్పకారణము కలదు.

౩౨-౩౩ ఓ రాజా "ఆకారణమును వినుము రాముఁడు తీర్థయాత్రలను సేవించుటవలన కలిగిన వైరాగ్యముచే నివృత్తిమార్గము నాశ్రయించెను కావున నారామునకు నెవ్విధముగ ప్రవృత్తిమార్గమునందభిరుచి కలుగునో యవ్విధముగ నీవు శీఘ్రముగ ప్రయత్నింపుము.

౩౪॥ ఇవ్విధముగ వసిష్ఠునిచేఁ జెప్పఁబడిన దశరథుఁడు తనపుత్త్రుని లోకవ్యాపారమున ప్రవర్తింపజేయు కోరికతో సభాస్థలిలో మంత్రులతోఁగూడ రామునియొక్క వివాహవిషయము నాలోచించుచుండెను.

* ఏతస్మిన్నేవ కాలేతు విశ్వామిత్రఇతి శ్రుతః
మహర్షి రభ్యగా ద్ద్రష్టుం తమయోధ్యాధిపం నృపం॥ ౩౫

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే
ద్వితీయభాగే చతుర్థస్సర్గస్సమాప్తః

---

* అత్ర సకలగుణాభిరామస్య రామస్యదారక్రియాం చింతయంతం దశరథం ప్రతి విశ్వామిత్రాగమనం చింతాసమయే మహతామాకస్మికప్రాప్తి శ్చింతితార్థప్రదేతి సూచయతి. మహర్షి రిత్యనేన స్వాగమనకార్యం స్వయం కర్తుం సమర్థోఽపి రామవైభవం ప్రకటయితుం స్వసంకల్పిత కార్యస్య నిమిత్తమాత్రం సహాయార్థం దశరథం యాచితుం సమాగతఇతి చ ధ్వన్యతే.

*౩౫౪ ఈసమయమున విశ్వామిత్రమహర్షి సాకేతాధిపతియగు దశరథుని జూచుటకు దశరథగృహమునకు వచ్చెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున
ద్వితీయభాగమున చతుర్థసర్గము సమాప్తము.

---

* ఇచ్చట సకలగుణాభిరాముఁడగు రాముని వివాహవిషయముల నాలోచించుచున్న దశరథునిగూర్చి "విశ్వామిత్రుఁడు వచ్చుటయను నది, యాలోచన సమయమున పెద్దలాకస్మికముగావచ్చుట యభీష్టసిద్ధినిఁ గలుగజేయునని సూచించుచున్నది. మహర్షియని చెప్పుటచేత తానువచ్చిన కార్యమును తాను స్వయముగాఁ జేసికొనుటకు సమర్థుఁడయ్యును రామవైభవమును ప్రకటింపఁజేయుటకు తనచే సంకల్పింపబడిన కార్యమునకు నిమిత్తమాత్రముగ సహాయార్థమై దశరథుని యాచించుటకు వచ్చెనని తోఁచుచున్నది.

పంచమసర్గ ప్రారంభః.

* స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షా నువాచ హ
శీఘ్ర మాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధినన్దనం॥ ౧

తస్య తద్వచనం శ్రుత్వా ద్వార్థా రాజగృహం గతాః
ప్రాప్త మావేదయామాసు ర్విశ్వామిత్రంనృపస్య తు॥ ౨

అథ రాజా దశరథ స్తేషాం వాక్యం నిశమ్య సః
స సమంత్రీ ససామంతః ప్రోత్తస్థౌ హేమవిష్టరాత్॥ 3

పదాతి రేవ సహసా రాజ్ఞాం బృందేన మాలితః
వసిష్ఠవామదేవాభ్యాం సహ సామంతసంస్తుతః
జగామ తత్ర యత్రాఽసౌ విశ్వామిత్రో మహామునిః॥ ౪౫

---

* ఏతావత్పర్యంతం భగవదవతారాదిక ముక్త్వా భగవదవతారప్రయోజనం దుష్టశిక్షణ శిష్టపరిపాలనరూప మిదానీంకథ్యతే-యథా కృషికర్తు ర్ధాన్యప్రాప్తి ర్ముఖ్యఫలం కలమాభివృద్ధ్యై దుష్టదూర్వాద్యుద్ధరణ మవాంతరఫలం భవేత్ తథైవ భగవతశ్శిష్టరక్షణం ప్రధానఫలం శిష్టరక్షణార్థం దుష్టశిక్షణ మవాంతరఫలం భవేత్ దుష్టశిక్షణకథనార్థం విశ్వామిత్రాగమనం వర్ణయతి.

అయిదవసర్గ ప్రారంభము.

* ౧ రాజదర్శనమునుఁ గోరుచున్నట్టి విశ్వామిత్రుఁడు గాధిసుతుఁడగు తనరాకను, దశరథునకుఁ దెలుపుడని ద్వారపాలకులతోఁ జెప్పెను.

౨ ఆవిశ్వామిత్రుని వాక్యమును విని ద్వారపాలకులు రాజగృహము లోనికివెళ్ళి విశ్వామిత్రమహాముని వచ్చెనని దశరథమహారాజునకుఁ దెలియఁజేసిరి.

3 దశరథమహారాజు ద్వారపాలురవాక్యమును విని వెంటనే మంత్రి సామంతపురోహితాదులతోఁగూడ బంగారు సింహాసనమునుండి లేచెను.

౪ దశరథమహారాజు రాజమండలముచేఁ బరివేష్టింపఁబడి సామంత రాజులచే స్తుతింపఁబడుచు పాదచారియగుచునే విశ్వామిత్రుఁడుండిన ద్వారప్రదేశమునకు వెళ్లెను.

---

* ఇంతపర్యంతము భగవదవతారాంశములనుఁ జెప్పి, దుష్టశిక్షణ శిష్టపాలనాదిరూపమగు భగవదవతారప్రయోజన మిప్పుడు చెప్పఁబడుచున్నది. వ్యవసాయముచేయువానికి ధాన్యప్రాప్తి ముఖ్యఫలమైనట్లును, వరిపైరు పెరుగుటకు పైరులో చెడుగా మొలచిన తుంగ మొదలగువానిని పెల్లగించుటయు వ్యవసాయమునకు అవాంతరఫలమైనట్లును, నటులనే భగవంతునకు శిష్టరక్షణము ప్రధానఫలమును, శిష్టరక్షణార్థమై దుష్టులను శిక్షించుట యవాంతరఫలము నగును. దుష్టశిక్షణమునుఁ జెప్పుటకు విశ్వామిత్రుని రాక వర్ణింపఁబడుచున్నది.

దదర్శ మునిశార్దూలం ద్వారభూమా వవస్థితం
కేనాఽపి కారణేనోర్వీతల మర్క ముపాగతం
బ్రాహ్మేణ తేజసా క్రాంతం క్షాత్రేణ చ మహౌజసా
జటావల్యా వృతస్కంధం దధానం భాస్వరం వపుః
ధారయంతం కరే కుండీం కరుణాయుక్తచేతసం
యుక్తయజ్ఞోపవీతాంగం ధవళప్రోన్నతభ్రువం॥ ౫-౬-౭॥
మునిమాలోక్య భూపాలః దూరాదేవ నతాకృతిః
ప్రణనామ గళన్మౌళిమణిమానితభూతలః। ౮॥
మునిరప్యవనీనాథం భాస్వానివ శతక్రతుం
తతోఽభినందయామాస మధురోదారయా గిరా॥ ౯॥
* అథ సర్వే సభాస్థాన మాసాద్య సముపావిశన్
ప్రహృష్టవదనో రాజా స్వయమర్ఘ్యం న్యవేదయత్॥ ౧౦॥

తతో వసిష్ఠప్రముఖా స్సర్వ ఏవ ద్విజాతయః
స్వాగతాదిక్రమేణైనం పూజయామాసురాదృతాః॥ ౧౧॥
స రాజ్ఞా పూజిత స్తేన ప్రహృష్టవదన స్తదా
కుశలం చాఽవ్యయం చైవ పర్యపృచ్ఛన్నరాధిపం॥ ౧౨॥

---

* విశ్వామిత్రాగమనసమనంతరం దశరథకృతపూజావిధానేనాఽన్యేషా మపి మహదాగమనే త్వేవంకర్తవ్యతా సూచితా.

౫-౬-౭॥ ఏదియో యొకకారణముచేత భూమికి దిగివచ్చిన సూర్యునివలె నున్నవాఁడును, బ్రాహ్మణతేజస్సుచేతను క్షాత్రమగు నోజస్సుచేతను వ్యాప్తమైనవాఁడును, ముసలితనముచేత నెఱసిన జడలచే నావరింపఁబడినభుజములుకలవాఁడును, తేజఃప్రకర్షముచే నొప్పుచున్న శరీరము కలవాఁడును, చేతియందు కమండలమును ధరించినవాఁడును, వయఃప్రకర్షకుఁ దగిన యజ్ఞోపవీతము కలవాఁడు నగు ద్వారప్రదేశమునందున్న విశ్వామిత్రుని దశరథుఁడుచూచెను.

౮॥ దశరథుఁడు విశ్వామిత్రమహర్షినిఁ జూచి దూరమునుండియే నమ్రత కలవాఁడునై తన శరీరమునందలి మణులు భూమికిఁ దాకులాగున నమ్మునికి నమస్కరించెను.

౯॥ పిమ్మట విశ్వామిత్రమహర్షియును దశరథమహారాజును మధుర వాక్కులచేత సూర్యుఁడు దేవేంద్రునివలెఁ గొనియాడెను.

*౧౦॥ అనంతరము వారందఱును సభాస్థానమునకువచ్చి కూర్చుండిరి. దశరథుఁడు సంతోషముతోఁగూడిన ముఖముకలవాఁడై తాను స్వయముగనే విశ్వామిత్రమహర్షికి అర్ఘ్యపాద్యాదులనుఁ దీసికొని వచ్చి యిచ్చెను. (విశ్వామిత్రునివలన భయముచే నితరులచే నిప్పింపక తానే యర్ఘ్యపాద్యముల నిచ్చెనని భావము.)

౧౧॥ అనంతరము వసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణులందఱు స్వాగతము మొదలగువానిచే విశ్వామిత్రుని నాదరించిరి.

౧౨॥ విశ్వామిత్రమహర్షి దశరథునిచేఁ బూజింపఁబడి సంతోషమొంది దశరథమహారాజునుఁ గుశలప్రశ్నములఁ జేసెను.

---

* విశ్వామిత్రమహర్షి వచ్చిన యనంతరము దశరథుఁడు అర్ఘ్యపాద్యాదివిధులచే నమ్మునినిఁ బూజించుటవలన నితరులును పెద్దలు వచ్చినపుడు ఇవ్విధముగఁ జేయవలయుననెడి ధర్మము సూచితమగుచున్నది.

రాజా దశరథః ప్రాహ విశ్వామిత్ర మిదం వచః॥ ౧౩

పూర్వజన్మసుకృతా న్మయా కృతా త్త్వం మదీయ
భవనం సమాగతః । మద్గృహం తవ పదాబ్జసంగతో
పావనం కిల బభూవ కౌశిక॥ ౧౪

అశంకితోపనీతేన భాస్వతా దర్శనేన తే
సాధో స్వనుగృహీతా స్మో రవిణేవాఽంబుజాకరాః॥ ౧౫

యదనాది యదక్షుణ్ణం యదపాయవివర్జితం
తదానందసుఖం ప్రాప్తం మయా త్వద్దర్శనా న్మునే॥ ౧౬

అద్య వర్తామహే నూనం ధన్యానాం ధురి ధర్మతః
భవదాగమనస్యేమే యద్వాయం లక్ష్య మాగతాః॥ ౧౭

యథేష్టదారసంపర్కా త్పుత్రజన్మాఽప్రజావతః
యథాఽం ధన్యేక్షణప్రాప్తి ర్భవదాగమనం తథా॥ ౧౮

సాక్షా దివ బ్రహ్మణో మే తవాభ్యాగమనం మతం
పూతోఽస్మ్యనుగృహీతోఽస్మితవాఽభ్యాగమనాన్మునే॥ ౧౯

మహాంతో న సమాయాంతి తూష్ణీం మధమసద్మనాం
తూష్ణీం మహాత్మా త్వల్పస్య గృహం గత ఇతీతియత్
మంగళానాంకారణం త త్సంపదామపి కారణం॥ ౨౦

౧౩ అప్పుడు దశరథమహారాజు విశ్వామిత్రమహర్షితో నివ్విధముగఁ బలికెను.

౧౪ ఓవిశ్వామిత్రమహర్షి! నేను పూర్వజన్మమునఁ జేసిన పుణ్యవశము వలన నీవు నాగృహమునకు విచ్చేసితివి. నీపాదారవింద సంపర్కముచే నాగృహము పవిత్రమయ్యెను.

౧౫ ఓవిశ్వామిత్రమహర్షి! నీ యాకస్మిక దర్శనముచే మేము సూర్యునిచే పద్మాకరములువలె ననుగ్రహింపఁబడితిమి,

౧౬ ఓమహాముని! ఉత్పత్తి వృద్ధి పరిణామము అపక్షయము వినాశములు లేని పరమపురుషార్థ సుఖము నీదర్శనమువలన నాకుఁ గలిగినది.

౧౭ ఓమహాముని! మేము నీరాకకుఁ బాత్రులమగుటవలన నిప్పుడు నీ రాకచేఁ గలిగిన పుణ్యమువలన కృతకృత్యులలో నగ్రేసరులమై యుండగలము.

౧౮ ఓవిశ్వామిత్రుడా! సంతానము లేనివారికి తనప్రియభార్యయందుఁ బుత్రోత్పత్తివలె గ్రుడ్డివానికి దృష్టిలాభమువలె నీరాకయు నాకు నట్లు ప్రియమైనది.

౧౯ ఓవిశ్వామిత్రమహాముని! నీరాక సాక్షాత్తు బ్రహ్మరాకవంటిదని నాయభిప్రాయము. నీరాకవలన ధర్మముచేతఁ బవిత్రుడను, కీర్త్యభివృద్ధులచేత ననుగ్రహింపఁబడినవాడను అయితిని.

౨౦౫ మీవంటి మహాత్ములు మావంటి యధముల యిండ్లకడను నూరక రానేరారు. (కారణము లేకయే) ఊరక, మహాత్ముడవు నావంటి యల్పుని గృహమునకు వచ్చుటయనునది సమస్తమంగళములకును సర్వసంపదలకునుఁ గారణమని తలచెదనని భావము

* కచ్చి దాశ్రమనిష్ఠానాం శ్వాపద పరాభవః
ప్రత్యూహోఽపి క్రతునాం చ న కచ్చి న్మునిపుంగవ
కచ్చి దంత ర్వసతి తే యోగం కర్తుం మనోరథః
అథవా తపసో మన్యే వివర్తం మే త్వదాగతిం॥ ౨౧-౨౨
మహామహిమయుక్తస్య తేఽశక్య మపరై ర్మునే
కరణీయం న చాఽప్యస్తి చింతితే సతి కౌశిక॥ ౨౩
మునేఽఘటితకార్యాణాం ఘటనాసు విశారదః
అవాప్తసర్వకామోఽసి న తే కృత్యం మయా మునే॥ ౨౪
కార్యార్థమాగత స్త్వం మే సమీహమితి యన్మునే
శుభాయ మే భవేన్మ్నానం జని ర్మేసఫలాప్యభూత్॥ ౨౫
త్వయా యచ్చింతితం స్వాంతే మనుధాః కృతమేవ తత్
మచ్ఛ్రేయసే మయా కార్యం చింతితం భవతా మునే
కృతంచేత్కుశలంనాస్తి తేఽకృతౌ నాస్తి తే క్షతిః॥ ౨౬-౨౭

---

* అత్ర తపోమహిమ్నా ఋష్యాశ్రమస్థితశ్వాపదాదీనాం విరోధాభావా త్తత్కృతపీడాయా అభావాత్ ప్రథమప్రశ్నానుపత్తి మాశంక్య ద్వితీయప్రశ్నః తత్రాఽపి దేవతాధిష్ఠితే కర్మణి విఘ్నసంభావనాయా అభావా త్తదనుపపత్తి మాశంక్య తృతీయప్రశ్నః తత్రాఽపి నిరీహాణాం తపస్వినా మీహాభావా చ్చతుర్థప్రశ్నః.

* ౨౧-౨౨॥ ఓ విశ్వామిత్రమహామునీ! మీ యాశ్రమవాసు లందఱకు ఘాతుక మృగాదులవలన భయములేకుండ నున్నదా! (అందువలన నీవిచ్చటకు వచ్చియుండలేదుకదాయని భావము) క్రతువులకు విఘ్నములు లేకుండనుండెనా? లేక, నీవు విశేష దక్షిణలతో యజ్ఞమునుఁ జేయదలచి యందునిమిత్తమై వచ్చియుండలేదుకదా? ఓవిశ్వామిత్రా! నాపుణ్యమే నీరాకగాఁబరిణమించెనని తలచెదను.

౨౩॥ ఓవిశ్వామిత్రా! మహామహిమకల నీకు శక్యముకానిదియును, నితరులచేఁ జేయఁదగినదియునగు కార్యము విచారింపగా నేమియు గన్పడదు.

౨౪॥ మఱియు నోమహాత్మా! నీవు అఘటితఘటనావిశారదుఁడవును, అవాప్తసర్వకాముఁడవును కాన నావలనఁ గాదగిన కార్యము నీకు లేదని తలచెదను.

౨౫॥ ఓ మహర్షీ! నీవు కార్యార్థము నా సమీపమునకు వచ్చుట యనునది నిశ్చయముగ నాకు శుభముల నొనగూర్చుటకేయని తలచెదను. నా జన్మము నీ రాకవలన సఫలమయ్యెను.

౨౬-౨౭ ఓమర్షీ! నీవు దేనిని మనస్సునందుఁ దలచి యిచ్చటకు వచ్చితివో దానిని నేను జేసివేసినట్లుగానే తలపుము. నీవు చింతించిన కార్యమును నా శ్రేయస్సుకొఱకు నేను చేసికొనవలసినదే కాని నేను చేసినందువలన నీకు క్షేమముకాని, చేయనిచో నష్టముకానిలేదు.

---

* తపోమహిమచే ఋష్యాశ్రమమునందున్న ఘాతుకమృగములకు విరోధము లేకపోవుటవలన నామృగములవలన పీడయే లేనందున మొదటి ప్రశ్నము యుక్తముగా లేదని తలచి రెండవ ప్రశ్ననుఁజేసెను అచ్చటను, దేవతలచే నధిష్ఠింపఁబడిన యాగాదికర్మలయందు విఘ్నముల నూహించుటయే మంచిదికాదని మూడవప్రశ్ననుఁజేసెను. అచ్చటను నిష్కాములగు మహర్షులకుఁ గోరికలుండవని నాల్గవప్రశ్నమునుఁజేసెనని యెఱుంగనగును

* అపిచ త్వం మహాభాగ పూజనీయో విశేషతః
పాత్రభూతోఽసి మే బ్రహ్మన్నార్యయుక్త్యా ప్రసీద మాం॥ ౨౮
కార్యం మదీయం కుర్యా ద్వా న వాఽయమితి వా మునే
కథయేయం న వా చేతి ద్వాపరం త్యజ కౌశిక॥ ౨౯

దైవం మమ భవాన్మానం దైవ్యోక్తం నకరోతి యః
మనుజో వా మునే సోఽపి పశురేవ న సంశయః॥ ౩౦
నూనం కరోమి తే కార్య మకుర్వ న్భవదీరితం
మచ్ఛ్రేయసేఽహమేవాఽద్య భవేయం కిష్నుకృన్మునే॥ ౩౧
అనుగృహీతు మా మిచ్ఛే ద్యద్యభీష్టం వరధ్రువం
ఏవం ప్రార్థయితారం తం నృపం ప్రాహ మహామునిః॥ ౩౨

---

* పూజనీయో విశేషత ఇతి తస్యాఽయ మాశయః హే కౌశిక త్వం సామాన్యమహర్షి రివ న. జన్మనా బ్రాహ్మణః జన్మప్రభృతి వనే స్థిత్వా బాల్యప్రభృతి తపోవ్రతాద్యనుష్ఠానేన బ్రహ్మర్షి ర్బభూవేతి య త్తద్విశేషవిషయం న. త్వం తు పురా క్షత్రియో భూత్వా క్షాత్రే వయసి సుకుమారోఽపి సత్వరం రాజ్యభోగా న్హిత్వా మహ త్తపః కృత్వా బ్రాహ్మణ్యం సంపాద్య బ్రహ్మర్షి రభూః ఏవం కర్తా లోకేఽపరో నాస్తి తస్మా ద్విశేషతః పూజ్యో భవానితి.

* ౨౮ ఇదియునుంగాక నీవు విశేషముగఁ బూజింపఁదగినవాఁడవును నాకుఁ బాత్రభూతుఁడవును నయినావు నీవు వచ్చిన కార్యమునుఁ జెప్పి నన్ననుగ్రహింపుము.

౨౯ ఓ విశ్వామిత్రా! నేను నీ కార్యమునుఁ జేయుదునో చేయనో యనికాని నేను చెప్పుదునా చెప్పకుండనుందునా యనికాని సందేహింపవలదు. నీవు నాకు దైవమవు, దైవము చెప్పినదానిని నెవఁడు చేయఁడో వాఁడు మనుష్యుఁడు కాఁడు. పశువని చెప్పుటకు సందియము లేదు.

30 ఓ మహాత్మా! నీ కార్యమును నిశ్చయముగాఁ జేసెదను. నీవు చెప్పినదానిని నేను చేయనిచో నా శ్రేయస్సునకు నేనే విఘ్నమునుఁ జేసికొనినవాఁడనగుదును.

3౧ ఓ మహాత్మా! నన్ను నీవనుగ్రహింపఁదలచితివేని యభీష్టమును నిశ్చయముగఁ జెప్పుము.

3౨ ఇవ్విధముగఁ దననుఁ బ్రార్థించుచున్న దశరథునిగూర్చి విశ్వామిత్రుఁడివ్విధముగఁ బలికెను.

---

* నీవు విశేషముగఁ బూజింపఁదగినవాఁడవని చెప్పిన దశరథుని యభిప్రాయము వర్ణింపఁబడుచున్నది. ఓ విశ్వామిత్రా! నీవు సామాన్య మహర్షివంటివాఁడవు కావు. జన్మచేత బ్రాహ్మణుఁడు జన్మము మొదలుకొని వనమునందుండి బాల్యము మొదలుకొని తపోవ్రతాద్యనుష్ఠానములచే బ్రహ్మర్షియైనచో నది విశేషవిషయము కాదు. ఓ కౌశికా! నీవైతే పూర్వము క్షత్రియుఁడవై క్షాత్రమునందుండినవాఁడవయ్యు సుకుమారుఁడవయ్యును శీఘ్రముగ రాజ్యభోగములను విడిచి గొప్ప తపమునుఁ జేసి బ్రాహ్మణ్యమును సంపాదించి బ్రహ్మర్షివైతివి. ఇవ్విధముగ నాచరించినవాఁడు నీకంటె నితరుఁ డెవ్వఁడును లేఁడు. ఆ కారణమువలన నీవు విశేషముగఁ బూజనీయుఁడవని భావము.

ప్రథితం ఖలు రాజేంద్ర దానే సత్యే రఘోః కులం
ప్రవర్తయసి తద్వంశజాత స్త్వం కథమన్యథా॥ 33
త్వద్వంశో వా రఘో ర్వంశః గురుర్వా బ్రహ్మణస్సుతః
గుణా వా తే మహారాజ వక్తుం శక్యా పరై ర్నహి॥ 34
త్వయా య ద్వాచ్యతే నూనం త ద్దదామీతి తద్వచః
సదృశం రాజశార్దూల రఘువంశోద్భవస్య తే। 35
మృషావాదీ నృపః కశ్చి ద్రఘువంశోద్భవేషు న
ఇతికీర్తిం స్థిరాం భూప కురు సత్యపరో భవ॥ 36
శృణు రాజ న్దశరథ యదర్థ మహ మాగతః
అహం ధర్మం సమాతిష్ఠే సిధ్యర్థం పురుషర్షభ॥ 37
యదా యదా తు యజ్ఞేన యజేఽహం విబుధ వజ్రి
తదా తదా తు మే యజ్ఞం వినిఘ్నంతి నిశాచరాః॥ 38
అవధూతే తథాధూతే తస్మిన్యాగకదంబకే
కృతశ్రమో నిరుత్సాహ స్తస్మా ద్దేశా దుపాగతః॥ 39
* నచక్రోధోమయాకార్యో యాగదీక్షావిధౌ నృప
ఈదృశీ యాగదీక్షా సా మమ తస్మి న్మహాక్రతౌ
త్వత్ప్రసాదా దవిఘ్నేన ప్రాపయేయంమహాఫలం॥ 40

---

* అనేన నియమనిష్ఠేన స్వకర్మవిరోధపరిహారార్థ మపి కోపో నకర్తవ్య ఇతి సూచితం.

౩౩-౩౪ ఓ రాజోత్తమా! రఘువంశము దానమునందును సత్యమునందును ప్రసిద్ధిని వహించినది. ఆ వంశమునందుఁ బుట్టిన నీవును వేఱువిధముగ నెటులఁ బ్రవర్తించెదవు? (ప్రవర్తించవని భావము.) నీ వంశమా రఘువంశము. నీ గురువా బ్రహ్మపుత్రుడగు వసిష్ఠుడు. నీ గుణములా పరులచే నిట్టివని గణనఁజేయుటకు శక్యముకానివి (కాన నిట్టి నీవు వేఱువిధముగ నెట్లు ప్రవర్తించెదవని భావము).

౩౫ రాజోత్తమా! నీవు దేనిని యాచించితే దానిని నిశ్చయముగ నిచ్చెదనని నీవు చెప్పిన వాక్యము రఘువంశమునందుఁ బుట్టిన నీకుఁ దగినదై యున్నది.

౩౬ ఓరాజా! రఘువంశమునందు జన్మించినవారలలో నొకడైన నబద్ధమాడువాడు లేడనియెడి కీర్తిని భూమియందు స్థిరముగా నుండునట్లు చేయుము. సత్యపరుడవు కమ్ము.

౩౭ ఓదశరథా! నేనెందులకిచటకు వచ్చితినో చెప్పెదను వినుము. నేనొక యాగమును ఫలసిద్ధికొఱకుఁ బ్రారంభించితిని.

౩౮-౩౯ నేను యజ్ఞముచే దేవతలనుఁ బూజించుటకు నుపక్రమించినతోడనే రాక్షసులువచ్చి యా యజ్ఞమునుఁ బాడుచేయుచున్నారు. ఆప్రకారము నాయజ్ఞములు రాక్షసులచేఁ బాడుజేయఁబడగా, నేనుపడిన శ్రమమంతయు నిష్ఫలమగుటచేత నిరుత్సాహుడనై యచ్చటినుండి వచ్చితిని.

* ౪౦౫ నేను రాక్షసులవిషయమై కోపము యాగకాలమునందుఁ జేయఁగూడదు. ఈయాగదీక్ష యట్టిది. (అనగా యజ్ఞము. శాంతచిత్తముతోఁ జేయఁదగినదియని భావము) నీయనుగ్రహమువలన నవిఘ్నముగ క్రతుపూర్తి రూపమగు మహాఫలమునుఁ బొందగలను.

* ఈవాక్యముచేత మనము తెలుసుకొనవలసిన నీతియేమనగా, నియమనిష్ఠుడుగా నున్నవాడు తాను చేయుచున్న కర్మకు విఘ్నములనుఁ బరిహరించుటకైనను కోపమును జేయఁ గూడదనియెడి ధర్మమునూచితము

తవాఽస్తి తనయ శ్శ్రీమాన్ దృప్త శార్దూల విక్రమః
మహేంద్రసదృశో వీర్యే రామో రక్షోవిదారణః॥
తంపుత్రంరాజశార్దూలం జ్యేష్ఠంమేదాతుమర్హసి॥౭౧-౭౨
శ్రేయ శ్చాఽస్య కరిష్యామి బహురూప మనంతరం
త్రయాణా మపి లోకానాం యేన పూజ్యో భవిష్యతి॥౭౩
న చ తే రామ మాసాద్య స్థాతుం శక్తా నిశాచరాః
క్రుద్ధం కేసరిణం దృష్ట్వా మృగా ఇవ వనస్థితాః॥ ౭౪
తేషాం న చాఽన్యః కాకుత్స్థాద్యోద్ధుముత్సహతే పుమాన్
ఋతే కేసరిణః క్రుద్ధా న్మత్తానాం కరిణా మివ॥ ౭౫
న చ పుత్రకృతం స్నేహం కర్తుం మర్హసి పార్థివ
న తదస్తి జగత్యస్మి న్యన్న దేయం మహాత్మనాం॥ ౭౬
అహం నూనం విజానామి హంతాం స్తాన్ విద్ధి రాక్షసాన్
నహ్యస్మదాదయః ప్రాజ్ఞా స్సందిగ్ధే సంప్రవృత్తయః॥ ౭౭
* అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః॥ ౭౮

---

వా॥రా॥* అయం బాలఇతి పుత్రే మోహం త్యజ. త్వదాత్మజస్యాగ్రే రాక్షసా నజీవేయు రితి శపథేన బ్రవీమీత్యహం

౪౧-౪౨ ఓ రాజా! గర్వించిన పులియొక్క పరాక్రమమువంటి పరాక్రమము గలవాడును, దేవేంద్రునితో సమానమగు వీర్యముగలవాడును, రాక్షసులను సంహరింపతగినవాడునగు రాముడను కుమారుడు నీకు కలడు. ఆ పెద్దవాడగు నీకుమారుని నాకు యాగరక్షణ నిమిత్తము నాకిచ్చుటకుఁ దగుదువు.

౪౩ ఈ రాముడు త్రిలోకపూజ్యుడగుటకు సాధనమైనట్టియు, మితిలేనట్టియు ననేకవిధములగు నస్త్రవిద్యాప్రదానరూపమగు శ్రేయస్సులనుఁ గలుగఁజేయఁగలను.

౪౪ ఆ రాక్షసులు రామునియెదుట నుండుటకు, కోపగించిన సింహము ముందట మృగములువలె సమర్థులు కారు.

౪౫ మదించిన ఏనుగులతో యుద్ధము చేయుటకొరకు కోపించిన సింహముకంటె నితరజంతువు నుత్సహించనట్లు, నా రాక్షసులతో యుద్ధము చేయుటకు రామునికంటె నితరుడెవ్వడు నుత్సాహమునొందడు.

౪౬ ఓ రాజా! "ఇతడు నా పుత్రుడని" ప్రకృతి సిద్ధమగు ననురాగమును నితనియందుఁ జేయుట నీకుఁ దగదు. మహనీయులచే లోకమునందివ్వదగనిది కొంచెమైనను లేదుకదా: శిబి దధీచి మొదలగు వారలు తమ దేహమునుఁగూడ నిచ్చిరి.

౪౭ నేను తపశ్శక్తిచేత నిశ్చయముగ నెఱుంగుదును. నీవును నామాటచే రాక్షసులు చచ్చినవారని తెలిసికొనుము. మావంటి పండితులు సంశయాస్పదమగు విషయమునందు దృఢప్రవృత్తికలవారలు కారు. కనుక నీవపాయము కలుగునని సందేహింపవలదు. తప్పక జయము కలుగును.

* ౪౮ నేను రాముని మహాత్మునిగాను, సత్యపరాక్రమవంతునిగాను నెఱుగుదును. తేజశ్శాలియగు వసిష్ఠుడు నెఱుగును. తపోనిష్ఠులగు నితరులును నెఱుగుదురు,

---

* ఇతడు బాలుడని పుత్రునియందలి మోహమును విడువుము. నీ పుత్రునిముందట రాక్షసులు నిలువలేరని శపథము చేసి చెప్పెదనని విశ్వా

యది ధర్మో మహత్త్వం చ యశ స్తే మనసి స్థితం
త న్మహ్యం సమభిప్రేత మాత్మజం దాతు మర్హసి॥ ౪౯
దశరాత్ర శ్చ మే యజ్ఞో యస్మి న్రామేణ రాక్షసాః
హంతవ్యా విఘ్నకర్తారో మమ యజ్ఞస్య వైరిణః॥ ౫౦

---

వేద్మీత్యాదినా కథయతి. ,,అహం,, జ్ఞానవృద్ధా మయా రాజన్ బహవః పర్యుపాసితా ఇతి బహుగురూపాసనాలబ్ధజ్ఞానః యోగబల సమాసాదిత పరావరతత్త్వ సాక్షాత్కార శ్చ, భవాం స్తు తద్రహితః. అహం కుశదర్భపాణి ర్భవా నాయుధపాణిః యద్వా, జటావల్కలధార్యహం కిరీట భారాక్రాంతో భవాన్, సాత్త్వికప్రకృతి రహం రాజసో భవాన్, గర్భభూతా స్తపోధనా ఇతి రామగర్భత్వం ప్రాప్తా వయం, మమాఽయం రామో గర్భ ఇత్యభిమానవా న్భవాన్, నీచాసనే స్థితోఽహం సింహాసనస్థితో భవాన్, యోగక్రమజ్ఞానవా నహం భోగక్రమజ్ఞానవా న్భవాన్, మోక్షకామేష్టిం కృతవా నహం పుత్రకామేష్టిం కృతవా న్భవాన్, ధర్మమోక్షపరోఽహం, అర్థకామపరో భవాన్, నను, విధిశివసనకాద్యై ర్ధ్యాతు మత్యంతదూర మితి పరిచ్ఛేదానర్హస్య కథంజ్ఞాన మిత్యాకాంక్షాయా మాహ (మహాత్మానం వేద్మి) అపరిచ్ఛిన్నమహిమవత్త్వేన వేద్మి, యద్వా, (మహాత్మానం) న తస్య ప్రాకృతా మూర్తి రితి స్మరణా దప్రాకృత దివ్య మంగళవిగ్రహవంతం వా. యద్వా, (మహాత్మానం) ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మనీ తి కోశ

౧౯ ఓరాజా! నీమనస్సునందు, ధర్మమునుఁ గొప్పతనమును, కీర్తిని రక్షించుకొనుఁ గోరిక యున్నయెడల నీకత్యంత ప్రియపుత్రుఁడగు రామునిఁ నాకీయుము.

౨౦ ఏ యజ్ఞమునందు, నా యజ్ఞవిఘాతమునుఁజేయు రాక్షసులు రామునిచేఁ జంపఁదగినవారో యట్టి నా యజ్ఞము పది రాత్రింబవళ్లచే సాధింపఁదగినది.

---

మిత్రుడు నేనెఱుఁగుదునని యర్థమిచ్చు ('అహంవేద్మి') యని చెప్పుచున్నాడు. (అహం) నేను, నేననగా "ఓ రాజా! జ్ఞానవృద్ధులగు ననేకులగు గురువులను సేవించుటవలన పొఁదబడిన జ్ఞానముకలవాఁడనగు నేను [లేక] యోగబలముచేఁ బొందబడిన పరతత్త్వ సాక్షాత్కారముఁగలవాఁడనగు నేను [వేద్మి] ఎఱుఁగుదును. నీవైతే యట్టి గురూపాసనా యోగబలములుఁలేని వాడవుగాన నెఱుఁగవని భావము. [అహమ్] కుశదర్భలు హస్తమందుఁగల వాఁడను నేను, ఆయుధపాణివి నీవు లేక [అహమ్] జటావల్కలధారిని నేను కిరీట భారాక్రాంతుఁడవు నీవు. లేక [అహమ్] సాత్త్వికప్రకృతి కలవాఁడను నేను. రాజసుఁడవునీవు. లేక, మహర్షులు భగవంతునికి గర్భమువంటివారను న్యాయముచే రామునికి గర్భమగుటను బొందినవాఁడను నేను. ఈ రాముడు నాగర్భమను నభిమానము కలవాఁడవు నీవు. లేక [నేను] అనగా నీ చాసనమునందున్నవాడను నేను. సింహాసనమునందున్నవాడవు నీవు. లేక [నేననగా] యోగక్రమమును నెఱిగినవాడను నేను. భోగక్రమము నెఱిగినవాడవు నీవు. లేక [నేను] మోక్ష కామేష్టినిఁ జేసినవాడను నేను. పుత్ర కామేష్టినిఁ జేసినవాడవు నీవు. లేక (నేను) ధర్మ మోక్షములయందాసక్తి కలవాడను నేను. అర్థ కామములయందాసక్తి కలవాడవు నీవు. లేక (నేను) ధర్మమోక్షపరుడను నేను, అర్థకామపరుడవునీవు. (కాన నే నెఱుఁగుదును కాని నీవెఱుఁగవని భావము).

ఓయి! బ్రహ్మాదులకు సనకాదులకుకూడ ధ్యానించుటకును మిక్కిలి దూరమందున్నవాడు దేవుడని చెప్పుచున్నందున నట్టి యపరిచ్ఛిన్నుఁడగు వాని నెట్లు తెలుసుకొనుట యను నాశంకరాగా మహాత్మునిగా నెఱుఁగుదునని చెప్పుచున్నాడు. [మహాత్మానం] మహాత్మునిగా అనగా నపరిచ్ఛిన్న

అతాఽప్యనుజ్ఞాం కాకుత్థ్స దదతాం తవ మంత్రిణః
వసిష్ఠప్రముఖాః సర్వే తేన రామం విసర్జయ॥ ౫౧

---

స్మరణాత్, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమేతి మహాస్వభావం వా, యద్వా, (మహాత్మానం) తాటకేయాది వధవిస్పష్ట మహాధైర్యమంతంవా, యద్వా (మహాత్మానం,) పరమాత్మానం వా, ఏతాదృశ మహం వేద్మి త్వంన వేత్సీతి భావః, యథా హృది స్థితస్య రత్నస్య మూల్యం మృదా న జ్ఞాయతే తథా త్వద్గృహస్థితత్వమాత్రేణ త్వత్సుతస్య మాహాత్మ్యం త్వయానజ్ఞాయత ఇతి పర్యవసితం-అహమ్, పుత్రప్రత్యాహారేణ ద్వితీయాంతం భవతి తదాశబ్దబ్రహ్మాత్మకం వేద్మీత్యర్థ శ్చ సంభవతి.

(రామం) లోకరామం, న కేవలం తవ సంతోషకరణాయైవ జాతః పరంతు లోకా న్సర్వా నపి సంతోషయితుం జాత ఇతి భావః యద్వా, నామైకదేశే నామగ్రహణ మితి న్యాయేన రాక్షసవినాశకర మితివా, రాక్షసా యేన మరణం యాన్తి సరామఇత్యుక్తేః.

౨౧. ఓ దశరథుడా! మంత్రులు వసిష్ఠుడు మొదలగు వారందరును, ఈవిషయమై యంగీకారము నిచ్చెదరు నీవు వారియంగీకారమునుఁ బొంది రాముని నావెంట నంపుము.

---

మహిమకల వానినిగా] నేనెఱుగుదును. లేక (మహాత్మనిగా) భగవంతుని శరీరము ప్రకృతిసంబంధము కాదనెడి స్మృతివలన నప్రాకృతదివ్యమంగళ విగ్రహము కలవానినిగా నెఱుగుదును. లేక (మహాత్మనిగా) ఆత్మయను పదమునకు జీవుడు ధైర్యము, దేహము, స్వభావము పరమాత్మ, యను నర్థములు నిఘంటువునందు జెప్పఁబడుటవలన, ఒక్కపర్యాయము నేను నీవాడనని యాచించిన వానికభయము నిచ్చుట నావ్రతమనియెడి మహా స్వభావము కలవానినిగా నెఱుగుదునని యర్థము. లేక (మహాత్మనిగా) సుబాహుమారీచాదులను జయించుటయందు విస్పష్టమగు మహాధైర్యవంతునిగా నెఱుగుదునని యర్థము.

లేక (మహాత్మనిగా) పరమాత్మనిగా నెఱుగుదునని యర్థము. ఇట్టి వానినిగా, నే నెఱుగుదును కాని నీవెఱుగవని విశ్వామిత్రుని యభిప్రాయము. ఏవిధముగ మట్టిలోనున్న రత్నముయొక్క విలువను మన్ను, ఎఱుగదో యటులనే నీ గృహమునందున్న నీపుత్రుని మహిమను నీవెఱుగవని భావము. (అహంవేద్మి) అనుస్థలమునందు, (అహమ్) ము ప్రత్యాహారముచే ద్వితీయాంతమగుచున్నది. అప్పుడు శబ్దబ్రహ్మనుగా నెఱుగుదునని యర్థముకూడ వచ్చును (రామం) రామునిగా అనగా లోకరామునిగా నెఱుగుదునని యర్థము. కేవలమునిన్ను సంతోషపెట్టుటకే పుట్టినవాడు కాడు–ఇక నేమన లోకములనందఱను సంతోషపెట్టుటకుఁ బుట్టినవాడని యెఱుగుదునని భావము. లేక (రామునిగాననగా) నామములో నొక యక్షరమును గ్రహించితే నామమంతయు వచ్చునను న్యాయముచే (రాక్షస) అను శబ్దమునుండి (రా) యను నక్షరమును దీసికొనిన, రాక్షసయను అర్థము వచ్చును. (మరణ) అను శబ్దమునుండి (మ) యను నక్షరముతీసికొనిన మారణమను నర్థమువచ్చును కాన (రా, అనగా రాక్షసులను] మ, అనగాఁ మారణము చేయువానినిగా నెఱుగుదునని యర్థము.

నాఽత్యేతి కాలః కాలజ్ఞ యథాఽయం మమ రాఘవ
తథా కురుష్వ భద్రం తే మాచశోకే మనఃకృథాః॥ ౫౭

---

(సత్యపరాక్రమం) సద్భైకరూపపరాక్రమం, అప్రతిమపరాక్రమం వా, నావిజిత్య నివర్తత ఇతి వక్ష్యతి, యద్వా, (సత్యపరాక్రమం) సత్యేన పరా నాక్రమతీతి వా, గచ్ఛానుజానామి రణాద్ధిత స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ లంకాం, ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః॥ ఇతి బహువారం ప్రకృతిసంబంధకృత ప్రాతికూల్యనివారణే యత్నం కృత్వా తథాప్యననుకూలత్వే తాఽహంతీత్యుక్తేః యద్వా,(సత్యపరాక్రమం)అకపట పరాక్రమంవా, తేన వామనాదివ్యావృత్తిః నచాఽహం కార్య వశేనవదామీత్యాహ వసిష్ఠోపీతి,(వసిష్ఠోపి) బ్రహ్మణఃపుత్రః యోగమహిమ్నా జ్ఞానసంపాదకః, ప్రసిద్ధప్రభావః, నత్యం వదధర్మంచరేతి తద్వ్యోపదేశకర్తైవ న, కింతు స్వయము మను ష్ఠాతా, తవాత్యంతాప్తః, కులాచార్యః అపిశబ్దేన విరోధః, అస్మద్విరోధ్యపి, యద్వశేనాఽహం బ్రహ్మర్షి రభవం తా దృశమహిమేతివా, తంపృష్ట్వా తదనుమతిశ్చే త్ప్రేషయేతి భావః.

౫౭ కాలమును గుఱుతెఱింగిన దశరథుఁడా! యజ్ఞాంగమగు వసంతకాల మతిక్రమింపక పూర్వమే శ్రేయస్కరమగు నీకార్యమునుఁ జేయుము. రాముని జయమువిషయమై యేసంకోచము నీకుఁదగదు. శోకింపకుము.

---

(సత్యపరాక్రమమం) ఎల్లప్పుడు నొకేవిధమగు పరాక్రమముకల వానినిగా నెఱుఁగుమనని యర్థము. (రాముడు జయించకుండ యుద్ధమునుండి మరలడని ముందుఁ జెప్పఁబడును) లేక (సత్యపరాక్రమం) సత్యముచే పరుల నాక్రమించిన వానినిగా నెఱుఁగుమనని) ఈవిషయము యుద్ధకాండమునందు విస్పష్టము కాగలదు, రాముడు రావణునితో యుద్ధము చేయునపుడు రావణుడు రామబాణములచేఁ బీడితుఁడై యుండఁగా రాముడు రావణునితో నిటులఁ జెప్పెను. ఓ రావణా! నీవు యుద్ధమునందు మిక్కిలి పీడింపఁబడితివి కాన నీవు యిక లోనికిఁబొమ్ము నేననుజ్ఞయిచ్చితిని. శ్రమనుఁ దీర్చుకొని రథారూఢుఁడవై ధనుర్ధరుడవై తిరిగి వచ్చినప్పుడు నాబలమునుఁ దిఱిగి చూడఁగలవు, అని యనేకపర్యాయములు ప్రకృతిసంబంధముచే కలిగిన రావణుని ప్రతికూలత్వమును నివారింపఁ బ్రయత్నించినను ననుకూలపడని కారణముచే రావణాదులను సంహరించినవాడు కాన సత్యముచే పరుల నాక్రమించినవాడని యర్థము. లేక (సత్యపరాక్రమం) నిష్కపటమైన పరాక్రమము కలవానినిగా నెఱుఁగుమనుటచే వామనావతారము మొదలగు నవతారముల వ్యావృత్తి కలుగుచున్నది. నేను కార్యవశముచే నిటులఁ జెప్పుటలేదని చెప్పుచున్నాడు. వసిష్ఠుడును నెఱుఁగునని చెప్పుచుండెను. (వసిష్ఠోపి) (వసిష్ఠుడును) అనగా బ్రహ్మపుత్రుడును. యోగమహిమచే జ్ఞానమును సంపాదించినవాడును ప్రసిద్ధప్రభావము కలవాడును, సత్యమును బలుకుము, ధర్మము నాచరింపుమని నీకుపదేశమును చేయువాడుమాత్రమే కాక స్వయముగ ననుష్ఠించువాడును, నీకత్యంతాప్తుడును, కులాచార్యుడును (అపిశబ్దముచే విరోధము సూచింపఁబడును కాన) నావిరోధియును, లేక. ఎవనిమూలముగ నేను బ్రహ్మర్షినయితినో యట్టి మహిమకలవాడునగు వసిష్ఠుడు నెఱుఁగును. కాన నమ్మహర్షినడిగి యతడు పంపుమని చెప్పితే పంపుమని భావము. ఇందుమీద నొకసందేహముదశరథుం

కార్య మణ్వపి కాలే తు కృత మేత్యుపకారతాం
మహ దప్యుపకారోఽపి రిక్తతా మేత్యకాలతః॥ ౫౩

యద్వా, బ్రాహ్మణ శ్చాఽబ్రాహ్మణశ్చ ప్రశ్న మేయాతాం బ్రాహ్మణాయాఽధిభూయా దితిన్యాయేన తవ మమ చ వివాదేతవ పక్షపాతీ స్యా దితి చే త్తత్రాఽహ యేచేతి, రాజ ద్వారసంబంధరహితాః అతో న పక్షపాతిన ఇతి. యద్వా, తస్య ధీరాః పరిజానంతి యోని మితి అవతారరహస్యవేదినః, (యేచేమే) పులస్త్యో గస్త్యఇతి ప్రసిద్ధాచార్య పదనిర్వాహకాః యద్వా, (యేచేమే) గర్భస్థఋషి ర్వామదేవః స ప్రకల్పస్థితో ముని రిత్యాదినా ఏకైకస్మా దుత్తరోత్తరం బ్రహ్మవిదా మగ్రేసరాః వామదేవమార్కండేయాదయః తవ ప్రియ హితపరివణా స్సంతో గృహే వర్తమానాః మహాతేజిష్ఠాః, కించైతే తిష్ఠంతు తవ నగరే కేవలోపాసనపరాః ఋషయ స్తేఽపి జానంతీ త్యాహ తపసిస్థితా ఇతి, లౌకిక వ్యాపారా నంతరితతయా సర్వదా తపస్యేవ స్థితా ఇత్యర్థః.

యద్వా, (ఇమే) శిరసి పలితజటావంతః చుబుకే దీర్ఘ పలితశ్మశ్రులోమానః శీర్ణత్వచః మంత్రగణనాంగులయః భగవద్ధ్యానవంతః ఆనందబాష్పనేత్రాః పులకితగాత్రాః, యద్వా, (ఇమే) బాల్యేఽపి తాదృశమహాత్మానఇతిద్రష్టవ్యాః

౫౩ యోగ్యకాలమునందుఁ జేసినకార్యము కొంచెమైనను ఫలప్రదమగు టవలన నుపకారమై ప్రీతినిఁ గలుగఁజేయుచున్నది. అకాలము నందుఁ జేసినకార్యము గొప్పదైనప్పటికి ఫలసంపన్నమగుటచే నుపకరించినప్పటికి సంతోషకరముకాదు.

---

నకుఁ గలుగవచ్చును. (ఏమనగా) ఒక బ్రాహ్మణునకును బ్రాహ్మణేతరునకును వివాదము కలిగినపుడు మరియొక బ్రాహ్మణుడు మధ్యవర్తిగా నున్నపుడు బ్రాహ్మణుని పక్షముగానే మధ్యవర్తిగా నున్న బ్రాహ్మణుడు చెప్పవలయునుకాని బ్రాహ్మణేతరునిపక్షముగఁజెప్పగూడదని శ్రుతిచెప్పుచున్నకారణముచే నీకును నాకును వివాదము వచ్చినపుడు వసిష్ఠుడును నీపక్షమే చెప్పునని యాశంకకలుగగా ముందువాక్యమును జెప్పుచుండెను.

(యేచేమే) రాజద్వారసంబంధము లేనివారలని యర్థము (కావ పక్షపాతములేని వారలని భావము) లేక (యేచేమే) ధీరులగువారలు పరమాత్మనుఁ దెలిసికొనఁగలరని శ్రుతి చెప్పినందున నవతార రహస్యములను గుర్తెఱింగిన వారలని యర్థము. లేక (యేచేమే) పులస్త్యుడని అగస్త్యుడని ప్రసిద్ధముగ నాచార్యపదవిని నిర్వహించిన వారని యర్థము. లేక (యేచేమే) గర్భమునందుండియే జ్ఞానియైన వామదేవుడు, సప్తకల్పములనుండి యున్న మార్కండేయుడు మొదలగు నుత్తరోత్తర బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులును నీగృహమునందుండి నీహితమునుఁ గోరినవారలని యర్థము. వారలు నెఱుగుదురు. (వారలనడిగి తెలుసుకొనుమని భావము) ఇంతయేకాదు. వీరలందఱి నిటులనుండనీయుము. నీపట్టణమున కేవలోపాసనాపరులగు ఋషులు నెఱుగుదురని చెప్పుచున్నాడు. (తపసిస్థితాః) లౌకికవ్యాపారసంబంధములేక యెల్లప్పుడు కేవలము తపస్సునందే యున్న వారలని యర్థము. లేక (ఇమే) శిరస్సునందు నెఱసిన వెంట్రుకలు కలవారును, గడ్డమునందు నెఱసిన రోమములు కలవారును ముడతలు పడిన చర్మముకలవారును, మంత్రమును లెక్కించుచున్న వ్రేళ్లుకలవారును, భగవద్ధ్యానతత్పరులును, ఆనందబాష్పములతో నిండిన నేత్రములు కలవారును, రోమాంచితమగు శరీరముకలవారు నగు వారలని యర్థము.

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధర్మార్థసహితం వచః।
విరరామ మహాతేజా విశ్వామిత్రో మునీశ్వరః॥ ౫౮

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే
ద్వితీయభాగే పంచమ స్సర్గ స్సమాప్తః.

---

సన్నిహితేదేశే సంత్యేతే,తపసి స్థితా ఇత్యనేన సర్వకాలం తపః పరాః,అథవా, ధ్యానపరాః, అథవా, తప, సంతాపే ఇతి, కాయక్లేశసహాః యద్వా, తపఆలోచనఇతి జ్ఞానయోగ నిష్ఠాః,యద్వా,తపఐశ్వర్యఇతిముక్త్వైశ్వర్యహేతు భూతభక్తి యోగనిష్ఠాః యద్వా, తపసిస్థితాః స్వాధ్యాయనిష్ఠాః తేఽపి యోగచక్షుషా విదంతీతిభావః త్వయా నదృష్టం యోగచక్షుషామయాదృష్ట మితిభావః. తానేకైకశః రహసిపృష్ట్వా తైరనుమతంచేత్ రామం దేహీతిభావః.

౨౮ మహాతేజస్సంపన్నుఁడగు విశ్వామిత్రమహర్షి యీ ప్రకారము ధర్మార్థయుక్తమగు వాక్యమునుఁ బలికి విరమించెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున

ద్వితీయభాగమున నైదవసర్గము సమాప్తము.

---

* లేక (ఇమే) వీరలు, అనగా, బాల్యమునందే యట్టి మహాత్ములని యర్థము. (వీరలనుటచే దగ్గరనేయున్నవారని సూచితము) (తపసిస్థితాః) సర్వకాలమునందు తపస్సునందే యున్నవారలని యర్థము. లేక (తపసిస్థితాః) ధ్యానపరులని యర్థము. లేక (తపసిస్థితాః) కాయక్లేశములను సహించినవారలని యర్థము. లేక (తపసిస్థితాః) తప యనుదానికి నాలోచనమను నర్థముచే జ్ఞానయోగనిష్ఠులని యర్థము. లేక [తపసిస్థితాః] తప యనుదానికి ఐశ్వర్యముకూడ నర్థమగుటచే మోక్షసామ్రాజ్యమునకుఁ గారణమగు భక్తియోగనిష్ఠులని యర్థము. లేక [తపసిస్థితాః] స్వాధ్యాయనిష్ఠులని యర్థము. వారలు నెఱుగుదురని తాత్పర్యము. నీవు చర్మచక్షుస్సుచే జూడలేకుండ నుంటివి యోగచక్షుస్సుచే మాచే జూడఁబడినది యని భావము. కాన వారలనుఁ బ్రత్యేకముగ నడిగి తెలిసికొని వారంగీకరించినచోఁ బంపుము లేకపోయినచోఁ ఖంపకుమని భావము.

## ష ష్ఠ స ర్గ ప్రా రం భ ః.

తచ్ఛ్రుత్వా రాజశార్దూలో విశ్వామిత్రస్య భాషితం
ముహూర్తమాసీన్నిశ్చేష్టస్సదైన్యం చేదమబ్రవీత్ ॥ ౧

* ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః
న యుద్ధయోగ్యతామస్య పశ్యామి సహ రాక్షసైః॥ ౨

---

* శ్రీరామచంద్రమాహాత్మ్యం విశ్వామిత్రేణ ప్రోక్తమపి తదవిజ్ఞాయ దశరథః పుత్రమోహేన శ్రీరామే బాలభావమేవ గణయన్ రామం ప్రేషయితుమవకాశో నాస్తీత్యుచ్యతే ఊనషోడశవర్ష ఇతి. మేరామః. లోకరామ ఇతి విశ్వామిత్రవచనమవిగణయ న్మనోవైకల్యతః పునః మేరామ ఇతి వదతి. మేరామఇత్యనేన షష్టిసహస్రవరవర్యంతమపుత్రేణ మయా వ్రతాదికరణేన శ్రమేణోత్పాదితః కుమార ఇతి భావః. అథవా, మేరామ ఇత్యనేన సదా మయా స్వాంకే లాలితః రామఇతి. అథవా, రామ ఇత్యనేన బాలక్రీడారామః క్రీడాస్వేవాఽధికప్రీతిమానితిభావః. అథవా, మేరామఇత్యనేన భాషాంతరే మారామఇత్యర్థః. మారామో నామసౌందర్యస్థానలక్ష్మీస్థాన భూతరామ ఇతి భావః.

షష్ఠసర్గప్రారంభము.

౧ రాజశ్రేష్ఠుడగు దశరథుడు విశ్వామిత్రుని మాటలను విని తగిన యుత్తరము లభింపక పోవుటవలన దాని యాలోచనచే నిశ్చేష్టుడాయెను. పూర్వము ప్రతిజ్ఞచేసిన తన్నయనమర్గతవలనను, విశ్వామిత్రుని వచనమునుల్లంఘ్యము మగుట వలనను దీనత్వము కలవాడై యీక్రిందివాక్యమును బలికెను.

౨ * పద్మనేత్రుడగు నారాముడు పదునారుసంవత్సరములైనను నిండనివాడు కనుక యుద్ధమునకుఁ దగినవాడు కాడు. అందులో మీమునిక్కిలి రాక్షసులతో యుద్ధమున కెట్లుతగును.

---

* శ్రీరామచంద్రమాహాత్మ్యము విశ్వామిత్రునిచేఁ జెప్పఁబడినను దానినిఁ దెలిసికొనక దశరథుడు పుత్రమోహముచే శ్రీరామునిఁ బంపుట కవకాశము లేదని చెప్పుచున్నాడు. ఊనషోడశవర్ష ఇతి. [మే రామః] [నారాముడని యర్థము] లోకరాముడని విశ్వామిత్రుడు చెప్పినను దానిని గణనచేయక మనోవైకల్యముచేఁ దిరిగి నారాముడని చెప్పుచున్నాడు. నారాముడని చెప్పుటచేత నరువదివేలసంవత్సరములు పర్యంతము పుత్రులు లేక వ్రతాదులనుఁ జేసి శ్రమచేఁ బుట్టింపఁబడిన కుమారుడని భావము. లేక [నారాముడు] అనుటచే నెల్లప్పుడు నాచేఁ దొడయందుఁ గూర్చుండ బెట్టుకొని లాలనచేయుబడిన రాముడని యర్థము. లేక [నారాముడు] అని చెప్పుటచే బాలక్రీడారాముడని యర్థము [క్రీడలయందే యుపధిక ప్రీతి కలవాడని భావము] లేక (మే రామః) అనుటచే నాంధ్రభాషయందు మారాముడని యర్థము కాన మారాముడనగా సౌందర్యస్థానమును లక్ష్మీస్థానమగు రాముడనియు సూచితము.

(ఊనషోడశవర్షః) పదునారుసంవత్సరములైనను నిండని వాడని యర్థము. "పదునారుసంవత్సరముల పర్యంతము బాల్యము" అను న్యాయముచే బాల్యమైనను రామునకు పెళ్లిలేదని భావము. ఇప్పటికి వ్యావహారిక

ఇయ మక్షౌహిణీ పూర్ణా యస్యాః పతి రహం ప్రభో
తయా పరివృతో యుద్ధం దాస్యామి పిశితాశినాం॥ 3

అపిచ, ఊనషోడశవర్షః "అషోడశం బాల్య మితి న్యాయా ద్బాల్య మస్య నగతమితి భావః. యదాధునిక వ్యావహారిక భాషాయాం మైనారిటీతి ఉచ్యతే తదేవ బాల్య మితి వ్యవహృతం-అపిచ, ఊనషోడశ ఇత్యనేన షోడశకలా పరిపూర్ణపవభగవా న్దుష్టశిక్షణశిష్టపరిపాలనరూప మవతార ప్రయోజనం సాధయితుం సమర్థో భవేత్. అత్రషోడశక లాపరిపూర్తి రేవ నాస్తి కుత ఇతి చేద స్త్రీసాపత్త్యే ర్వా, అవతారమూలకారణీభూతసీతాయా వా అభావాత్. తస్మా ద్దుష్టశిక్షణాదిరూపకార్యం కర్తు మనర్హ ఇతిభావః. అత్రనిశాచరణాం రాత్రౌ ప్రాబల్యాత్ తదానీం రామస్య నిద్రాభిభుతయా యుద్ధానర్హ ఇతి వక్తుం రాజీవలోచనఇతి. (రాజీవలోచనః) యథా రాజీవం సతిసూర్యా స్తమయే ముకుళీభవే త్తథాఽయ మపి సూర్యా స్తమయావ్యవహిత కాలఏవ ముకుళితనేత్రో భవతి. నిద్రావశం గతో భవే దితి భావః, ఏతాదృశః రాక్షసైస్సహ యుద్ధం కర్తుమనర్హః ఇతివదతి. రాక్షసైరితి, రాక్షసానామ నిర్ఘృణా అకులీనా ఆక్షీరకంఠం పరవంచనకలానిపుణాః మనుష్యభక్షకాః నిశా చరాః ఖలు, తాదృశా న్సంహర్తుం మహావంశే ప్రసూతాయ మహాగుణః పరవంచనానభిజ్ఞః మనుష్యః దివా మనుష్యై

3 ఓ విశ్వామిత్రమహాముని! నాయధీనమందు సంపూర్ణమగు నక్షౌహిణీ సంఖ్యగల సేనయున్నది. నేనా సేనతోఁగూడికొనిన వాడనై వచ్చి రాక్షసులతో యుద్ధము చేయఁగలను.

---

భాషయందు, మైనారిటీ యని వ్యవహరింపఁబడుచున్న దానినే యప్పుడు బాల్యమని వ్యవహరింపఁబడుచుండెను. (మైనారిటీ వెళ్లనివాడని భావము) (ఊనషోడశవర్షః) అనుటచే షోడశకలాపరిపూర్ణుడు కానివాడనియు సూచితమగుచున్నది. షోడశకలాపరిపూర్ణుడగు భగవానుడే దుష్టశిక్షణ శిష్టపరిపాలనరూపమగు నవతారప్రయోజనమును సాధించుటకు సమర్థుడగును ఈరాముని యందింకను షోడశకలాపరిపూర్తిలేదు. ఎందువలననగా, నస్త్రసంపత్తికాని యవతారమునకు మూలకారణమగు సీతకాని లేకపోవుటవలననని యెఱుంగనగును (కాన దుష్టశిక్షణాది రూపకార్యమునుఁ జేయుటకు నిప్పుడసమర్థుడని భావము) రాక్షసులు రాత్రిభాగమునందు ప్రబలులుగా నుందురు కాన నప్పుడు రాముడు నిద్రించువాడు కాన యుద్ధానర్హుడని చెప్పుటకు రాజీవలోచనుడని చెప్పుచున్నాడు. (రాజీవలోచనః) పద్మపత్రములవంటి నేత్రములు కలవాడని యర్థము) సూర్యాస్తమయమగుటతోడనే పద్మమేవిధముగ ముకుళించుకొని పోవునో యావిధముగ సూర్యాస్తమయమగుటతోడనే ముకుళించుకొనిపోవు నేత్రములు కలవాడని భావము. (రాత్రి యగుటతోడనే రాముడు నిద్రావశుడగునని పర్యవసానము)

ఇట్టివాడు రాక్షసులతో యుద్ధము చేయుటకు సమర్థుడు కాడని చెప్పుచున్నాడు. (రాక్షసులనగా నిర్ఘృణులు, అసురీనులు, సుగ్గుపాలతో పరవంచనయందు నిపుణులు మనుష్యభక్షకులు నిశాచరులు కదా. అట్టివారిని సంహరించుటకు మహావంశమునందుఁ బుట్టి మహాగుణములు కలిగిన వాడును పరవంచన నెఱుగనివాడును, మనుష్యుడును, పగటియందు మనుష్యులతోఁగూడ యుద్ధము చేయుటకు సమర్థుడు కానివాడును

ఇమే హి శూరవిక్రాంతా భృత్యా మంత్రవిశారదాః
అహం చైషాం ధనుష్పాణిర్గోప్తా సమరమూర్ధని॥ ౪
ఏభిస్సహైవ వీరాణాం మహేంద్రమహతామపి
దదామి యుద్ధం మత్తానాం కరిణామివ కేసరీ॥ ౫

---

స్సాకం యోద్ధుమశక్తః తథాఽపి కాకపక్షధరః రాక్షస శబ్దశ్రవణమాత్రేణాఽపి బిభ్యన్బాలః న ప్రభవతీతి మహా మనా ఆలోచనపరశ్చ భవాన్కథం నమనుత ఇతి భావః.

కించ రాక్షసై రితి బహువచనేన, ఏకేన రాక్షసే నాఽపి యోద్ధుమశక్తః బహుభి రసురైః కథం యోత్స్య తీతి భవాన్నమనుత ఇతి భావః. క్రీడనకవిహారయోగ్యతా పమేవశ్యామి, ఆయుధంస్ప్రష్టుం ద్రష్టుం వా యోగ్యతాం న పశ్యామీత్యాహ,న యుద్ధయోగ్యతా మస్యేతి, మునీంద్ర! త్వద్యాచితకార్యే త్వనేకాక్షౌహిణీసమేతస్య శస్త్రాస్త్ర పారంగతస్య మమైవ కష్టభూతే సత్యశస్త్రాస్త్రవిదో బలా బలవివేచనరహితస్యాఽ యుద్ధనిపుణస్య క్షీరకంఠస్య రామస్య సుతరాం కష్టభూత మితి కిము వక్తవ్య మితిభావః తస్మాద్రాక్షసై స్సహ యోద్ధుం రామస్య నయన మన హమితి వర్యవసితం. అత్ర ఊనషోడశవర్ష ఇతి దశరథ వచనేన శ్రీరామస్య షోడశాబ్దః ప్రచలతీతి, షోడశవర్షేభ్యః ద్విత్రిమాసావవన్యూనా ఇతి చ,ద్విత్రివత్సరావయదిన్యూనా స్తదా చతుర్దశవర్ష ఇతి వా త్రయోదశవర్ష ఇతి వా పంచదశ వర్ష ఇతి వా దశరథః వదేదేవేతి.

౮-౨౧ ఈ వాకేటులందఱును శూరులు పరాక్రమవంతులు మంత్రవేత్తలు నగుటచే నేనుధనుర్ధరుఁడనై సైన్యము మొదటనిలిచి వీరితోఁగూడ నింద్రునికంటె గొప్పవారగు యోధులతోనైనను, సింహము మదించిన యేనుగులతోవలె యుద్ధమునుఁ జేయఁగలను.

---

తత్రాపి, కాకపక్షధరుఁడు(అనగా పిల్లజుట్టుకలవాఁడనియర్థము) రాక్షసుఁడని పేరు వినినంతమాత్రముననే భయ పడువాఁడు నగు బాలుఁడెట్లు సమర్థుఁడు కాఁడని గొప్పమనస్సు కలిగి యాలోచనపరుఁడవై యుండియున్న నీకెట్టుల తలంప లేదని భావము.

ఇంతియేకాక, రాక్షసులని బహువచనముచే నొక రాక్షసునితోఁ గూడ యుద్ధమునుఁజేయ నశక్తుఁడగు వాఁడనేకులగు రాక్షసులతో నెట్లు యుద్ధము చేయగలఁడని నీవు తలచుచుంటివని భావము. క్రీడలయందు యోగ్యతే రామునియందున్నది కాని ఆయుధమును స్పృశించుటకుఁ గూడ యోగ్యత వానియందు లేదని చెప్పుచున్నాఁడు. (న యుద్ధయోగ్యతామస్యైతి) అనగా యుద్ధయోగ్యతను వానియందుఁ జూడనని యర్థము, ఓ కౌశికా! నీవు యాచించిన కార్యము అనేకాక్షౌహిణీసైన్యములతోఁ గూడినట్టియు శస్త్రాస్త్రపారంగతుఁడగు నట్టియు నగు నాకే కష్టమగుచుండగా శస్త్రాస్త్రములనుఁ దెలియని వాఁడును శత్రుబలాబలములను బరిశీలించుట కసమర్థుఁడును యుద్ధనైపుణ్యము లేనివాఁడును క్షీరకంఠుఁడు నగు రామునకు నీకార్యము మిక్కిలి కష్టమైనదని చెప్పనదేమియని భావము. ఆకారణమువలన రాక్షసులతోఁగూడ యుద్ధమునుఁ జేయుటకు రామునిఁ దీసికొని వెళ్లుట యుక్తముకాదని పర్యవసానము.

ఈశ్లోకమునందుఁ బదునారుసంవత్సరములకు తక్కువవయస్సు కలవాఁడను నర్థమిచ్చు (ఊనషోడశవర్షః) అను దశరథుని మాటచే శ్రీరామునకుఁ బదునాఱవసంవత్సరము జరుగుచున్న దియనియుఁ బదునారుసంవత్సరములకంటె రెండుమూఁడుమాసములు మాత్రము తక్కువయనియు, రెండుమూఁడుసంవత్సరములే తక్కువయైన పక్షమునఁ బదమూఁడుసంవత్సరములు వయస్సుకలవాఁడని కాని పదునాల్గు సంవత్సరములవయస్సు కలవాఁడనికాని లేక పదునైదవసంవత్సరము కలవాఁడనికాని దశరథుఁడు చెప్పనే చెప్పును.

బాలో రామ స్త్వనీకేషు న జానాతి బలాబలం
అంతఃపురా ద్రితే దృష్టా నాఽన్యాతేన రణావనిః॥ ౬

---

తథా ఽకథనా త్ప్రివర్తమాన షోడశాబ్ద ఇతి కేచన వర్ణయంతి. తద్వర్ణన మవిచారితరమణీయ మివ భాతి. కుత ఇతిచే దుచ్యతే.

పూర్వోక్తరీత్యావర్ణనే" సమాద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే, ఇతి సీతావచనేన వనవాసనిర్గమకాలస్య రామస్యాష్టా వింశతివత్సరా భవేయుః. ఏవంసతి మమభర్తా మహాతేజా వయసా పంచవింశక ఇతి సీతావాక్యం విరుధ్యతే, తస్మాదూనషోడశవర్ష ఇత్యస్య పాదోనఇత్యర్థవర్ణనే ద్వాదశ వర్షీయ ఇత్యర్థస్సంభవతి వివాహకాలస్య రామస్య ద్వాదశ వత్సరాః అనంతరం ద్వాదశవత్సరాణ్ గృహేఽగమయ ద్రామః, సంఘీభూయ చతుర్వింశతివత్సరాః గతాః పంచ వింశతివత్సరే వననిర్గమనమితి సీతావాక్యం సంగచ్ఛతే. ఏవంచ, బాలోద్వాదశవర్షో య మకృతాస్త్రశ్చ రాఘవః, ఇత్యుత్తరత్ర రావణం ప్రతిమారీచవాక్యమపి సంగచ్ఛతే.

౭. పిల్లవాడగు రాముడు సేనలయందలి బలాబలముల నెఱుగడు. అంతః

పురమును విడిచి వేఱుయుద్ధభూమినిఁ జూచియుండలేదు.

---

అట్లు చెప్పకపోవుటవలనఁ బదునారవసంవత్సరము జరుగుచున్నదియని కొందఱు వర్ణించుచున్నారు. ఆవర్ణనమవిచారితరమణీయమని తోఁచుచున్నది, (ఏలననగా) పైనచెప్పిన విధముగ వర్ణించినచో, "నేను పండ్రెండు సంవత్సరములు రాముని గృహమునందుంటిని" అను సీతావాక్యముచే వనవాసమునకు బయలుదేరిన కాలమునకు నిరువదియెనిమిది సంవత్సరములు రామునకుండవలసి వచ్చును. ఇటుల నొప్పుకొనినచో, "నాభర్తయగు రాముడు వనవాసమునకు బయలుదేరుకాలమునకు నిరువదియైదు సంవత్సరముల వయస్సుకలవాడని సీతచే ముందుఁ జెప్పబడే వాక్యము విరుద్ధమగును. కానఁ బదునాఱుసంవత్సరములకంటె తక్కువ వయస్సుకలవాడని యర్థమిచ్చు (ఊనషోడశవర్షః ( అను దశరథ వాక్యమునకు పదునారు సంవత్సములకు పాదము తక్కువ యని యర్థము చెప్పినఁ బండ్రెండు సంవత్సరములు వయస్సుకలవాడు రాముడని తేలును. వివాహకాలమునకు రామునకు పండ్రెండుసంవత్సరములు అనంతరము 12 సంవత్సరములను గృహమునందు రాముడు వెళ్లించెను. మొత్తము 24 సంవత్సరములు గడచినవి. 25 వ సంవత్సరమున వనమునకు బయలుదేరెను. కాన సీతవాక్యము సంగతమగును. ఇట్లుచెప్పుటచే, అస్త్రముపట్టుకొనుటకు చేతకాని పండ్రెండుసంవత్సరములు వయస్సుకల బాలుడగు నే రాముడు నన్ను వాయవ్యాస్త్రప్రయోగముచే నూరామడదూరములో సముద్రములో బడవేసినాడో యతడిప్పు డెట్టిబలశాలిగా నుండెనోకదా? రావణా! వానితో విరోధము పెట్టుకొనుమని నీకెవడు బోధించియుండెనో చెప్పుమని రావణునితోఁ బలికిన మారీచుని వచనమును సంగతమగును.

(విశ్వామిత్రునియాగరక్షణకాలమునకుఁ బండ్రెడు సంవత్సరములు రామునకుండెనని మారీచుని వాక్యమునకు విరోధము లేకుండగ నుండుటకు 12 సంవత్సరముల వయస్సనియే సిద్ధాంతము) ఇట్లుచెప్పినను దోషముండునని పూర్వపక్షము వచ్చును (ఎట్లన) ఓ‌రామా నీవు పుట్టిన పదునేడుసంవత్సరములనుండి నాదుఃఖము

న శస్త్రైః పరమైర్యుక్తో న చ యుద్ధవిశారదః
కేవలం పుష్పఖండేషు నగరోపవనేషు చ
విహర్తుమేవ జానాతి సహ రాజకుమారకైః॥ ౭

---

నన్వేవమపి, దశసప్తచవర్షాణి జాతస్య తవపుత్రక, ఇతి కౌసల్యావచనేన విరుధ్యతీతిచేన్న కౌసల్యావాక్యస్య ద్వితీయ జన్మప్రభృతిగణన ఏవ తాత్పర్యవర్ణనే అష్టమే ఉపనయనం తదాదిగణనే సప్తదశవత్సరాః, సంఘీభూయ ౮+౧౭= ౨౫ సంవత్సరాస్సంభవంతీతి నకోపి విరోధః. నన్వేవమపి గర్భాదేకాదశే రాజ్ఞ ఇతిస్మృతివాక్యేన జననాది దశమవర్ష ఏవోపనయనస్య రాజ్ఞాం విహితత్వేన „దశసప్తచేతి కౌసల్యావాక్యస్య ద్వితీయజన్మప్రభృతిగణనేపి విరోధో దుష్పరిహారఏవేతి చేన్న పూర్వోక్తోపనయన వాక్యస్య దశమ వర్షం ముఖ్యకాలం నాతిక్రమేదిత్యర్థవర్ణన ఏవ తాత్పర్యం, నత్వష్టమేవా, నవమేవా, కుర్యాదితి న. సప్తమేచాష్టమేవాపి వ్యాపనీయాద్విజాతయఇతిస్మృతేరిత్యలంశాఖాచంక్రమణేన.

౭ ఈ రాముడుత్కృష్టములగు శస్త్రములతోఁగాని యస్త్రములతోఁగాని కూడుకొనినవాఁడు కాఁడు. యుద్ధమునందు నిపుణుఁడును కాఁడు, కేవలము పుష్పవాటికలయందును పట్టణప్రాంతముల యందలి యుద్యానవనములయందును రాజపుత్త్రులతోఁ గూడ విహరించుట మాత్రము నెఱుఁగును.

---

తొలఁగినది నీవు పుట్టకపూర్వము సంతానములేదని దుఃఖముండెడిది. పుట్టిన పదునేడు సంవత్సరముల నుండి దుఃఖములేదు. నీవు వనవాసమునకు వెళ్లుచున్నందున నాదుఃఖము తిరిగి నాకే వచ్చినది యని రాము డరణ్యవాసమునకు వెళ్లునపుడు కౌసల్య రామునితోఁ జెప్పిన పైవాక్యమునుఁ బట్టి రామునకు వనవాసమునకు బయలుదేరు కాలమునకు పదునేడు సంవత్సరము లేయని కౌసల్య చెప్పిన వాక్యమునకు విరోధము కలిగెనని యాశంక రాఁగా సమాధానము చెప్పఁబడుచున్నది. బ్రహ్మ క్షత్త్రియ వైశ్యులు రెండుజన్మములు కలవారుకాన నొకటి పుట్టుకయు, రెండవ జన్మము ఉపనయనము, కౌసల్యావాక్యమునకు, రెండవ జన్మము మొదలు లెక్కపెట్టుటయందుఁ దాత్పర్యమును వర్ణించినచో నెనిమిదవ సంవత్సరమునందు పనయనము. తదాది లెక్కించినచో పదునేడుసంవత్సరములగును. మొత్తము ౮ + ౧౭ = ౨౫ సంవత్సరములగును కాన నెట్టి విరోధములేదు. ఇట్లు చెప్పినను, గర్భమునుండి పదునొకండవ సంవత్సరమున రాజులకుపనయనముఁ జేయవలయునని స్మృతిచే విధింపబడుచున్నందున జననాదిగ పదియవసంవత్సరమున నుపనయనము రాజులకు విహితమయినందున పదునేడు సంవత్సరములని యర్థమిచ్చు (దశసప్తచవర్షాణి) యను కౌసల్యావాక్యమునకు రెండవజన్మము మొదలు లెక్కించినను విరోధము దుష్పరిహారమే యను నాశంకకు సమాధాన మేమనఁగా. పూర్వమందుఁ జెప్పబడిన యుపనయనవాక్యమునకు, పదియవసంవత్సరము ముఖ్యకాలమనియును దానినతిక్రమింపఁ గూడదనియు నర్థమును వర్ణించుటయందే తాత్పర్యము కాని యెనిమిదవసంవత్సరమునందుఁ గాని తొమ్మిదవ సంవత్సరమునందు గాని చేయఁగూడదని కాదు. "ఏడవసంవత్సరమునఁగాని యెనిమిదవ సంవత్సరమునఁగాని రాజులకుపనయనముఁ జేయవలయునని స్మృతియుండుటవలనని యెఱుఁగనది.శాఖాచంద్రమఃన్యాయము చూడుము.

అద్య త్వతితరాం బ్రహ్మన్ మమ భాగ్యవిపర్యయాత్
హిమేనేవ ఽజ్ఞ పద్మాభ స్సంపన్నో హారిణః కృశః॥ ౮
సదార స్సహ భృత్యో ఽహం తత్కృతే మునినాయక
శరదీవ పయోవాహో నూనం నిస్సారతాం గతః॥ ౯
ఈదృశోఽసౌ సుతో బాల ఆధినాఽథ వశీకృతః
కథం దదామి తం తుభ్యం యోద్ధుంసహనిశాచరైః౧౦
అపి బాలాంగనాసంగా దపి సాధో సుధారసాత్
రాజ్యాదపి సుఖాయైవ పుత్రస్నేహో మహామతే॥ ౧౧
యే దురంతా మహారంభా స్త్రీషు లోకేషు విశ్రుతాః
పుత్రస్నేహేన సంతోఽపి కుర్వతే తాన్నసంశయః॥౧౨
అసవోఽథ ధనం దారా స్త్యజ్యంతే మానవై స్సుఖం
న పుత్రో మునిశార్దూల స్వభావో హ్యేష జంతుషు॥౧౩
విప్రయుక్తోఽపి రామేణ ముహూర్త మపి నోత్సహే
జీవితుం జీవితాకాంక్షీ న రామం నేతు మర్హసి॥ ౧౪
షష్టివర్ష సహస్రాణి మమ జాతస్య రాఘవ
దుఃఖేనోత్పాదితా స్తే తే చత్వారః పుత్రకామ్యయా॥౧౫
ప్రధానభూత స్తేష్వేవ రామః కమలలోచనః
తంవినేమా స్త్రయోఽప్యన్యే ధారయంతి న జీవితం॥ ౧౬

౮ ఓవిశ్వామిత్రమహర్షీ! ఇప్పుడైతే రాముడు నామరదృష్టవశమున పద్మములచే నొప్పుచున్న సరోవరము వంచుచేతనువలె నత్యంతము చిక్కినవాడును పాలిపోయిన వాడును నై యున్నవాడు,

౯ ఓమునిశ్రేష్ఠుడా! శరత్కాలమునందు మేఘము నిస్సారము నొంది నట్లు నేను నాభార్యలు నాసేవకులును, ఆరామునికొఱకు నిరుత్సాహమును, బొందియుంటిమి.

౧౦ మనోవ్యాధికి లోనై యిట్టి స్థితిలోనున్న నాపిల్లవానిని రాక్షసులతో యుద్ధము చేయుటకు నీకు నే నెట్లీయఁగలను.

౧౧ బుద్ధిశాలియగు నోమహర్షీ! పుత్రస్నేహము బాలాంగనయొక్క సంగమముకంటెను. అమృతరసముకంటెను, మహారాజ్యముకంటెను సుఖకరమయినదగుటచే పుత్రుని నెడబాయఁజాలను.

౧౨ ఓమహాముని! దుఃఖమును నిచ్చునట్టి గొప్పయుపక్రమముఁగల చిరకాలసాధ్యములగు తపఃక్లేశములను ధార్మికులు పుత్రప్రేమ చేత నే లోకత్రయమునందును చేయుచున్నారు. ఈవిషయమై సందియ మెంత మాత్రము లేదు.

౧౩ ఓమునిశ్రేష్ఠుడా! ప్రాణములను ధనమును, భార్యలనైనను, మనుష్యులు సుఖముగా విడుచుచున్నారు. పుత్రులను విడచుటలేదు. ఇది ప్రాణులయొక్క స్వభావముకదా.

౧౪ నేను రామునితో వియోగమునొందిన వాడనై క్షణకాలమైనను జీవింపఁ జాలను. కనుక నీకు నేను బ్రతుకవలయును నని తలంపున్నయెడల రామునిఁ దీసికొని వెళ్లుట యుక్తముకాదు.

౧౫ ఓ విశ్వామిత్రుడా! నేను పుట్టినదాదిగ నరువదివేల సంవత్సరములు పుత్రకాంక్షతోఁ గూడుకొనియుండగాఁ దుదకీ నలువురుపుత్రులు దుఃఖసాధ్యములగు నశ్వమేధ పుత్రకామేష్ట్యాదుల చేతఁ గలిగిరి.

౧౬ ఆనలుగురు పుత్రులలోఁ బద్మనేత్రుడగు రాముడే ముఖ్యుడుకాన నీవితనినిఁ దీసికొని వెళ్లినచో రాముని విడిచి మిగిలిన ముగ్గురును జీవింపఁజాలరు.

కించాస్య జననీ రామ మదృష్ట్వైనం మరిష్యతి
అపిచాఽత్మజహీనంత్వాం మృత మేవాఽశుషద్ధి మాం॥ ౧౭

నిశాచరబలం హంతుం మునే తవ యదీప్సితం
చతురంగసమాయుక్తం మయా సహ బలం నయ। ౧౮

రావణ స్తవ యజ్ఞస్య యది విఘ్నంకరోతి సః
తత్సంగ్రామే న శక్తా స్మో వయం తస్య దురాత్మనః॥ ౧౯

సుందోపసుందయో శ్చైవ పుత్రౌ వైవస్వతోపమౌ
యజ్ఞవిఘ్నకరౌ బ్రూహి నైవ దాస్యామి పుత్రకం॥ ౨౦

రామో మే నిశి మాత్రాదిసాహాయ్యం తు వినా మునే
శేతుం వా భీతి మాప్నోతి తాదృక్తే కిం కరిష్యతి। ౨౧

గండస్థలే ధృతే క్షీరః ప్రస్రవే ద్యస్య తాదృశః
ఏకసాహాయ్యసంస్థేయః కథం కాంతారమావ్రజేత్॥ ౨౨

అసంభావితకార్యం తు జానీహీనం మహామునే
వినాశో మమ తేఽభీష్ట స్స్యా చ్చేన్నయ సుతం మునే॥ ౨౩

పుత్రపుత్రేతి సంస్మృత్య కృత్వా వై దుస్తరం తపః
అతిప్రయాససంప్రాప్తం పుత్రం జ్యేష్ఠం మహామునే
పాతయేయం కథం రామం రక్షసాం ముఖగహ్వరే। ౨౪

౧౭ ఇంతియేకాదు. ఈరామునితల్లియును రామునిఁ జూడనియెడల మృతినొందును. యుద్ధమునకు రామునిఁ దీసికొని వెళ్లినచో పుత్ర వియోగముకల నేనును మృతినొందెదననియే తెలిసికొనుము.

౧౮ ఓవిశ్వామిత్రమహాముని! రాక్షససైన్యమును సంహరింపఁజేయుటకు నీకుఁ గోరికయున్నదకాన చతురంగబలసమేతుడగు నన్నచటికిఁ దీసికొని వెళ్లుము.

౧౯ రావణాసురుడు నీయజ్ఞమునుఁ బాడుజేయుచున్నాడా! చెప్పుము. వాడే విఘ్నకర్తయైనచో మేము దుర్మార్గుడగు రావణునియెదుట నిలువలేము.

౨౦ అట్లుకాక యమతుల్యులగు సుందోపసుందపుత్రులగు సుబాహు మారీచులు యజ్ఞమునకు విఘ్నమునుఁ జేయువారని చెప్పినను నాపుత్రునీయజాలను.

౨౧ ఓ విశ్వామిత్రమహాముని! మారాముడు రాత్రియందు తల్లిమొదలగు వారి సాహాయ్యము లేనిదే యొక్కఁడు శయనించుటకుఁగూడ భయపడును. అట్టివాడు నీకేమి చేయఁగలడు?

౨౨ ఎవనిగండస్థలమును పట్టుకొనిన పాలుకారునో యట్టివాడును, ఒకని సాహాయ్యముతో నుండఁదగినవాడునగు రాముడు వనమునుగూర్చి యెటుల రాగలడు? (రాలేడనిభావము)

౨౩ ఓమహాముని! ఈకార్యము సమకూడని దానినిగాఁ దెలిసికొనుము నామరణము నీకిష్టమైనచో రామునిఁ దీసికొని వెళ్లుము.

౨౪ పుత్రుడు పుత్రుడని కలవరించి దుస్తరమగు తపమునుఁ జేసి యతి ప్రయాసముచేత సంపాదింపఁబడిన జ్యేష్ఠపుత్రుడగు రాముని రాక్షసుల యొక్కయుద్ధమునకు నెట్లు పంపఁజేయుదును?

* విశ్వామిత్రసమాఖ్యాం తే సార్థకం కురు మయ్యపి
దయాం కృత్వా మమ సుతం చిరజీవం కురుప్రభో॥౨౫

త్వామేవ మన్యే సతతం దైవం పుత్రప్రదం మునే
యాచ్ఞా మత్కులవృత్తి ర్నో న హి క్షత్రియసేవితా
తథాఽపి వ్రతభంగేఽపి ఫలం స్యా దితి నీతితః॥
త్వాంపుత్రభిక్షాం దేహీతిప్రార్థయే దేహి మేమునే॥౨౬-౨౭
ఇత్యాత్మజప్రేమవశా త్కథితం భూపతే ర్వచః
శ్రుత్వోత్స్రజ న్నగ్నికణా న్నేత్రాభ్యామాహతంమునిః॥౨౮

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే
ద్వితీయభాగే షష్ఠసర్గ స్సమాప్తః.

---

* విశ్వామిత్రఇతి. విశ్వ + మిత్రః, విశ్వామిత్రః, మిత్రేచర్షా ఇతి విశ్వశబ్దస్య దీర్ఘః శ్రు॥ విశ్వం మిత్ర మాసీ ద్యదిదం కించ తస్మా ద్విశ్వామిత్ర ఇత్యాచక్షతే, ఇతి. అను శాసినికేపి విశ్వామిత్రశబ్దస్యాఽర్థం విశ్వామిత్రఏవ వర్ణిత వాః ॥శ్లో॥విశ్వే దేవా శ్చ మే మిత్రం మిత్ర మస్మి గవాం తథా। విశ్వామిత్ర ఇతి ఖ్యాతం యాతుధాని నిబోధ మా మితి.

౨౫ *ఓమహామునీ! నీకు విశ్వామిత్రుడని నామము ప్రసిద్ధమై యున్నది. విశ్వామిత్రుడను నామము ప్రపంచము నందంతటను సార్థకము గానే యున్నది. నావిషయమైకూడ నీనామమును సార్థకమునుఁగా జేయుము. మహామునీ! నాయందు దయనుంచి నాపిల్లవానినిఁ జిరజీవినిగాఁ జేయుము.

౨౬—౨౭ ఓమహామునీ! ఎల్లప్పుడును నిన్నే పుత్రదాతయగు దైవమునుఁ గాఁదలచెదను. యాచ్ఞావృత్తి నాకులధర్మము కాకపోయినను క్షత్రియు లెవ్వరు యాచ్ఞావృత్తిని నింతదనుక సేవింపక పోయి నను, వ్రతము చెడినను ఫలము కలుగునను, న్యాయముచే నాకుఁ బుత్రభిక్ష పెట్టుమని నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

౨౮ ఈప్రకారముగఁ బుత్రక్షేమముచేఁ జెప్పఁబడిన దశరథుని వాక్య మును విశ్వామిత్రుడు విని నేత్రములనుండి యగ్నికణములను వర్షిం చుచున్నవాడువలె నుండి దశరథునిగూర్చి యిటులఁ బలికెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున

ద్వితీయభాగమున షష్ఠసర్గముసమాప్తము.

---

* (విశ్వామిత్రుడని) (విశ్వ + మిత్రః) ప్రపంచమునకు మిత్రుడని యర్థము. ఋషివాచకమగు మిత్రశబ్దము పరమందున్నపుడు విశ్వశబ్దమునకు దీర్ఘము "విశ్వమంతయునీమహర్షి కి మిత్రమగుటవలన విశ్వామిత్రుడని చెప్పు దురు" అని శ్రుతి చెప్పుచున్నది. భారతమున అనుశాసనిక పర్వమునందు విశ్వామిత్రశబ్దమున కర్థమును విశ్వామిత్రుడే వర్ణించెను. (ఏమన) ఓరాక్షసి విశ్వేదేవతలు నాకు మిత్రులు, గోవులకు నేను మిత్రుడను, ఆకారణము వలన నన్ను విశ్వామిత్రుడని చెప్పుదురని" విశ్వామిత్రుడు రాక్షసితో చెప్పెను.

## సప్తమసర్గప్రారంభః.

యద్య ద్వాంఛసి త త్తే దాస్యామీతి నృపాధమ
ప్రోక్త్వాఽదా మా మిదానీం తు నాస్తీతి వదత స్తవ
అసత్యభీరుతాఽల్పాఽపి నా స్త్యహో కులపాంసన॥ ౧
మమాఽఽగతస్య మర్యాదా మవిచార్య త్వయా పురా
కథితం చాపి విస్మృత్య ప్రవ ర్తయసి వాఽల్పవత్॥ ౨
నృపాపశద! కాకుత్థ్సవంశోద్భవనృపేషు వై
దేహీతి వదతో నాస్తీత్యుక్తవాన్కోఽపి నాఽభవత్॥ ౩
నహ్యర్థినః కార్యవశా దుపేతా స్తు కదాచన
కకుత్థ్సవంశే విముఖా న ప్రయాంతి స్మ భూపతే॥ ౪
స్వతోజ్ఞానవిహీనం చ పరోక్తం వేత్తు మక్షమం
విషయాసక్తచిత్తం చ మృషాభాషణతత్పరం
భవంత మస్య దేశస్య పుణ్యస్య పరిపాలకం
కృతవానాత్మభూర్నింద్యో న తే దోషోఽస్తి కశ్చన॥ ౫-౬
హరిశ్చంద్రస్య వంశస్థో భవానితి మనీషయా
యాచ్ఞాభంగ స్తు నభవే దిత్యయాచమహం వృథా॥ ౭
యది త్వం నక్షమో రాజన్ గమిష్యామి యథాగతం
హీనప్రతిజ్ఞః కాకుత్థ్స సుఖీ భవ సబాంధవః॥ ౮

తస్మి న్నపసృతేఽథ విశ్వామిత్రే మహాత్మని
చచాల వసుధా కృత్స్నా సురాంశ్చ భయమావిశత్॥ ౯

## సప్తమసర్గప్రారంభము.

౧౹ కులపాంసనుఁడగు నో రాజాధమా! నీవు దేని దేనిని గోరెదవో దానినంతయు నిచ్చెదనని మొదట నీవు చెప్పి యిప్పుడు లేదని చెప్పుచున్న నీకు పాపభయముకాని యసత్యభయముకాని కొంచెమైనను యున్నట్లుగఁ గనిపింపదు. ఆశ్చర్యము.

౨౹ వచ్చినవాని మర్యాదనైనను విచారింపక, నీవు మొదటఁ జెప్పిన దానినైనను స్మరింపక యల్పునివలెఁ బ్రవర్తించుచుంటివా?

౩౹ ఓరాజాధమా! కకుత్స్థవంశమునందుఁ బుట్టినవారిలో నొక్కఁడైనను, దేహీయనువానికి నాస్తియని సమాధానము చెప్పినవాఁడింతపర్యంతము లేకపోయెను (లేదని చెప్పువాఁడవు నీవు పుట్టితివని భావము)

౪౹ ఓరాజా! కార్యార్థులై యాచకులు కకుత్స్థవంశపురాజుల సన్నిధానమునకు వచ్చి విముఖులై యెవరును వెళ్లియుండలేదు.

౫-౬౹ ఓరాజా! స్వయముగ జ్ఞానవిహీనుఁడవును, పరులు చెప్పినను తెలిసికొనలేనివాఁడవును, విషయాసక్తచిత్తుఁడవును, అసత్యవాదివియునగు నిన్ను పవిత్రమగు కోసలదేశమునకుఁ బరిపాలకునిగా సృజించిన బ్రహ్మదేవుని నిందింపవలయును గాని నీతప్పేమియు లేదు.

౭౹ రాజా! నీవు హరిశ్చంద్రుని వంశీకుఁడవుకదా యనియు యాచ్ఞాభంగము కలుగదు కదాయనియు నూహించి వ్యర్థముగ యాచించితిని.

౮౹ ఓరాజా! నీవు ప్రతిజ్ఞనుఁ గొనసాగించుకొనుటకు సమర్థుఁడవు కాని యెడల వచ్చిన త్రోవనే వెళ్లెదను. ప్రతినను భంగము చేసిన నీవు బంధుసహితముగ సుఖముగనుండుము. (అని విశ్వామిత్రుఁడు కోపముతో దశరథునితోఁ బలికెను)

౯౹ అనంతరము విశ్వామిత్రుఁడు కుపితుఁడగుటవలన భూమి గడగడ వణంకె. దేవతలు మొదలగువారు భయమునుఁ బొందిరి.

క్రోధాభిభూతం విజ్ఞాయ విశ్వామిత్రం మహామునిం
ధృతిమా న్సువ్రతో ధీమా న్వసిష్ఠో వాక్యమబ్రవీత్ ॥ ౧౦
ఇక్ష్వాకూణాం కులే జాత స్సాక్షా ద్ధర్మ ఇవాఽపరః
భవా న్దశరథ శ్శ్రీమా న్న ధర్మం హాతుమర్హతి। ౧౧
* కరిష్యామీతి సంశ్రుత్య త త్తే రాజ న్నకుర్వతః
ఇష్టాపూర్తం వినష్టం స్యాత్తస్మా ద్రామం విసర్జయ॥ ౧౨
ఇక్ష్వాకువంశజాతోఽపి స్వయం దశరథోఽపి సన్
న పాలయసి చే ద్ధర్మం కోఽపరః పాలయిష్యతి॥ ౧౩
అల్పోఽపి తరణి స్త్వంధతమిస్రం నాశయే ద్యథా
తథా బాలోఽపి రామోఽయం రాక్షసా న్నాశయిష్యతి॥౧౪
రక్షసాం నిగ్రహే శక్త స్స్వయం కుశికనందనః
తవ పుత్రహితార్థాయ త్వాముపేత్యాభియాచతే॥ ౧౫

---

*అనేన పుత్రస్నేహేన ప్రతిశ్రుతార్థవిముఖం రాజానం తేన చ కుపితం విశ్వామిత్ర మవేక్ష్య విశ్వామిత్ర క్రోధ కృతసర్వనాశపరిజిహీర్షయా చ వసిష్ఠకృతోపపత్తి ప్రతిపాదనప్రతిశ్రుతార్థదానప్రతిపాదనేన ఉత్పథం ప్రతిపన్నో రాజా గురుభి శ్శిక్షణీయ ఇతి సూచితం.

౧౦ నిర్వికారుడును, స్థిరవ్రతుడును, బుద్ధిశాలియునగు వసిష్ఠుడు విశ్వామిత్ర మహర్షిని కోపాక్రాంత చిత్తునిగ నెఱిగి యీ క్రింది వాక్యమును దశరథునితో బలికెను.

౧౧ ఓరాజా! నీవిక్ష్వాకువంశమునందు మూర్తీభవించిన ధర్మమువలె నావిర్భవించి పదిదిక్కులయందు నడ్డులేని ప్రభుత్వము కలిగి ప్రసిద్ధుడవైయున్న నీవు స్వధర్మత్యాగము నిప్పుడు చేయుటకుఁ దగవు.

*౧౨ ఓరాజా! "నేను చేసెదనని" ప్రతిజ్ఞచేసితివి. ఆప్రతిజ్ఞను నీవు నిర్వహింపకపోయినచో నిదివరకు నీవుచేసిన యిష్టాపూర్తాదిరూపమగు ధర్మము నశించును. కనుక రాముని బంపి ప్రతిననుసరి పాలింపుము. (యాగాదులు ఇష్టములు. తటాకాదులు పూర్తములు)

౧౩ ధర్మమును కొనసాగించిన యిక్ష్వాకువంశమునందుఁ బుట్టినవాడవయ్యును, నీవే ప్రతిజ్ఞనుఁ బరిపాలించనిచో నితరుఁడెవ్వడు పరిపాలించును?

౧౪ రాముడు బాలుడని సందేహింపవలదని చెప్పుచున్నాడు. సూర్యుడల్పుడైనను గొప్పదియగు గాఢాంధకారమును నశింపఁజేసినట్లు రాముడు బాలుడైనను గొప్ప రాక్షసులనుగూడ నశింపఁజేయఁగలడనిభావము

౧౫ ఓరాజా! విశ్వామిత్రుడు స్వయముగ రాక్షసులను నిగ్రహించుటయందు సమర్థుడైనను నీపుత్రునిహితముకొఱకు నిన్ను యాచించుచున్నవాడని దెలియుగుము.

---

* పుత్రస్నేహముచేఁ బ్రతిజ్ఞచేయఁబడిన దానియందు విముఖుడైన దశరథుని, అందుచేఁ గోపించిన విశ్వామిత్ర మహర్షినిఁ జూచి వసిష్ఠుడు విశ్వామిత్రుని కోపముచే సర్వనాశనము కలుగునని యట్టిదానినిఁ బరిహరింపఁ దలచి తగినయుక్తులు దశరథునకుఁ జెప్పి ప్రతినచేయబడిన యర్థమునే నీయుమని వసిష్ఠుడు చెప్పుచుండుట చేతను కుమార్గమననుసరించుచున్న రాజును గురుపులగువారు శిక్షించి మంచిమార్గమునందుఁ బ్రవేశ పెట్టవలయు ననెడి ధర్మము సూచింపఁ బడినది.

రాజన్యోభి ర్ద్విజై ర్వైశ్యై స్సతీభి స్సత్యవాదిభిః
అలుబ్ధై ర్దానశీలై శ్చ సప్తభి ర్ధార్యతే మహీ॥ ౧౬

మహీంభరణఖిన్నస్య తే విశ్రాంతిపదం త్విదం
యదభీష్టార్థసంసిద్ధిప్రీతార్థిముఖవీక్షణం॥ ౧౭
ఏష విగ్రహవా న్ధర్మః ఏష వీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాఽధికో లోక స్తపస శ్చ పరాయణం॥ ౧౮
ఏషోఽస్త్రం వివిధం వేత్తి త్రైలోక్యే సచరాచరే
నైతదన్యః పుమా న్వేత్తి న చ వేత్స్యతి కశ్చన॥ ౧౯
ఏవంవీర్యో మహాతేజా కౌశిక స్త్వాం హి యాచతే
న రామగమనే బుద్ధిం విక్లబాం కర్తు మర్హసి॥ ౨౦
అస్మి న్మహాసత్త్వతమే మునీంద్రే స్థితేసమీపే పురుషస్య
సాధోః ప్రాప్తేఽపి మృత్యా వమరత్వ మేతి మా
దీనతాం గచ్ఛ యథా విమూఢః॥ ౨౧

కించ ద్విజమనఃక్షోభా ద్రఘువంశోఽస్త మేష్యతి
తస్మా త్కీర్తివినాశం చ కులనాశం విచార్య చ
రామభద్రః ప్రేషణీయో కౌశికేనసహాత్వయా॥ ౨౨-౨౩

౧౬ ఓరాజా! గోవులవలనను, బ్రాహ్మణులవలనను, వేదములవలనను, పతివ్రతలవలనను సత్యమునుఁ బలుకు వారివలనను లుబ్ధత్వములేని వారివలనను, దానశీలురవలనను, పై యేడుగురివలనను భూమి నిలువఁబడి యున్నదియని యెఱుగుము (కాన నీవు సత్యపరిపాలనము చేయుమని భావము)

౧౭ భూభారముచే ఖేదము నొందుచున్న నీకు, అభీష్టము నెఱవేఱుటచే సంతోషించుచున్న యాచకుల ముఖసందర్శనమే విశ్రాంతిస్థానమని యెఱుగుము.

౧౮ ఈ విశ్వామిత్రుడు మూర్తీభవించిన ధర్మము. పరాక్రమవంతులలో నగ్రేసరుడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు. లోకమునఁ దపము చేయువారలకితఁడా దర్శ పురుషుడని యెఱుగుము.

౧౯ ఈ విశ్వామిత్రుడు సమస్త శస్త్రాస్త్రముల నెఱిగినవాడు. ఇతనికంటె నస్త్రముల నెఱిగిన పురుషుడు వేఱొకడు లేడు! ఉండబోడు. ఈ విషయముము లోకములందును ప్రసిద్ధము.

౨౦ ఇట్టి మహా పరాక్రమ వంతుడును: మహాతేజస్సంపన్నుడునగు విశ్వామిత్రుడు నిన్ను యాచించుచున్నాడు. కనుక యాతని వెంట రాముడు వెళ్లిన భయము కలుగునని యాతురత చెందకుము.

౨౧ ఓ దశరథ మహారాజా? మహాప్రభావ సంపన్నుడగు నీ విశ్వామిత్ర మహర్షి సమీపమందుండగా సామాన్య పురుషుడును మృత్యుపీడ నొందక యమరత్వము నొందుచున్నాడు: మృత్యువు సమీపించినను చెక్కు చెదరడు. అతనిచే రక్షింపఁ బడుచున్న నీ కుమారునకెంత మాత్రము భయము కలుగదు. కాన నజ్ఞునివలె నీవు దైన్యము నొందకుము.

౨౨-౨౩ ఇదియునుంగాక బ్రాహ్మణ మనస్సు సంక్షోభించిన యెడల నీ వంశమునకే చేటు వాటిల్లును. కనుక కీర్తినాశమును కులనాశమును విచారించుకొని: విశ్వామిత్రునితోఁ గూడ రామునిఁ బంపుట శ్రేయస్కరము.

వసిష్ఠస్య వచ శ్శ్రుత్వా రాజా కించి త్ప్రసన్నధీః
భూప్రసంజ్ఞయా వామదేవం పరిపప్రచ్ఛ తన్మతం॥ ౨౪

వా॥ *కౌశికో యాచక స్త్వం తుదా తారక్ష్యోఽధ్వరో మహాన్
రక్షితా యది రామ శ్చే ద్వయం తుష్టింలభేమహి॥ ౨౫
యాచకస్వాంతసంతుష్టే స్సుఖహేత్వపరం నృప
న హితిష్ఠతిభూమ్యాంతదా ప్రమంసం ప్రేషయ ద్రుతం॥ ౨౬
కించ బ్రహ్మర్షి కోపేన సంప ద్ధీనా భవిష్యతి
ఇందిరా బ్రహ్మశాపేన పురా సాఽంతర్హితా భవత్
యస్యాః కటాక్షమాత్రేణ జగ దైశ్వర్యసంయుతం॥ ౨౭

అసారః ఖలు సంసారః శరీరమతిభంగురం
సారేత రేఽస్మిన్సంసారే కీర్తిం స్వర్గఫలంబుధాః
ప్రవదంత్యపకీర్తించ నరకం కథయంతి తే॥ ౨౮-౨౯
సత్యదానాదిభిః పూర్వేమార్గమిక్ష్వాకవృాదివః
కృత్వాఽవినశ్వరీం కీర్తిం శ్రేయశ్చాప్య గమన్నృప
తద్వంశీయయశ స్త్వం చ పరిపాలయ సర్వథా॥ 30
రామం సంప్రేషయక్షిప్రం మునినాసహపార్థివ
కౌశికస్య ప్రసాదేన శుభం స్యా దాత్మజస్య తే॥ 31

* ఏతేన యాచకదాతృప్రయోజనాదికం సమాలోచ్య పరిహారో న యుక్త ఇత్యుక్తం భవతి.

౨౪ దశరథుడు వసిష్ఠుని వాక్యములను విని క్షోభించెను నిర్మలమగు మనస్సు కలవాడై, నీ యభిప్రాయ మేమియని వామదేవుని కను సంజ్ఞచే నడిగెను. (వామదేవుడు చెప్ప నారంభించెను)

* ౨౫ ఓరాజా! విశ్వామిత్రుడు యాచకుడును. నీవు దాతవును గొప్ప క్రతువు రక్షింపఁ దగినదియును, రాముడు రక్షకుడునైనపుడు మే మందఱము సంతోషించెదము.

౨౬ ఓరాజా! భూమియందు యాచకజనులను సంతోష పెట్టుటకంటె సుఖహేతువు మఱియొకటి కానరాదు కాన రాముని శీఘ్రముగఁ బంపుటయే నా యభిమతము.

౨౭½ ఇదియునుంగాక బ్రాహ్మణులు కోపించిన యెడల సంపదయును హీనమగును. ఏలక్ష్మియొక్క కటాక్షముచేత జగమంతయు నైశ్వ ర్యముతోఁ దులతూగునో యాలక్ష్మియును పూర్వ మొకప్పుడు బ్రాహ్మణకోపముచే నంతర్ధానము నొందెను. (దూర్వాసునిశాప ముచే స్వర్గలక్ష్మి తిరోహితమయ్యెనని గ్రహింపవలయును.)

౨౮-౨౯ ఓరాజా! సంసారము సారహీనమైనది. శరీరము క్షణభంగు రము, అట్టినిస్సారమగు సంసారమునందుఁ గీర్తిని స్వర్గమనుగాను నపకీర్తిని నరకముగాను పండితులు చెప్పుదురు. స్వర్గతుల్యమగు కీర్తినిఁ బాడుచేసికొనకుమని భావము)

౩౦½ ఓరాజా! మీపూర్వులగు ఇక్ష్వాకువంశపు రాజులందఱు సత్యదానా దులచే స్వర్గమునకు మార్గము నేర్పరచి శాశ్వతమగు కీర్తిని శ్రేయ స్సునుఁ బొందిరిఁ నీవును తద్వంశమర్యాదను కీర్తిని సర్వవిధములచే గాపాడుము.

౩౧½ ఓరాజా! విశ్వామిత్రునితోఁగూడ రామునిఁ బంపుము. నీపుత్రునకు విశ్వామిత్రుని యనుగ్రహముచేత శుభము చేకూరగలదు.

---

* యాచకదాతృ ప్రయోజనాదికము నాలోచించి పరిహారము యుక్తము కాదనియెడి ధర్మము దీనివలన సూచింపఁ బడినది.

* ఇతి తస్య వచ శ్శ్రుత్వా రాజా నిర్మలహృ త్తతః
అంగీచకార రామస్య గమనం కౌశికేన సః॥ ౩౨౪
తతో దశరథం నీత్వా రహః ప్రోవాచ కౌశికః
అలంహి రామచంద్రేఽపి బాలోఽయ మితి తే మతిః
దుష్టానాం నిగ్రహార్థాయ శిష్టానాం పాలనాయ చ
అవతీర్ణో న సందేహ స్తవ గేహే నృపో త్తమ॥ ౩౩-౩౪౪
న మాతాపిత్రోరాజస్య శోకః కార్యోఽత్రచాణ్వపి
యాగపూర్త్తౌ తవ సుతంత్వర్పయిష్యామ్యహం పునః ౩౫౪
తచ్ఛ్రావభీతో రాజాఽపి నీయతా మిత్యుదీర్య సః
కౌశికేన పునః ప్రాహ గద్గదస్వరవా న్వచః॥ ౩౬౪
అపుత్రోఽహం పురా బ్రహ్మన్ బహుభిః కామ్యకర్మభిః
మునిప్రసాదా దధునా పుత్రవా నస్మి కౌశిక॥ ౩౭౪
తస్మా త్పుత్రవియోగం తు సోఢుం శక్ష్యామినో మునే
త్వమేవ జానాసి మునే నీత్వాసంప్రేషయ ద్రుతం॥ ౩౮౪
ఇత్యేవ ముక్తో రాజానం విశ్వామిత్రోఽ బ్రవీ త్పునః
సమా ప్తయజ్ఞశ్చ పున ర్నేష్యేరామంతవాఽంతికం॥ ౩౯౪

---

* అనేన మంత్రిణా సమయే కృతో హితోపదేశః భూష్ణునా రాజ్ఞాఽంగీకర్తవ్య ఇతి సూచితం.తథాచ కామందకః- సజ్జమాన మకార్యేషు నిరుంధ్యుర్మంత్రిణో నృపమితి.

*౩౧–౩౨॥ ఈప్రకారము వామదేవుడు చెప్పగా విని దశరథుడు నిర్మలాంతః కరణముకలవాడై విశ్వామిత్రునితోఁ గూడ రాముడు వెళ్లుట కంగీకరించెను.

౩౩–౩౪॥ పిమ్మట విశ్వామిత్రుడు దశరథునకు రహస్యముగ నిటులఁ జెప్పెను. ఓదశరథా! ఈరామునియందును బాలుడను భావము చాలును. ఈరాముడు దుష్టులను నిగ్రహించుటకును శిష్టులను రక్షించుటకును నీగృహము నందవతరించెను. సందియములేదు.

౩౫॥ ఓరాజా! నీవుకాని రామునితల్లియగు కౌసల్యకాని లేశమాత్రము విచారింపవలసినపనిలేదు, నాయజ్ఞము పూర్తియగుటతోడనే నీపుత్రునిఁ దిరిగి తీసికొనివచ్చి నీకర్పింపఁగలను.

౩౬॥ విశ్వామిత్రుడు శపించునని భయముకలవాడై దశరథుడు రాముని దీసికొని వెళ్లుడని విశ్వామిత్రునితోఁ జెప్పి తిరిగి గద్గదస్వరముతో నమ్మహర్షితో నిటులఁ బలికెను.

౩౭॥ ఓబ్రహ్మర్షీ: పూర్వమునందు నేను పుత్రసంతానములేనివాడనై యనేకములగు కామ్యకర్మలనుఁ జేసి ఋష్యశృంగమహర్షియను గ్రహముచేతను నిప్పటికి పుత్రవంతుడనైతిని.

౩౮॥ ఓవిశ్వామిత్రమహర్షీ! ఆకారణమువలన నేను పుత్రవియోగమును సహింపకుంటిని, నీకునుఁ దెలిసియే యున్నది కాన నీవు తీసికొని వెళ్లి శీఘ్రముగఁ బంపుము.

౩౯॥ ఈప్రకారముగ దశరథుడు చెప్పగా విశ్వామిత్రుడు తిరిగి పలికెను ఓరాజా! యజ్ఞము పూర్తియగుటతోడనే నీసమీపమునకు రాముని దీసికొని రాగలను.

---

* మంత్రులు సమయమునందుఁ జేసిన హితోపదేశమును నభిన్న ధినిఁ గోరెడు రాజులు వినవలయునని ధర్మము సూచింపఁబడినది. అవ్విధముగానే కామందకుడును చెప్పియుండెను (ఏమన) అకృత్యముల యందుఁ బ్రవేశించిన రాజును మంత్రులు నిరోధించి మంచిమార్గమును బోధింపవలయునని.

ఇత్యుక్తో మునినాథేన రాజా సంతుష్టమానసః
ప్రహిణోద్రామమానేతుందూతంత్వరితగామినం॥ ౭౦౪

నివేదితోఽథ దూతేన రామో లక్ష్మణసంయుతః
కృతస్వస్త్యయనో మాత్రా ధనుర్బాణసమన్వితః
పితు రంతిక మాగత్య స్మితశోభిముఖాంబుజః
ప్రథమం పితరం పశ్చా న్మునీ మాన్యైకమానితౌ
తతో విప్రాం స్తతో బంధూ న్ప్రణనామ యథావిధి॥
౭౧-౭౨-౭౩

ఉత్సంగే పుత్ర తిష్ఠేతి వదత్యథ మహీపతౌ
భూమౌ పరిజనాస్తీర్ణే సోఽంశుకే ఽథ న్యవిక్షత॥ ౭౪

రాజా॥ పుత్ర! ప్రాప్తవివేక స్త్వం కల్యాణానాం చ భాజనం
జడవ జ్జీర్ణయా బుధ్యాఖేదాయాఽత్మాన దీయతాం॥౭౫

వసిష్ఠః॥ కి మతద్వ ఇవాఽజ్ఞానాంయోగ్యేవ్యామోహసాగరే
వినిమజ్జసి కల్లోలబహుళే జాడ్యశాలిని। ౭౬

కౌశికః॥ యథాభిమతమాశుత్వం బ్రూహిప్రాప్స్యసిచాఽనఘ
సర్వ మేవ పున ర్యేన భేత్స్యంతే త్వాంతునాథయః॥ ౭౭

౪౦ ఈప్రకారము విశ్వామిత్రుడు చెప్పగా దశరథుడు సంతుష్ట మనస్సుకలవాడై త్వరితముగా వెళ్లునట్టి దూతను రామునిఁ దీసికొనిరమ్మని పంపెను.

౪౧-౪౨ అనంతరము దూతచేఁ దెలుపబడిన వృత్తాంతము
౪౩ కలవాడై రాముడు తల్లిగారికి నమస్కరించి యామె యాశీర్వాదము నొంది ధనుర్బాణములను ధరించి లక్ష్మణ సమేతుడై తండ్రిగారి సమీపమునకు వచ్చి చిఱునగవుతో నొప్పుచున్న ముఖపద్మము కలవాడై ముందు తండ్రికిని పిమ్మట వసిష్ఠ విశ్వామిత్రులకును పిదప బ్రాహ్మణులకును బంధువులకును యథావిధిగ నమస్కరించెను.

౪౪ ఓ పుత్రుడా! తొడమీదఁ గూర్చుండుమని దశరథుడు చెప్పినను రాముడట్లు కూర్చొనక పరిజనులచేఁ భూమియందు బరుపఁబడిన రత్నకంబళి మీద కూర్చుండెను.

౪౫ దశరథుడు రామునితో నిటులఁ బలికెను. ఓ పుత్రా! నీవు వివేకవంతుడవును సమస్త శుభములను నొందఁదగిన వాడవునై యుండియు మందబుద్ధివై యివ్విధంబున దైన్యంబునకు లోబడకుము.

౪౬ అనంతరము వసిష్ఠుడు రామునితో నిటులఁ బలికెను. ఓ రామా! అజ్ఞానులకుఁదగినట్టియు జడత్వముచే నొప్పుచున్నట్టియు తరంగ పరంపరలచే విస్తృతమైనట్టియునగు మోహమనెడి సముద్రమున నజ్ఞానివలె నెందుకు నీవు మునుగుచున్నావు? (అని యడిగెను.)

౪౭ రాముడు తండ్రికిని వసిష్ఠునకునుఁ గూడ సమాధానమునుఁ జెప్పకుండుటనుఁ జూచి విశ్వామిత్రుడు రామునిటులఁ బ్రశ్నించెను. ఓ రామా! మనోవ్యాధి దేనిచే నిన్ను బాధింపకుండ నుండునో యట్టి నీ యభిమతమునుఁ జెప్పుము. నీవు దానినిఁ బొందగలవు. (అని కౌశికుడు ప్రశ్నించెను)

ఇతి పృష్టో మునీంద్రేణ సమువాచ రఘూత్తమం
విహృత స్తీర్థయాత్రార్థ ముర్వీ మంబుధిమేఖలాం॥ ४८

సముద్భూతో మనసి మే విచార స్తేన కౌశిక
భావేష్వరతి రాయాతా పథికస్య మరుష్వివ
శామ్యతీదం కథం దుఃఖ మితి తప్తోఽస్మి చింతయా॥ ४९
కింనామేదం బత సుఖం యేయం సంసారసంతతిః

జాయతే మృతయే లోకో మ్రియతే జననాయ చ॥ ५०

* మోహయన్తి మనోవృత్తిం ఖండయంతి గుణావళిం
దుఃఖజాలం ప్రయచ్ఛన్తి విప్రలంభపరా శ్శ్రియః॥ ५१
ఆయుః పల్లవకోణాగ్రలంబాంబుకణభంగురం

ఉన్మత్త ఇవ సంత్యజ్య యాత్యకాండే శరీరకం॥ ५२

---

ననుశ్రీమతాం కిందుర్లభ మితిన్యాయేన సంపదైవ తవాఽభీష్టం సేత్స్యతి కిమర్థం విచారయసీ త్యాశంకాయామాహ మోహయన్తీతి. అపిచ ధన మాయు రహంకార స్తృష్ణా చేతో వపు స్తథా బాల్యం చ యౌవనం యోషి జ్జరా కాల శ్చ చింత్యతే. ఇత్యాదినాధనాదయః క్రమాద్విచార్యంతే ప్రథమం ధనం విచార్యతే॥

౪౭-౪౯॥ ఈ ప్రకారముగ విశ్వామిత్రునిచే నడుగబడినవాడై రామ
చంద్రమూర్తి తన మోహమునకుఁ గారణమునుఁ జెప్పుచున్నాడు.
ఓ మహాత్మా! నేను తీర్థయాత్రార్థమై భూమినంతయుఁ దిరిగితిని.
తీర్థయాత్రలను సేవించుటవలన నామనస్సునందుఁ దత్త్వ విచా
రము కలిగెను. ఆతత్త్వ విచారము చేతనే బాటసారికి నిర్జల ప్రదేశ
ములయందువలె నాకు విషయోపభోగములయందభిరుచి తగ్గెను.
నేనీ సంసార రూపమగు దుఃఖమెట్టుల శాంతించునని పరితపించు
చుంటిని.

౫౦॥ రాముడు తనకుఁ గలిగిన వైరాగ్యమునే వివరించుచున్నాడు. ఈ
సంసారము సుఖమగునా? అయ్యో, ఎంతమాత్రము కాదు. పుట్టిన
వాడు తప్పక మృతినొందును. చచ్చినవాడు తప్పక పుట్టును. కనుక
నిది దుఃఖమే.

*౫౧॥మహాత్మా! సంపదలు మనస్సును భ్రమపెట్టుచున్నవి. గుణములను
నశింపఁ జేయుచున్నవి. దుఃఖసంతతి నిచ్చుచున్నవి. కనుక వంచన
స్వభావముకల యీ సంపదలను నమ్మరాదు

౫౨॥ సంపదవలెనే యాయువుకూడ సుఖకరము కాదని చెప్పఁబడు
చున్నది. మహాత్మా! చిగురుటాకుకొనయందున్న మంచుబిందువు
స్థిరముకానట్లు, ఆయువుస్థిరముకాదు, పిచ్చిపట్టినవాఁడు తటాలున
దేనినైనను విడుచునట్లు శరీరము నాయువు, అకస్మాత్తుగ విడిచి
పోవుచున్నది. (అర్థాంతరమునందు) పిచ్చిపట్టినవానిని జనులు తటా
లున విడచునట్లు దేహము నాయువు శీఘ్రముగ విడచిపోవును.

---

* శ్రీమంతులకు దుర్లభమైనది లేదను న్యాయముచేతను సంపద
చేతనే నీయభీష్టము సిద్ధింపఁగలదుకదా. ఏల యీ విచారమని విశ్వామి
త్రుడను నేమోయని యుండగనే రామచంద్రమూర్తి మోహయంతియను
శ్లోకముచేత సమాధానము చెప్పుచున్నాడని యెఱుగనగును ఇంతియే
కాక ధనము, ఆయువు, అహంకారము, తృష్ణ చేతస్సు, శరీరము,
బాల్యము, యౌవనము, స్త్రీ, ముదిమి, కాలము, పైపదింటియందలి
దోషములను గురించి క్రమముగఁ జెప్పఁదలచి ముందుగ ధనమునందున్న
దోషమును మోహయంతియను శ్లోకముచేఁ జెప్పుచుండెను.)

అహంకారవశా దాప దహంకారా ద్దురాధయః
అహంకారవశా దీహా నాఽహంకారా త్పరో రిపుః॥౧౩॥

అప్యబ్ధిపానా న్మహత స్సమేరూన్మూలనా దపి
అపి వహ్న్యశనా త్సాధో విషమ శ్చిత్తనిగ్రహః॥ ౧౪॥

య న్న శక్నోతి తత్రాఽపి ధత్తే తాండవినీ గతిం
నృత్యత్యానందరహితా తృష్ణా జీర్ణేవ నర్తకీ॥ ౧౫॥

రక్తమాంసమయస్యాఽస్య సబాహ్యాభ్యంతరే మునే
నాశైకధర్మిణో బ్రూహి కైవ కాయస్య రమ్యతా॥ ౧౬॥

అశక్తి రాపద స్తృష్ణా మూకతా మూఢబుద్ధితా
గృధ్నుతా లోలతా దైన్యం సర్వం బాల్యే ప్రతిష్ఠితం॥౧౭॥

౫౩౹ అహంకారము సర్వక్లేశములకు మూలభూతమగుట వలన అహంకారము, అనర్థదాయకమని చెప్పఁబడుచున్నది. మహాత్మా! అహంకారము వలననే సమస్తమగు నాపదలును మనఃక్లేశములును రాగద్వేషాదులును కలుగుచున్నవి. ఇట్టి యహంకారమే మనస్సునందుఁ గలరోగము.

౫౪౹ అహంకారమువలెనే చిత్తము కూడ దోషహేతువగుటచే దుఃఖకారణమని చెప్పబడుచున్నది. ఓ విశ్వామిత్ర మహర్షీ! మనోనిగ్రహము గొప్పదియగు సముద్రపానము కంటెను, అగ్నిని భక్షించుటకంటెను, దుష్కరమైనది. (ఇట్టి మనస్సునన్ను దూరముగా విషయములలోనికిఁ దీసికొని పోవుచున్నది యని భావము)

౫౫౹ సర్వప్రపంచమును భ్రమింపఁ జేయుచున్న యాశయు నింద్యమని చెప్పఁబడుచున్నది. ఆశ వృద్ధవేశ్యవలెఁ దనకు సాధ్యముకాని విషయములందుఁ బ్రయత్నించుచున్నది చూచువారలకు సంతోషము కలుగఁ జేయని విధముగా నాట్యము చేయుచున్నది.

౫౬౹ శరీరమునందలి దోషమునుఁ జెప్పుచున్నాడు. ఓమహాముని! చూచిన మాత్రంబుననే విసుకుపుట్టింపఁ జేయునదియును, నెత్తురు మాంసము మొదలగునవియే లోపల వెలపటఁ గలదియును. నాశనమునొందుటయే ముఖ్యధర్మముగాఁ గలదియై యుండెడి యీ శరీరము యొక్క రమ్యత యెట్టిదో చెప్పుము?

౫౭౹ బాల్యమునందలి దోషమునుఁ జెప్పుచున్నాడు. ఈగలు మొదలగువానిని నివారించుకొనుటకు శక్తిలేక పోవుటయు, బాలకగ్రహములవలన నాపదలును, దప్పిక చేతను బాధయును, తన సంకటములనవల జెప్పికొనుటకు మూగితనమును, హితాహితవివేకంబులేమియు, మూఢతయును, చూడబడిన యన్ని వస్తువులయందు నభిలాషయు చాంచల్యము, దైన్యము కలిగియుండుటయు, ఇట్టి దుఃఖసాధనములన్నియు బాల్యమునందుండుటవలన బాల్యము దుఃఖకరమే యని భావము.

వినయభూషిత మార్యజనాస్పదం కరుణయోజ్వల
మావరితం గుణైః। ఇహ హి దుర్లభ మంగ సుయౌవనం
జగతి కానన మంబరజం యథా ౫౮

జన్మపల్వలమత్స్యానాం చిత్తకర్దమచారిణాం
పుంసాం దుర్వాసనారజ్జుః నారీ బడిశపిండికా॥ ౫౯

దాసాః పుత్రాః స్త్రియశ్చైవ బాన్ధవా స్సుహృద స్తథా
హసన్త్యున్మత్తకమివ నరం వార్ధకకంపితం॥ ౬౦

జగజ్జీర్ణ కుటీకీర్ణా న్నిక్షిపత్యుగ్రకోటరే
క్రమేణ గుణవ ల్లోకమణీ న్మృత్యుసముద్గకే॥ ౬౧

విషం విషయవైషమ్యం న విషం విష ముచ్యతే
జన్మాంతరఘ్నా విషయా ఏకదేహాహరం విషం॥ ౬౨

౫౮॥ యౌవనమునందలి దోషము చెప్పబడు చున్నది. వినయముచేనలంక
రింపఁ బడినదై పెద్దలచే గొనియాడఁబడినదై. కరుణతోఁ గూడి
ప్రకాశించునదియై, సద్గుణములచేఁ జుట్టుకొన బడినదై యొప్పారు
మంచియౌవనము, ఆకాశమున బుట్టినయడవిపలె నీ ప్రపంచమున
దుర్లభమని భావము. (అనగా యౌవనమున, వినయము సద్గుణములు,
కరుణయు మొదలగునవి యుండుట యరిదియని పర్యవసానము)

౫౯॥ స్త్రీ యందలి దోషము చెప్పబడు చున్నది. జన్మమనగా సంసా
రము, అదియే చిన్నకొలను, అందుచిత్తమను బురదలో సంచరింపు
చుండెడి పురుషులనే మత్స్యములకు బంధహేతువులగు మలినవాస
నలనేగాలపు త్రాడులు, స్త్రీయే యా గాలపుకొనయందుఁ గూర్పఁ
బడిన మాంసపుముక్కయని భావము. (అనగా చేపలు మాంసపు
ముక్కను తినవలెనని యాశతో నా గాలము చివరనున్న మాంసపు
ముక్కనుఁ దినబోయి యా గాలములో చిక్కుకొనినట్లు పురుషు
లును స్త్రీవలలోఁ బడిపోవుదురని భావము.

౬౦॥ వార్ధక్యమునందలి దోషము చెప్పఁబడుచున్నది. ముదిమిచేత దేహ
మంతయు వణకుచుండెడి నరుని, వాని సేవకులును, కొడుకులును,
భార్య మొదలగు స్త్రీలును, బంధువులును, స్నేహితులును వెఱ్ఱి
బట్టినవానిని చూచినట్లుఁ జూచెదరని భావము.

౬౧॥ కాలమునందలి దోషము చెప్పఁబడుచున్నది. ఈ ప్రపంచము యజ
మానుడులేని పాతకొంప, దీనియందుఁ జల్లబడిన గుణవంతులగు జను
లే నానావిధములగు మణులు, అట్టి మణులను నివారించెడివారు
లేని కారణమున రత్నములను దీసికొని పోవనిచ్ఛగల కాలమను
దొంగవాడు వరుసగా నెత్తికొని భయంకరముఖగుహాకల
మృత్యువనెడి సంపుటములో వేయుచున్నాడు.

౬౨॥ విషయదోషము చెప్పఁబడుచున్నది విషము (వత్సనాభి మొదలగు
నవి) ఏదేహిచేఁ దినబడునో యాదేహమునే చెఱచును నిషిద్ధ
విషయములను సేవించుట యను విషము జన్మాంతర సహస్రముల
నైనఁ జెఱచును. కావున విషంబునకంటె విషయ వైషమ్యము
సహింపఁగూడనిది యని భావము)

యథా జానాసి భగవన్ తథా మోహనివృత్తయే
బ్రూహి మే సాధవో యేన నూనం నిర్దుఃఖతాం గతాః
వదత్యేవం తదా రామే విశ్వామిత్రోఽభ్యభాషత॥౬౩-౬౪

న రాఘవ తవాస్త్యన్యద్జ్ఞేయం జ్ఞానవతాం వర
స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవానసి
యుక్తింకథయతు శ్రీమాన్వసిష్ఠో భగవానయం॥౬౫

తతో వసిష్ఠో భగవానుత్పత్తివిషయం తథా
స్థితిప్రకరణం చాఽపి నిర్వాణాదీన్యుదీర్య చ
పునః ప్రోవాచ తం రామం జ్ఞాతతత్త్వం రఘూత్తమం॥౬౬-౬౭

యుక్త్యావై చరతో జ్ఞస్య సంసారో గోష్పదాకృతిః
దూరసంత్యక్తయుక్తేస్తు మహార్ణవోపమః॥ ౬౮

మహానుభావసంపర్కాత్సంసారార్ణవలంఘనే
యుక్తిస్సంప్రాప్యతే రామ దృఢా నౌరివ నావికాత్॥౬౯

పరమేష్ఠిముఖా దేవా జనకాద్యా నరా యథా
లోకవృత్తేష్వసంసక్తా యథా పద్మాని వై జలే
లోకసంగ్రహకార్యార్థం కర్మ కుర్వంతి సర్వదా
తథా త్వమపి నిష్కామః కర్మాచర రఘూత్తమ॥ ౭౦-౭౧

౬3 ఓ మహాత్మా! సత్పురుషులు దేనిచేత దుఃఖరహితులైరో ఆ రీతిని నీ వెఱింగిన రీతిగా మోహనివృత్తికొఱకు నాకుఁ జెప్పుమా అని రామచంద్రమూర్తి విశ్వామిత్రు నడిగెను. అనంతరము విశ్వామిత్రుఁడు రామునితో నిటులఁ బలికెను.

౬౪౺ జ్ఞానవంతులలో శ్రేష్ఠుఁడ వగు నో రామా! నీ వన్నియు నెఱింగిన వాఁడవై యుంటివి. కావున వేఱుగాఁ దెలియఁదలసినది యొకటియు లేదు. నీవు స్వయముగ సూక్ష్మబుద్ధిచేతనే సర్వమునుఁ దెలిసి కొంటివి. అయినను నీ వడిగితివి కాన వసిష్ఠుఁడు దీనికిఁ దగిన సమాధానమును జెప్పుగాక యని యనెను.

౬౬_౬౭ అనంతరము పూజ్యుఁ డగు వసిష్ఠుఁడు రామునకు, ఉత్పత్తిస్థితి నిర్వాణవిషయములనుఁ జెప్పి తత్త్వమునుఁ దెలిసిన యా రాముని తోఁ దిరిగి యిటులఁ బలికెను.

౬౮ ఓ రామా! జ్ఞానరూప మగు యుక్తిచే సంచరించువానికి సంసారము గోష్పదము వంటిది (అనఁగా సులభముగా సంసారమునుఁ దరింప వచ్చును). జ్ఞానయోగమును దూరముగ విడచినవానికి సంసారము గొప్ప సుళ్లతోఁగూడిన మహాసముద్రమువంటి దని యెఱుఁగుము.

౬౯ ఓ రామా! మహానుభావులతో సహవాసము చేయుటవలన సంసార సముద్రమును దాటుటకు నావికునివలనఁ బడవవలెఁ దగిన యుక్తి లభించును.

౭౦_౭౧ ఓ రామా! బ్రహ్మాది దేవతలును జనకుఁడు మొదలగు మానవులును జ్ఞాను లయ్యును నీటియందుఁ బచ్చితామరాకులవలె సంసారమునందు సంసక్తులు కాక లోకసంగ్రహార్థమై యెల్లపుడు వ్యావహారికకర్మలనుఁ జేయువిధముననే, నీవును ఫలాపేక్షారహితుఁడవై యసంసక్తుఁడవై లోకసంగ్రహార్థమై వ్యావహారికకర్మలనుఁ జేయుచుండుము (అని వసిష్ఠుఁడు రామునకు బోధించెను).

అథ సర్వాణి కార్యాణి జ్ఞాతతత్త్వో గతవ్యథః
కర్తు మంగీచకా రాథ నిష్కామో జనకో యథా॥ ౨౨

అథ రాజా దశరథః ప్రాహ రామ మిదం వచః
పుత్ర! గత్వా కౌశికేన తద్యాగం రక్షతా ద్భవాన్॥
ఇత్యుక్తో రాఘవో ఽప్యాహ రాజానం మధురం వచః
శిరసా ధారయిష్యామి త్వదాజ్ఞాంచ తదానతిమ్॥ ౨౩-౨౪

ఇత్యుక్త్వా పితరం రామః ప్రాప్తుం మాత్రాశిషం తతః
కౌసల్యాభవనం గత్వా నత్వా ఽఽహ జననీం తదా॥
అంబ! పిత్రా నియుక్తో ఽహం కౌశికాధ్వరరక్షణే
తస్మా ద్గచ్ఛామి మునినా విధే హ్యాశిష మంబ! మే॥
ఇత్యుక్త్వా మాతృసాన్నిధ్యేవసతిస్మ రఘూత్తమః॥ ౨౫-౨౬

కౌసల్యా రాఘవం స్వాంకే నివేశ్య ముదితా ఽవదత్॥
ఋతే బ్రాహ్మణకార్యాద్వై కిమన్యత్కార్యమస్తి తే
గత్వా కృత్వా మునేఃకార్యం శుభం కీర్తించ శాశ్వతీం
మునిప్రసాదా ల్లభతాం భవా న్విజయ మాత్మజ!
౨౭-౨౮

* కృతస్వస్త్యయనో మాత్రా త్వేవం రామో సలక్ష్మణః॥

---

* అనేన గురుజనైః స్వస్త్యయనపూర్వకమేవ మహాఫల
కార్యాయ ప్రేషణీయ ఇతి సూచితమ్, తథాచ ఐతరేయ

౨౨ అనంతరము రామచంద్రమూర్తి వసిష్ఠోపదేశముచేఁ దత్త్వమునుఁ దెలిసికొని మనస్తాపమును విడచి నిష్కాముఁడగు జనకుఁడువలెఁ దానును వ్యావహారిక కార్యములను లోకసంగ్రహార్థమై చేయుటకు సమ్మతించెను.

౨౩-౨౪ అనంతరము దశరథమహారాజు రామునితో నివ్విధముగఁ బలికెను. కుమారా ! నీవు విశ్వామిత్రమహర్షితోఁగూడ వెళ్లి యామహాత్ముని యాగమును నిర్విఘ్నముగ రక్షింపుమని చెప్పెను.
ఇట్లు తండ్రి చెప్పఁగా విని రాముఁడు తండ్రితో నివ్విధముగ మధురముగఁ బలికెను— ఓతండ్రీ! నీయానతిని విశ్వామిత్రుని యానతిని శిరసా వహింతును.

౨౫-౨౬½ ఈప్రకారముగఁ దండ్రితోఁ జెప్పి రాముఁడు తల్లియాశీర్వాదమునుఁ బొందఁగలందులకుఁ గౌసల్యాభవనమునకు వెళ్లి తల్లికి నమస్కరించి యామెతో నిటులఁ బలికెను— ఓ తల్లీ! నన్ను తండ్రి యగు దశరథుఁడు విశ్వామిత్రయాగరక్షణార్థమై నియమించెను. నా కాశీర్వాదమునుఁ జేయుము; వెళ్లెదను.
ఈప్రకారము రామచంద్రమూర్తి తల్లితోఁ జెప్పి యామెసాన్నిధ్యమునందు నిలువఁబడి యుండెను.

౨౭-౨౮½ అప్పుడు కౌసల్య రామునిఁ దనతొడయందుఁ గూర్చుండఁ బెట్టుకొని సంతోషముతో నిటులఁబలికెను—పుత్రా! బ్రాహ్మణకార్యముకంటె వేఱుగఁ జేయఁదగిన యుత్తమకార్య మేమియున్నది? కాన నీవు మహర్షితో వెళ్లి యమ్మహర్షి కార్యమునుఁ జక్కపెట్టి యమ్మహాత్ముని యనుగ్రహమువలన శుభములను, శాశ్వతకీర్తిని, విజయములను పొందెదవుగాత! యని యాశీర్వచించెను.

౨౯-౩౦½ *ఈప్రకారముగఁ దల్లియగు కౌసల్యచే నాశీర్వదింపఁబడినవాఁడై రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై తిరిగి తండ్రియొద్దకు వచ్చి

* ఇచ్చటఁ గౌసల్యాదేవి యాగరక్షణార్థమై వెడలఁబోవు తనపుత్రున కాశీర్వాదములనుఁ జేసినది యని చెప్పుటచేతఁ దల్లిదండ్రులు మొద

పితు రంతిక మాగత్య నత్వా తం చ తదాశిషమ్
ప్రాప్య పశ్చా ద్వసిష్ఠాద్యా న్గురూ న్నత్వా తదానతిమ్॥
ప్రాప్య చాథ ధనుర్బాణాన్ ధృత్వా పితర మాయయౌ॥
౭౯-౮౦౪

బ్రాహ్మణమ్. తే దేవా అబ్రువన్ గాయత్రి త్వం న
ఇమం సోమం రాజాన మాహర—ఇతి. సా తథే త్యబ్రవీత్.
తాంవై మా సర్వేణ స్వ స్త్యయనే నానుమంత్రయధ్వ
మితి తథేతి సోదపతత్. తాం దేవాః సర్వేణ స్వ స్త్యయనే
నానుమంత్రయ న్త స్వ స్త్యేవ గచ్ఛేతి, స్వ స్తి పున రాగ
చ్ఛేతి.

తత్రాపి ప్రథమం మాతృకృతమంగళప్రతిపాదనేన ఇతర
కృతమంగళాపేక్షయా మాతృకృతమంగళ స్యావశ్యకతా
వ్యతిరేకే ణాన్వయేనచ సూచితా. వ్యతిరేక స్తావత్
పాండవా న్జేతుకామో ధుర్యోధనః 'శివ మాశంస మే
మాతః! యుధ్యమానస్య శత్రుభిః' ఇత్యష్టాదశాహా న్యపి
స్వమాతరం గాంధారీం ప్రార్థితవాన్. సాచ 'యతో ధర్మ
స్తతో జయ' ఇతి వద న్తీ మంగళం నకృతవతీ. సచ తద
భావాదేవ విపరీతం ఫలం ప్రాప్తవాన్. అయ మర్థో మహా
భారతే స్త్రీపర్వణి పుత్రశతవధజనితామర్షేణ పాండవాన్

తండ్రికి నమస్కరించి తండ్రియాశీర్వాదము నొంది పిదప వసిష్ఠాది మహర్షులకు నమస్కరించి వారి యనుజ్ఞను గైకొని ధనుర్బాణసమేతుఁడై తండ్రియొద్దకు వచ్చెను.

---

లగువారు తమపుత్రులు మహాకార్యమును సాధించుటకుఁ బోవునప్పుడు ఆశీర్వాదపూర్వకముగానే పుత్రునిఁ బంపవలయుననెడి ధర్మము సూచింపఁబడినది. ఆవిధముగానే యైతరేయబ్రాహ్మణమునందుఁ గన్పడుచున్నది. ఏమనఁగా—ఒకప్పుడు దేవతలు గాయత్రిని సోమలతనుఁ దమకుఁ దెచ్చిపెట్టుమని ప్రార్థింపఁగా నామె యావిధముగానే తెచ్చెద నని చెప్పి దేవతలారా! మీరలందఱును న న్నాశీర్వదింపవలయు నని యాగాయత్రి దేవతలతోఁ జెప్పఁగా దేవతలందఱును గాయత్రిని నివ్విధముగ నాశీర్వదించిరి. (ఏమనఁగా) ఓగాయత్రి! నీవు శుభముగా వెళ్ళుదువుగాక! నీవు శుభముగా వచ్చెదవుగాక! నీకు జయము కలుగుగాక! యని.

అందులో ముందుగా మాతృవుచేఁ జేయఁబడిన మంగళమునుఁ జెప్పుటచే నితరులచేఁ జేయఁబడిన మంగళములకంటె మాతృమంగళమునకావశ్యకత వ్యతిరేకముచేతను, అన్వయముచేతను సూచింపఁబడినది. వ్యతిరేకమైతే చెప్పఁబడుచున్నది (వ్యతిరేక మనఁగా మంగళము లేకపోవుటవలన విపరీతఫలము కలుగుట) పాండవులను జయింపఁ గోరికగల దుర్యోధనుఁడు తల్లి యగు గాంధారియొద్దకు వచ్చి తల్లీ! శత్రువులతో యుద్ధము చేయఁబోవు నాకు ఆశీర్వాదమునుఁ జేయమని భారతయుద్ధమునఁ బదునెనిమిది దినములును ప్రార్థించుచునే యుండెను. ఆగాంధారియును 'ఎచ్చట ధర్మముండునో యచ్చట తప్పక జయము కలుగుగాక!' యని చెప్పినదేకాని మంగళమునుఁ జేయకపోయెను. మాతృమంగళము లేకపోవుటవలననే దుర్యోధనుఁడు విపరీతఫలమును బొందెను. ఈసంగతి మహాభారతమున స్త్రీపర్వమున నూర్గురు పుత్రులు మరణించినందువలనఁ గలిగిన

స్వపుత్రం మూ ర్థ్న్యుపాఘ్రాయ రాజా దశరథః ప్రియం
దదౌ కుశికపుత్రాయ సుప్రీతే నాంతరాత్మనా

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
స ప్తమసర్గ స్సమా ప్తః.

---

శప్తు ముద్యుక్తాం గాంధారీం సాంత్వయతా వ్యాసేన స్పష్టీ కృతః. తథాహి— న కోపః పాండవే కార్యో గాంధారి! శమ మాప్నుహి, ఉక్తా స్వష్టాదశాహాని పుత్రేణ జయ మిచ్ఛతా. శివ మాశంస మే మాత! యుధ్యమానస్య శత్రుభిః. సా తథా వాచ్యమానా త్వం కాలేకాలే జయైషిణా. ఉ క్తవ త్యసి గాంధారి! యతో ధర్మ స్తతో జయ ఇతి.

అన్వయస్తు— అయోధ్యాకాండే 'శాపితాఽసి మమ ప్రాణైః కురు స్వ స్త్యయనం మమ'ఇతి మాతృమంగళమేవ రామః ప్రార్థితవాన్. తస్మై సా ఽపి యం పాలయసి ధర్మం త్వం ధర్మ స్త్వా మభిరక్షతు. ఇతి మంగళం వితతాన. తేన శుభ ఫలం ప్రా ప్తవా న్రామ ఇ త్యన్వయః.

౮౧౪ అప్పుడు దశరథుఁడు పుత్రుని శిరము మూర్కొని సంతుష్టాంతరంగముతోఁ దన ప్రియపుత్రుఁడగు రాముని విశ్వామిత్రున కిచ్చెను.

ఆశ్చర్య రామాయణమున బాలకాండమున ద్వితీయభాగమున
సప్తమ సర్గము సమాప్తము.

---

కోపముచేఁ బాండవులను శపింపఁ నుద్యుక్తురాలగు గాంధారి నోదార్చునపుడు వ్యాసుఁడు స్పష్టీకరించెను. (ఏమనఁగా) ఓగాంధారి ! నీవు పాండవులయందుఁ గోపమునుఁ బూనకుము. శాంతినిఁ బొందుము. నీపుత్రుఁడు శత్రువులతో యుద్ధమునకు వెళ్ళుచుఁ బదునెనిమిదిదినములయందును మంగళమునుఁ జేయు మని నిన్నెన్నివిధములఁ బ్రార్థించినను 'నెచ్చట ధర్మ ముండునో యచ్చట జయము కలుగును' అని చెప్పుచు వచ్చితివికాని మంగళమునుఁ జేయకపోతివి. కాన ధర్మమున్నచోట జయము కలిగెను. నీవు పాండవులమీద నాగ్రహింపకుము (అని వ్యాసుఁడు గాంధారితోఁ జెప్పెను).

అన్వయము చెప్పఁబడుచున్నది.
(అన్వయ మనఁగా మాతృ మంగళముండినచోట శుభఫలము కలుగుట యని యర్థము.)
అన్వయవిషయము అయోధ్యాకాండమునందు స్పష్టము కాఁగలదు. (ఏమనఁగా) రాముఁడు వనవాసము వెళ్లునపుడు తల్లి యగు కౌసల్య యొద్దకు వచ్చి తల్లీ ! అరణ్యమునకు వెళ్లుచున్న నాకు మంగళమునుఁ జేయు మని ముందుగా మాతృమంగళమునే రాముఁడు ప్రార్థించెను ఆకౌసల్యయును రామునికొఱకు నీవిధముగ మంగళమునుఁ జేసెను. (ఏమనఁగా) ఓపుత్రా ! ఏధర్మమును నీ వెప్పుడును పరిపాలించుచున్నావో యాధర్మమే నిన్ను సర్వవిధముల రక్షించుగాక యని (కాన మాతృమంగళమునుఁ బొంది వెళ్లిన రామునకు శుభముకలిగెననునది యన్వయము).

అష్టమసర్గప్రారంభః.

అథ పుత్రాశ్రితం రామం సమాదాయ సలక్ష్మణం
సిద్ధాశ్రమం సంప్రతస్థే విశ్వామిత్రో మహామునిః॥ ౧

స్వకార్యసిద్ధే స్సంతుష్టా దేవా స్స్వస్థానత స్తయోః
వవర్షుః పుష్పవృష్టిం తే ఽనాదయన్ దుందుభీ నపి॥ ౨

* యథా స్కందో విశాఖో ద్వా రుద్రం బ్రహ్మణ మశ్వినౌ
యథా ఽన్వగాతాం శ్రీరామలక్ష్మణౌ కౌశికం తథా॥ 3

---

* అత్ర స్కందవిశాఖౌ రుద్రపుత్రౌ. తతో ఽభవ చ్చతు ర్మూర్తిః క్షణేన భగవా న్ప్రభుః, స్కందోవిశాఖ శ్శాకశ్చ నైగమేషశ్చ పృష్ఠతః- ఇతి భారతే. ఏతేన ప్రథమోపమానేన యథా కుమారౌ పితరం నిర్భయ మనుసరత స్తథా రామలక్ష్మణౌ విశ్వామిత్రం వినానవ్య ఇతి భియం నిర్భయ మనుసరత ఇతి. బ్రహ్మణ మశ్వినౌ యథేతి ద్వితీయోపమానేన యథా మహాతాం పృష్ఠతః యాదృశమర్యాదా మవలంబ్య బాలా గంతవ్యా స్తాదృశ మర్యాదయా రామలక్ష్మణౌ వినయేన గచ్ఛత ఇతి చ ధ్వన్యతే. అనేన మహాంత మనుసృత్య గంతవ్య మితి.

## అష్టమ సర్గము.

౧ అనంతరము విశ్వామిత్రుఁడు తండ్రియగు దశరథునిచే నప్పగింపఁబడిన లక్ష్మణసహితుఁ డగు రాముని వెంటఁదీసికొని సిద్ధాశ్రమమునకుఁ బ్రయాణ మయ్యెను.

౨ అప్పుడు దేవతలు తమకార్యము సిద్ధించినందుకు (తమ కార్య మే మనఁగా- దశరథుఁడు రాముని బంపనిచో తాటకా సుబాహు మారీ చాదులవలన నుపద్రవములు కలుగుచునే యుండును. రాముఁడు బయలు దేరినందున రాక్షసోపద్రవములు తగ్గును. కాన తమకార్యము సిద్ధించె నని భావము) సంతోషించినవారలై రామలక్ష్మణుల మీఁదను బ్రయాణసమయమునఁ బుష్పవర్షమును గురిపించిరి. మఱియు దేవతలు సంతసముతో దుందుభులను మోగించిరి.

3 * స్కందుఁడు విశాఖుఁడు అను బాలురు రుద్రు ననుసరించినటులను, అశ్వినీ దేవతలు బ్రహ్మదేవుని ననుసరించి నటులను శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్రుని ననుసరించి వెళ్లుచుండిరి.

---

* ఇచ్చట స్కందవిశాఖు లను వారెవ రనఁగా—రుద్రుని పుత్రు లని యెఱుఁగనగును. అవ్విధముగ భారతమునఁ జెప్పఁబడినది (ఏమన) భగవంతుఁడు క్షణకాలములో స్కందుఁడనియు, విశాఖుఁడనియు, శాకుఁడనియు, నైగమేషుఁడనియు, నాలుగురూపములు కలవాఁ డయ్యెను. ఈ మొదటి యుపమానముచేత కుమారులు తండ్రితో నెటుల నిర్భయముగ వెళ్లుదురో యాప్రకారము రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నిర్భయముగ వెళ్లిరని తెలియఁబడుచున్నది. అశ్వినీదేవతలు బ్రహ్మ ననుసరించి వెళ్లినట్లు వెళ్లిరని చెప్పు నీ రెండవ యుపమానముచేఁ బెద్దల వెనుక భాగమున పిల్లలెట్టి మర్యాదతో వెళ్ళవలయునో యవ్విధముగ వినయ విధేయతలతోఁ బెద్దల ననుసరించి వెళ్లవలయు నని నీతియు సూచింప విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులు వెళ్లి రను విషయము సూచింపఁబడుచున్నది.

‡ అధ్యర్ధయోజనం గత్వా సరయ్వా దక్షిణే తటే
రామేతి మధురాం వాణీం విశ్వామిత్రో౽భ్యభాషత॥ ౪

♦ గృహాణ వత్స! సలిలం మాభూ త్కాలస్య పర్యయః
మంత్రగ్రామం గృహాణ త్వం బలా మతిబలాం తథా॥ ౫

---

‡ అధ్యర్ధయోజనం గత్వా— ఇత్యనేన గోప్రతారతీర్థపర్యంతం గతా ఇతి భావః.

♦ మాభూ త్కాలస్య పర్యయ ఇత్యనేన సూర్యా స్తమయో భవిష్యతి. రాత్రౌ మంత్రోపదేశః న కర్తవ్యః. శీఘ్రం జలం సంస్పృశేతి కౌశికః రామం ప్రేరయామాస. ఏతా వతా అభిజిల్లగ్నే అయోధ్యాయా నిష్క్రమ్య తయో ర్బాలత్వాత్ షట్క్రోశపర్యంతం గమనస్య పంచఘంటావసరో భవేత్. తస్మా ద స్తమానసమయస్య గోప్రతారతీర్థ మాగత ఇతి ద్యోత్యతే. అత్ర బలాతిబలేనామ సిద్ధమంత్రౌ. సిద్ధోనామ మంత్రగ్రహణకాల ఏవ సిధ్యతీతి (పురశ్చరణాదినైరపేక్ష్యేణ ఫలప్రద ఇతి భావః). మంత్రస్తు పంచవిధః- సిద్ధస్సుసిద్ధః ఆర్షః పౌరుషః శాబరశ్చేతి. తత్ర సిద్ధోనామ ధ్యానమాత్రఫలప్రద ఇతి. (తదుక్తం) మంత్రః పంచవిధ స్సిద్ధ స్సుసిద్ధార్షౌచ పౌరుషః, శాబరశ్చేతి తత్రాద్యో ధ్యానమాత్రఫలప్రద ఇతి.

అత్ర బలానామ ఉత్సాహబలవృద్ధిహేతుభూతః క్షుత్పిపాసానివర్తకః పరిశ్రమసహిష్ణుతాపాదకో మంత్రవిశేషః.

౪ † విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను వెంటనిడుకొని సరయూనదికి దక్షిణభాగపుటొడ్డున నాలుక్రోసుల దూరము వెళ్ళి యచ్చట రామచంద్రమూర్తితో మధురముగ నిటులఁ బలికెను.

౫ ♦ రామచంద్రా! నీవు జలమును స్పృశింపుము. ఆలస్యము చేయకుము. బల, అతిబల యను మంత్రముల నుపదేశించెదను. గ్రహింపుము (అని విశ్వామిత్రుఁడు రామునితోఁ జెప్పెను).

---

♦ అధ్యర్ధయోజనదూరము వెళ్ళి రని చెప్పుటచే గోప్రతారతీర్థము పర్యంతము వెళ్ళి రని భావము.

† ఆలస్యము చేయకుము అని చెప్పుటచేతను సూర్యాస్తమయ మగు ననియు, రాత్రియందు మంత్రోపదేశము చేయఁగూడదు, కాన వెంటనే జలమును స్పృశింపుమనియు విశ్వామిత్రుని భావమని తెలియుచున్నది. ఇందువలన నేమి తెలియఁబడుచున్నదనగా- మధ్యాహ్నకాలమున అభిజిల్లగ్నమున అయోధ్యనుండి బయలుదేరినట్లును ఆఱు క్రోసులదూరము నడచుటకు నైదు గంటలకాలము పట్టును. కాన నైదుగంటలకాలమునకు గోప్రతార తీర్థము చేరిరని తెలియబడుచున్నది. ఇచ్చట బల, అతిబల యను మంత్రములు సిద్ధములని తెలియనగును. సిద్ధ మనఁగా- మంత్రమును గ్రహించిన కాలమునందే సిద్ధించునది(అనఁగా పురశ్చరణ మక్కఱలేకయే ఫలమునిచ్చునదియని భావము). మంత్రము ఐదువిధములు- 1 సిద్ధము, 2 సుసిద్ధము, 3 ఆర్షము, 4 పౌరుషము, 5 శాబరము. వానిలో సిద్ధము ధ్యానమాత్రముచేతనే ఫలము నిచ్చునది యని యెఱుఁగనగును. ఆవిధము గనే మంత్రశాస్త్రమునందుఁ జెప్పఁబడినది.

ఇచ్చట మంత్రమునకు బల యను నామ మెందునకు వచ్చిన దనఁగా- ఉత్సాహమునకు బలమునకుఁ గారణభూతమైనదియును, క్షుత్పిపాసలను బోఁగొట్టునదియును బరులచేఁ బ్రయోగింపఁబడిన శస్త్రాస్త్ర

పితామహసుతే హ్యేతే విద్యే తేజ స్సమన్వితే
♦ దదామి తవ కాకుత్స్థ! సదృశ స్త్వం హి ధార్మిక! ౬

---

తదుక్తం- ఉత్సాహబలయో ర్వృద్ధిః పరశస్త్రసహిష్ణుతా, అబాధః క్షుత్పిపాసాభ్యాం యత స్సా కథితా బలా, ఇతి. అతిబలానామ శత్రో రస్త్రస్ఖాలిత్యహేతుః. తస్యైవ జ్ఞానకర్మోపాయప్రైయర్థ్యాపాదకో మంత్రవిశేషః. తదుక్తం— యతః పరాస్త్రస్ఖాలిత్యం దృఙ్మనఃకాయకర్మణాం, స్వోపాయానా మమోఘత్వం భవే త్సా ఽతిబలా స్మృతా. ఇదం విద్యాద్వయం జ్ఞాతమాత్రం సిద్ధికరం నృణాం, విష్ణు రేతద్ద్వయం స్మృత్వా జితవా న్మధుకైటభా వితి.

♦ సదృశ స్త్వంహి ధార్మిక ఇతి—త స్యాయ మాశయః. హేరామ! మహామంత్రజపితౄణాం యాదృక్సుచిత్వాది గుణా స్థ్సాతవ్యా స్తాదృగ్గుణా స్త్వయి సంతి. తస్మా త్పాత్రభూతో ఽసి. సత్పాత్రదానకర్తు ర్యాదృశీ గతి రుత్తమా భవే త్తాదృశీ మమ త్వత్తో భవిష్యతీతిచ. రామ స్యోపదేశకరణేన లక్ష్మణ స్యా ప్యుపదిదేశేతి మంతవ్యమ్. పితామహసుతే ఇత్యనేన న సామాన్యభూతే, ఇతి. తేజస్సమన్వితే ఇత్యనేన ఏతన్మంత్రబలాత్ పరధ్యానేపి తవ రాక్షసా అపకారం న కర్తుం శక్నువంతీతిచ ధ్వన్యతే.

౬ ♦ ఓ రామచంద్రా! మహాతేజస్సుకల యీ బలాతిబల లను విద్యలు రెండును బ్రాహ్మము బ్రహ్మపుత్రికలు. లోకోపకారార్థము అస్త్రరూపములయ్యె. ఆ రెండువిద్యలు నీకు నే నిచ్చెదను. ధార్మికుఁడవగు నో రామా! నీవు ఈ మంత్రోపదేశమునకుఁ దగినవాఁడవు (అని కౌశికుఁడు రామునితోఁ జెప్పెను)

ములను సహింపఁ జేయునదియును గాన బల యను నామము సార్థకము. అవ్విధముననే మంత్రశాస్త్రమునఁ జెప్పఁబడినది. అతిబల యనఁగా, శత్రువుయొక్క అస్త్రములకు స్థాలిత్యము కలుగజేయు నదియును శత్రువుల జ్ఞానకర్మోపాయములకు వ్యర్థతనుఁ గలుగఁ జేయునదియును దన యుపాయములకు సఫలత్వమును గలుగఁజేయు నదియునని చెప్పఁబడినది. ఈరెండు మంత్రములు జ్ఞాతములగుట తోడనే సిద్ధినిఁగలుగఁ జేయుననియుఁ, బ్రాహ్మము విష్ణువు ఈరెండు మంత్రములను జపించి మధుకైటభాసురులను జంపెననియుఁ జెప్పఁబడినది.

* నీవు తగినవాఁడ వని చెప్పిన విశ్వామిత్రుని యభిప్రాయ మిది యై యున్నది- ఓ రామా! మహామంత్రమును జపించువారల కుండ వలసిన శుచిత్వాదిగుణములు నీయం దున్నవి. కాన నీవు తగినవాఁడ వని యాశయము. మఱియు సత్పాత్రమందు దానము చేసినవాని కెట్టి యుత్తమగతి కలుగునో యట్టి యుత్తమగతి నీవలన నాకుఁ గలుగుననియు విశ్వామిత్రుని యభిప్రాయమై యున్నది. ఇచ్చట రామున కుపదేశము చేసెననుటచే లక్ష్మణునకు నుపదేశించె ననియే యూహింపనగును. ఈ విద్యలు బ్రహ్మపుత్రిక లని చెప్పుటచే సామాన్యవిద్యలు కావనియుఁ, దేజస్సు కలవని చెప్పుటచే పరధ్యానముగా నున్నప్పుడును రామునకు రాక్షసులు అపకారమును జేయుటకు సమర్థులు కారనియు సూచిత మగుచున్నది.

* తతో రామో జలం స్పృష్ట్వా ప్రతిజగ్రాహ తే మునేః
తత స్తే రజనీం తత్రాయాపయ న్సుసుఖం త్రయః॥ ౭

ప్రభాతాయాంతు శర్వర్యాం విశ్వామిత్రో మహామునిః
అభ్యభాషత కాకుత్థ్సం ‡ శయానం పర్ణసం స్తరే॥ ౮

† కౌసల్యా సుప్రజా రామ ! పూర్వా సంధ్యా ప్రవ ర్తతే

---

* అనే నాచార్యేణ సదృశే శిష్యే నియమోపదేశపూర్వకం మంత్రోపదేశః క ర్తవ్యః. శిష్యే ణాపి కృతస్నానాచమనేన గురునియమేన మంత్రం గ్రాహ్య మితి ధర్మ స్సూచితః.

‡ శయానం పర్ణసం స్తరే ఇత్యనేన శిష్యాణాం మహ త్త్వే ఽపి గురో రధికభోగవాంఛా నహి కదాఽపి స్థాతవ్యేతిచ సూచితమ్.

† కౌసల్యా సుప్రజేతి—అనేన పూర్వోత్థా ఇతి స్మృతిసిద్ధం పూర్వోత్థానాదిక మధ్వశ్రమే ణాతుర్వ న్నపి శిష్యః ఆచార్యేణ ప్రబోధ్య నిత్యకర్మసు నియోజ్య ఇతి ధర్మ స్సూచితః. అత్ర సూర్యోదయా త్పూర్వ మేవ కౌశిక స్తూత్థాయ సూర్యోదయసమయే నిద్రాళోః ప్రాయశ్చి త్తవిధానాత్ నిద్రావశంగతం రామ ముత్థాపయతి. సూర్యోదయసమయే నిద్రాళోః దోషవిశేషః ప్రతిపాదితః. తథాహి—సుప్తే యస్మి న్న స్తమేతి సుప్తే యస్మి న్నుదేతిచ, అంశుమా నభి నిర్ము క్తాభ్యుదితౌ తౌ యథాక్రమమ్. ప్రాయశ్చిత్త మకు ర్వాణౌ యుక్తౌ తౌ మహ తైనసా - ఇతి.

౭ * అనంతరము రామచంద్రమూర్తి స్నానాచమనాదులను జేసి విశ్వామిత్రునివలన పై రెండు మంత్రములను నుపదేశమును బొందెను. పిమ్మట నాముగ్గురును సుఖముగ నా రాత్రి నచటనే గడపిరి.

౮ అరుణోదయసమయమున విశ్వామిత్రుఁడు ముందుగ లేచి ‡ తృణపర్ణశయ్యయందు నిద్రించుచున్న రామునిగూర్చి యిటులఁ బలికెను.

౯ † కౌసల్యాదేవికి సత్సంతానమగు రామచంద్రా! ప్రాతస్సంధ్యాకాల

---

* ఇందువలన తగినశిష్యుఁడు దొరికినపుడు గురువు మంత్రోపదేశమును జేయవలయు ననియు శిష్యుఁడు స్నానాచమనాదులనుజేసి గురువు చెప్పిన నియమములతో మంత్రమును గ్రహింపవలయు ననియు ధర్మము సూచితమగుచున్నది.

‡ రామచంద్రమూర్తి తృణపర్ణశయ్యయందు నిద్రించుచుండెనని చెప్పుటచే శిష్యు లెంత గొప్పవారైనను గురువుకంటె నధికభోగముల ననుభవించుకోరిక యెప్పుడు నుండ కూడ దను ధర్మము సూచింపఁబడినది.

† గురువుకంటె ముందుగా శిష్యుఁడు లేవవలయు నని ధర్మశాస్త్రమున్నను మార్గాయాసముచేత గురువుకంటె ముందుగ శిష్యుఁడు లేవలేక బద్ధకించినపుడు గురువు శిష్యుని లేపవలయు ననెడి ధర్మము ఇచ్చట సూచింపఁబడినది.

సూర్యోదయమునకుఁ బూర్వమునందే విశ్వామిత్రుఁడు లేచి, సూర్యోదయసమయమున నిద్రించువానికి ధర్మశాస్త్రమునందుఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడిన హేతువుచే నాసమయమున నిద్రించుచున్న రాముని విశ్వామిత్రుఁడు లేపుచుండెను.

సూర్యోదయసమయమున నిద్రించువానికి దోషవిశేషము శాస్త్రమునందుఁ బ్రతిపాదింపఁబడెను. (ఎట్లన) ఎవ్వఁడు నిద్రించుచుండఁగా సూర్యుఁ డుదయించునో, యెవఁడు నిద్రిం[illegible]చుండఁగా సూర్యుఁ డస్తమించునో (అనఁగా - సూర్యోదయసమయ[illegible]మున నిద్రించువాఁడును,

ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్॥ ౯

కౌసల్యాసుప్రజేత్యత్ర సుశబ్దేన మాతాపిత్రనుమతావపి, కౌశికే నాహం న గచ్ఛేయం తేనసహ కందమూలాదికం భుక్త్వా నవసేయం నహి స్థండిలే శయన మప్యాచరేయ మితి రామచంద్రః వదతి చేద్విశ్వామిత్రోవా కిం కరిష్యతి. న కిమపి కరిష్యత్యేవ. మాతాపిత్రో ర్వాక్యం తు నోల్లంఘనీయ మితి మత్వా స్వానుష్ఠానేన మాతాపితృవాక్యం న లంఘనీయమితి లోకస్య రామః బోధయితు మేవ నిర్గతః తస్మా త్సుప్రజేతి.

అత్ర కౌసల్యా సుప్రజా ఇతి విశేషణం పరశురామవ్యావృత్త్యర్థ మితి జ్ఞేయం. కౌసల్యాదశరథయో రుభయో రపి తపః ఫలత్వేనావతీర్ణత్వేఽపి కథం కౌసల్యా సుప్రజా ఇత్యుక్తి రితిచే దుచ్యతే "మాతా పుత్రస్య భూయాంసి కర్మాణ్యారభతే ముదా" ఇత్యుక్తరీత్యా 'మాతృదేవో భవ, పితృదేవోభవ' ఇత్యుక్త్వా మాతుః ప్రాధాన్యోక్తేః 'పితు

మైనది. ఓమానవోత్తమా ! లెమ్ము. ఆహ్నికకృత్యములు చేయవలసి యున్నవి.

---

సూర్యాస్తమయసమయమున నిద్రించువాఁడు నని భావము) వారిద్దఱును అభ్యుదితుఁడనియు, అభినిర్ముక్తుఁడనియుఁజెప్పఁబడుదురు. వారలిద్దరు ప్రాయశ్చిత్తమును జేసికొనకపోయినచో గొప్పపాపము కలవారగుదురు.

ఈ శ్లోకమునకు విశేషార్థము వ్రాయబడుచున్నది.—

కౌసల్యా సుప్రజా రామ కౌసల్యాదేవికి సత్సంతానమైన రాముఁడా! (అని యర్థము). కౌసల్యాదేవికి సంతానమైన రాముఁడా, అని చెప్పితే చాలునే, మంచిసంతానమైన రాముఁడా! అనుటలో విశేషమేమనఁగా- తల్లిదండ్రులు విశ్వామిత్రునితో వెళ్ళుటకు రామునకనుజ్ఞ నిచ్చినను, నేను విశ్వామిత్రునితో వెళ్ళననికాని, కందమూలఫలాదులు మునితోబాటు భుజించి యుండలేనని కాని, భూమియందుఁ బరుండలేనని కాని రామచంద్రమూర్తి పలికినయెడల విశ్వామిత్రుఁ డేమిచేయఁగలఁడు (ఏమియుఁజేయలేఁడు)? అట్లుకాక తల్లిదండ్రుల వాక్యము నుల్లంఘింపఁగూడ దని తలఁచి తన యనుష్ఠానముచేఁ దల్లిదండ్రుల వాక్యము నుల్లంఘింపఁగూడదను ధర్మమును లోకమునకు రాముఁడు బోధించుటకే బయలుదేరెను. ఆకారణమువలన విశ్వామిత్రుఁడు రాముని సంబోధించుటలో కౌసల్యాదేవికి సత్సంతానమైన రాముఁడా! యని సంబోధించెనని భావము.

ఇచ్చట రామా అని పిలిచిన చాలునే, కౌసల్యాపుత్రుఁ డగు రాముఁడా ! అని పిలుచుటలో విశేష మేమనఁగాఁ బరశురామునకును రామ యను మాట వర్తించును కాన పరశురాముని వ్యావృత్తికొఱకుఁ గౌసల్యాపుత్రుఁ డగు రాముఁడా యని పిలిచెను. రామచంద్రమూర్తి కౌసల్యాదశరథులకిద్దఱకుఁ దపఃఫలముగా నవతరించినపుడు దశరథపుత్రుఁ డగు రాముఁడా! యని పిలువకుండఁగఁ గౌసల్యాపుత్రుఁ డగు రాముఁడా! యని పిలుచుటలో విశేష మేమనఁగా " తల్లి కుమారునకు విస్తారమైన శుభకృత్యములను సంతోష

ర్దశగుణం మా' తేతి స్మృతేశ్చ; యద్వా కౌసల్యాదశరథయో ర్మహదంతర మస్తి. దశరథోఽపి 'అహం వేద్మి మహాత్మాన' మితి పరత్వేన నివేద్యమానే ఽపి త దకించిత్కృత్య 'దుఃఖే నోత్పాదిత శ్చాయం న రామం నేతు మర్హ' సీతి రామే పుత్రత్వం మన్వానో వసిష్ఠసంధుక్షితహృదయో రామం ప్రేషితవాన్. కౌసల్యా తు కేవలం వాత్సల్యపరా ఽపి దుత్రితం సాదరం ప్రేషితవతీ. తదిదం తారతమ్య మవలోక్య ముదితహృదయో ముని రాహ కౌసల్యాసుప్రజా ఇతి.

రామే త్యనేన స్వాపకాలికసౌందర్య ముచ్యతే. యద్వా రామ! ఏతాదృశసౌందర్యయుతం త్వాం ప్రసూతవతీ కౌసల్యా సుప్రజాఖల్వితి వా, నిద్రావశంగతరామముఖ సౌందర్యం దృష్ట్వా కౌశికః రామ మాహ- ఏకద్విత్రిదినేషు

ముతో జేయ నారంభించుననియెడి స్మృతివాక్యమువలనను 'తల్లిని దేవతనుగా భావింపు'మని తండ్రికంటె ముందుగా తల్లిని స్తుతి కొనియాడుటవలనను, ప్రాధాన్యము తల్లికి చెప్పబడియుండుట లనను–నిదియునుగాక తండ్రికంటె తల్లి పదిరెట్లు యెక్కువయను స్మృతివాక్యమువలనను కౌసల్యాపుత్రు డగు రాముడా! యని పిలిచెనని యెఱుగనగును. లేక కౌసల్యాదశరథులలో తారతమ్య మెక్కువ యుండెను. ఎట్లన - నేను రాముని మహాత్మునిగా నెఱుగుదు నని విశ్వామిత్రుడెంత జెప్పినను దానిని లక్ష్యపెట్టక అరువది వేల సంవత్సరములకు పుట్టక పుట్టక యతికష్టముచే రాముడు నాకు సంప్రాప్తమయ్యెను. కాన రాముని నీవు తీసికొని వెళ్ళతగదని దశరథుడు రామునియందు పుత్రభావమే తలచుచున్నవాడై తుదకు వసిష్ఠునిచే నిష్కల్మషముగా జేయబడిన హృదయముకలవాడై విధిలేక రాముని బంపెను. కౌసల్యయన్నో తండ్రికన్న నెక్కుడు వాత్సల్యము కలదైనను రాముని శీఘ్రముగ నిస్సందేహముగ విశ్వామిత్రుని కార్యమును నెరవేర్పుమని ప్రోత్సహించికూడ పంపెను. కాన కౌసల్యాదశరథుల తారతమ్యమును విశ్వామిత్రుడెఱిగినవాడు కాన దశరథపుత్రా యని పిలువక సంతోషముతో కౌసల్యాపుత్రుడా యని పిలిచెను.

కౌసల్యాపుత్రుడా యని పిలిచినచాలును కాని రామా యనికూడ చెప్పుటచే లోకోత్తరమైన సౌందర్యము కలవాడా యనుభావము స్ఫురించుచున్నది. నిద్రించుచున్నప్పుడే యిట్టి సౌందర్యముచే నొప్పుచున్న లేచినప్పుడు నీసౌందర్య మెట్లుండునో కదా యని భావము. లేక రామ – లోకాభిరాముడా! లోకోత్తరసౌందర్యముకల నిన్ను కని నీతల్లియగు కౌసల్యాదేవి సత్సంతానముకలదిగదా! అనగా ధన్యాత్మురాలుకదా యని యర్థము చెప్పవచ్చును. అనగా విశ్వామిత్రుడు నిద్రించుచున్న రామునిముఖసౌందర్యమును జూచి యిట్లనెను–రామా! రెండుమూడుదినములు నీసహవాసము నాకు జేకూరుటచే నే నెంతయో కృతార్థుడ నని నన్ను నేను తలచుకొనుచున్న

త్వత్సహావాసాదేవ మయి కృతార్థం మన్యే వేసతి ఏతా దృశం ప్రసూతవతీ త్వజ్జననీ కీదృశీ ధన్యేతి స్తౌతి.

పూర్వా సంధ్యా ప్రవర్తతే - పూర్వా సంధ్యా యథా దివాకరం జనితవతీ తథా కౌసల్యా రామదివాకరం త్వాం జనితవతీతి భావః. యద్వా మాతృవ త్పూర్వసంధ్యా మ ప్యుపలాల యేతి భావః. యద్వా ఆదిత్యస్యేవ తవా ప్యయం విరోధినిరసనారంభసమయ ఇతిభావః. యద్వా అజ్ఞానాంధ కారో గతః. - భవత్సాక్షాత్కారో మే జాత ఇతిభావః. యద్వా - అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ శర్వరీ, య దున్నిద్రాబ్జపద్మాక్షం విష్ణో ర్ద్రక్ష్యా మ్యహం ముఖ - మిత్యనుసంధేయమ్.

ఉత్తిష్ఠ - నిద్రాశ్రీ రవలోకితా ప్రబోధశ్రియ మ ప్యవ లోకితు మిచ్ఛామీతి భావః.

నరశార్దూల - నర శ్రేష్ఠతయా భవతాఽపి సం ధ్యోపాసనీ యా 'యద్య దాచరతి శ్రేష్ఠ స్త త్తదే వేతరో జన' ఇత్యుక్తేః. యద్వా - ఉత్తిష్ఠ నరశార్దూల - ఆశ్రితవిరోధి నిరసనశీలస్య కిం నిద్రావకాశో ప్యస్తి. ఉత్థానప్రయోజన మాహ - కర్తవ్యం దైవమాహ్నికం - దేవేన సర్వేశ్వరేణ విహితం నిత్యకర్మానుష్ఠానం కర్తవ్యమ్. యద్వా దేవశబ్దో భవదర్థకః. భవదీయం కర్మ భవదాజ్ఞారూపం కర్మ మయా కర్తవ్యం తత్స్వీకు ర్వితి శేషః. యద్వా యజ్ఞాత్మకం మయా కర్తవ్య మిత్యర్థః.

పుడు నిన్నుకని నీముచ్చటలను సర్వదా చూచుకొనుచుండెడి నీతల్లి యగు కౌసల్య యెంతధన్యాత్ముఁరాలోకదా ! యని విశ్వామిత్రుడు కౌసల్యాదేవిభాగ్యమును వర్ణించె నని భావము.

పూర్వా సంధ్యా ప్రవర్తతే- ప్రాతస్సంధ్య యేవిధముగ సూర్యుని గనెనో ఆవిధముగ కౌసల్యాదేవియును రాముడను సూర్యుని నిన్ను గనినదని భావము. లేక తల్లివలె ప్రాతస్సంధ్య సేవింపదగిన దని భావము. లేక సూర్యునకు నెటుల శత్రువులను సంహరింపసమయమో యటులనే నీకును శత్రువులను సంహరింపదగిన సమయమని భావము. లేక అజ్ఞానాంధకారము తొలగి నీసాక్షాత్కారముకలిగిన దని భావము. లేక నాజన్మము సఫలమయ్యెను. వికసించినతామరపుష్ప మువంటి భగవంతుని ముఖమును చూచుటవలన రాత్రి సుప్రభాతము కలదయ్యె ననుభావ మనుసంధేయము.

ఉత్తిష్ఠ- నిద్రాకాలమునందలి శోభ చూడబడినది. మేల్కొనినపు డుండుశోభను జూచుటకు గోరుచున్నాను. కాన లెమ్ము.

నరశార్దూల- నరశ్రేష్ఠుడా యని చెప్పుటచేత రామచంద్రా! నీవు నరశ్రేష్ఠుడవు. కాన లోకములో శ్రేష్ఠుడు దేని నాచరించునో యితరులును దానినే యాచరించెద రనెడి న్యాయముచేతను నీవును సంధ్య నుపాసింపవలెనని భావము. లేక ఉత్తిష్ఠనరశార్దూల- నీయా శ్రితుల విరోధులను సంహరించు స్వభావముకల నీకు నిద్ర కవకాశ మెట్లుకలుగును ? కాన లెమ్మని భావము. లేచుటకు ప్రయోజనము చెప్పుచున్నాడు- సర్వేశ్వరు డగు దేవునిచేత విహితమైన నిత్య కర్మానుష్ఠానురూపమైన యాహ్నికకృత్యము చేయవలసియున్నది. లేక దేవుడనగా నిచ్చట నీవే యని యర్థము. దైవమనగా నీయాజ్ఞా రూపమయిన కర్మను నేను చేయువలసియున్నది. దానిని స్వీకరించు టకు లెమ్మనిభావము. లేక యాగరూపమగు కర్మను నేను చేయ వలసియున్నది కాన లెమ్మని యర్థము.

* అథ తస్య వచ శ్శ్రుత్వా కౌశికస్య నరోత్తమౌ
ఉత్థాయ మజ్జనం కృత్వా జేపతుః పరమం జపమ్॥ ౧౦

---

* పరమం జపం జేపతు రిత్యనేన గాయత్రీజపం కృతవంతా విత్యర్థః - న గాయత్ర్యాః పరం మంత్ర మితి న్యాయేన తస్మా త్పరం మంత్రం నాస్తి. స్వోపాసకం త్రాయత ఇతి గాయత్రీతి సా స్వనామనిర్వచనేన స్వోత్కృష్టతాం నివేద యతి. తజ్జపస్య ముఖ్యకాలస్తు సూర్యోదయా త్పూర్వం ఘటికాత్రయం ప్రాతస్సంధ్యా, సూర్యోదయా త్పరం ఘటి కాత్రయపర్యంతం సాయంసంధ్యా ఉదయే త్వీశాన్యదిశాభి ముఖం సాయం వాయవ్యదిశాభిముఖం సూర్యోదయా త్పర మర్ఘ్యం సూర్యోదయపర్యంతం జపం ఉదయే తిష్ఠన్ సాయ ముపవిశన్ జపేత్. ప్రతిప చ్చతుర్థ్యష్టమీ చతుర్దశీ పూర్ణి మాదితిథిషు సాయంజపసంకోచం కుర్యాత్. ప్రాత స్సంధ్యా వశా ద్రాత్రిపాపం, సాయంసంధ్యావశా ద్దివాపాపంచ వినశ్యతి. ద్విజ స్సంధ్యోపాస్తిరహితః శూద్రఏవ భవేత్. అపిచ సంధ్యా గ్రామా ద్బహిః కృతాచేత్ ఫల మధికం భవేత్. అస్యా అనధ్యయనాదిదోషప్రసక్తి ర్నాస్తి. శాస్త్రబద్ధః బ్రాహ్మణః గాయత్రీం జపన్నపి శ్రేష్ఠఏవ. నిషిద్ధకార్య కర్తా చతుర్వేదాఢ్యోఽపి హీనఏవేతి మను స్మృతౌ ప్రతిపాదిత మితి విజ్ఞేయమ్.

౧౦ * అనంతరము రామలక్ష్మణులు విశ్వామిత్రుని వాక్యమును విని లేచి స్నానముచేసి సర్వోత్కృష్టమగు మంత్రమును జపించిరి.

---

* సర్వోత్కృష్టమగు మంత్రమును జపించిరి యనుటచేత గాయత్రీ మంత్రమును జపించిరి యని తోచబడుచున్నది. గాయత్రికంటె గొప్పమంత్రము లేదని స్మృతి చెప్పుచున్నది. గాయత్రి యను శబ్దమే వ్యుత్పత్త్యర్థముచేత తన సర్వోత్కృష్టతను దెలియఁజేయుచున్నది. తన నుపాసించువానిని రక్షించునది కాన గాయత్రి యని చెప్పఁబడుచున్నది. గాయత్రీజపమునకు ముఖ్యకాలము— సూర్యోదయమునకుఁ మూడుగడియలకాలము పూర్వము ప్రాతస్సంధ్య నారంభింపవలయు ననియు, సాయంసంధ్యకు సూర్యోదయానంతరము మూడుగడియలపర్యంతమును చెప్పఁబడినది. ఉదయకాలమున ఈశాన్యదిక్కు కభిముఖముగాను, సాయంకాలమున వాయవ్యదిక్కు కభిముఖముగాను జపము చేయవలయుననియు, సూర్యోదయపర్యంతము జపమును, సూర్యోదయానంతరము అర్ఘ్యమును జేయవలయుననియు, ఉదయమున నిలిచియుండి జపించవలయు ననియు, సాయంకాలమున కూర్చుండి జపించవలయు ననియు, పాడ్యమి చతుర్థి అష్టమి చతుర్దశి పూర్ణిమాది తిథులయందు సాయంకాలమున జపమును తగ్గించి చేయవలయుననియు, ప్రాతఃకాలమున గాయత్రీజపమువలన రాత్రిపాపము నశించుననియు, సాయంసంధ్యమునఁ బగటిపాపము నశించుననియు చెప్పఁబడినది. ద్విజుడు (అనగా బ్రహ్మక్షత్రియవైశ్యులు) గాయత్రీమంత్రజపమును జేసికొననిచో శూద్రుడగుననియు, దేవపితృకర్మలకు [illegible]డనియుఁ జెప్పఁబడినది. సంధ్యావందనము గ్రామమునకు వెలుపల [illegible] జేయఁబడినచో ఫల మధికముగా నుండును. గాయత్రీ మంత్రజపమునకు అనధ్యయనాదిదోషప్రసక్తి లేదు. శాస్త్రమునకుఁ గట్టుబడి బ్రాహ్మణుడు గాయత్రీమంత్రమాత్రమును జపించిన శ్రేష్ఠుడనియు, [illegible]ద్ధకార్యములను జేయువాడు నాలుగు వేదములను జదివినను హీనుడే యనియు మనుస్మృతియందుఁ జెప్పబడినదని తెలియనగును.

† కృతాహ్నికౌ మహావీర్యౌ విశ్వామిత్రం తపోధనం
అభివాద్యాభిసంహృష్టౌ గమనాయోపతస్థతుః॥ ౧౧

తతో రాఘవసౌమిత్రీ విశ్వామిత్ర మనువ్రతౌ
జాహ్నవీ సరయూసంగస్థలం సంప్రాప్య తౌ క్రమాత్॥
తత్ర ఋష్యాశ్రమం దృష్ట్వా తద్వృత్తాంత మపృచ్ఛతామ్॥
౧౨-౧౨½

తయో స్తద్వచనం శ్రుత్వా ప్రహస్య మునిపుంగవః॥
అబ్రవీ చ్ఛ్రూయతాం రామ! యస్యాయం పూర్వఆశ్రమః॥
౧౩-౧౩½

అత్ర రుద్రం తపస్యంతం కందర్పో ధర్షయ త్పురా॥
* నిటలాక్షేణ సందగ్ధ స్సో ప్యనంగ ఇతిశ్రుతః
తస్యాయ మాశ్రమః పుణ్య ఇతి జానీహి రాఘవ! ౧౪-౧౫

---

† అనేన ప్రాతరుత్థానాదికం కృత్వా గుర్వభివాదనం కర్తవ్య మితి సూచితమ్. అభివాదనశీలస్య విశేషఫల మాహ మనుః- "అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః, చత్వారి తస్య వర్ధంతే హ్యాయుః ప్రజ్ఞా యశో బల మితి."

* ఏతేన మహాపురుషద్రోహిణో దుర్బలస్య స్వరూపనాశోఽపి భవతి. మహాపురుషద్రోహః సర్వథా న కర్తవ్య ఇతి సూచితమ్.

౧౧ *ఆహ్నికక్రియల నాచరించి మహాపరాక్రమవంతులయిన నా రామ లక్ష్మణు లిరువురు తపోధను డగు విశ్వామిత్రునికి నమస్కరించి ఆనందముతో ప్రయాణోన్ముఖులయిరి.

౧౨-౧౨½ అనంతర మా రామలక్ష్మణులు విశ్వామిత్రు ననుసరించి వెళ్ళిన వారలై క్రమముగా గంగాసరయూసంగమస్థలమును జేరి యచ్చట నొక ఋష్యాశ్రమమును జూచి యాశ్రమవృత్తాంతమును విశ్వామిత్రు నడిగిరి.

౧౩-౧౩½ విశ్వామిత్రమహర్షి యా రామలక్ష్మణుల వాక్యమును విని మందహాసముచేసి యీ యాశ్రమము పూర్వ మెవరిదో దాని వృత్తాంతమును రామా చెప్పెదను వినుమని చెప్పనారంభించెను.

౧౪-౧౫ † పూర్వ మిచ్చట శంకరుడు తపముచేయుచుండగా మన్మథుడు తపోవిఘ్నమును జేయుటకు రాగా మూడవనేత్రాగ్నిచే నాతని దహింపఁజేసెను అది మొదలు మన్మథుడు అనంగు డని ప్రసిద్ధి చెందెను (అనంగు డనగా శరీరము లేనివా డని యర్థము). రామ చంద్రా! యీ యాశ్రమము పవిత్రమగు స్థాణ్వాశ్రమ మని తెలిసికొనుము.

---

* ఇందువలన ఉదయమున లేచి కాల్యముల నిర్వర్తించి గురువునకు నమస్కరింపవలె నని సూచింపబడినది. అట్లే మనువును - 'పెద్దలకు భక్తి విశ్వాసములతో సేవించి నమస్కరించువానికి ఆయుస్సు, ప్రజ్ఞ, కీర్తి, బలము వృద్ధినొందు' నని చెప్పెను.

† ఇందుచేఁ దెలిసికొనఁదగిన విశేష మే మనగా—మహాపురుషులకు ద్రోహముచేయఁదలచిన దుర్బలునకు స్వరూపనాశ మగును. కాన మహాపురుషులకు ద్రోహము చేయఁగూడ దని సూచితము.

† అథ తత్రత్యమునిభిః పూజితా స్సర్వ ఏవ తే
న్యవస న్సుసుఖం తత్ర స్థాణ్వాశ్రమపదే నిశి॥ ౧౬

తత్రియ స్త దాశ్రమావాసిమున్యానీతసునౌకయా
ప్రభాతే సరయూం తీర్త్వా క్రమా దేకం వనం గతాః॥ ౧౭

తదా రామో వనం ఘోరం దృష్ట్వా పప్రచ్ఛ కౌశికం
అహో గంతు మశక్యంవై కిం న్విదం దారుణం వనమ్॥
త మువాచ మహాతేజా విశ్వామిత్రో మహామునిః॥ ౧౮౹

* పురా వృత్రవధే రామ! మలేన సమభిప్లుతమ్॥
క్షుధా చైవ సహస్రాక్షం బ్రహ్మహత్యా సమావిశత్॥
౧౯-౧౯౹

---

† ఏతే నాతిథ్యభ్యాగతా స్స్వస్థానం ప్రత్యాగతా సర్వథా పూజనీయా ఇతిసూచితమ్. అన్నార్థేన వినా ధర్మపురస్కారో య ఆగచ్ఛతి సో ఽభ్యాగతః. అన్నమాత్రప్రయోజనో ఽతిథి రితి.

* నను పురా మహేంద్రస్య వృత్రాసురహననేన బ్రహ్మహత్యా సంప్రాప్తేతి కథావర్ణన మే వాసంగత మిత్యత్ర భాతి. వృత్రస్య బ్రాహ్మణత్వేపి—గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతం, ఆతతాయిన మాయాంతం

౧౬ † అనంతరము ఆయాశ్రమవాసులగు మునులచే వారలు పూజింపఁబడినవారలై యారాత్రియందు స్థాణ్వాశ్రముననే సుఖముగ నుండిరి.

౧౭ ప్రాతఃకాలమునందు మువ్వురును నా యాశ్రమవాసులచేఁ దీసికొనిరాఁబడిన పడవచే సరయూనదినిఁ దాటి క్రమముగా నొకవనమును జేరిరి.

౧౮-౧౯½ రామచంద్రమూర్తి యప్పు డాఘోర మగు నవ్వనమును జూచి విశ్వామిత్రుని బ్రశ్నించెను. ఓ విశ్వామిత్రా! నడచుటకు శక్యముకానిదియును, దారుణమైనదియు నగు నివ్వనము ఏమిటి యని రాము డడుగగా మహాతేజశ్శాలి యగు విశ్వామిత్రమహర్షి రాముని గూర్చి యివ్విధముగఁ బలికెను.

౨౦-౨౧½ *ఓ రామచంద్రా! పూర్వమునందు దేవేంద్రుడు వృత్రాసురుని సంహరించుటవలన క్షుధయును (విపరీతమైన యాకలి), బ్రహ్మహత్యయును దేవేంద్రుని నావేశించెను.

---

† 'స్థాణ్వాశ్రమవాసు లగు మునులు విశ్వామిత్రాదులను బూజించిరి యని చెప్పుటచేత, తమ స్థానములకు వచ్చిన యతిథి యభ్యాగతులను సర్వవిధములచేఁ బూజింపవలయు ననెడి ధర్మము సూచితము. అతిథి యనగా అన్నార్థమై తమతావునకు వచ్చినవాడనియు, అభ్యాగతు డనగా ధర్మకార్యమును బురస్కరించుకొని తమతావునకు వచ్చినవా డనియుఁ దెలిసికొనఁదగు.

* పూర్వమునందు వృత్రాసురుని సంహరించుటచే దేవేంద్రునకు బ్రహ్మహత్యాదోషము సంభవించె ననియు, నప్పుడు దేవతలు మహర్షులును దేవేంద్రుని బుణ్యతీర్థములయందు స్నానము చేయించిరనియు, నిచ్చట స్నానము చేయించుటచేత దేవేంద్రుని మలము అనగా పాపము నివృత్తియయ్యె ననియు, నందువలననే యీదేశమునకు మలదయను పేరు కలిగెననియు నిందు వర్ణింపఁబడినది.

త మిందర్రిం స్నాపయామాసు ర్దేవా శ్చ పరమర్షయః॥
సో ఽస్మి న్దేశే మలం త్యక్త్వా దేవః కారూశమేవచ
వృత్రాభిదోహాసంభూతం తతో హర్ష మవాప్తవాన్॥
౨౦-౨౧

హన్యాదే వావిచారయన్. ఇతి మనువచనపర్యాలోచనయా తస్య యుద్ధే నిహతత్వా దిందస్య బ్రహ్మహత్యాదోషస్తు న సంభవేదేవ. ఏవంసతి బ్రహ్మహత్యా సంభవకథాయా అసంభవే తన్నివృత్త్యుపాయకథనకథా సుతరా మసంగతేతి చేన్న.

ఉపరితనప్రమాణా న్యంగీకార్యాణ్యేవ. న తత్ర ద్వాపరః. తదనుసృత్యైవ భీష్మః పరశురామం హంతు ముద్యుక్తః. పరం త్విద మత్రవృత్రవిషయే నాస్త్వేతి. కుతో ఇంద్రస్తు వృత్రం సంగరేన హతవాన్. మిత్రద్రోహీ స స్సాతవాన్. కథ మితిచేత్—మహేంద్రస్య స్వస్యచ సంధింకారయితుం సమాగతా న్మునీ న్ప్రత్యేవ మాహ వృత్రః—భో మహర్షయః! ఆర్ద్రా చ్ఛుష్కా త్తరోః పాషాణా చ్ఛస్త్రాస్త్రవశా ద్దివా రాత్రౌ చ యథా ఽహం వధ్యో న భవేయం తథా యూయం ప్రసాదం కురుత. తథాచే త్సంధి మంగీకరో మీతి. తేఽపి తథేతి తం ప్రత్యుక్త్వా నిర్గతా వాసవాంతిక మాగత్య సర్వమపి తస్మై ప్రావదన్. త దాది మఘవాపి సుఖేన

౨౦-౨౧ దేవతలును మహర్షులును దేవేంద్రుని పుణ్యతీర్థములయందు స్నానమును జేయించిరి. బ్రహ్మహత్యవలనఁ గలిగిన మలమున్ను (పాపమున్ను), కరూశమున్ను, (యాకలియును) నచ్చటఁ దొలగిపోగా నింద్రుఁడు సంతోషమును బొందెను.

---

ఇందుపై నొక యాశంక కలుగుచున్నది. ఏమనఁగా వృత్రాసురుఁడు బ్రాహ్మణుఁడైనను గురువునుఁ గాని, బాలునిఁ గాని, వృద్ధునిఁగాని, సమస్తశాస్త్రములనుఁ జదువుకొనిన బ్రాహ్మణునిఁ గాని, శస్త్రపాణిగా తన పైకివచ్చినపుడు విచారణలేకుండగనే వానిని సంహరింపవచ్చునను మనువచనము నాలోచించినచో వృత్రాసురుఁడు యుద్ధమునందుఁ జంపఁబడినవాఁ డగుటవలన నింద్రునకు బ్రహ్మహత్యాదోష మే సంభవింపనపుడు బ్రహ్మహత్య సంభవించెనను కథయే యసంగతమగునపుడు బ్రహ్మహత్యా నివృత్త్యుపాయవర్ణనను కథ మఱియు నసంగతమని తోచుచున్నది. అని యాశంక రాగా సమాధానము వర్ణింపఁబడుచున్నది.

పై మనువచనాదిరూపమగు ప్రమాణము లంగీకరింపవలసినవే. అందున సందియము లేదు. దాని ననుసరించియే భీష్ముఁడు గురువగు పరశురామునిఁ జంపుట కుద్యమించెను. కాని యాపైప్రమాణము లీవృత్రవధవిషయమై యన్వయింపవు. ఎందువలన ననగా దేవేంద్రుఁడు వృత్రాసురుని యుద్ధమునఁ జంపియుండలేదు. మిత్రద్రోహియై చంపెను. ఎట్లనగా—దేవేంద్రునకును వృత్రాసురునకును సంధినిఁ జేయవలయు నని వచ్చిన మునీంద్రులతో వృత్రాసురుఁ డిటులఁ జెప్పెను.—ఓ మహర్షులారా! ఎండిన దానివలనను తడిసినదానివలనను చెట్టువలనను రాళ్ళవల్లను శస్త్రాస్త్రములవల్లను రాత్రియందుఁ బగటియందును నేను చావకుండ నుండులాగున మీరలు నాకు వరమిచ్చినచో మీ రాయబారమును నే నంగీకరించెద నని వృత్రాసురుఁడు పలుకగా మహర్షులు నవ్విధముగానే వరమిచ్చి యచ్చటనుండి బయలుదేరి ఇంద్రుని సమీపమునకు వచ్చి యావృత్తాంతమునంతను వానికిఁ జెప్పిరి. అది మొదలు

మలదాశ్చ కరూశాశ్చ త్యేతౌ ఖ్యాతౌ తదాదితః॥ ౨౦౻

కస్యచి త్త్వథ కాలస్య యక్షీ వై కామరూపిణీ॥
బలం నాగసహస్రస్య ధారయన్తీ తదా హ్యభూత్
ఇమౌ జనపదౌ నిత్యం వినాశయతి తాటకా॥
క్రమా ద్దేశా విమౌ రామ! మహారణ్యసమౌ స్థితౌ॥ ౨౨-౨౩౻

ఇతి తస్యవచ శ్శ్రుత్వా మునిం పప్రచ్ఛ రాఘవః॥
యక్షాస్తు దుర్బలా ఏవం లోకోక్తి ర్వర్తతే మునే!
తత్రాపి యక్షకన్యాయాః కథ మేతాదృశం బలమ్॥ ౨౪-౨౫

ఇతి పృష్టో మునిః ప్రాహ పురావృత్తం తు రాఘవమ్॥ ౨౫౻

సదాచారయుతో యక్ష స్సుకేతు ర్నామ వై పురా॥
నిరపత్య స్తప శ్చక్రే బ్రహ్మాణం ప్రతి రాఘవ! ౨౬-౨౬౻

---

స్థితః పరంతు పూర్వవైరం మనసి సంస్మర న్కదాచన సంధ్యాసమయే జలధిఫేనేన మురా ర్యధిష్ఠితేన వృత్రం హతవాన్. ఏవం మిత్రద్రోహపూర్వకహననా ద్బ్రహ్మహత్యా మహేంద్రస్య సంభభూవ. తస్మా ద్బ్రహ్మహత్యా సంభవకథా సంగ్రైవేతి జ్ఞేయమ్.

౨౧॥ అది మొదలుకొని యీ దేశములు యింద్రుని పాపరూప మగు మలము పోయినది కాన మలదమనియు, ఇంద్రుని యాకలిపోయినస్థలము కాన కరూశమనియు పేర్లతో నొప్పుచుండెను.

౨౨-౨౩॥ అనంతరము కొంతకాలమునకు స్వేచ్ఛాస్వరూపము కలదియు వెయ్యియేనుగుల బలము కలదియు నగు తాటక యను యక్షస్త్రీ యొకతె యుండెను. ఆతాటక సర్వసమృద్ధితో నొప్పుచున్న యీ మలదకరూశ దేశములను రెంటిని నిత్యము నశింపఁ జేయుచుండెను. క్రమముగ నా దేశములు రెండును తాటకచే నశింపఁజేయఁబడి యివ్విధముగ మహారణ్యములుగ నుండెను.

౨౪-౨౫॥ ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పఁగా రామచంద్రమూర్తి విని సందేహముకలిగి విశ్వామిత్రుని దిరిగి ప్రశ్నించెను. ఓ విశ్వామిత్రమహర్షీ! యక్షులు దుర్బలులనికదా వాడుక యుండెను. అందులో యక్షస్త్రీకి నిట్టి బల మెటులఁగలిగెనో చెప్పుమని యడిగెను.

౨౬॥ పైవిధముగ రాముఁడు తన నడుగగా నప్పుడు విశ్వామిత్రుఁడు రామునితో తాటకయొక్క వృత్తాంతమును మొదటినుండియుఁ జెప్పఁ నారంభించెను.

౨౭-౨౮॥ ఓరామచంద్రా! పూర్వమునందు సదాచారసంపన్నుఁడగు సుకేతుఁ డను యక్షు డొకఁ డుండెను. అతఁడు సంతానములేక సంతానముకొఱకు బ్రహ్మనుగూర్చి తపస్సును జేసెను.

---

దేవేంద్రుఁడును సుఖముగా నుండెను. కాని పూర్వవైరమునుమాత్రము దేవేంద్రుఁడు మనస్సునం దుంచుకొని యొకప్పుడు పగలు రాత్రికాని సంధ్యాసమయమున, తడిసినది కానిది యెండినదికానిదియు నగు సముద్రపు నురుగునందు విష్ణుశక్తి నావేశింపఁజేసి యా నురుగుతో వృత్రాసురుని మోసముతోఁ జంపెను. ఈప్రకారము మిత్రద్రోహపూర్వకముగాఁ జంపుటవలన దేవేంద్రునకు బ్రహ్మహత్యా దోషము సంభవించెను. ఆకారణమువలన బ్రహ్మహత్య సంభవించెననెడి కథ వర్ణనము సంగతమే యని తెలియనగును.

బ్రహ్మాఽపి తస్య తపస స్తుష్ట్వా ఽఽగత్య తదంతికమ్॥
త స్యాత్మజం త్వపరిసాద్య సహస్రగజసద్బలాం
రూపయౌవనసంపన్నా మనుజగ్రాహ పుత్రికామ్॥ ౨౭-౨౮

సుకేతు ర్ఝర్ఝరపుత్రస్య సుంద స్యాదా త్స్వకన్యకాం
తస్యాం మారీచనామాఽభూ త్పుత్రః పరమదుర్జయః॥ ౨౯

అథ కాలే గతే సుంద స్త్వగస్త్యేన హతో ఽభవత్
తద్వృత్తాంతం నిశ మ్యాశు తాటకా ప్యాత్మజాన్వితా॥
అగ స్త్యం హంతు మిచ్ఛంతీ గతా త స్యాశ్రమం మునేః
స్వపస్యోప ర్యాగతాం వీక్ష్య క్రుద్ధా ఽగ స్త్య శ్శశాప తాం॥
నరాదినీ త్వం భవతా త్సుత స్తే స్యాచ్చ రాక్షసః॥ 30-3౧½

ఇతి శప్తాతు సా యక్షీ రాక్షసీ రూప మాశ్రితా॥
ఆత్మజేన యుతా సర్వా న్వినాశయతి రాఘవ! 3౨-3౨½

పూర్వమే వాభవ త్తూర్ణం సా ద్యాతి క్రూరతాం గతా॥
త్వాం వినా ఽన్యో నిహంతుం తాం న క్షమో హి మహీతలే॥
33-33½

సేయం పంథాన మాశ్రిత్య వస త్యధ్యర్ధయోజనే॥
గోబ్రాహ్మణహితార్థాయ జ హీమాం దుష్టచారిణీం
మన్నియోగా దిమం దేశం కురు నిష్కంటకం పునః॥3౪-3౫

౨౭-౨౮ బ్రహ్మదేవుఁడును నతని తపమునకు సంతసించి వాని సమీపము నకు వచ్చి వానికి బుత్త్రి నను గ్రహింపక వేయియేనుగుల బలము కలదియు రూపయౌవనసంపన్నురాలు నగు నొకపుత్త్రిక ననుగ్రహించెను. ఆపుత్త్రికయే తాటక యని పిలువబడుచుండెను.

౨౯ సుకేతువను యక్షుఁడు తనపుత్త్రికయగు తాటకను ఝర్ఝుఁ డను వానియొక్క కుమారుడైన సుందుఁ డను వాని కిచ్చి వివాహము చేసెను. ఆసుందునివలన తాటకయందు దుర్జయుఁడగు పుత్త్రుఁడు జన్మించెను. వాఁడు మారీచు డను పేరుతో నొప్పుచుండెను.

౩౦-౩౧½ అనంతరము కొంతకాలమునకు సుందుఁడను గంధర్వుఁడు అగస్త్యునిచే సంహరింపఁబడె నని తాటక విని వెంటనే తన పుత్త్రునితోఁ గూడ నగస్త్యునిఁ జంపుటకు న మ్మునియాశ్రమమునకు వెళ్లెను. తన మీఁదికి వచ్చుచున్న యా తాటకనుఁజూచి యగస్త్యుఁడు కోపముచే నా తాటక నీ విధముగ శపించెను.—నీవు మనుష్యభక్షకురాలవై రాక్షసివి కమ్ము. మఱియు నీ కుమారుడును రాక్షసుఁడగుగాక యని శపించెను.

౩౨-౩౨½ ఈ ప్రకారముగ నా యక్షస్త్రీయగు తాటక యగస్త్యునిచే శపింపఁబడి రాక్షసరూపము నాశ్రయించి క్రూరభావము కలదియై కుమారునితోఁగూడి క్రమముగ నందఱను నశింపఁజేయుచున్నది.

౩౩-౩౩½ ఓ రామచంద్రా! ఆతాటక మొదటనే క్రూరురాలై యున్నది. శాపముచే మఱింత క్రూరత్వము కలదియై యున్నది నీకంటె నితరుఁ డెవ్వడును భూమియందు దీనిని జంపు సమర్థుఁడు లేఁడు.

౩౪-౩౫ ఆ తాటక యీ మార్గము నావరించి యామడక్రోశముల దూరమున నరణ్యమధ్యమున నున్నది. గో బ్రాహ్మణ హితముకొఱకు దుర్మార్గముగ సంచరించు తాటకను సంహరింపుము. నా యానతిచే నీ దేశము నిష్కంటకమునుగాఁ జేయుము.

న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ!
నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్॥
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా
రాజ్యభారనియుక్తానా మేష ధర్మ స్సనాతనః॥
అసత్యేన ఋతం నశ్యే ద్యదా ధర్మ స్త్వధర్మతః॥ 36-37
తదా భూపాలక స్తద్వై సమీకుర్యా న్నృపాత్మజ! 38

గోబ్రాహ్మణా న్సదా రామ! బాధతే రాక్షసీ త్వియం
ఏతాం నిహత్య గోవిప్రా న్న రక్షే ర్య ద్యఘం హి తే॥ 39

అహమ ప్యభవం రామ! పురా భూపాలశేఖరః
ధర్మా దనుభవా చ్చేదం వచ్మ్యహం తవ సాంప్రతమ్॥ 40

దుష్టనారీవధే దోషో నాస్తి రాఘవ! శాస్త్రతః
మద్వాక్యే మహతాం చాపి సంమతిం వచ్మ్యహం శ్రుణు॥41

* పురా విరోచనసుతాం మంథరాం మఘవా హనత్॥ 415

---

* ఏకదా పృథివీం హంతు మిచ్ఛన్తీం విరోచనపుత్రికాం మింద్రో హన దితి మార్కండేయరామాయణకథా ఽత్రా నుసంధేయా.

౩౬—౩౭ ఓమానవోత్తమా! నీవు స్త్రీవధవిషయమై యసహానపడనక్కఱ లేదు. ప్రజారక్షణముచేయు రాజు ప్రజారక్షణముకొఱకు పాతక మున్నను, దోష ముండినను, ఘాతుకపు పనియైనను జేయవలసినదే. రాజ్యమును భరించువారికి నెవ్విధముచే నైనను ప్రజారక్షణమును జేయుట యనునది సనాతనధర్మమై యున్నది.

౩౮ రామచంద్రా! అసత్యముచేతను సత్యమున్ను, అధర్మముచేత ధర్మ మున్ను నశించిన సమయమున రాజు వానిని దిరిగి చక్కఁపరచ వలయును.

౩౯ ఈరాక్షసి గోబ్రాహ్మణులను సదా బాధించుచున్నది. దీనినిఁ జంపి వారలను రక్షింపకపోయినచో బ్రహ్మహత్యాదిపాపము నీకు సంభవించునుసుమా!

౪౦ ఓ రామచంద్రా! పూర్వము నేనును భూమిని బరిపాలించు రాజునై యుంటిని. రాజధర్మములు నాకు తెలుసును గనుకను, అనుభవమువలనను నీకు నేను చెప్పుచున్నాను (ఇష్టమువచ్చినట్లు నేను చెప్పుట కాదని భావము).

౪౧ రామచంద్రా! దుష్టస్త్రీని జంపుటలో శాస్త్రముచే నేవిధమగు దోషమును లేదు. నేను చెప్పెడి మాటలలోఁ బెద్దల సమ్మతిని గూడఁ జూపెదను వినుము.

౪౧౺ * పూర్వమునందు దేవేంద్రుడు విరోచను డను రాక్షసుని కొమరిత యగు మంథర యను రాక్షసిని జంపెను.

---

* 'ఒకప్పుడు సర్వనాశనముచేయ సమకట్టిన విరోచనపుత్రిక యగు మంథరను దేవేంద్రుఁడు సంహరించె' నను మార్కండేయరామాయణము నందలి కథ గ్రాహ్యము.

† విష్ణుర ప్యహన త్పూర్వం భృగుపత్నీం ద్రుఢవ్రతామ్॥ ౨౧

ఇత్యధర్మరతా నార్యో నిహతాః పురుషోత్తమైః॥ ౨౧½

లోకోపద్రవకారిణ్యాః పాపిష్ఠాయా స్త్రియావధే॥
న కేవల మఘాభావమాత్రం పుణ్యం ప్రకీర్తితమ్॥ ౨౩-౨౩½

పురావృత్త మహం వచ్మి శ్రుణు రామ! త వాపరమ్॥ ౨౪

పృథి వ్యాత్మవధోద్యుక్తం పృథుం ప్రాహ పురా నృపం
స్త్రీవధే త్వం మహాపాపం కిం నరేంద్ర! న పశ్యసి॥ ౨౫

---

† దేవై స్సంపీడితానాం రక్షసాం విజయప్రాప్త్యర్థం రాక్షసగురౌ శుక్రే రుద్రం ప్రతి తపస్యతి సతి నిరీక్ష్య తదవకాశమింద్రాదయో నిశాచరా న్బాధయన్. తదా రాక్షసాస్త్వగతికాః పలాయనం కృతవంత శ్శుక్రమాతరం భృగుపత్నీం శరణం గతాః. సాపి తేషా మభయం దదౌ. తత్సమయే మహేంద్రస్తు రాక్షసా న్సంహర్తుకామః భృగ్వాశ్రమం ప్రాప్య తా న్నిహంతు మారబ్ధవాన్. తదా త మింద్రం హంతు మిచ్ఛన్తీం భృగపత్నీం శ్రీహరి స్స్వచక్రధారయా హతవానితి మత్స్యపురాణోక్తకథా ౭ త్రానుసంధేయా.

౮౨ † మఱియు పూర్వమునందు విష్ణుమూర్తియును మహాతపస్సంపన్నురా లగు భృగుపత్నిని సంహరించెను.

౮౨½ ఇవ్విధముగ నధర్మపరులైన స్త్రీలనుఁ బూర్వమునందును బురుష శ్రేష్ఠు లగు వారలు చంపిరి.

౮౩-౮౩½ రామచంద్రా! లోకోపద్రవమునుఁ జేయునట్టి పాపిష్ఠురాలగు స్త్రీనిఁ జంపుటలో కేవలము పాపము లేకపోవుటయే కాక పుణ్యముకూడ వచ్చునని చెప్పబడినది.

౮౮ ఓ రామచంద్రా! నీకు మఱియొక పూర్వవృత్తాంతమునుఁ జెప్పెదను వినుము.

౮౫ ఒకానొకప్పుడు భూదేవి సమస్తమైన యోషధులనుఁ దనయందు లీనముచేసికొనగా భూమియంతయు నిస్సారముకాగా నప్పుడు పృథుచక్రవర్తి భూదేవిని సంహరింప నుద్యుక్తుడు కాగా భూదేవి పృథుచక్రవర్తితో నిటులఁ బలికెను — 'ఓరాజా! స్త్రీహత్య మహాపాప మని నీవు ఏల విచారింపక నన్ను సంహరింపఁ బ్రయత్నించుచుంటివి?

---

† దేవతలచేఁ బీడింపఁబడిన రాక్షసులకు విజయమునుఁ గలుగఁజేయవలయు నని రాక్షసగురువగు శుక్రాచార్యుడు రుద్రునిఁగూర్చి తపస్సునుఁ జేయుచుండగా నా యవకాశమునుఁజూచి దేవతలు రాక్షసులను విశేషముగ బాధింపసాగిరి. అప్పుడు రాక్షసులు దిక్కులేనివారలై పారిపోయి శుక్రునితల్లి యగు భృగుపత్నిని శరణు జొచ్చిరి. ఆమెయును నారాక్షసుల కభయము నిచ్చెను. రాక్షసులు భృగుమహర్షి యాశ్రమమున నున్నవారని తెలిసికొని దేవేంద్రుడు రాక్షసులను సంహరించుటకు భృగుమహర్షి యాశ్రమమునకు వచ్చి యచ్చటి రాక్షసులను సంహరింప నారంభింపగా నిందురుని సంహరింప నుద్యుక్తురా లగు భృగుపత్నిని విష్ణుమూర్తి చక్రముచే నామెను సంహరించె ననెడి మత్స్యపురాణకథను గ్రహింపవలయును.

ఇత్యుక్తో పృథురప్యాహ పృథివీం ధర్మతత్పరః॥ ౪౫

ఏకస్మి న్యత్ర నిధనం ప్రాపితే దుష్టచారిణీ॥
బహూనాం భవతి క్షేమ స్తస్య పుణ్యప్రదో వధః॥౪౬-౪౬

ఇత్యుక్తే పృథునా వాక్యే ధర్మే చాపి విచారితే॥
* తాటకాయా వధే దోషో నాస్తి పుణ్యం భవిష్యతి॥
ఇత్యుక్త్వా రాఘవం సమ్య గ్విరరామ స కౌశికః॥ ౪౭-౪౮

ఇ త్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
అష్టమసర్గ స్సమాప్తః.



* అనేన ధర్మవిచారపూర్వకం తాటకాయా వధే దోషో నాస్తి. కింతు పుణ్యమేవ భవిష్యతీతి మహర్షిణా విశ్వామిత్రేణ ప్రతిపాదితం. ఇదానీంతనై రపి బహూనాం క్షేమార్థ మేకస్య హననే దోషో నాస్తీతి జ్ఞేయం. విశేషతో రాజ్ఞా జానపదరక్షణే దీక్షితే నావధ్యవధోఽపి కర్తవ్య ఇత్యపి సూచితమ్.

౪౫౹ ఈవిధముగ భూదేవి యడుగగా ధర్మపరుడగు పృథుచక్రవర్తి యా భూదేవితో నిట్లుఁ బలికెను.

౪౬-౪౭౹ ఓ భూదేవి! దుర్మార్గముగ సంచరించెడి యొకనిని సంహరించిన ననేకులకు క్షేమము కలుగును. అందువలన నా దుర్మార్గుని సంహరించుట పుణ్యప్రదము ( అని పృథుచక్రవర్తి సమాధానము చెప్పెను ).

౪౮-౪౯ * ఇవ్విధముగఁ బృథుచక్రవర్తిచేఁ జెప్పఁబడిన వాక్యమును విచారించినను, ధర్మమును విచారించినను తాటకను సంహరించుట దోషము లేక పోవుటయే కాక పుణ్యముకూడఁ గలదు. అని విశ్వామిత్రుడు రామునితో జెప్పి యూరకుండెను.

ఆశ్చర్యరామాయణమందు బాలకాండ ద్వితీయభాగమున
ఎనిమిదవసర్గము ముగిసెను.



---

* ఈ చెప్పుటచేత ధర్మవిచారపూర్వకముగ తాటకను వధించుటలో దోషము లేదనియు పుణ్యముకూడఁ గలదనియు విశ్వామిత్రుడు చెప్పిన వాక్యమును విచారించిన నిప్పటివారలును నొకని సంహరించుటవలన ననేకులకు క్షేమము కలుగునప్పుడు నొకనినిఁ జంపుట దోషము లేదని తెలియనగును. మఱియు విశేషముగ ప్రజారక్షణ దీక్షితుఁడగు రాజు వధింపఁగూడని వానినిఁ గూడ వధించి ప్రజారక్షణము చేయవలయు ననెడి ధర్మము సూచింపఁబడినది.

## నవమసర్గప్రారంభః

మునేర్వచన మాకర్ణ్య చింతయామాస రాఘవః
* స్త్రీవధం తు మహాపాపం ప్రవదంతి మనీషిణః॥
కథం హి స్త్రీవధం కుర్యాం మునేర్వచన మాశ్రితః
కరణే స్త్రీవధా త్పాప మకృతౌ గురుధిక్కృతేః॥
ద్విధాఽపి ప్రత్యవాయస్స్యాత్కింనుకార్యం మయాఽధునా॥
౧-౨½

కిం చాకృతౌ గురువచో నుల్లంఘనవశా దఘం॥
న కేవలం పితృవాక్యోల్లంఘనా చ్ఛ భవే దఘం॥ 3-3½

తస్మా ద్గురుద్వయప్రోక్తవాక్యాతిక్రమజా దఘాత్॥
తాటకాయావధోఽప్యద్య శ్రేయ ఇత్యూహ్యతే మయా॥
౪-౪½

---

* స్త్రీవధః పాపకార్య మితి రామాయణే అయోధ్యాకాండే ‘సర్వేషాం తు స్త్రియోఽవధ్యాః’ ఇతి భరతవచనేన యుద్ధకాండే మాయాసీతాహననకృత మింద్రజితం ప్రతి ‘స్త్రీహంతుర్లోకం త్వం ప్రాప్స్య’సీతి హనుమద్వచనేనచ భారతే మహాప్రస్థానే ‘మిత్రద్రోహ స్త్రియో వధ స్సమాన’ ఇతి ధర్మరాజవచనేనచ స్త్రీవధస్య మహాపాపత్వేన

# నవమసర్గప్రారంభము.

౧-౨౪ * విశ్వామిత్రుడు చెప్పిన వాక్యములను రామచంద్రమూర్తి విని తన మనమునం దిట్లు విచారింపదొడగెను. తెలిసినవారలే స్త్రీవధను మహాపాపమునుగా జెప్పుదురు. విశ్వామిత్రుని వాక్యము ననుసరించి స్త్రీహత్యను మొదటగా నెటులఁ జేయుదును ? ముని మాటల ననుసరించి స్త్రీహత్యను జేసినచో స్త్రీహత్యవలన వచ్చిన పాపమును, మునివాక్యము ననుసరింపకపోయినచో గురుతిరస్కారమువలన గలుగు పాపమును కలుగును. రెండువిధములను పాపము సంభవించునట్లుగానే యున్నది. ఇప్పుడు నే నేమి చేయవలయునని విచారించెను.

3-34 ఇదియునుంగాక మునివాక్యముచొప్పున తాటకను వధింపకపోయినచో కేవలము గురువాక్యోల్లంఘనమువలనఁ గలుగు పాపమొక్కటియే కాక పితృవాక్యము నుల్లంఘించిన పాపముకూడ సంభవించును. (అనగా విశ్వామిత్రుఁడు చెప్పిన విధముగా నడువుమని తండ్రి చెప్పినందున నిపుడు విశ్వామిత్రుని మాట విననిచో పితృవాక్యము నుల్లంఘించుట యను పాపమును సంభవించు నని భావము).

౫-౬౪ ఆకారణమువలన ( తండ్రియు గురువే కాన ) గురువులిద్దరిచేఁ జెప్పఁబడిన వాక్యముల నతిక్రమించుటవలనఁ గలిగెడి పాపమును పొందుటకంటె తాటకను వధించుటయే యిప్పుడు మంచిదని తలచెదను.

---

* స్త్రీహత్య పాపమని రామాయణముననే యయోధ్యాకాండమునందు "స్త్రీలు వధ్యులుకా"రని భరతవాక్యముచేతను, యుద్ధముకాండమున మాయాసీతను సంహరించుచున్న యింద్రజిత్తునుగూర్చి "స్త్రీహంతకుని లోకమునుఁ బొందెద"వని హనుమంతుడు చెప్పినవాక్యమువలనను, భాగతమున మహాప్రస్థానమున 'మిత్రద్రోహము స్త్రీవధయు సమానము'లని ధర్మరాజు చెప్పిన వాక్యమువలనను స్త్రీవధ మహాపాపమని పరిగణింపఁబడుచున్నందువలన, స్త్రీహత్య నే నెట్లు

కించ స్త్రియో వధే దోష స్స్యాన్నామ మమ న క్షతిః॥
గుర్వాదేశా త్కృర్వతో మే నాస్తి దోషస్తు కశ్చన
యది దోషః పితుర్వాపి గురో ర్వా సంభవే వయం॥
ఇతి సంచింత్య మనసా కౌశికం ప్రాహ రాఘవః॥ ౫-౬-౬౪

* పితు ర్వచననిర్దేశా త్తవ వాక్యేచ గౌరవాత్॥

---

పరిగణితత్వాత్ స్త్రీవధం కథం కుర్యా మితి శ్రీరామస్య సంశయసంభవ స్సమీచీన ఏవ.

ఏత త్సంశయనివృత్త్యై భగవద్గీతాపి ప్రత్యుత్తరం భవేత్. పార్థ శ్శ్రీరామ శ్చ ద్వావపి క్షత్రియావేవ. స్వధర్మ ఇతి బంధుహింసాం కరోమిచే త్పాప స్సంభవే దితి భీతః పార్థః. స్వధర్మ ఇతి స్త్రీవధ మహం కరవాణిచేత్ పాప స్సమాపతే దితి భీత శ్శ్రీరామః. తత్ర కృష్ణభగవాన్ 'స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హ'సీతి య దుపదేష్టవాన్ తదే వాత్ర విశ్వామిత్రో ప్యుపదిదేశ. రామస్తు స్వధర్మనిర్వహణం విధి రితి కృతవాన్.

* స్త్రీవధస్య పాపకార్యత్వేన నైకత్ర కథితత్వేఽపి కౌశికస్య గురుత్వేన తద్వచసో ఽనుల్లంఘనీయత్వాత్, కించ కౌశికేన య త్కథ్యతే తద్వచసో ఽవశ్యకర్తవ్యతయా స్వస్య పిత్రా నియుక్తత్వేన తద్వచనస్యా ప్యనుల్లంఘనీయత్వాచ్చ,

---

1. వాల్మీకిరామాయణమ్.

౫౬ ఇంతియేకాక స్త్రీవధలో దోష ముండినను నాకు నష్టము లేదు. ఎందువలన ననగా:—గురువు చెప్పినట్లు శిష్యుఁడు సంచరించుట శిష్యునకువిధి. కాన గుర్వాజ్ఞాప్రకారము తాటకను సంహరించు చున్న నా కెట్టిదోషమును లేదు. దోష ముండినయెడల తద్దోషము నాతండ్రిగారికిఁగాని లేక నాగురువగు విశ్వామిత్రునకుఁగాని సంభ వించును. కాని నా కుండ దని రాముఁడు మనమున నాలోచించి విశ్వామిత్రునితో నివ్విధముగఁ బలికెను.

౭౮ * ఓగురువర్యా! మాతండ్రియగు దశరథుఁడు నేను మీతో వచ్చి నప్పుడు విశ్వామిత్రమహర్షి చెప్పినప్రకారముగా సంచరింపు మని

---

చేయుదు నని శ్రీరామునకు సంశయము సంభవించుట సమీచీనమే. ఈసంశయనివృత్తికొరకు భగవద్గీతయును ప్రత్యుత్తర మగును ఎట్లన గా—అర్జునుఁడును శ్రీరాముఁడును ఇద్దఱును క్షత్రియులే. స్వధర్మ మని బంధుహింసను నేను జేసినచోఁ బాపము సంభవించు నని యర్జునుఁడు భయపడెను. స్వధర్మ మని స్త్రీహత్యను నేను జేసినచోఁ బాపము వచ్చునని శ్రీరాముఁడు భయపడెను. అచ్చట కృష్ణభగ వానుఁడు 'స్వధర్మమును విచారించి నీవుచలింపఁదగ'వని యర్జును నకు దేని నుపదేశించెనో దానినే విశ్వామిత్రుఁడును రాముని కుపదేశించెను. రాముఁడైతే స్వధర్మనిర్వహణము విధి యని యటులఁ జేయ సమకట్టెను.

* స్త్రీహననము పాప మని యనేకస్థలములయందుఁ జెప్పఁబడియుండి నను, విశ్వామిత్రుఁడు గురువుకాన నమ్మహర్షి వచన మనుల్లంఘనీయ మగుటవలనను, మఱియు విశ్వామిత్రుఁడు చెప్పిన ట్లవశ్యము ప్రవ ర్తింపు మని తాను తండ్రి యగు దశరథునిచే నియోగింపఁబడుట చేతఁ బితృవాక్య మనుల్లంఘనీయ మగుటవలనను, ఒకగురువుయొక్క

ఉరరీకృతవా నద్య నిహంతుం తాటకాం మహాం
ఇత్యుక్త్వా తాటకాస్థానం గంతుం ప్రేరితవా న్మునిమ్॥ ౭-౮
తత స్తే నిర్గతా ఘోరం తాటకావిపినం యయుః॥ ౮౻

తత్ర రామో ధనుర్మధ్యే బధ్వా ముష్టి మరిందమః॥
జ్యాఘోష మకరో త్తీవ్రం దిశ శ్శబ్దేన నాదయన్॥ ౯-౯౻

జ్యానినాదం నిశ మ్యాశు తాటకా బహి రాగతా॥
దూరా ద్ధనుర్ధరం రామం దృష్ట్వా స్వాంతే వ్యచింతయత్॥
౧౦-౧౦౻

అహో కాలస్య మాహాత్మ్యం నై తావ న్మద్వనం ప్రతి॥
పురా సమాగతో నాభూ న్నరః కశ్చిదపి ధ్రువం
అజ్ఞాత్వా మానవః కశ్చి త్ప్రవిష్టో౽పి మ మాటవీమ్॥
గతప్రాణో ౽భవ త్సద్యః మద్దర్శనవిభిన్నహృత్
న కో౽పి బహి రుత్క్రాంతో యథా ౽గ్నౌ శలభ స్తథా॥
౧౧-౧౨-౧౩

---

ఏకస్య గురో ర్వచనే స త్యనుల్లంఘనీయే గురుద్వయాను శిష్టం వచః కథ ముల్లంఘితుం శక్యత ఇతి మత్వా స్త్రీవధనిషేధే సత్యపి తాటకావధ మంగీకృతవా న్రామ ఇతి జ్ఞేయమ్.

ఇతరై రపి గురుశాసనే స త్యవిశంకయా ౽ధర్మ్యమపి తదుక్త మవశ్య మంగీకర్తవ్య మితి సూచితమ్.

చెప్పినందునను మీవాక్యమునందలి గౌరవముచేతను, నేను తాటకను సంహరించుట కంగీకరించితిని. అని రామచంద్రమూర్తి చెప్పి తాటక యున్న తావునకుఁ బోవ నమ్మునినిఁ బ్రోత్సహించెను.

౭½ అనంతరము వారందఱును బయలుదేరి భయంకరమగు తాటకా వనమునకుఁ జేరిరి.

౮-౮½ అచ్చట శత్రుసంహారకుఁడగు రామచంద్రమూర్తి ధనుర్మధ్యయందుఁ బిడికిలిని బిగించి దిక్కులన్నియు శబ్దముచేఁ బిక్కటిలునట్లు ధనుష్టంకారమునుఁ జేసెను.

౧౦-౧౦½ ఆధనుష్టంకారమును తాటక విని వెంటనే బయటికి వచ్చి దూరము నుండి ధనుర్ధరుఁ డగు రామునిఁజూచి తనమనమునం దిటుల నాలోచించెను.

౧౧-౧౩ ఏమి కాలమహిమము! ఆశ్చర్యముగా నున్నది. నిశ్చయముగ నొకనరుఁడైనను నంతపర్యంతము నావనమునుగూర్చి వచ్చినవాఁడే లేఁడయ్యెను. ఒకపక్షమునఁ దెలియక యెవ్వఁడైనను నావనమునుఁ బ్రవేశించినను, నన్నుఁ జూచినమాత్రముననే గుండెబ్రద్దలై వెంటనే ప్రాణములను విడుచును. అగ్నిలోఁబడిన మిడత బయటికి వెళ్లలేనటుల నెవ్వఁడును నానుండి తప్పించుకొని బయటికి వెళ్లినవాఁడింతదనుక లేఁడయ్యెను.

---

వచనమే యనుల్లంఘనీయమైనపుడు గురుద్వయముచేఁ జెప్పఁబడినది యెటుల నుల్లంఘింప శక్య మగునని యాలోచించి స్త్రీవధనిషేధ మున్నను రామచంద్రమూర్తి తాటకావధ నంగీకరించె నని తెలియ నగును.

ఇతరులును గురుశాసనమైనప్పుడు నిశ్శంకముగ ధర్మవిరుద్ధ మగు కార్యమైనను చేయవలయు నను ధర్మము సూచింపఁబడినది.

ఏవంసతి నరో బాలః వీతభీ ర్మద్వనం విశన్
జ్ఞాత్వాపి మద్వనం చేదం జ్యాఘోషం వితనో త్యహో! ౧౪

ఏతావ న్మమ నాభూ ద్వై సుకుమారౌదనోత్సవః
మమ భాగ్యవశా ల్లబ్ధ స్సుకుమారో ఽయ మీదృశః॥ ౧౫

ఇతి తుష్ట్వా తాటకా సా కాలమేఘనిభాకృతిః
శోణిలంబినరాంత్రాభిశోభికాంచీలసత్కటిః॥
నిర్మజ్జదక్ష్యంతరాళభ్రమత్కపిలతారకా
దంతాంతరాళగ్రథితనరాస్థిగ్రంథిశోభినీ॥
కపాలమాలికాహారసంశోభిగళసంయుతా
ఉత్తమాంగోపరివ్యాప్త గృధ్రసంసూచితమృతిః॥
గర్జంతీభీకరాకారాచాఽభిదుద్రావరాఘవమ్।౧౬-౧౭-౧౮॥
కౌశిక స్తాం సమాలోక్య చోదయామాస రాఘవమ్॥
రామ రామ! మహాబాహో సేయ మాయాతి రాక్షసీ
పాంసువర్షం శిలావర్షం కుర్వతీ తవ సమ్ముఖమ్॥
ఏతయా నిహతా నైకే మునిపుత్రా నరా స్తథా
భక్షితా శ్చ మృగా నైకే తస్మా దేనాం హన ద్రుతమ్॥
౧౯-౨౦

తదా రామోఽబ్రవీ ద్వాక్యం సౌమిత్రిం ప్రతి సుస్మితః॥౨౧॥

౧౬ ఇట్లుండ నొకమనుష్యుఁడు, అందునను బాలుఁడు (అనగా-భయపడ వలసినస్థితికలవాఁ డనిభావము.) నిర్భయుఁడై నావనమని తెలిసియు నా తావునుఁ బ్రవేశించి ధనుష్టంకారమునుఁ జేయుచుండెను. ఎంత యాశ్చర్యము ?

౧౭ కానిమ్ము. ఇంతపర్యంతము నాకు సుకుమారమగు మనుష్యుని మాంసరూప మగు భోజనము లభింపకపోయెను. నా యదృష్టమువలన నేటికి సుకుమారుఁ డగు బాలుఁడు నాకు లభ్యమయ్యెను.

౧౮-౧౯ ఈప్రకారముగ తాటక మనస్సునందు నిశ్చయించి సంతోషముతో వర్షాకాలమేఘముతోసమానమగు నాకారము కలదియై, లోపలికిపోయిన నేత్రములమధ్యయందుఁ దిరుగుచున్న పచ్చని గ్రుడ్లు కలదియై, దంతముల మధ్యయందుఁ గూర్పఁబడిన మనుష్యుల బొమికలు కలదియై, కంఠమునందు కపాలముల హారములను ధరించినదియై, శిరోభాగమునందు మూగుచున్న గద్దలచే సూచింపఁబడుచున్న మరణముకలదియై భీకరాకారముకలిగి గర్జించుచు రాముని కెదురుగఁ బరుగిడెను.

౨౦-౨౧ ఆవచ్చుచున్నతాటకను విశ్వామిత్రుఁడు చూచి రామునిఁ బ్రేరేపించెను. 'ఓరామచంద్రా! ఓరామచంద్రా! ఇదిగో రాక్షసి పాంసువర్షమును, శిలావర్షమునుఁ గురియుచు నీకు సమ్ముఖముగ వచ్చుచున్నది. ఈరాక్షసి యిదివరకనేకు లగు మునిపుత్రులను, నరులను, మృగములను హింసించెను. కాన నాలోచింపక వెంటనే సంహరింపుము' అని విశ్వామిత్రుఁడు రామునితోఁ బలికెను.

౨౨ అప్పుడు రాముఁడు చిఱునగవు నవ్వుచు లక్ష్మణునితో నిటులఁ బలికెను.

* 1 నహ్యేనా ముత్సహే హంతుం స్త్రీస్వభావేన లక్షితామ్॥
వినివృత్తాం కరో మ్యద్య హృతకర్ణాగ్రనాసికామ్
ఇతి రామస్య సౌమిత్రిం వదత స్తాటకా పునః॥
భీషయంతీ సమాయాతా తస్యోపరి మహారవా॥ ౨౨-౨౩<sub></sub>

తత స్స్వకరనిర్ముక్తశస్త్రచ్ఛిన్నమహాశయాం॥
సౌమిత్రికృత్తకర్ణాగ్రనాసికా మపి భక్షితుం
వ్యాదాయాఽస్యం సమాయాంతీం స్వస్యోపరి స రాఘవః॥

---

* నను పునః గురువచనగౌరవా త్తాటకావధం ప్రతిశ్రుత్య, స్త్రీస్వభావేన లక్షితా మేనాం న హనిష్యామీతి రామేణ కథ ముక్తమితిచే న్న. స్త్రీవధ స్సహసా న కర్తవ్యః. విరూపకరణాది స్త్రీదండనమేవ ప్రథమతః కృతంచే త్తేన చాఽతిక్రుద్ధా తాటకా స్వయమే వాతతాయి న్యాగమిష్యతి. అనంతరం హనిష్యామి. ఏవంచ 'ఆతతాయిన మాయాన్తం హన్యా దేవాఽవిచారయన్' ఇతి శాస్త్రమ ప్యనుగృహీతం భవతి. అనేన లోకాపవాదోఽపి పరిహృతో భవిష్యతి. గుర్వాజ్ఞాపి పాలితా భవతీ త్యేతదభిప్రాయే ణో క్తమితి న విరోధః. తద్వధోఽనభిమత శ్చే న్మారీచమివ తామపి వాయవ్యాస్త్రేణ దూరేపాతయేత్. తథాఽకృత్వా హస్తకర్ణనాసాచ్ఛేదనాది ముఖేనైన తాటకా రామేణ నిషూదితేతి ప్రతిపాదయిష్యతే.

---

1. వాల్మీకి రామాయణమ్.

౨౨-౨౩॥ * 'ఓలక్ష్మణా! స్త్రీస్వభావముకల యీతాటకనుఁ జంపుటకు నా కిష్టము లేదు. ముక్కునుఁ జెవులనుఁ గోసి మఱలిపోవునట్లుగాఁ జేసెదను' అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పునంతలోఁ దాటక యును బొబ్బరిల్లుచు భయమునుఁ గొల్పుచు రామునిపైకి వచ్చెను.

౨౪-౨౫॥ అనంతరము రాముఁడు తనబాణముచేఁ దాటకహస్తములను ఛేదింపగా నప్పుడే లక్ష్మణుఁడును తన శస్త్రముచే తాటకముక్కు, చెవులను ఛేదించెను. అట్లు ముక్కు, చెవులు, చేతులు ఛేదింపఁబడినదయ్యును నోరు తెఱచుకొని తాటక రామునిపైకి వచ్చుచుండగా నింక

* మీపెద్దల మాటయందుండు గౌరవముచే నేను తాటకనుఁ జంపుట కంగీకరించితి నని రామచంద్రమూర్తి విశ్వామిత్రునితోఁ బ్రతిజ్ఞా పూర్వకముగఁ జెప్పి యిప్పుడు తిరిగి తాటకనుఁ జంప నని లక్ష్మణు నితో రాముఁడు చెప్పుట యసంగతముగా నుండెనని యాశంక రాగా సమాధానము చెప్పఁబడుచున్నది.

స్త్రీహత్య శీఘ్రముగఁ జేయఁగూడదనియు, స్త్రీలకు విధింపఁబడిన విరూపకరణాదిదండనము ముందుగఁ జేసినచో వికారరూపము నొందుటచే తాటకయే స్వయముగ నాతతాయినియై (అనగా, శస్త్ర పాణియై) పైకి రాగలదనియు, అనంతరము దానిని జంపవచ్చు ననియు నిటులఁ జేయుటచే 'శస్త్రపాణియై సంహరించుటకు పైకి వచ్చువానిని విచారింపకయే చంపవచ్చు' ననెడి మనుధర్మశాస్త్రము ననుగ్రహింపఁబడుననియు, దీనిచే లోకాపవాదముకూడ తొలఁగు ననియు, గుర్వాజ్ఞయును బరిపాలింపఁబడినది యగుననియు ననెడి యభిప్రాయము చేత రామునిచే నటులఁ జెప్పబడినది. కాన విరోధము లేదని తెలియనగును. తాటకావధయే రామున కభిమతముకానిచో మారీచునివలె తాటకనుగూడ వాయవ్యాస్త్రముచేత దూరముగాఁ బడవేయును. అట్లుచేయకుండ హస్తకర్ణనాసాదిచ్ఛేదనద్వారా తాట కను రాముఁడు చంపునటులఁ జెప్పఁబడును.

శరేణోరసి వివ్యాధ సా పపాత వ్యసుః క్షితౌ॥ ౨౮-౨౫

చచాల వసుధా కృత్స్నా తదద్భుతమివాభవత్॥
కిం చార్ధక్రోశపర్యంతసంస్థితా స్తరవ స్తదా
తాటకావపుషా తత్ర చూర్ణితాః పతితా భువి॥ ౨౬-౨౭

తతో௨తిసుందరీ యక్షీ సర్వాభరణభూషితా
శాపా త్తిరశ్చతాం ప్రాప్తా ముక్తా రామప్రసాదతః॥
నత్వా రామం పరిక్రమ్య గతా రామాజ్ఞయా దివమ్॥
౨౮-౨౮౫

తదా రాఘవకారుణ్యం తుష్టావ మనసా మునిః॥
అహో రామం వినా కం వా వ్రజేయం శరణం పరం
తాటకాయై స్వర్గతిం చ దదౌ పతితపావనః॥ ౨౯-౩౦

తదా దేవా విమానస్థా స్సిద్ధా శ్చ పరమర్షయః
దుష్కరం రామకార్యం తు దృష్ట్వా ప్రీతి ముపాగతాః
సంశ్లాఘ్య నైకథా రామం వవర్షుః కుసుమాన్యపి॥ ౩౧౫

మిథో దేవా మునిం సద్య స్సమాహూ యాబ్రువ న్వచః॥
భృశాశ్వపుత్రా న్దివ్యాస్త్రా న్రామా యార్పయ కౌశిక!
నహ్యేతస్మా త్పాత్రభూత స్త్వపరో దృశ్యతే క్షితౌ॥

నుపేక్షింపఁగూడదని రామచంద్రమూర్తి వెంటనే యొక బాణమును తాటకవక్షస్థలమునందు నాటునట్లు వేయగా వెంటనే తాటక విగత ప్రాణయై భూమియందుఁ బడెను.

౨౬–౨౭ భూమియంతయు చలించెను. అది గొప్ప యాశ్చర్యముగా నుండెను ఇదియునుం గాక యర్ధక్రోశపర్యంత ముండెడి చెట్లన్నియు తాటకయొక్క శరీరము క్రిందఁబడి చూర్ణములై భూమియందుఁ బడిపోయెను.

౨౮–౨౮½ పూర్వము మునిశాపముచే రాక్షసీభావము నొందిన తాటక రామానుగ్రహముచే శాపవిముక్తురాలై దివ్యరూపమును, దివ్యతేజమును ధరించి సర్వాభరణభూషితురాలై రామచంద్రమూర్తికి నమస్కారించి స్తుతించి రాముని యానతిచే స్వర్గమున కేగెను.

౨౯–30 అప్పుడు విశ్వామిత్రమహర్షి రాముని కరుణారసము ననేక విధములుగ స్తుతించెను. ఏమనగా– ఇంతఘోరకృత్యములనుఁ జేసిన తాటకకుఁగూడ రామచంద్రమూర్తి యుత్తమగతినిఁ గలుగఁజేసెను గదా! ఎంత యాశ్చర్యముగా నున్నది. ఇట్టి దయామయుఁ డగు రాముని విడిచి నే నెవనిని శరణుఁబొందెదను. అనగా– నే నితరుని శరణుఁ బొంద నని భావము

30–30½ అప్పుడు దేవతలు సిద్ధులు మహర్షులు నాకాశమున విమానములయందున్నవారలై యితరులచేఁ జేయశక్యముకాని రాముఁడు చేసిన తాటకావధరూప మగు దుష్కరకార్యమును జూచి సంతోషము నొందిరి మఱియు రామచంద్రమూర్తి ననేకవిధములుగ స్తవముచేసి పుష్పవర్షమును గూడ గురిపించిరి.

3౨–33 రహస్యముగా దేవతలు విశ్వామిత్రుని బిలిచి యివ్విధముగఁ జెప్పిరి. ఏమన– ఓవిశ్వామిత్రమహర్షీ భృశాశ్వమహర్షి పుత్రులు లోకోపకారార్థమై దివ్యాస్త్రరూపకములు కాగా వానిని నీవద్ద నిదివరలో దాచియుంచితిమి. వాని నుపదేశించుటకు పాత్రుఁడు

కిం చాస్మదభివాదం చ రాఘవాయ నివేదయ
ఇత్యుక్తశ్చ మిథో దేవై స్తథే త్యాహ స కౌశికః॥ 3౭-3౪

విశ్వామిత్రో౽థ సంహృష్ట స్సమాహూయ తు రాఘవం
బ్రహ్మాస్త్రం కాలచక్రం చ విష్ణుచక్రం విధే శ్శిరః॥
దండచక్రం పాశుపత మస్త్రం నారాయణాభిధం
పర్జన్య మైంద్రం వాయవ్య మాగ్నేయం వారుణం తథా॥
భృశాశ్వపుత్రదివ్యాస్త్రజాలం చాపి సమంత్రకం
సరహస్యం రాఘవాయ విధి నోపదిదేశ సః॥ 3౫-3౭

తన్మంత్రజాలే రామేణ సకృ దుచ్చారితే సతి
తన్మంత్రదేవతాః కాశ్చి చ్చంద్రార్క–నిభ తేజసః॥ 3౮
కాశ్చి దగ్నినిభాః కాశ్చి ద్ధూమవర్ణా స్సుతేజసః
సాక్షా దుద్భూయ ప్రాంజలయ స్తదా రాఘవ మబ్రువన్॥ 3౯

రామచంద్ర! వయం తుష్టా స్సకృజ్జపనశేన తే
అస్మాభిః కరణీయం తే కార్య ముక్త్వా ప్రసీద నః॥ ౪౦

త్వత్కృతోపాస్తితో౽స్మాకం వీర్యం నష్టం భవే ద్ధ్రువం
తస్మా న్మాభజ నో రామ! భవేమ తవ సేవికాః॥
ఇతి తత్తన్మంత్రదేవై రర్థితో రాఘవో౽బ్రవీత్॥ ౪౧-౪౧½

రాముఁడు కాన నాయస్త్రములను రామచంద్రమూర్తి కుపదేశింపుము. భూతలమునందింతకంటె పాత్రుఁడు మఱియొకఁడు కన్పడఁడు. మఱియు, మేము రావణసంహార మగునంతదనుక రామచంద్రమూర్తితో సంభాషణము చేయ వీలులేదు. కాన మా యభివందనములను గూడ రామచంద్రమూర్తితో నీవే తెలియఁ జేయు మని దేవతలు చెప్పగా విశ్వామిత్రుఁడు నవ్విధముననే చేయుదు నని దేవతలతోఁ జెప్పెను.

౩౫-౩౭ అనంతరము విశ్వామిత్రుఁడును సంతసముతో రామునిబిలిచి సమస్తమంత్రముల నుపదేశించెను. అవియేవన- బ్రహ్మాస్త్రమును కాలచక్రమును విష్ణుచక్రమును బ్రహ్మశిరోనామకాస్త్రమును దండచక్రమును పాశుపతాస్త్రమును నారాయణాస్త్రమును పర్జన్యాస్త్రమును నైంద్రాస్త్రమును వాయవ్యాస్త్రమును ఆగ్నేయాస్త్రమును వారుణాస్త్రమును భృశాశ్వపుత్రు లగు దివ్యాస్త్రములను సమంత్రకముగ సరహస్యముగ విధిపూర్వకముగ రామున కుపదేశించెను.

౩౮-౩౯ ఆమంత్రసమూహము నొకపర్యాయము రామచంద్రమూర్తి యుచ్చరించుటతోడనే మంత్రదేవతలు కొందఱు సూర్యచంద్రులతో సమానమగు నాకారముకలవారలై మఱికొందఱు అగ్ని తేజస్సుతో సమాన మగు తేజస్సు కలవారలై మఱికొందఱు ధూమవర్ణముతో సమాన మగు ఆకారము కలవారలై రామునకు ప్రత్యక్షమై చేతులు జోడించి రామునితో నివ్విధముగఁ బలికిరి.

౪౦ ఓ రామచంద్రప్రభూ! నీవు ఒకపర్యాయము మమ్ములను స్మరించుటచేతనే మంత్రదేవతల మగు మేము ప్రసన్నులమైతిమి. మావలన గాఁదగినకార్య మేదియో చెప్పి మమ్ముల ననుగ్రహింపుము.

౪౧-౪౧½ ఓ రామచంద్రా! నీవు విశేషముగ మమ్ముల నుపాసన చేసినచోఁ మాశక్తియంతయు నష్టమగును. ఆకారణమువలన మమ్ముల నీ విక యుపాసింపకుము. మేమందరము నీకే సేవకులముగా నుందుము. అని మంత్రదేవతలు రాముని ప్రార్థింపగా రామచంద్రమూర్తి యామంత్రదేవతలతో నిటుల బలికెను.

మత్కార్యసమయే యుష్మా న్స్మరిష్యామి తదా ఽగతాః॥
కుర్వంతు మమ సాహాయ్యం గచ్ఛం త్వద్య యథేప్సితమ్
ఇతి రామసమాజ్ఞప్తాః మంత్రిదేవా స్తిరోహితాః॥ ౪౨-౪౩

విశ్వామిత్రానుమత్యైవ సర్వాస్త్రా న్రాఘవ స్తతః
లక్ష్మణా యాదిశ త్సద్య స్సుప్రీతే నాంతరాత్మనా॥ ౪౪

తాటకాయా వనే తస్మి న్విశ్వామిత్రాదయ స్త్రయః
* ఉషిత్వా రజనీం ప్రాత ర్నిర్గతా వామనాశ్రమమ్॥ ౪౫

ఇతి ఆశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
నవమ స్సర్గ స్సమాప్తః.

---

* వామనాశ్రమమితి — వామనాశ్రమస్యైవ సిద్ధాశ్రమ ఇతి నామాంతర మితి జ్ఞేయమ్ పూర్వ మనేకయుగపర్యతం నిష్ఠయా ఽత్ర విష్ణు స్తప శ్చకార. విష్ణో స్తపఃకారణం కిమితి చే ల్లోకా న్ప్రవర్తయితుమేవ నాన్యత్. విష్ణురేవ తప శ్చకార, వయం తపః కుర్మ శ్చే త్కియ త్ఫలం భవేదితి లోకాః ప్రవర్తంత ఇతి. సతు బదరీనారాయణఇవాఽత్రాపి తప శ్చకార. తత్ర తప స్తు న కై రపి జ్ఞాతమ్. అత్రతు సర్వై రపి జ్ఞాయత ఇత్యాశయేన విష్ణురూపేణ వామనరూపేణ చ తప శ్చకార. తస్మాదే వాస్య వామనాశ్రమ ఇతి నామాగతమ్. అత్ర తపస స్సిద్ధిప్రదత్వా త్సిద్ధాశ్రమ ఇత్యయం వ్యవహ్రియతే.

౪౨-౪౩ ఓమంత్రదేవతలారా! నాకు పనిపడినపుడు మిమ్ములను నేను స్మరించెదను. అప్పుడు మీరలు వచ్చి నాకు సాహాయ్యమును జేయుదురుగాక! ఇప్పుడు మీరలు యథేష్టముగ వెళ్లుడని రామచంద్రమూర్తి మంత్రదేవతలతోఁ జెప్పఁగా రాముని యానతిచే మంత్రదేవత లంతర్ధానమొందిరి.

౪౪ అనంతరము రామచంద్రమూర్తి విశ్వామిత్రుని యనుమతిమీఁద సమస్తమైన యస్త్రములను సంతుష్టాంతరంగముతో లక్ష్మణున కుపదేశించెను

౪౫ * విశ్వామిత్రుఁడు మొదలగువారు ముగ్గురును తాటకావనమునందుండి ప్రాతఃకాలమున వామనాశ్రమమునకు బయలుదేరిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమున
నవమసర్గము సమాప్తము.

---

* (వామనాశ్రమము) వామనాశ్రమమునకే సిద్ధాశ్రమ మని నామాంతర మని యెఱుఁగనగును. పూర్వము అనేకయుగముల పర్యంతము విష్ణుమూర్తి యిచ్చట నిష్ఠతోఁ దపమును జేసెను. విష్ణుమూర్తి తపస్సుచేయుటకుఁ గారణ మేమనగా జనులను తపస్సునందుఁ బ్రవర్తింపఁ జేయుటకే కాని వేఱొండు కారణము కానరాదు. విష్ణుమూర్తియే తపమును జేసెనే మనముకూడా తపస్సును జేసినచో నెట్టి ఫలము కలుగునోకదా యని లోకులు ప్రవర్తించెద రని బదరీనారాయణమునందువలె నిచ్చటను దపమునుఁజేసెను. 'అచ్చటఁ దపము ఎవ్వరికిఁ దెలియదు. ఇచ్చటనైతే యందఱిచేతను దెలియఁబడును' అనెడి యాశయముచే విష్ణురూపముతోను, వామనరూపముతోఁ గూడ శ్రీహరి తపము నిచ్చటఁజేసెను. ఆ కారణమువలననే వామనాశ్రమ మని పేరు వచ్చెను. ఇచ్చట తపస్సు సిద్ధినిచ్చునది కావున సిద్ధాశ్రమ మనియు వ్యవహరింపఁబడుచున్నది.

## దశమసర్గప్రారంభః

నానాద్రుమలతాకీర్ణం నానాపుష్పోపశోభితం
నానానిర్ఝరతోయాఢ్యం వింధ్యశైలాంతరస్థితం॥
శాకమూలఫలోపేతం మహర్షిజనసేవితం
సిద్ధాశ్రమం సంనిరీక్ష్య మునిం పప్రచ్ఛ రాఘవః॥ ౧-౨
కస్యాయమాశ్రమః కుత్ర వధ్యా యాగవిఘాతినః
యజ్ఞక్రియా మయా కుత్ర రక్షణీయా మునే! వద॥ ౩
ఇతి రామేణ సంపృష్టో కౌశికోఽప్యాహ రాఘవమ్॥ ౩½

X॥ ఇహ హి దేవవరో విష్ణు తపశ్చరణాయ బహుకాలం వసతి సతి వైరోచని రింద్రాదీ న్నిర్జి త్యాక్రాంత త్రిభువనో మహాంతం యజ్ఞ మారబ్ధవాన్. తదా దేవై రస్య యాచకేభ్య స్సర్వకామదాతు రసమాప్తే క్రతౌ మాయాయోగేన వామనత్వం గతో ఽస్మత్కార్యం కుర్వితి ప్రార్థితో విష్ణు రనేకవర్షతపశ్చర్యాపూర్వక మదిత్యాసహ కాశ్యపకృతస్తుత్యా సంతుష్టః, ఉపేంద్రావతారేణ దేవ సాహాయ్యాచరణరూపం వరం ప్రదాయ వామనరూపే ణాదిత్యా మవతీర్ణో బలిం త్రి క్రమా న్భిక్షిత్వా మానేన త్రీ న్లోకా నాక్ర మ్యేంద్రాయ స్వర్గరాజ్యం దదౌ. అస్య వామన స్యాయ మాశ్రమః. అత్రైవ యజ్ఞవిఘ్నకరా రాక్షసా నిహంతవ్యా ఇతి వద న్రామేణ సహ సిద్ధాశ్రమం కౌశికః ప్రావిశత్॥ ౪

## దశమసర్గ ప్రారంభము.

౧–౨ * అనేకములగు ఫలవృక్షములతోడను లతలతోను వ్యాప్తమైనట్టియు ననేకములగు కొండగొరియల జలముతో నిండినట్టియు, వింధ్య పర్వతమధ్యమం దున్నట్టియు, కందమూలఫలాదులచే సమృద్ధి కలిగినట్టియు, మహర్షి జనులచే సేవింపఁబడినదియు నగు సిద్ధాశ్రమమును రామచంద్రమూర్తి చూచి విశ్వామిత్రుని నివ్విధముగఁ బ్రశ్నించెను.

3–3౪ ఓవిశ్వామిత్రమహామునీ! ఈ యాశ్రమ మెవరిదై యుండును? నీయాగమునకు విఘాతమునుఁజేయు రాక్షసుల నెచ్చటఁ జంపవలసి యుండును? నేను నీయాగము నెచ్చట రక్షింపవలసియుండెను? అని పైవిధముగ రాముఁ డడుగగా విశ్వామిత్రుఁడు రామచంద్ర మూర్తితో నివ్విధముగఁ జెప్పఁదొడగెను.

౪ ఓరామచంద్రా! పూర్వ మిచ్చట విష్ణుమూర్తి చిరకాలము తపస్సునుఁ జేసెను. ఆకాలమున బలిచక్రవర్తి యింద్రాదులను జయించి ముల్లోకములను వశము చేసికొని గొప్పయజ్ఞమునుఁ జేయ నమకట్టెను. అప్పుడు దేవతలు విష్ణుమూర్తి నీవిధముగఁ బ్రార్థించిరి. ఏమన— ఓశ్రీహరీ! యాచకుల యభీష్టములను సఫలము గాఁ జేయుచున్న యీ బలిచక్రవర్తి తలపెట్టిన యజ్ఞము సమాప్తము కాకపూర్వమే మాయాయోగముచే వామనరూపమునుఁబొంది మా దేవకార్యమునుఁ జేయుమని దేవతలు విష్ణుమూర్తినిఁ బ్రార్థించుటచేతను, మఱియు అదితితోఁగూడ కశ్యపుఁడు చిరకాలము విష్ణుమూర్తినిగూర్చి పుత్రార్థియై తపమును స్తోత్రములనుఁ జేసియుండుటచేతను విష్ణుమూర్తి సంతోషించినవాఁడై యుపేంద్రుఁడనుగా నవతరించి దేవసాహాయ్యమునుఁ జేసెదనని దేవతలకు వరమిచ్చి వామనరూపముచే నదితికశ్యపుల కవతరించి బలిచక్రవర్తిని మూడడుగుల భూమిని యాచించి ముల్లోకములను త్రివిక్రమావతారముచే నాక్రమించి స్వర్గరాజ్యమును దేవేంద్రున కిచ్చెను. రామచంద్రా! ఆవామనుని యాశ్రమమే యిది. ఇచ్చటనే యాగవిఘాతకు లగు రాక్షసులను సంహరింపవలసియున్నది. అని రామునితోఁ జెప్పుచు విశ్వామిత్రుఁడు సిద్ధాశ్రమమునుఁ బ్రవేశించెను.

కౌశికే నాథ సందిష్టా స్సిద్ధాశ్రమనివాసినః॥
చక్రు ర్మహార్ఘయ స్తత్రపూజాం రాఘవయో ర్ద్రుతమ్॥ ౫

బోధయిత్వా రాఘవయోః కర్తవ్యంతు విశేషతః
తత శ్చారబ్ధవా న్యాగం విశ్వామిత్రో మహాతపాః॥ ౬

దీక్షాం ప్రవిష్టే చ మునౌ విశ్వామిత్రే మహాత్మని॥
యజ్ఞే తు వితతే రామం ప్రాబ్రువ న్నృత్విజ స్తదా॥ ౭

రామచంద్ర! ముని ర్దీక్షాం మౌనం చాపి గతో ఽధునా॥
భవాం స్తు షడహోరాత్రం జాగరూకో ఽవతు క్రతుమ్॥ ౮

తథైవే త్యురరీకృత్య రామ స్సౌమిత్రిణా సహ॥
క్రతుం ధనుర్ధరో ఽనిద్రో రరక్ష పంచరాత్రికమ్॥ ౯

సమాగతే షష్ఠదినే మధ్యాహ్నే కామరూపిణౌ
వర్షంతౌ రుధిరాస్థీని దృష్ట్వా రామేణ రాక్షసౌ॥
మారీచ శ్చ సుబాహు శ్చ యజ్ఞవిఘ్నకరౌ తదా॥ ౧౦-౧౦౪

రాఘవో ధను రాదాయాఽకృష్యాఽకర్ణాంత ముత్తమం॥
ఆగ్నేయ మస్త్రం వాయవ్యం చాపే సంధాయ ముక్తవాన్॥
౧౧-౧౧౪

తయో ర్వాయవ్యరూపో ఽస్త్రో మారీచం శతయోజనమ్॥
నీత్వా ఽబ్ధౌ పాతయామాస ద్వితీయో ఽగ్నిమయశ్శరః॥
సుబాహుం నామరూపాభ్యాం విహీనం కృతవా నహో॥
౧౨-౧౩

౫ అనంతరము విశ్వామిత్రునిచే నాజ్ఞాపింపఁబడినవారలై సిద్ధాశ్రమ నివాసు లగు మహర్షులు రామలక్ష్మణులకు నర్ఘ్యపాద్యాదులచేఁ బూజలు సల్పిరి.

౬ మహాతపస్సంపన్నుఁ డగు విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ జేయఁదగిన కార్యక్రమమును బోధించి యనంతరము యాగదీక్షలోఁ బ్రవేశించెను.

౭ మహాత్ముఁ డగు విశ్వామిత్రుఁడు యాగ దీక్షయందు ప్రవేశింపగా యజ్ఞము సాగుచుండగా నచ్చటి ఋత్విక్కులు రామునితో నివ్విధముగఁ బలికిరి.—

౮ ఓ రామచంద్రా! విశ్వామిత్రమహర్షి యాగదీక్షను, మౌనమునుఁ బొంది యుండెను. నీవు ఆరుదినములు జాగరూకుడవై క్రతువును రక్షింపుము (అని ఋత్విక్కులు రామునితోఁ జెప్పిరి).

౯ రామచంద్రమూర్తియు నాలాగే నని యంగీకరించి లక్ష్మణునితోఁ గూడ ధనుర్బాణములను ధరించి జాగరూకుఁడై యైదుదినములు క్రతువును రక్షించెను.

౧౦-౧౦½ ఆఱవదినమున మధ్యాహ్నసమయమందు కామరూపు లగు సుబాహు మారీచు లను రాక్షసులు రక్తమాంసములను వర్షించుచు యాగమునకు విఘాతమునుఁ జేయుటకు రాగా, రాముడా రాక్షసులనుఁ జూచెను.

౧౧-౧౧½ అప్పుడు రామచంద్రమూర్తి యాకర్ణాంతము ధనుస్సు నాకర్షించి యాధనువునందు వాయువ్యాస్త్రమును నాగ్నేయాస్త్రమును సంధించి విడిచెను.

౧౨-౧౩ ఆయస్త్రములలో వాయువ్యాస్త్రము మారీచునినూరామడదూరము నకుఁ దీసికొనిపోయి సముద్రమునందుఁ బడవేసెను. రెండవదియైన యాగ్నేయాస్త్రము సుబాహుఁ డను రాక్షసుని నామరూపవిహీను నిగాఁ జేసెను- అనగా భస్మముచేసె నని భావము.

తయో రనుచరా న్సర్వా న్హత్వా న్లక్ష్మణ స్తదా
కేచిత్పలాయితాస్సద్యో రావణాయన్యవేదయన్॥ ౧౪

తదా ఽమరా శ్చ సంతుష్టా స్స్మై రామ మవాకిరన్
కించ దుందుభయో నేదు స్తుష్టువుః పరమర్షయః॥ ౧౫

1 విశ్వామిత్రో౽పి బ్రహ్మేష్టిం సమాప్య విధినా తతః॥
విధా యావబృథస్నానం సంపూజ్య మునిపుంగవాన్॥
నివేశ్య రాఘవం స్వాంకే త మాలింగ్య పునఃపునః
పులకాంకితగాత్రో౽భూ దానందాశ్రుయుతేక్షణః॥
స్వం కృతార్థం చ మన్వానో కౌశికః ప్రాహ రాఘవమ్॥
౧౬-౧౭½

త్వన్మూలతో మత్క్రతు స్తు రామ! పూర్తిం గతో౽భవత్॥
కృతార్థో ఽహం తవ స్నేహా ద్ధన్యో ఽహం త్వత్ప్రసాదతః॥
౧౮-౧౮½

ఇతి స్తుత్వా స సౌమిత్రిం రామం పక్వఫలాదిభిః॥
భోజయి త్వేతిహాసై స్తం తోషయ న్కౌశికో ఽవసత్॥
౧౯-౧౯½

ఇతి సూతముఖే నోక్తాం కథాం శ్రుత్వా మహర్షయః॥
కించి త్సందిగ్ధచిత్తా స్తే పప్రచ్ఛు రోమహర్షణం॥ ౨౦-౨౦½
రోమహర్షణ సర్వజ్ఞ మారీచో నామ రాక్షసః॥
శతయోజనదూరే ఽబ్ధౌ పాతితో రాఘవేణ హి॥ ౨౧-౨౧½

1. కవిః.

౧౪ అప్పుడు లక్ష్మణుడు మిగిలినరాక్షసులను హతముచేసెను. కొందఱు పాఱిపోయి యీవృత్తాంతమును రావణున కెఱిగించిరి.

౧౫ అప్పుడు దేవతలు సంతోషించినవారలై రామునిమీద పుష్పములను జల్లిరి. ఇంతియే కాదు. దుందుభులను మ్రోగించిరి. మహర్షులు స్తోత్రములఁ జేసిరి.

౧౬-౧౭½ విశ్వామిత్రుఁడును యథావిధిగా యాగమునుఁ బూర్తిచేసి యవభృథస్నానమునుఁ జేసి మునిశ్రేష్ఠులనుఁ బూజించి యనంతరము రామచంద్రమూర్తినిఁ దన తొడయందుఁ గూర్చుండఁబెట్టుకొని మాటిమాటికి యాలింగనమును చేసికొనుచు రోమాంచిత మగు శరీరముకలవాఁడై, యానందబాష్పములతో నిండిన నేత్రములు కలవాఁడై తనకంటె కృతార్థుఁడు మఱియొకఁడు లేఁడని తలచుచు రామచంద్రమూర్తితో నిట్లనియె ఁబలికెను.

౧౮-౧౮½ ఓ రామచంద్రా! నా యాగము నీవలన సంపూర్తినిఁ జెందెను. కొన్ని దినములనుండి నీతోఁ గలిసియుండుటఁవలన నేను కృతార్థుఁడ నైతిని. నీ యనుగ్రహమువలన నేను ధన్యాత్ముఁడ నైతిని.

౧౯-౧౯½ ఈవిధముగ విశ్వామిత్రుడు లక్ష్మణసహితుఁ డగు రామచంద్రమూర్తిని స్తుతించి పక్వఫలాదులను వారిచే భుజింపఁజేసి యితిహాసములఁ జెప్పుచు రామలక్ష్మణులను సంతోషపెట్టుచుండెను.

౨౦-౨౦½ పైవిధముగ సూతుఁడు చెప్పినకథను శౌనకాదిమహర్షులు వినినవారలై యా సూతుని నిట్లనియెఁ బ్రశ్నించిరి.

౨౧-౨౨ ఓ రోమహర్షణుఁడా! ఓ సర్వజ్ఞుఁడా! రామచంద్రమూర్తి మారీచుఁడను రాక్షసుని నూరామడదూరమున సముద్రములోఁబడవేసి నట్లు చెప్పియుంటివి. ఆమారీచుఁడు జీవించినాఁడా? మృతిపొందెనా?

స తు మారీచనామా ఽసౌ జీవితో వా మమార వా
తదనంతరవృత్తాంతం శ్రోతుకామా వయం స్థితాః॥
తద్వృత్తం సూక్ష్మత స్తూక్త్వా పశ్చా ద్రామకథాం వద॥
౨౩-౨౪

సూతః—

కథాం భగవత శ్శ్రుత్వా తర్తుం శక్యో భవార్ణవః॥
న రాక్షసకథాభాగశ్రుతే స్తర్తుం న శక్యతే॥
తథాపి రామచ్చరితే మారీచో మూలకారణమ్
యతో భవే దత స్తస్య వృత్తం కించి ద్బ్రవీ మ్యహమ్॥
౨౫-౨౬

మారీచానుచరః పశ్చా త్కరాళో నామ రాక్షసః॥
స్వప్రభుం తు విచిన్వాన స్సింధుతీర ముపాగతః॥ ౨౭

సింధుతీరేతు పతితం కిరీటం స్వప్రభోః పునః
నిరీక్ష్య కరవాలంచ మార్గయం స్తం చచార సః॥ ౨౮

శ్రీరామచంద్రనిర్ముక్తశరరఘుంఝానిలేన తు
సముద్రే పాతితం కంఠగతప్రాణసమన్వితం॥
వార్ధికల్లోలసంఘాతనీతతీరభువం తతః
విశీర్ణసంధిబంధం చ సమాకీర్ణశిరోరుహం॥
శైవాలఫేనపిహితప్రతీకం సింధుతీరగం
మారీచం వీక్ష్య చాఽలింగ్య కరాళో ముదితో ఽవదత్॥
౨౯-౩౦

వాని యనంతర వృత్తాంతమును వినవలయు నని కోరికతో మే ముండుటవలన ముందుగ మారీచుని యనంతరవృత్తాంతమును సూక్ష్మముగఁ జెప్పి యనంతరము రామకథనుఁ జెప్పు మని మహర్షులు సూతుని బ్రశ్నించిరి.

సూతుఁడు చెప్ప నారంభించెను.—

౨౪-౨౫ ఓమహర్షులారా! భగవత్కథను శ్రవణము చేసిన సంసారసముద్రమును దాట శక్యమగును కాని రాక్షసకథాశ్రవణముచే సంసారసాగరము తరింప శక్యముకాదు. కాని, రామచరితమున మారీచుఁడు కూడ మూలకారణము కాన వానివృత్తాంతమునుఁ గొంచెముగఁ జెప్పెదను. విను డని చెప్ప నారంభించెను.

౨౬ ఓమహర్షులారా! రామచంద్రమూర్తి మారీచుని దూరముగ పడవేసిన యనంతరము మారీచుని యనుచరుఁడగు కరాళుఁడను రాక్షసుఁడు తన ప్రభువగు మారీచుని వెదకుచు సముద్రతీరమునకు వచ్చెను.

౨౭-౨౮ సముద్రతీరమునందుఁ బడియున్న మారీచుని కిరీటమును చేతికత్తిని కరాళుఁడు చూచి మారీచుని వెదకుచు నచ్చట సంచరించుచుండెను.

౨౯-౩౦ ఇట్లు కరాళుఁడు నచ్చటచ్చట సంచరించుచుండగా, శ్రీరామచంద్రుని బాణవేగముచే సముద్రమున బడవేయఁబడి సముద్రతరంగములచే నొడ్డుకు కొట్టుకొనిరాబడి సంధులు విడిపోయి కేశములు వ్రేలాడుచు నాచుచేతను నురుగుచేతనుఁ గప్పబడిన శరీరముకలిగి సముద్రతీరమునందు బడియున్న మారీచునిఁ గరాళుఁడు చూచి యాలింగనము చేసికొని సంతసముతో మారీచునితో నిటుల బలికెను.

1 అహో భాగ్యం తవ శ్లాఘ్యం పూర్వపుణ్యవశా ద్భవా౯
రామబాణాద్విముక్తోఽసి ధ్రువమ్మృత్యుముఖాదివ॥
ఇతః పరం తు మారీచ! చిరంజీవ సుఖీ భవ॥
ఇత్యాత్మభృత్యవినుతో మారీచ స్త్వాహ తంశనైః॥ ౩౧-౩౨

త్వయా సంభాషితుం శక్తి ర్నాస్త్యథాపి బ్రవీమ్యహం
అవిదిత్వా సమగ్రం త్వం కరాళ స్తౌషి మాం వృథా॥
మదవస్థా వర్ణయితు మశక్యాఽనుచర! ధ్రువం॥ ౩౩-౩౩½
లోకే నైకే ప్రవీరా స్తు దృష్టపూర్వా మయాఽసకృత్॥
పరం తు రామసంకాశో ధన్వీ దృష్టో న హి క్షితౌ॥ ౩౪-౩౪½

కరాళ రామచంద్రస్య తద్ధనుఃకౌశలం తథా॥
న కుత్రాపి మయా దృష్టం శరవేగోఽపి చాద్భుతః॥ ౩౫-౩౫½

తద్ధనుష్టంకృతే రాదా విభిన్నహృదయోఽభవం
తద్ధనుష్టంకృతిం తీవ్రశరవేగం దివౌకసాం
ముదా కృతా న్జయరవా౯ హాహారావాం శ్చ రక్షసాం॥
సముద్రఘోష మేకస్మి న్క్షణే శ్రుతవత స్తతః
పతిత్వా వారిధౌ తత్ర నిమగ్న స్యారసాతలం॥
పున స్సింధుతరంగై స్తు తీరం నీతస్య మే సఖే॥
వేద్యా స్స్వానుభవైనైవ దుస్థితిః కిము వర్ణ్యతే॥ ౩౬-౩౯
తచ్ఛ్రుత్వా స్వప్రభో ర్వాక్యం కరాళోఽప్యాహ దుఃఖితః
మాభజ స్త్వం నిరుత్సాహ మేతావన్మాత్రతః ప్రభో॥

1. కవిః.

౩౧-౩౨ ఓ మారీచుఁడా! ఆహా! నీయదృష్టము కొనియాడఁదగినదై యున్నది. పూర్వపుణ్యముచే నీవు మృత్యుముఖమునుండి వలె రామ బాణమునుండి విముక్తుఁడవైతివి ఓ మారీచుఁడా! ఇంతటినుండి చిరంజీవివై సుఖముగ వర్ధిల్లుము. అని యివ్విధముగఁ గరాళుఁడు మారీచుని కొనియాడుచుండఁగా మారీచుఁడు మెల్లగఁ గరాళునితో నిటులఁ బలికెను.

౩౩-౩౩½ ఓ కరాళుఁడా! నీతో సంభాషించుటకును నాకు శక్తిలేదు. అయినను నెమ్మదిగఁ జెప్పెదను. నాయవస్థను వినుము. ఓయనుచరుఁడా! నిశ్చయముగ నా యవస్థ వర్ణింప శక్యముకానిది.

౩౪-౩౪½ లోకమునం దనేకులగు మహావీరుల ననేకపర్యాయములు నేను చూచి యుంటిని, కాని రామునితో సమానుఁడగు ధనుర్ధరుని నే నెచ్చటను జూచి యుండలేదు.

౩౫-౩౫½ ఓ కరాళుఁడా! ఆరాముని ధనుఃకౌశలమువంటిది కూడ నాచే నెచ్చటను జూడఁబడి యుండలేదు. ఆరాముని శరవేగము మిక్కిలి యాశ్చర్యమును గొల్పునది.

౩౬-౩౯ ఓకరాళుఁడా! రాముని ధనుష్టంకారమును వినినంతమాత్రముననే గుండె బద్దలయిపోయినది. ఆ ధనుష్టంకారము, బాణవేగము, దేవతల జయజయధ్వనులు, రాక్షసుల హాహాకారములు, సముద్రధ్వనియు నివి యన్నియు నొక్కపర్యాయము బయలుదేరగా వానినన్నిటిని వినుచు శరవేగముచే సముద్రములోఁ బడవేయఁబడి తిరిగి సముద్ర తరంగములచే నొడ్డునఁ బడవేయఁబడిన నా దురవస్థ యనుభవైక వేద్యము కాని వర్ణింప శక్యము కాదని చెప్పెను.

౪౦-౪౧ తన ప్రభువగు మారీచునివాక్యమును కరాళుఁడను రాక్షసుఁడు విని దుఃఖపడి యిట్లు మారీచునితోఁ బలికెను.—ఓ ప్రభువగు మారీచుఁడా! ఇంతమాత్రమునకు నీవు నిరుత్సాహమును బొందకుము.

వయం సర్వే గతా స్సద్య స్త్రిలోకీవిజయాయ వై
సర్వ ముక్త్వా రావణాయ నాశయిష్యామ తేన తమ్॥ ౪౦-౪౧

తత్ర త్రిహాతకో నూనం రక్షోరాజకరే పతేత్
యేన కేనా ప్యుపాయేన నాశయిష్యతి రావణః॥
తస్మా చ్ఛుచం నిరుత్సాహం సముత్సృజ్య భవా న్ద్రుతమ్
మయా సహ సమాగచ్ఛ త్వద్య రావణసన్నిధిమ్॥ ౪౨-౪౩

ఇత్యుక్త స్తాటకాసూనుః ప్రత్యువాచ కరాళకమ్॥ ౪౩½

అద్యాఽపి పురతో భాతి రామ స్సాయకో ధనుర్ధరః॥
రకారశ్రవణే జాతే మే ఽంగకంపో భవ త్యలమ్॥ ౪౪-౪౪½

స తు రాక్షసనాశాయ త్వవతీర్ణో జనార్దనః॥
ఇతి మన్యే కరాళాహం నరమాత్రో న హి ధ్రువమ్॥
౪౫-౪౫½

తస్మా త్తేన విరోధం తు త్యక్త్వా కృత్వాఽఽశ్రమం క్వచిత్॥
తపః కరోమి నైశాటభావం చాఽపి త్యజా మ్యహమ్॥
౪౬-౪౬½

యత్ర కుత్రాపి గచ్ఛ త్వం న త్వయా కార్య మస్తి మే॥
ఇత్యుక్త్వా తం శనై ర్గత్వా క్వచి త్కృత్వా ఽఽశ్రమం శుభం
తాపసం వేష మాశ్రిత్య తపసి స్థితవా నభూత్॥ ౪౭-౪౮

ఆశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
దశమస్సర్గ స్సమాప్తః.



మన మందరము వెళ్లి ముల్లోకములను జయించిన రావణునితోఁ జెప్పి వానిచే నారాముని హతముఁ జేయించుదము.

౪౨-౪౩ అక్షత్రియహతకుఁ డగు రాముఁడు నిశ్చయముగ రావణుని చేతిలోఁ జిక్కును. ఏదో ఒక యుపాయముచేత రావణుఁడు చంపఁగలఁడు. అందువలన నీవు నిరుత్సాహమును, దుఃఖమును విడిచి శీఘ్రముగ రావణుని యొద్దకు నాతోఁ గూడ రమ్ము.

౪౩½ ఇవ్విధముగ కరాళుఁడు చెప్పగా మారీచుఁడు వానితో నిటులఁ బలికెను

౪౪-౪౪½ ఓ కరాళుఁడా! ఇప్పటికిని రాముఁడు ధనుర్ధరుఁడై నాముందర ప్రత్యక్షముగ నుండినట్లు తోచుచుండెను. మఱియు 'ర' అనెడి యక్షరము వినినప్పటికి శరీరమంతయు మిక్కిలి కంపించుచున్నది.

౪౫-౪౫½ ఓ కరాళుఁడా! విష్ణుమూర్తియే రాక్షససంహారముకొఱకు రాముడుగా నవతరించె నని తలఁచెదను. రాముఁడు సామాన్యమనుష్యమాత్రుఁడు కాఁడని నిశ్చయముగఁ జెప్పెదను.

౪౬-౪౬½ ఆకారణమువలన రామునితో విరోధమును మాత్రము నేను పెట్టుకొనక యొక్కచోట నొక యాశ్రమమును గల్పించుకొని రాక్షసభావమును విడిచి తపమును జేసికొనెదను

౪౭-౪౮ 'ఓ కరాళుఁడా! నీతో నా కేమియుఁ గార్యము లేదు. నీ యిష్టము వచ్చినవిధముగ నీవు వెళ్లుము.' అని కరాళునితోఁ జెప్పి మారీచుఁడు మెల్లగా వెళ్లి యొక్కచోట నొక యాశ్రమము నేర్పరచుకొని తాపసవేషమును ధరించి తపస్సు చేసికొనుచుండెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బదియవసర్గము ముగిసెను.



## ఏకాదశసర్గప్రారంభః

శ్రుత్వా మారీచవృత్తాంత మపృచ్ఛ న్మునయ స్తతః
జనకస్య ధనుర్యాగవృత్తాంతం రోమహర్షణమ్॥ ౧
మహర్షిభి స్సమాపృష్టో ధనుర్యాగకథాం శుభాం
వక్తు మారబ్ధవా న్సూత శ్శౌనకాద్యా న్ద్విజర్షభాన్॥ ౨
జనకో దేవమునినా నారదేన ప్రచోదితః
మిథిలాయాం ధనుర్యాగం కర్తు మారబ్ధవా న్నృపః॥ 3
ఉవాచ జనకం రాజా సుధన్వా ఽఽగత్య స్సై తదా
మహ్యం ప్రదీయతాం కన్యా ధనుషాసహ భూమిప! ౪

[1] నస్వై దాస్యసిచే ద్రాజన్! లుంఠయిష్యామి తే పురీం
న దాస్యా మీతి తే నోక్త స్సాంకాశ్యాధిపతి స్తదా॥
రురోధ మిథిలాం సద్య స్సేనయాసహ భూమిపైః॥ ౫

యుయుధే జనకో రాజా పరై స్సార్థం మహామనాః॥
పరై స్సంపీడితో రాజా సస్మారచ సదాశివం
శివేన ప్రేషితా సేనా దేవానాంచ బలీయసాం॥
దేవసేనాం తదా ప్రాప్య రిపుణా యుయుధే నృపః
సుధన్వా నిహతో యుద్ధే జనకేన మహాత్మనా॥ ౬-౭
సాంకాశ్యనగరే తస్య భ్రాతరంచ కుశధ్వజం
విదధే తత్ర రాజాన మిక్షుమత్యా స్తటే నృపః॥ ౮

1. మార్కండేయ రామాయణమ్.

## పదునొకండవసర్గప్రారంభము.

౧ శౌనకాదిమహర్షులు మారీచునివృత్తాంతమును విని యనంతరము జనకుని ధనుర్యాగవృత్తాంతమును సూతు నడిగిరి.

౨ సూతుఁడు మహర్షులచే నడుగబడి శౌనకాదిమహర్షులనుగూర్చి ధనుర్యాగ వృత్తాంతమును గ్రిందివిధముగఁ జెప్ప నారంభించెను.

౩ ఓ మహర్షులారా! జనకుఁడు దేవర్షి యగు నారదునిచేఁ బ్రేరేపింపఁబడి మిథిలయందు ధనుర్యాగముఁజేయ నారంభించెను.

౪ అప్పుడు సాంకాశ్యపురాధిపతి యగు సుధన్వుఁ డను రాజు మిథిలకు నచ్చి ధనువుతోఁగూడ సీతను దన కిమ్మని జనకమహారాజు నడిగెను.

౫–౭౺ మఱియు సుధన్వుఁడు జనకునితో నిటులఁ బలికెను. 'ఓజనకుఁడా! నేను కోరినవిధముగ నీవు సీత నీయనిచో నీ పట్టణమును గొల్లఁగొట్టెదను.' అని సుధన్వుఁడు పలుకఁగా 'నేను సీత నీయ' నని జనకుఁడు చెప్పెను. సుధన్వుఁడు వెంటనే తనసైన్యముంతో మిథిలను నిరోధించెను.

౮–౯ జనకుఁడు శత్రువులతోఁ బోరాడి వానిచేఁ బీడింపఁబడి సదాశివుని స్మరింపఁగా శంకరుఁడు కొంత దేవతాసైన్యమును జనకునిసహాయార్థమై పంపెను. ఆ దేవతాసైన్యసహాయముతో జనకుఁడు సుధన్వుఁడనురాజును యుద్ధమునందు సంహరించెను.

౯ అనంతరము జనకమహారాజు సుధన్వునిరాజధానియైన ఇక్షుమతీ నదీతీరమునందలి సాంకాశ్యపట్టణమును స్వాధీనము చేసికొని యచ్చటఁ దనసోదరుఁ డగు కుశధ్వజుని బట్టాభిషిక్తునిగాఁ జేసెను

పున ర్యజ్ఞం సమారభ్య జనకోఽతిముదాన్వితః
సర్వేషాం ప్రేషయామాస నృపాణాం శుభపత్రికాః॥ ౧౦

దేవకిన్నరగంధర్వచారణేషు నరేషు వా
యః కోఽపి నమయే చ్ఛైవం ధను ర్యది సవీర్యవాన్॥
పరిగ్రహం మత్సుతాయాః కర్తుం శక్నోతి నాన్యథా
ఇత్థ మావేదయామాస పత్రికామూలతశ్చ సః॥ ౧౧-౧౨

నారదోక్తం వచ స్స్మృత్వా వితీర్య శుభపత్రికాం
ద్విజం సంప్రేషయామాస విశ్వామిత్రాంతికం నృపః॥ ౧౩

జనకప్రేషితో విప్ర స్సిద్ధాశ్రమ మథాఽఽగతః
సమాత్తక్రతవే రామలక్ష్మణాభ్యాం తదాశ్రమే॥
ఇతిహాసా న్సంవదతే విశ్వామిత్రమహర్షయే
నానామహర్షిజుష్టాయ దదౌ తాం శుభపత్రికామ్॥ ౧౪-౧౫

స్వయం విజ్ఞాపయామాస జనకప్రేషితో ద్విజః
జనకస్య గృహే రాజ్ఞో ధనుర్యాగో ఽద్య వర్తతే॥
నిర్గచ్ఛతు భవా న్ద్రష్టుం మునిభిస్సహ కౌశిక! ౧౬-౧౭

[1] విశ్వామిత్రోఽపి వైదేహప్రేషితాం శుభపత్రికాం
సంపఠ్య శ్రావయామాస ద్విజానాం రాజపుత్రయోః॥
౧౮-౧౯

యజనాదికషట్కర్మరత కౌశిక తే నమః॥
త్వచ్ఛాత్రజనకే నేయం లిఖ్యతే శుభపత్రికా

1. కవిః.

౧౦ పిమ్మట జనకుఁడు తిరిగి ధనుర్యాజ్ఞము నారంభించి సమస్తమైన రాజపుత్త్రులకు శుభపత్త్రికల నంపెను.

౧౧-౧౨ దేవతలలోఁగాని, కిన్నరులలోఁగాని, గంధర్వులలోఁగాని, చారణులలోఁగాని, నరులలోఁగాని యొవఁడు నాగృహమునందలి శివధనువు నెక్కు-పెట్టునో వానికి నాకొమరిత నిచ్చి వివాహము చేయుదు నని పత్త్రికాముఖమునఁగూడ జనకమహారాజు లోకమునకుఁ దెలియఁజేసెను.

౧౩ నారదుఁడు పూర్వము చెప్పినవాక్యము జ్ఞప్తికి వచ్చి జనకమహారాజు బ్రాహ్మణుని చేతికి శుభపత్త్రిక నిచ్చి విశ్వామిత్త్రమహర్షి సమీపమునకుఁ బంపెను.

౧౪-౧౫ జనకుని చేఁ బంపఁబడిన బ్రాహ్మణుఁడు సిద్ధాశ్రమమునకు వచ్చినవాఁడై; క్రతువు పూర్తిని జేసి తనయాశ్రమమున రామలక్ష్మణులకుఁ బురాణగాథలను జెప్పుచు మహర్షులచే సేవింపఁబడుచున్న విశ్వామిత్త్రమహర్షికి శుభపత్త్రిక నందిచ్చెను.

౧౬-౧౬½ జనకుని చేఁ బంపఁబడిన బ్రాహ్మణుఁడు స్వయముగఁగూడ నిటుల విన్నవించెను.-ఓ విశ్వామిత్త్రుఁడా! జనకుని గృహమునందు ధనుర్యాగ మిప్పుడు జరుగుచున్నది. మీశిష్యవర్గముతోఁ గూడ యాగమును జూచుటకు మిథిలకు దయచేయుము

౧౭-౧౭½ అనంతరము విశ్వామిత్త్రమహర్షియును జనకుని చేఁ బంపఁబడిన శుభపత్త్రికను మహర్షులకును, రామలక్ష్మణులకును జదివి వినిపించెను.

౧౮-౨౦½ శ్రీమద్యజనాదిషట్కర్మనిరతుఁడును, బ్రహ్మర్షియు నగు నో విశ్వామిత్త్రమహర్షీ! మీశిష్యుఁ డగు జనకుఁడు నమస్కారము చేసి వ్రాయు శుభపత్త్రిక యేమనఁగా—నాగృహమునందు సీతాస్వయం

సీతాస్వయంవరఫలో ధనుర్యాగః ప్రవర్తతే॥
సశిష్యపరివార స్త్వం సమాగత్య గృహం మమ
దృష్ట్వోత్సవం మామకీనాం సపర్యాం పరిగృహ్య మాం॥
ఆనందయే త్యహం మానివర్య! త్వాం ప్రార్థయా మ్యలమ్॥
౧౮-౨౦½

ఇతి మైథిలరాజన్యప్రేషితాం పత్రికాం మునిః।
శ్రావయిత్వా ప్రేరితవాన్ నిర్గంతుం మిథిలాం మునీన్॥
౨౧-౨౧½

విశ్వామిత్రం పురస్కృత్య రామ మాహు ర్మహర్షయః॥
త్వం చాపి నరశార్దూల ధనుర్యాగం నిరీక్షితుం
సమాగచ్ఛ సహాస్మాభి ర్జనకస్య పురీం ప్రతి॥ ౨౨-౨౩
కృతదారో మయా నేయ ఇతి సంచింత్య కౌశికః
రాఘవం ప్రేరయామాస నిర్గంతుం మిథిలాం ప్రతి॥ ౨౪

* ఇత్యుక్త స్తత్ర నిర్గంతుం రామో ఽప్యూరీచకార సః॥ ౨౪½

---

* న న్వాహూతస్య కౌశికస్య గమనే సమీచీనే ప్యనాహూతస్య రామస్య గమన మసమీచీన మితి చే న్న. అనాహూతానామపి సమీపే ధర్మిష్ఠయజ్ఞానుష్ఠానే తద్దర్శనాయ గమనం ధర్మ ఏవ. అనాహూతగమననిషేధస్య ఆర్త్విజ్యేచ్ఛావిషయత్వాత్. తథాచ గౌతమః— 'నయజ్ఞ మవృతో

వరనిమిత్తకమగు ధనుర్యాగము జరుగుచున్నది. శిష్యపరివారసమేతుఁడవై నీవు నాగృహమునకు దయచేసి యుత్సవమును జూచి నాచేఁ జేయఁబడు పూజలను గ్రహించి నన్నానందింపఁజేయుటకు నేను మిక్కిలి మిమ్ములను బ్రార్థించుచున్నాఁడను.

౨౧–౨౧½ ఈప్రకారము జనకమహారాజుచేఁ బంపఁబడిన శుభపత్రికను వినిపించి మిథిలాపురమునకు బయలుదేరుటకు నమ్మహర్షుల నందఱను బ్రోత్సహించెను.

౨౨–౨౩ ఆమహర్షులందఱును విశ్వామిత్రుని బురస్కరించుకొని రామచంద్రమూర్తితో నివ్విధముగఁ జెప్పిరి.—"ఓరామచంద్రా! ధనుర్యాగమును జూచుటకు మిథిలాపురికి మాతో నీవుకూడ బయలుదేరుము."

౨౪ రామచంద్రమూర్తికి వివాహశుభమును జేయించి పిమ్మట నయోధ్యకుఁ బంపవలయు నని విశ్వామిత్రుఁడు తలంచి రామచంద్రమూర్తిని మిథిలకుఁ బయనము కమ్మని విశేషముగఁ బ్రోత్సహించెను.

౨౪½ * ఇవ్విధముగా మహర్షులచేఁ జెప్పఁబడి రామచంద్రమూర్తి తానుకూడ బయలుదేరుట కంగీకరించెను.

---

* జనకునిచే నాహూతుఁ డగు విశ్వామిత్రుఁడు యాగమునకు బయలుదేరుట సమంజసమేకాని యనాహూతుఁ డగు రాముఁడు యాగమునకు బయలుదేరుట సమంజసముకా దని యాశంక కలుగును. అనాహూతుఁడును సమీపమున జరుగుచున్న యజ్ఞమును జూచుటకు వెళ్లుట ధర్మమే యగును. అనాహూతులైనవారు వెళ్ళఁగూడదను నిషేధము ఋత్విక్కులవిషయ మనియుఁ దెలియ నగును. ఋత్విక్కులు కోరఁబడనివారలై వెళ్ళఁగూడ దనియు, నితరులు చూచుటకు యథేష్టముగ వెళ్ళవచ్చుననియు గౌతముఁడును జెప్పియుండెను. యజ్ఞ

శకటీషు వినిక్షిప్య శ్రౌతాగ్నీ న్మునయ స్తతః॥
కౌశికప్రేరితా స్సద్యః మిథిలాంప్రతి నిర్గతాః॥ ౨౫-౨౫½

మాహేశ్వరధనుర్ద్రష్టుకామరామానుజాన్వితః॥
† నిర్గత్య కౌశిక శ్శోణాతీర మాపా స్తగే రవౌ
తస్యాం రాత్రౌ తు తత్తీరే న్యవసం స్తే మహర్షయః॥
౨౬-౨౭

కోన్వయం దేశ ఇత్యేవం మునిం పప్రచ్ఛ రాఘవః
ఇతి రామసమాపృష్ట స్తద్దేశచరితం పునః॥
సమూలం వక్తు మారేభే రాఘవం ప్రతి కౌశికః॥ ౨౮-౨౮½
♦ బ్రహ్మయోని ర్మహా నాసీ త్కుశో నామ మహాతపాః॥
వైదర్భ్యాం జనయామాస చతుర స్సదృశా న్సుతాన్
కుశాంబం కుశనాభంచ అధూర్తరజసం వసుం॥ ౨౯-౩౦

---

గచ్ఛే ద్దర్శనాయతు కామమ్' ఇతి. స్మృత్యంతర మపి 'అనాహూతో ఽధ్వరం గచ్ఛే దాహూత శ్శుభకర్మ' ణీతి.

† శోణేతి—ఇదానీం సోన్ ఇతి వ్యవహ్రియతే. ఖాండవవనే (ఖాండ్వానా) జనిత్వా పాట్నాప్రదేశే గంగాయాం పతితా.

♦ కుశఇతి. కుశోనామ విధాతృసుతః కశ్చి దస్తి. (కౌశేత ఇతి కుశః) భూమ్యా మాగత ఇతి భావః. నారదవత్ బ్రహ్మలోకే స్థిత్వా భూప్రజారక్షణార్థం రాజవంశసముద్ధరణార్థం బ్రహ్మణా భూలోకస్య ప్రేషితః. క్షత్రియసుతా

౨౫-౨౫½ అనంతరము విశ్వామిత్రుని చే మహర్షులందఱును ప్రేరేపింపఁబడి వెంటనే తమశౌత్రాగ్నులను జిన్నబండ్లమీద నుంచుకొని మిథిలాపురమునకు బయలు దేరిరి.

౨౬-౨౭ శివధనువును జూడఁగోరికగల రామలక్ష్మణులతోఁగూడ విశ్వామిత్రుఁడు బయలుదేరి సూర్యాస్తమయసమయమునకు † శోణానదీతీరమునకుఁ జేరెను. ఆరాత్రియందు మహర్షులందఱును ఆనదీతీరముననే నివసించిరి.

౨౮-౨౮½ పూజ్యుఁడగు విశ్వామిత్రుఁడా! ఈదేశ మెయ్యది? అని రామచంద్రమూర్తి విశ్వామిత్రుని నడుగఁగాఁ దద్దేశచరిత్రను సమూలముగ విశ్వామిత్రుఁడు చెప్ప నారంభించెను.

౨౯-౩౦ మిక్కిలితపస్సంపన్నుఁడగు ♦ కుశుఁ డను బ్రహ్మపుత్త్రుఁ డొకఁడుండెను. ఆకుశునకు విదర్భరాజపుత్రియందుఁ దండ్రికి సరివచ్చువారగు కుశాంబుఁడు, కుశనాభుఁడు, అధూర్తరజసుఁడు, వసువు నను నల్వురుకొడుకులు పుట్టిరి

---

మునకుఁ బిలువఁబడకపోయినను వెళ్ళవలయు ననియు, శుభకార్యమునకుఁ బిలువఁబడి వెళ్ళవలయు ననియు స్మృత్యంతరమునఁగూడఁ గలదు.

† శోణానది యీకాలమున సోన్ అను నామముతో వ్యవహరింపఁబడుచున్నది ఈశోణానది ఖాండవవనమున (ఖాండ్వానాలో) బుట్టి పాట్నాపట్టణప్రదేశమున గంగయందుఁ బడినది.

♦ (కుశుఁడు) "కు" భూమియందు "శ" శయనించువాఁడు (అనఁగా నారదునివలె మొదట బ్రహ్మపుత్రుఁడగుటవలన బ్రహ్మలోకమునం దుండి పిదప భూప్రజాపాలనమునకై రాజవంశసముద్ధరణమునకై బ్రహ్మచే భూలోకమునకుఁ బంపఁబడినవాఁ డని భావము. శ్రుతి

తా నువాచ కుశః పుత్రా న్ధర్మిష్ఠా న్సత్యవాదినః
క్రియతాం పాలనం పుత్రా ధర్మం ప్రాప్స్యథ పుష్కలమ్॥ 30

కుశస్య వచనం శ్రుత్వా చత్వారో లోకసంమతాః
నివేశం చక్రిరే సర్వే పురాణాం నృవరా స్తదా॥ 31

* కుశాంబస్తు మహాతేజాః కౌశాంబీ మకరో త్పురీం
కుశనాభస్తు ధర్మాత్మా పురం చక్రే మహోదయం॥

---

ప్రసూయ తైః రాజ్యం పాలయితు మవకాశో భవిష్య తీతి మత్వా క్షత్రియకన్యాం పరిణీయ తస్యాం చతురో పుత్రా న్లేభే ఇతి జ్ఞేయం.

* ఏతేన కుశాంబాదాయః పితు రనుజ్ఞయా తత్ర తత్రావ స్థాయ పృథగ్ధర్మ మాచరితవంత ఇతి గమ్యతే. నను భ్రాతౄణాం మధ్యే జ్యేష్ఠేన ధర్మే కృతే సర్వైః కృతో భవతి. తథా ఆశ్వమేధికే పర్వణి యుధిష్ఠిరం ప్రతి కృష్ణవచనం— "భీమసేనార్జునౌ చైవ తథా మాద్రవతీసుతౌ, ఇష్టవంతో భవిష్యంతి త్వ యీష్టవతి పార్థివ" ఇతి ఏవ మాదిషు బహువచనేషు సత్సు యుధిష్ఠిరాదీనాం మహాతా మాచారేచ సతి కథం పృథగనుష్ఠాన మితిచే న్న. ఏతేషాం వచనానా మవిభక్తవిషయత్వాత్ విభక్తానాంతు పృథగేవ ధర్మాచరణమ్. తథాచ నారదః—భ్రాతౄణా మవిభక్తానా మేకో ధర్మః ప్రవర్తతే విభాగే సతి ధర్మోఽపి

౩౧ మిక్కిలి ధర్మిష్ఠులును, సత్యవాదులు నగు కొడుకులంజూచి తండ్రి యగు కుశుఁ డిట్లు చెప్పెను.—"కొడుకులారా! ప్రజాపరిపాలనము జేయుఁడు. దానిచే పుష్కలమైన ధర్మము నొందెదరు."

౩౨ తండ్రి యగు కుశునిమాట వినినంతనే లోకసమ్మతు లగు కొడుకులు నల్వురును బ్రజాపరిపాలనమునం దాసక్తులై తమకు రాజధానులగాఁ బట్టణముల నేర్పరుచుకొనిరి.

౩౩-౩౪ * మహాతేజుం డగు కుశాంబుఁడు కౌశాంబి యను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. ధర్మాత్ముం డగు కుశనాభుఁడు మహోదయ మను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. అమూర్తరజ

---

యపుత్రులను గని వారలచే రాజ్యమును బరిపాలింపఁజేయ నవకాశముండు నని తలఁచి క్షత్రియకన్యకను వివాహమాడి యామెయందు నల్వురఁ బుత్రులను బుట్టించె నని తెలియనగు.

* పైవచనములచేఁ గుశాంబుఁడు మొదలగు వారలు తండ్రియనుజ్ఞచే వేఱువేఱు చోట్లయం దుండి వేఱువేఱుగ ధర్మముల నాచరించినట్లు తెలియఁబడుచున్నది. ఇందుపై యొకయాశంక కలుగుచున్నది. ఏమనఁగా సోదరులలో జ్యేష్ఠుఁడుగా నున్నవాఁడు ధర్మము నాచరించినచో నందఱు నాచరించినట్లే యగు నని భారతమున అశ్వమేధపర్వమునఁ గన్పడుచున్నది. "ఓధర్మరాజా! నీవు యజ్ఞము చేసినచో భీమార్జునులు నకులసహదేవులును యజ్ఞమును జేసినవా రగుదు" రని ధర్మరాజుతోఁ గృష్ణుఁడు చెప్పెను. ఇట్టివాక్యము లనేకములు కన్పడుచుండుటవలనను మహనీయు లగు ధర్మరాజాదుల శిష్టాచారము వలనను నొకజ్యేష్ఠుఁడు ధర్మము నాచరించిన సరిపోవునపుడు వేఱువేఱుగా కుశాంబాదులు ధర్మముల నాచరింప పని యే మని యాశంకకు సమాధానము చెప్పఁబడుచున్నది. పైవాక్యములు అవిభక్తసోదరుల విషయములు. విభక్తు లగు సోదరులు వేఱువేఱుగా ధర్మముల నాచరింపవలయు నని నారదుఁడు చెప్పియుండెను.

అథూర్తరజసోనామ ధర్మారణ్యం మహీపతిః
చక్రే పురవరం రాజా వసుశ్చక్రే గిరివ్రజం॥ 33-34
1 ఏషా వసుమతీ రామ వసోస్తస్య మహాత్మనః॥ 345

కుశనాభస్తు రాజర్షిః కన్యాశత మనుత్తమం॥
జనయామాస ధర్మాత్మా ఘృతాచ్యాం రఘునందన !
ఏక దోద్యానవిఖ్యాతిం కుర్వంతీ ర్రూపకన్యకాః॥
దృష్ట్వా సర్వగతో వాయు రిదం వచన మబ్రవీత్॥ 35-365
అహం వః కామయే సర్వా భార్యా మమ భవిష్యథ॥
చలంహి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః
అక్షయ్యం యౌవనం ప్రాప్తా అమర్త్యాశ్చ భవిష్యథ॥
37-38

తస్య తద్వచనం శ్రుత్వా కన్యాశత మథాబ్రవీత్
ప్రభావజ్ఞాః స్మ తే సర్వాః కి మస్మా నవమన్యసే॥
* పవమానసమాఖ్య స్త్వం కి మధర్మే ప్రవర్తసే॥ 39-395

భవే త్తేషాం పృథ క్పృథ గితి. తేషా మవిభక్తత్వపక్షే ఽపి పితు రభ్యనుజ్ఞయా పృథగ్ధర్మాచరణం జ్ఞేయమ్. తస్మా త్పితుః కుశ స్యాజ్ఞయా బహుభిః పుత్రైః పృథగ్ధర్మాచరణం యత్కృతం తద్యుక్తమేవ.

* పవమానసమాఖ్య ఇత్యస్యాయ మాశయః. భో సమీరణ ! పరపవిత్రీకరణా త్పవమాన ఇతి భవా నేతావ త్సార్థ

1. వాల్మీకిరామాయణమ్.

నుఁడు ధర్మారణ్య మను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. వసుమహారాజు గిరివ్రజ మను పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను.

౩౮౹ ఓ రామచంద్రా! ఇప్పుడు మన ముండునది మహాత్ముఁ డగు నావసుమహారాజుభూమి అని యెఱుఁగుము.

౩౯-౩౬౹ ఓ రామచంద్రా! ధర్మాత్ముఁడును, రాజర్షియు నగు కుశనాభుఁడు ఘృతాచి యను స్త్రీయందు నూర్వురఁగొమార్తెలం గనెను. ఆకన్యలందరు నొకప్పుడు పుష్పోద్యానవనమున విహరించుచుండఁగా సర్వప్రదేశములందుండు వాయుదేవుఁడు కుశనాభునికూతులం జూచి యిట్లు పలికెను.

౩౭-౩౭ ఓ కన్యకలారా! నేను మిమ్ములనందఱం జూచి కామించుచున్నాను. నాకు భార్యలుగా నుండుఁడు. మనుష్యులయం దుండు యౌవనము విశేషముగాఁ జంచలమైనది (అనఁగా వారలను గోరకుఁడని భావము). మీరలు నన్నుఁ బెండ్లిచేసికొనినచో, నాశనములేని యౌవనము నొంది దేవతాస్త్రీలను గాఁగలరు.

౩౯-౩౯౹ ఆ వాయుదేవుఁడు చెప్పిన వాక్యమును విని నూర్గురుకన్యలు నిటులఁ జెప్పిరి ఓ వాయుదేవుఁడా! మేమందఱము *నీప్రభావము నెఱుంగుదుము. ఎందుకు మమ్ముల నవమానించెదవు?

---

"అవిభక్తు లగువారలకు ధర్మ మొక్కటి యనియు, విభక్తులగు వారలకుఁ బృథక్కుగా ధర్మ మనియుఁ జెప్పఁబడినది" కుశాంబాదు లవిభక్తు లనియెడి పక్షమునను తండ్రి యనుజ్ఞచే వేఱు వేఱుగా ధర్మముల నాచరించి రని తెలియనగును. కాన కుశాంబాదులు నల్వురు తండ్రియనుజ్ఞచే ధర్మములను వేర్వేఱుగా నాచరించుట యుక్త మనియే తెలియనగు.

* పవమానుఁడ వని పేరుపెట్టుకొని యధర్మమున నెందుకుఁ బ్రవర్తించుచున్నావు? (నీ వధర్మమునఁ బ్రవర్తింపఁగూడ దని భావము.) పవమానుఁడ వనుదాని యభిప్రాయ మిది యని తెలియనగును.

* కుశనాభసుతా స్సర్వా స్సమర్థా స్త్వాం సురోత్తమ !
స్థానాచ్చ్యావయితుం దేవం రక్షామస్తు తపో వయం॥ ౨౦-౨౦౹

† పితాహి ప్రభు రస్మాకం దైవతం పరమంచ సః॥
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి॥ ౨౧-౨౧౹

తాసాం తద్వచనం శ్రుత్వా వాయుః పరమకోపనః॥
ప్రవిశ్య సర్వగాత్రాణి బభంజ భగవా న్ప్రభుః॥ ౨౨-౨౨౹

---

కనా మాభూత్. ఏతాదృ శాధర్మే భవా నద్య ప్రవర్తేచే త్త్వ మపవిత్రో భవష్యసి తదా కథ మితరా న్పవిత్రీ కరిష్యసి? తదా పవమాన ఇతి నామ ఘృతకోశాతకీవ న్నిష్ఫలం భవేది త్యాశయః.

* స్థానా చ్చ్యావయితుం సమర్థా ఇత్యనేన పురా స్త్రీష్వపి శాపానుగ్రహశక్తి ర్వర్తత ఇతి ద్యోత్యతే. ఇదానీంతనానాం బాడబానామపి తాదృశశక్త్యభావే ముఖాద్యపవిత్రత్వమేవ కారణమ్. "పరాన్నేన ముఖం దగ్ధం హస్తౌ దగ్ధౌ ప్రతిగ్రహాత్, మనో దగ్ధం పరస్త్రీభిః కుత శ్శాపః కలౌ యుగే" ఇత్యభియుక్తోక్తే రితి జ్ఞేయమ్.

† అనేన కన్యాయాః పితృదానపూర్వకో వివాహః ప్రశస్త ఇతి సూచితమ్. కించ స్త్రీణాం పతివరణం స్వతంత్రతయా నాస్తీతిచ ధ్వన్యతే. ఏతేన యౌవనవత్యః ఏకాకితయా న గచ్ఛేయు రితి సూచితమ్.

౮౦-౮౦౹ ఓవాయుదేవుఁడా! మేమందఱము కుశనాభుని కూతులము. నిన్ను నీపద్రిభు పగు నింద్రునిఁగూడ *మీ యధికారములనుండి తొలఁగింప సమర్థురాలము. తపస్సు తఱుఁగు నని తలఁచుచున్నాము.

౮౧-౮౧౹ మాకుఁ బ్రభువు తండ్రి, తండ్రియే పరమదైవము. † మా తండ్రి మమ్ము లెవ్వని కిచ్చునో యతఁడు మాకు భర్త కాఁగలఁడు (అని కన్యకలు చెప్పిరి).

౮౨-౮౨౹ ఆకన్యకలు చెప్పినమాటను విని పరమకోపి యగు భగవంతుఁడైన వాయుదేవుఁడు వారిసమస్తావయవములను బ్రవేశించి విఱిచెను.

---

ఓ వాయుదేవుఁడా! నీవు పరులను బవిత్రము చేయుచుంటవలన "పవమానుఁడవు" అను సార్థకనామము కలవాఁడవైతివి. ఇట్టి యధర్మమున నీవు ప్రవర్తించినచో అపవిత్రుఁడవు కాఁగలవు. అప్పుడు నీ వితరుల నెట్లు పవిత్రము చేయఁగలవు? (పవిత్రము చేయ లేవు) అప్పుడు పవమానుఁ డను నీనామము నేతిబీరకాయ వలె నిరర్థకనామము కాఁగల దని యాశయము.

* మీయధికారములనుండి మిమ్ములను దొలగింప మేము సమర్థురాల మని చెప్పుటచేతఁ బూర్వమునందు స్త్రీలకు శాపానుగ్రహసామర్థ్యము లుండినట్లు తోఁచుచున్నది. ఇప్పటి బ్రాహ్మణులకైనను నట్టిశక్తిసామర్థ్యములు లేకపోవుటలో ముఖాద్యవయవముల యపవిత్రతయే కారణము. "పరాన్నముచే ముఖము దగ్ధమైన దనియుఁ, బ్రతిగ్రహముచే హస్తము దగ్ధమైనదనియుఁ, బరస్త్రీలచే మనస్సు దగ్ధమైనదనియుఁ, గావునఁ గలియుగమున శాపానుగ్రహశక్తులు నశించిన వనియు" నభియుక్తవచనము తెలియనగును.

† పైవాక్యముచేఁ గన్యకకుఁ దండ్రి కన్యాదానపూర్వకముగాఁ జేసిన వివాహమే ప్రశస్త మని సూచింపఁబడినది. మఱియు, స్త్రీలకు స్వాతంత్ర్యముగా భర్తను వరించుట లేదనికూడ దీనివలనఁ దెలియఁ బడుచున్నది. ఇదియునుంగాక యౌవనవతు లగు స్త్రీలు ఒంటరిగా సంచరింపఁగూడ దని సూచితము.

* తాః కన్యా వాయునా భగ్నా వివిశు ర్నృపతే ర్గృహమ్॥ ४३

సచ తా దయితా దీనాః కన్యాః పరమశోభనాః
దృష్ట్వా భగ్నా స్తదా రాజా సంభ్రాన్త ఇద మబ్రవీత్॥ ४४

కి మిదం కథ్యతాం పుత్ర్యః కో ధర్మ మవమన్యతే
కుబ్జాః కేన కృతా స్సర్వా వేష్టంత్యో నాభిభాషథ॥ ४५

తస్య తద్వచనం శ్రుత్వా కన్యాశత మభాషత॥ ४५५

వాయు స్సర్వాత్మకో రాజ న్ప్రధర్షయితు మిచ్ఛతి॥ ४६

పితృమత్యః స్మ భద్రం తే స్వచ్ఛందే న వయం స్థితాః
పితరం నో వృణీష్వ త్వం యది నో దాస్యతే తవ॥
తవ భార్యా భవిష్యామ ఇత్యవోచామ వాయునా॥४८-४८५

ఏవం బ్రువంత్య స్సర్వా స్స్మ వాయునా నిహతా భృశం॥ ४७

తాసాం తద్వచనం శ్రుత్వా రాజా పరమధార్మికః
ప్రత్యువాచ మహాతేజాః కన్యాశత మనుత్తమమ్॥ ४९

---

* యస్మి న్ప్రదేశే వాయునా కుశనాభకన్యకాః కుబ్జీకృతాః తత్ప్రదేశస్య వాద్య కన్యాకుబ్జ మితి కనోజ్ ఇతి వ్యవహార ఇతి జ్ఞేయమ్.

౪౩ * ఆకన్యలు వాయువుచేత విఱువఁబడి యంతఁ గుశనాభుని గృహము నకుఁ జనిరి.

౪౪ అప్పుడు కుశనాభమహారాజు పరమశోభను లగు తనప్రియపుత్రికలు భంగము నొంది దైన్యము నొంది యుండుటం జూచి కలత నొంది యిట్లు వారితోఁ బలికెను.

౪౫ కొమార్తెలారా! ఇదేమి? చెప్పుఁడు; ఎవఁడు ధర్మము నతిక్రమించినవాఁడు; ఎవఁడు మిమ్ముల నిట్లు కుబ్జలుగాఁ జేసెను? ఎందుకుఁ బదులు చెప్పరు? (అని తండ్రి యడిగెను)

౪౫½ ఆకుశనాభునిమాటలను విని యాకన్యకలు నూర్వురును నమస్కరించి యిటులఁ జెప్పిరి.

౪౬ ఓ కుశనాభుఁడా! అన్నిటం దిరుగులాడెడి వాయుదేవుఁడు మమ్ము ధర్షింపఁగోరెను.

౪౭-౪౭½ మాకుఁ దండ్రియున్నాఁడు కావున స్వాతంత్ర్యము లేదు. నీవు మాతండ్రి నడుగుము అతఁడు మమ్ముల నీ కిచ్చినట్లయిన మేము నీకు భార్యల మయ్యెద మని చెప్పితిమి.

౪౮ ఈ ప్రకారము చెప్పుచున్న మమ్ముల నందఱను పాపము ననుసరించి మామాట నంగీకరింపక యిటులఁ గుబ్జలనుగాఁ జేసెను (కుబ్జ లనఁగా అంగవికారము కలవా రని తెలియ నగు).

౪౯ ఆకన్యకలు చెప్పినమాటను విని మహాపరాక్రమశాలి యగు కుశనాభుఁడు పరమధార్మికుఁ డగుటంజేసి వాయువుపైఁ గోపంబు వహింపక క్షమయే ముఖ్య మని తలఁచి, యుత్తములైన నూర్వురికన్యలకు నిట్లని బదులు సెప్పెను.

---

* కుశనాభుని కన్యకలు వాయువుచే నెచ్చటఁ గుబ్జలుగాఁ జేయఁబడిరో యాప్రదేశ మిపుడు "కన్యాకుబ్జ" మని, కనోజ్ అని వ్యవహరింపఁబడుచున్న దని తెలియనగును.

క్షాంతం క్షమవతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతం
ఐకమత్య ముపాగమ్య కులం చావేక్షితం మమ॥ ౨౦

అలంకారో హి నారీణాం క్షమా తు పురుషస్య వా
క్షమా దానం క్షమా యజ్ఞః క్షమయా విష్ఠితం జగత్॥ ౨౧

౫॥ ఇతి కుశనాభస్తు కన్యాః ప్రశస్య సదృశవరే ప్రదానాయ
మంత్రిభి స్సంమంత్ర్య సోమదానామకగంధర్వీ పరిచర్యా
సంతుష్టచూళినామక మహర్షిదత్తం మానసం పుత్రం
బ్రహ్మదత్తనామకం కాంపిలీనామకనగరవాసినం రాజాన
మాహూయ తస్మై సమీరణవిగుణీకృతం కన్యాశతకం
దత్వా తత్కరసంస్పర్శ సమనంతరమేవ సంప్రాప్తపూర్వ
రూపాః భర్త్రా బ్రహ్మదత్తేనసహ సంతుష్టః కాంపిల్యాం
ప్రేషయామాస. సోమదాపి స్వపుత్రసదృశస్నుషాశత
దర్శనజనితసంతోషభరితా బభూవ. ౨౨

కృతోద్వాహే గతే తస్మిన్ బ్రహ్మదత్తే చ రాఘవ!
అపుత్రః పుత్రలాభాయ పౌత్రి మిష్టి మకల్పయత్॥ ౨౩

ఇష్ట్యాంతు వర్తమానాయాం కుశనాభం మహీపతిం
ఉవాచ పరమోదారః కుశో బ్రహ్మసుత స్తదా॥ ౨౪

౨౦ కూతురులారా! ఓర్పుగలవారలు తమ కెవ్వఁడైన నపరాధము చేసి నప్పుడు చేయవలసిన కార్యమంతయు క్షమించుటయే. ఇప్పుడు మీరలు చేసిన కార్యము చాల గొప్పది. మీర లొకరితో నొకరు కలసికొని యొద్దిక నొంది నాకులంబునుంగూడ రక్షించితిరి.

౨౧ ఓర్పు అనునది స్త్రీలకుఁగాని, పురుషులకుఁగాని భూషణము. శాంతమే దానము (అనఁగా దానమువలనఁ గల్గు ఫలము శాంతముచేతనే సమకూరు నని భావము). శాంతమే యజ్ఞము (అనఁగా యజ్ఞము వలనఁ గలుగుఫలము శాంతమువలననే కల్గు నని భావము). శాంతము చేతనే జగత్తంతయు నిల్చియున్నది.

౨౨ ఈప్రకారముగఁ గుశనాభుఁడు తన కన్యకలను బ్రశంసించి యనంతరము తనమంత్రులతోఁ గన్యకలవివాహవిషయమై యాలోచించి సోమద యను గంధర్వస్త్రీపరిచర్యచే సంతసించిన చూళి యను మహర్షిచే నాసోమద కనుగ్రహింపఁబడినవాఁడును, నమ్మునిమానస పుత్త్రుఁడును గాంపిలీనగరనివాసియు నగు బ్రహ్మదత్తుఁ డను రాజును బిలిచి వానికి వాయుదేవునిచే వికారరూపవంతులుగాఁ జేయఁబడిన తన నూర్వురఁ బుత్రికల నిచ్చి వివాహము చేసెను. బ్రహ్మదత్తుని హస్తస్పర్శముచేతనే యాకన్యకలందఱు నా వికారరూపములను విడిచి పూర్వరూపములను బొందిరి. అప్పుడు కుశనాభుఁడు తనపుత్రికలను భర్తతోఁగూడఁ గాంపిల్యనగరమునకుఁ బంపెను. బ్రహ్మదత్తునితల్లి యగు సోమద యను గంధర్వస్త్రీయును దనపుత్రునకుఁ దగినకోడండ్రను నూర్వురను జూచి సంతోషభరితురా లయ్యెను.

౨౩ రామచంద్రా! వివాహముచేసికొని బ్రహ్మదత్తుఁడు వెళ్లినపిమ్మట కుశనాభుఁడు తనకుఁ గొడుకు లేకుండుటంజేసి కొడుకుగల్గుటకై పుత్రప్రదం బగు పుత్రకామేష్టిని జేసెను.

౨౪ పుత్రకామేష్టిజరుగుచుండఁగా నప్పుడు అందఱను మించియుండు బ్రహ్మపుత్రుఁడైన కుశుఁడు తనకొడుకైన కుశనాభునిం జూచి యిటులఁ బలికెను.

పుత్ర స్తే సదృశః పుత్త్ర! భవిష్యతి సుధార్మికః
గాధిం ప్రాప్స్యసి తేన త్వం కీర్తిం లోకేచ శాశ్వతీం॥ ౫౫

కస్యచి త్త్వథ కాలస్య కుశనాభస్య ధీమతః
జజ్ఞే పరమధర్మిష్ఠో గాధి రిత్యేవ నామతః॥ ౫౬

స పితా మమ కాకుత్స్థ! గాధిః పరమధార్మికః
కుశవంశప్రసూతో ఽస్మి కౌశికో రఘునందన! ౫౭

పూర్వజా భగినీ చాపి మమ రాఘవ సువ్రతా
నామ్నా సత్యవతీ నామ ఋచీకే ప్రతిపాదితా॥ ౫౮

సా భర్తృసేవాం కృత్వాథ సశరీరా దివం గతా
కౌశికీ త్యాఖ్యయా భూమ్యాం నదీరూపం సమాపసా॥ ౫౯

తతో ఽహం హిమవత్పార్శ్వే వసామి నిరత స్సుఖం
భగిన్యాం స్నేహసంయుక్తః కౌశిక్యాం రఘునందన! ౬౦

అహంహి నియమా ద్రామ! హిత్వా తాం సముపాగతః
సిద్ధాశ్రమ మనుప్రాప్య సిద్ధో ఽస్మి తవ తేజసా॥ ౬౧

ఏష రామ మమోత్పత్తి స్స్వస్య వంశస్య కీర్తితా
దేశస్య చ మహాబాహో య న్మాం త్వం పరిపృచ్ఛసి॥ ౬౨

గతో ఽర్ధరాత్రః కాకుత్స్థ! కథాః కథయతో మమ
నిద్రా మభ్యేహి భద్రం తే మాభూ ద్విఘ్నో ఽధ్వనీహ నః॥ ౬౩

౫౫ పుత్త్రుండా ! మిక్కిలి ధార్మికుండును, గుణములచే నీకు సరివచ్చు వాండు నగు పుత్త్రుండు నీకుం గల్గును ; అతని పేరు " గాధి " యనంబడును. ఆతనిచే నీవు శాశ్వతం బగు యశంబునుం బొందం గలవు. అని కుశుండు చెప్పెను.

౫౬ అంతం గొంతకాలము గడచినపిదప బుద్ధిమంతుం డగు కుశనాభునకు కుశుండు చెప్పినట్లు గాధి యనియే పేరుగల్గిన పరమధార్మికుం డగు నొకకొడుకు పుట్టెను.

౫౭ రామచంద్రా ! పరమధార్మికుం డగు నాగాధికి నేను బుట్టితిని; ఇట్లు కుశవంశమునం బుట్టితిం గాంబట్టి కౌశికుండ నైతిని.

౫౮ రామచంద్రా ! మంచివ్రతముల నాచరించి నా యక్కయగు సత్యవతియను ఋచికుం డను ఋషిని పెండ్లియాడినది.

౫౯ ఆసత్యవతి భర్తృసేవచేసి శరీరముతో స్వర్గము నొందినది. మఱియు నాబిడ పరమోత్కృష్టమైన కౌశికి యను మహానదిగా లోకోపకారమునకై ప్రవహించినది.

౬౦ రామచంద్రా ! నేను భగిని యగు కౌశికీనదియందలి స్నేహముచే మిక్కిలి యాసక్తితో సుఖముగా హిమవత్పర్వతము దగ్గఱ కౌశికీ తీరంబున నివాసము చేయుచున్నాను.

౬౧ రామచంద్రా ! నేను యాగమును జేయుటకై యాకౌశికీనదిని విడిచి వచ్చి సిద్ధాశ్రమము చేరి యచ్చట నీతేజస్సుచే సిద్ధి నొందితిని.

౬౨ రామచంద్రా ! నీవు నన్ను దేనిం జెప్పు మని యడిగితివో ఆ నా యుత్పత్తిని, నావంశోత్పత్తిని, యీ దేశమునుత్పత్తిని దానినంతయు నీకుం జెప్పితిని.

౬౩ ఓరామచంద్రా ! నే నిట్లు కథలు చెప్పుచుండంగా రాత్రి చాలభాగము గడచిపోయినది. ఇంక నిదురింపుము. నీకు మంగళ మగుంగాక ! మా కిచో ప్రమార్గమునందు విఘ్నము గల్గకుండుంగాక !

ఏవ ముక్త్వా మహాతేజా విరరామ మహామునిః
రామోఽపి సహ సౌమిత్రిః నిద్రాం సముపసేవతే॥ ౬౪

ఉపాస్య రాత్రిశేషంతు శోణాకూలే మహర్షిభిః
గమనం రోచయామాస ప్రాత స్సమునిసత్తమమ్॥ ౬౫

తే గత్వా దూర మధ్వానం గతేఽర్ధదివసే తదా
జాహ్నవీం సరితాం శ్రేష్ఠాం దదృశు ర్మునిసేవితామ్॥ ౬౬

తస్యా స్తీరే తత శ్చక్రు స్త ఆవాస పరిగ్రహం
తతః స్నాత్వా యథాన్యాయం *సంతర్ప్య పితృదేవతాః॥
♦ హుత్వా చైవాగ్నిహోత్రాణి ప్రాశ్య చానుత్తమం హవిః
వివిశు ర్జాహ్నవీతీరే శుచౌ ముదితమానసాః॥ ౬౭-౬౮

తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారసశోభితాం
సంప్రహృష్టమనా రామో విశ్వామిత్ర మథాబ్రవీత్॥ ౬౯

---

* సంతర్ప్య పితృదేవతా ఇత్యనేన పుణ్యతీర్థాదిగమనే తీర్థ ఉషిత్వా పిత్రాదితృప్త్యై దానశ్రాద్ధాదిక మితరైరపి కర్తవ్య మితి సూచితమ్.

♦ హుత్వా చైవాగ్నిహోత్రాణీత్యనేన ఆహితాగ్నీనాం యజ్ఞదర్శనాదిధర్మార్థం గచ్ఛతా మగ్నిభి స్సహైవ ప్రవాసః, నార్థార్థ మితి సూచితమ్.

౨౮ ఈప్రకారము చెప్పి, మహాప్రభావముకల విశ్వామిత్రమహర్షి యూరకుండెను. అనంతరము రామలక్ష్మణులు చక్కగా నిదురించిరి.

౨౯ విశ్వామిత్రుఁడు మిగిలిన రాత్రిభాగమంతయు శోణానదీతీరమున మహర్షులతోఁ బరుండియుండి ప్రాతఃకాలమందలి కృత్యములను నెరవేర్చుకొని యచ్చటనుండి మహర్షులతో బయలుదేరెను.

౩౦ ఆమునులు చాలదూరము పోయి సగముదినముగడచినపిదప మునులచే సేవింపఁబడినదై నదులలో శ్రేష్ఠమై యుండు గంగానదిం జూచిరి.

౩౧-౩౨ * ఆ మునులందఱును గంగాతీరమున నివసించినవారలై స్నానము పితృతర్పణము మొదలగువానిని జేసి, ♦ యగ్నిహోత్రములను జేసికొని, హవిస్సునుమాత్రము భుజించి యాదినమున నచ్చటనే సంతుష్టమానసులై యుండిరి.

౩౩ పవిత్రమైన యుదకము కలదియు హంసలు మొదలగువానిచే నొప్పుచున్నట్టిదియు నగు గంగానదిని రామచంద్రమూర్తి చూచి విశ్వామిత్రునితో నివ్విధముగఁ బలికెను.

---

* పితృతర్పణములను జేసిరి యని చెప్పుటచేఁ బుణ్యతీర్థాదులను గూర్చి వెళ్ళినపుడు తీర్థమునం దుండి పితృతృప్తికొఱకు దానము, తీర్థశ్రాద్ధము మొదలగువాని నితరులును జేయవలయు ననెడి ధర్మము సూచింపఁబడినది.

♦ అగ్నిహోత్రములను జేసిరి యని చెప్పుటచేత ఆహితాగ్నులుగా నుండువారు యాగదర్శనార్థమై వెళ్ళునపుడు తమ యగ్నిహోత్రములతోఁ గూడ బ్రయాణము చేయవలయు ననియు, ధనార్జనాదులకు వెళ్ళునపుడు తమ యగ్నులతో వెళ్లకపోయినను దోషము లే దనియు ననియెడి ధర్మము సూచింపఁబడినది.

భగవన్ ! శ్రోతు మిచ్ఛామి గంగోదంత మహం మునే !
ఇతి రాఘవసంపృష్టో వక్తు మారబ్ధవా న్మునిః॥ ౨౦

ఇయం హైమవతీ గంగా జ్యేష్ఠా హిమవత స్సుతా
లోకానా ముపకారాయ నదీరూపా దివి స్థితా॥ ౨౧

భగీరథస్తు రాజర్షి స్తప స్తప్త్వా విధిం ప్రతి
గంగా మానీయ మేదిన్యా స్సాగరా న్ప్రపితామహాన్॥
* తారయామాస కపిలదగ్ధా న్కృత్వా జలక్రియామ్॥ ౨౨-౨౨౹

య శ్శృణోతి చ కాకుత్స్థ ! గంగోదంత మిమం శుభం॥
యేన సంస్మర్యతే గంగా యో గంగా మవగాహతే
ప్రీయన్తే పితర స్తస్య ప్రీయన్తే దైవతానిచ॥
† ఇత్యేవం గాంగమాహాత్మ్య మవద ద్రాఘువం మునిః॥ ౨౩-౨౪౹

---

* అనేన స్వవంశ్యేన కేనాపి గంగాస్నానతర్పణాదికృతం చే త్తద్వంశ్యానాం సర్వేషా ముత్తమలోకప్రాప్తి రితి సూచితమ్.

† ఏత న్మాహాత్మ్యం మహాభారతే ఆనుశాసనికే విస్తరేణ శ్రూయతే. "పూర్వే వయసి కర్మాణి కృత్వా పాపాని యే నరాః, పశ్చా ద్గంగాం నిషేవన్తే తేఽపి యా న్త్యుత్తమాం గతిమ్॥ యావ దస్థి మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి, తావ ద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే॥ ఇతి. విష్ణుపురాణేఽపి — గంగాగంగేతి యన్నామ యోజనానాం

౨౦ ఓపూజ్యుఁడ వగు విశ్వామిత్రమహర్షీ! గంగయొక్క వృత్తాంతమును నాకు వినఁ గుతూహలముగా నున్నదికానఁ జెప్పుమని రామచంద్రమూర్తి యడుగఁగా నమ్మహర్షియుఁ జెప్ప నారంభించెను.

౨౧ ఓ రామచంద్రా! ఈ గంగ పూర్వము హిమవంతుని జ్యేష్ఠపుత్రికయై యుండెను. పిదప లోకోపకారార్థమై నదీరూపమును ధరించి స్వర్గలోకమునం దుండెను.

౨౨-౨౨½ భగీరథుఁ డను రాజర్షి బ్రహ్మనుగూర్చి తపస్సును జేసి భూలోకమునకు గంగను దెచ్చి కపిలుని కోపాగ్నిచే దగ్ధులైన తన ప్రపితామహు లగు సగరపుత్రులభస్మరాసులను గంగచేఁ దడిపి తర్పణముల నిచ్చి యా సగరపుత్రులనందఱను * దరింపఁజేసెను.

౨౩-౨౪½ ఓ రామచంద్రా! శుభప్రదమయిన యీ గంగావృత్తాంతము నెవ్వఁడు వినునో, యెవఁడు గంగను స్మరించునో యెవఁడు గంగలో స్నానముచేయునో వానిపితృదేవతలు తృప్తిచెందెదరు. దేవతలును సంతసించెదరు. అని విశ్వామిత్రుఁడు * గంగామాహాత్మ్యమును రామచంద్రునితోఁ జెప్పెను.

---

* దీనిచేఁ దన వంశీకుఁ డగు నెవ్వఁడైనను గంగలో స్నానతర్పణాదులను జేసినచో నావంశీకుల కందఱకు నుత్తమలోకప్రాప్తి కలుగు ననియెడి ధర్మము సూచింపఁబడినది.

† ఈ గంగామాహాత్మ్యము మహాభారతమున ఆశ్వమేధికపర్వమున విస్తారముగఁ గన్పడును. (ఏమనఁగా) పూర్వవయస్సునందు మనుష్యులు పాపకర్మములను జేసినను అనంతరమున గంగను సేవించినచో నుత్తమగతుల నొందెద రనియు, మఱియు మనుష్యులయెముకలు గంగాజలములం దెంతదనుక నుండునో యన్నివేలసంవత్సరములపర్యంతము స్వర్గలోకమునఁ బూజితులై యుందు రనియుఁ జెప్పఁబడెను విష్ణుపురాణమునందుఁగూడ నీవిషయము చెప్పఁబడినది. గంగగంగ యని నూరామడదూరములోనుండి యానామము నుచ్చరించినను మూఁడు

శ్రుతగంగావతరణో రాఘవస్సహ లక్ష్మణః॥
ఉషిత్వా రజనీం తత్ర ప్రాత రుత్థాయ చాహ్నికం
నిర్వ_ర్త్య మునిభి స్సాకం మిథిలాంప్రతి నిర్యయౌ॥ ౭౫-౭౬

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ఏకాదశస్సర్గః.



ద్వాదశసర్గప్రారంభః

మధ్యేమార్గ మలం రమ్యం నానాపుష్పఫలద్రుమం
సంనిరీక్ష్యాశ్రమం త్వేకం మునిం పప్రచ్ఛ రాఘవః॥ ౧

అహో కౌశిక! పశ్యాయ మాశ్రమ స్సుమనోహరః
న కోఽపి దృశ్యతే జంతుః కిం బీజం వద మే మునే! ౨

ఇతి రామసమాపృష్టో కౌశికో ఽప్యాహ రాఘవం
పురాఽయ మాశ్రమో రామ! గౌతమ స్యాభవ న్మునేః॥
తచ్ఛాపాదేవ నిర్జంతు రభూ_త్త స్యాయ మాశ్రమః॥ 3-34

శతే ష్వపి, స్థితై రుచ్చారితం హంతి పాపం జన్మత్రయార్జి
తమ్॥ శ్రుతా ఽభిలషితా దృష్టా స్పృష్టా పీతా ఽవగా
హితా, సా పావయతి భూతాని కీ_ర్తితాచ దినే దినే॥ ఇతి,

౭౫-౭౬ రామచంద్రమూర్తి లక్ష్మణసహితముగా గంగావతరణాదివృత్తాంతమును విని యా రాత్రియంతయు నచ్చట నుండి ప్రాతఃకాలమున లేచి యాహ్నికకృత్యములను జేసికొని మునులతోఁగూడ మిథిలాపట్టణమునుగూర్చి బయలు దేరెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బదునొకండవ సర్గము ముగిసెను.



## పండ్రెండవ సర్గ ప్రారంభము.

౧ మిక్కిలిరమ్యమైనదియు ననేకవిధము లగు పుష్పఫలాదులతో నొప్పుచున్న వృక్షములు కలదియు నగు నొకయాశ్రమమును మధ్యమార్గమున రామచంద్రమూర్తి చూచి విశ్వామిత్రుని నివ్విధముగఁ బ్రశ్నించెను.

౨ ఓవిశ్వామిత్రమహర్షీ ! ఈయాశ్రమ మెంతమనోహరముగ నుండెనో చూడుము. కాని యిచ్చట నొకజంతువైనను గన్పడకుండెను. ఆశ్చర్యముగ నున్నది. దాని కారణ మేదియో యనుగ్రహించి చెప్పుము.

3-34 పైవిధముగ రామచంద్రమూర్తి ప్రశ్నింపఁగా విశ్వామిత్రుఁడు రామునితో నివ్విధముగఁ బలికెను. ఓరామచంద్రా ! పూర్వ మిది గౌతమాశ్రమము. కారణాంతరముచే గౌతముఁడే తనయాశ్రమమును జంతుసంచారరహితమునుగా శపించెను. (అని చెప్పెను)

---

జన్మముల పాపమంతయు నశించిపోవుననియు మఱియు గంగావృత్తాంతమును వినినను, నభిలషించినను, గంగను జూచినను, స్పృశించినను, గంగోదకమును బానముచేసినను, నందున స్నానముచేసినను, గీర్తించినను వానిని గంగ పవిత్రముచేయు ననియుఁ జెప్పఁబడినది.

తచ్ఛ్రుత్వా రాఘవ స్తస్య వచనం విస్మయావహం॥
పప్రచ్ఛ కౌశికం సద్య శ్శాపవృత్తం సమూలకమ్॥ ౪-౪౫

విశ్వామిత్రో౽థ తద్వృత్తి మారేభే వక్తు మాదితః॥ ౫

1 పురా బ్రహ్మా౽సృజ త్కన్యాం సర్వావయవసుందరీం
మనస్సంకల్పిత స్తస్యా *స్త్వహల్యాఖ్యాం చకార సః॥
అహో నవనవాశ్చర్యనిర్మాణరసికో విధిః॥ ౬-౬౫

సిద్ధగంధర్వసాధ్యానాం పతయో౽పి సమాగతాః॥
బ్రహ్మలోకం తత్ర విధే రంతికే సంస్థితాం పితుః
అహల్యాం వీక్ష్య తద్రూపమోహితాశ్చ గతత్రపాః॥
దేహి మే దేహి మే కన్యా మిత్యయాచన్పితామహమ్॥ ౭-౭౫

తతో మహేంద్రో౽పి పితామహం తం ద్రష్టుం సమాగత్య
తదంతికస్థాం, ప్రధానజాంబూనదశుద్ధవర్ణాం కన్యా మహ
ల్యాం తు దదర్శ ముగ్ధామ్॥ ౮-౮౫

* అహల్యాఖ్యా మితి. హల్యం నామ వికారరూపం. న విద్యతే
హల్యం యస్యాం సా అహల్యా. సర్వాంగసౌందర్యవతీత్యర్థః.
అథవా వేధాస్తు సర్వవస్తుషు సారం పరిగృహ్య తాం
నిర్మమే. హలా దేకస్మా దేవ సారం న జగ్రాహ. తస్మా ద
ప్యహల్యా నామేతి గ్రాహ్యమ్.

1 కవిః.

౩-౪॥ రామచంద్రమూర్తి యాకౌశికునివాక్యమును విని యాశ్చర్యమొంది గౌతముఁడు శపించినకారణమును సమూలకముగఁ జెప్పుమని విశ్వామిత్రు నడిగెను

౫ విశ్వామిత్రుఁడును గౌతముఁడు తనయాశ్రమమును శపించుటకుఁ గల కారణమును సమూలకముగఁ జెప్ప నారంభించెను.

౬-౭॥ పూర్వము బ్రహ్మదేవుఁడు మనస్సంకల్పమాత్రముననే సర్వాంగ సౌందర్యవతి యగు నొకకన్యను సృజించి యాకన్యకకు *అహల్యా యను నామకరణము చేసెను. ఆశ్చర్య మేమి ? బ్రహ్మ క్రొత్తక్రొత్త వస్తువులను నిర్మించుటయం దభిరుచికలవాఁడుకదా !

౮-౯॥ గంధర్వరాజులు సాధ్యులు సిద్ధులు మొదలగువార లొకప్పుడు బ్రహ్మలోకమునకు వచ్చి బ్రహ్మదేవునిసమీపమునం దుండిన త్రిలోకసుందరియైన యహల్యను జూచి యామెసౌందర్యముచే మోహితులై సిగ్గు విడిచి, నీకొమరితను నా కిమ్ము, నాకిమ్ము అని బ్రహ్మదేవుని బ్రార్థించిరి.

౧౦-౧౧॥ పిమ్మట దేవేంద్రుఁడు నొకప్పుడు బ్రహ్మదేవుని జూచుటకు వచ్చి యాపితామహుని సమీపమునం దున్నదియు, మేలిమిబంగారముతో సమానమగు శరీరకాంతికలదియుఁ, ద్రిలోకసుందరియు నగు నహల్యను జూచెను.

---

* అహల్య యను పదమునకు వ్యుత్పత్త్యర్థము వ్రాయఁబడుచున్నది. హల్య మనఁగా వికారరూప మని యర్థము. న + హల్య = వికారరూపము లేనిది, కాన అహల్యయని చెప్పఁబడినది. (అనఁగా నే యవయవమును జూచినను వంకరటింకర లేక సర్వాంగసౌందర్యము కలిగియుండె నని భావము) లేక బ్రహ్మదేవుఁడు అహల్యను సృష్టించునపుఁడు సమస్తవస్తువులయందలి సౌందర్యమును గ్రహించి యా సౌందర్యరాశిచే నహల్యను సృజించెను. కాని ఒక నాగలి యను వస్తువులోని సౌందర్యమునుమాత్రము గ్రహించనికారణముచే అహల్య యను నామము కలిగె ననియుఁ దెలియఁదగు.

అనంగరాజన్యమహారథస్య పతాకభూతాం ప్రసమీక్ష్య కన్యాం, సహస్రనేత్రానిమిషత్వయోస్తు ఫలం తదా ప్రాప సుపర్వరాజః॥ ౧౦-౧౦౪

ఇంద్రస్తదా ఽభూ ద్విషమస్వభావో రాజ్యేషు భోగేష్వపి తాం సమీక్ష్య, ధ్రువం విరాగీకృతమానసానాం స్వర్గస్య రాజ్యం భవితాల్పమేవ॥ ౧౧-౧౧౪

స్వాత్మ న్యేవం మహేంద్రస్తు చింతయామాస నైకథా॥ ౧౨

భాగ్యం స్త్రియో జన్మ మహాకులే హి తతో హి భాగ్యం సుమనోజ్ఞరూపం, తతో హి సాద్గుణ్య మతీవ భాగ్య మేత త్త్రియం చాస్తి సుపుణ్యతో ఽస్యామ్॥ ౧౩

స్వర్గాధిపత్యంచ మయా ప్రలబ్ధం వృథా భవిష్య త్యనయా వినా తత్, కృత్వాఽపి యాచ్ఞా మజకన్యకాయాః పాణిగ్రహార్థం నితరాం యతిష్యే॥ ౧౪

ఇతి సంచింతయ న్నేవ మఘవా ఽనంగపీడితః
న త చ్చిత్ర మనంగేన పీడితో ఽయ మితీతి యత్॥
యే నానంగేన రుద్రో ఽపి బభూ వార్ధశరీరధృత్
తదనంగశరాఘాతం సోఢుం కః ప్రభవే దలం॥ ౧౫-౧౬

౧౦-౧౦౪ మన్మథమహారాజురథమునకుఁ గట్టెడి ధ్వజమో యనున ట్లుండిన యాబ్రహ్మపుత్రిక యగు నహల్యను దేవేంద్రుఁడు చూచి తనకు వెయ్యినేత్రము లుండుటకును రెప్పపాటు లేకుండ నుండుటకును ఫలము నేటికిఁ గలిగె నని తలఁచెను. దేవతలకు అనిమిషులు అని పే రుండెను. (అనఁగా—రెప్పపాటు లేనివార లని దాని యర్థము.)

౧౧-౧౧౪ దేవేంద్రుఁడు, అహల్యను జూచి తనస్వర్గరాజ్యభోగములయందుఁ గూడ విరక్తికలవాఁ డయ్యెను. నిశ్చయముగ మనస్సునందు విరక్తి కలిగినవారికి స్వర్గరాజ్యముకూడ స్వల్పమే యగును.

౧౨ దేవేంద్రుఁడు తనమనస్సునందు బహువిధములుగ నప్పు డాలోచింపఁ దొడఁగెను.

౧౩ గొప్పవంశమునందు స్త్రీజన్మించుటయే భాగ్యము. అందునను సౌందర్యము కలిగియుండుట యంతకంటె భాగ్యము, సద్గుణసంపత్తి కలుగుట యంతకంటె మహాభాగ్యము. ఈయహల్యయందుఁ బూర్వపుణ్యముచే నీమూఁడుగుణములు నుండెను. ఏమి యహల్యభాగ్యము!

౧౪ నేను స్వర్గరాజ్యాధిపత్యము నొందితిని కాని యీ యహల్య నాకు సమకూడనిచో నాస్వర్గరాజ్యము వ్యర్థమే యని తలఁచెదను. బ్రహ్మను యాచించియైనను నీయహల్యను వివాహము చేసికొనుటకుఁ బ్రయత్నించెదను.

౧౫-౧౬ ఈప్రకారముగ నాలోచించుచునే దేవేంద్రుఁడు కామపీడితుఁ డయ్యెను. ఇతఁడు కామపీడితుఁ డయ్యె నను విషయములో నాశ్చర్యము లేదు. ఏకాముని బారికి తాళఁజాలక రుద్రుఁడును సగము శరీరమును దన భార్యవశముచేసి యర్థశరీరధారి యయ్యెనో యా యనంగునిబాణముల దెబ్బలను నెవ్వఁడు సహింపఁగలఁడు? (ఎవఁడును సహింపలేఁ డని భావము)

అథాబ్రవీ దాత్మభువం మరుత్వాన్ దేయాహి కన్యా
భవతా పరస్మై, తస్మా దహల్యాం భగవ న్ప్రసన్నో
మదంగసంగైకరసాం విధేహి॥ ౧౬

ఏతస్మిన్నేవ సమయే కేచి ద్దిక్పాలకా అపి
ద్రష్టుం విధిం సమాగత్యాహల్యాం తత్ర సమీక్ష్య తాం॥
మహ్యాం దేహీతి తే సర్వే సురజ్యేష్ఠం యయాచిరే॥
౧౭-౧౭½

తదాఽఽత్మభూ స్స్వమనసి విచారం గతవా నితి॥
తూష్ణీ మతిష్ఠ న్నహ మద్య కన్యా మిమాం కిమర్థం త్వ
సృజం సురూపాం, కస్మైచి దేషా యది దీయతేచే ద్భవేయ
మన్యస్యతు దుఃఖదోఽహమ్॥ ౧౮-౨౦

ఏతే సమాశ్శక్రపురోగమా మే కుర్యాం కి మస్మి న్విషయే
ఽహ మద్య, ఇతి స్వచిత్తే పరిచింతయానే ప్రజాపతౌ దేవ
ముని స్సమాగాత్॥ ౨౧

విచారయంతం తం దృష్ట్వా బ్రహ్మాణం ప్రాహ నారదః
విచారకారణం దేవ! మహ్యం బ్రూహి యథాతథమ్॥ ౨౨

ఇతి దేవర్షిసంపృష్ట స్సురజ్యేష్ఠో ఽవద త్తదా
అహల్యాసర్జనాదేవ విచారో మే సమాగతః॥

౧౭ ఇవ్విధముగఁ దనమనమునం దాలోచించి యనంతరము దేవేంద్రుఁడు బ్రహ్మనుగూర్చి యిట్లుఁ బలికెను. – ఓపితామహా! నీవు కన్యకను నెవనికైన నితరునకు నీయవలసినదే కదా! అందువలన నాయం దను గ్రహించి నీకొమరితయగు నహల్యను నాదేహసంబంధినిరాల నుగాఁ జేయుము. (అనఁగా నా కిచ్చి వివాహముచేయు మని భావము)

౧౮–౧౮½ ఈసమయముననే కొందఱు దిక్పాలకులును బ్రహ్మదేవుని జూడ వచ్చి యచ్చట నహల్యను జూచి తత్సౌందర్యమోహితులై నా కిచ్చి వివాహముచేయుము, నా కిచ్చి వివాహము చేయుము అని వారలు బ్రహ్మదేవుని బ్రార్థించిరి.

౧౯–౨౦ అప్పుడు బ్రహ్మదేవుఁడు తనమనమున నిట్లు విచారింపఁదొడగెను. (ఏమనఁగా) నే నూరకుండక యిట్టి త్రిలోకసుందరి యగు కన్యక నెందుకు సృష్టించితిని. ఈ దేవతలలో నెవనికైన నొక్కనికి నీకన్య నిచ్చినచో రెండవవానికిఁ గష్టమును గలుగఁజేసినవాఁడ నగుదును.

౨౧ ఇంద్రుఁడు మొదలగువారలందఱును నాకు సమానులే. ఈవిషయ ములో నే నిప్పు డేమి చేయుదును? ఈవిధముగ బ్రహ్మదేవుఁ డాలోచింపుచుండఁగా నారదమహర్షి యచ్చటకు వచ్చెను.

౨౨ ఆనారదుఁడు దీర్ఘాలోచనము చేయుచున్న బ్రహ్మను జూచి, తండ్రీ! నీ వింత దీర్ఘాలోచనములో నుండినకారణమును యథా ర్థముగ నాకుఁ జెప్పు మని బ్రహ్మదేవు నడిగెను.

౨౩–౨౩½ ఈప్రకారము నారదునిచే నడుగఁబడి బ్రహ్మదేవుఁ డిట్లుఁ జెప్పెను. నారదా! నే నూరకుండక యహల్యను సృష్టించియుంటిని అందువలననే యీవిచారమంతయు నాకుఁ గలిగినది (దేవతలంద ఱును "నా కిమ్ము నాకిమ్ము" అని యడుగుచుండిరి. ఒకని కిచ్చిన

ఇత్యాత్మని స్థితం సర్వం మునయే ప్రావద ద్విధిః॥ ౨3౫

ఉపాయ మథ దేవర్షి ర్విచిం త్యాహ పితామహం॥
భూప్రదక్షిణ మాధాయ ప్రథమం య స్సమాపతేత్
తస్మై దద్యా మిమాం కన్యా మితి త్వం వద దేవతాః॥
౨౪-౨౫

ఇతి నారదవాక్యంతు శ్రుత్వా ఽజో ఽపి ముదం గతః
తథైవ ప్రాహ శక్రాదీ న్పరమేష్ఠీ దివౌకసః॥ ౨౬

అథ దిక్పాలకాశ్చాపి నిర్యయు ర్భూప్రదక్షిణం
అనాహూయాపరం చైక స్త్వజ్ఞాత్వాచ పరస్పరమ్॥ ౨౭

అత్రాంతరే నారదో ఽపి స్వచిత్తే పర్యచింతయత్
త్రిదశానాం వశం నేయా దహ ల్యేయం గుణాధికా॥
కింతు బ్రహ్మర్షయే త్వేషా దాపనీయా విధే స్సుతా॥
౨౮-౨౮౫

అస్మి న్కాలే గౌతమస్తు దృశ్యతే తపసా ఽధికః॥
కించ వ్రతీ మహావిద్వాన్ యోగినా మగ్రణీశ్చ సః
ఇతి సంచింత్య దేవర్షి గౌతమాశ్రమ మాగతః॥
తదాశయం స్వయం జ్ఞాత్వా ఽహల్యాం దాపయితుం తతః॥
౨౯-3౦౫

గౌతమ స్యాశ్రమం జంతువిరోధపరివర్జితం॥ 3౧
ప్రశాంతం నారదో ఽవేక్ష్య విస్మయం గతవా నభూత్॥ 3౧౫

రెండవవానికిఁ గష్టము కలుగును. నే నేల సృజించితి నని విచారించు చుంటి నని బ్రహ్మ నారదునితోఁ దన మనోగత మగు విచారకారణ మును జెప్పెను.

౨౮-౨౫ అనంతరము నారదుఁ డొకయుపాయము నాలోచించి బ్రహ్మ దేవునితో నిటులఁ బలికెను. ఓ తండ్రీ! ఎవఁడైతే ముందుగ భూప్రదక్షిణముచేసివచ్చునో వానికి నాకన్యక నిచ్చెద నని దేవత లతోఁ జెప్పుము. నీబాధ తొలఁగు ననెను.

౨౬ ఈప్రకారముగ నారదుఁడు చెప్పఁగా విని బ్రహ్మదేవుఁడు సంత సించి తనసమీపమునకు వచ్చిన యింద్రాదులతో నవ్విధముగనే చెప్పెను.

౨౭ అనంతరము మహేంద్రుఁడు మొదలగుదిక్పాలకులు ఒకని నొకఁడు పిలువకుండఁగను నొకరి కొకరు పరస్పరము తెలియకుండఁగను భూప్రదక్షిణమునకు బయలుదేరిరి.

౨౮-౨౯ ఈలోపల నారదుఁడు తనమనమునం దిటుల నాలోచించెను, రూపశీలవిద్యావినయములు కల యీకన్యకను దేవతలవశము కానీ యకుండఁగఁజేసి బ్రహ్మర్షులలో నెవనికైన నిప్పించవలయును.

౨౯-౩౦ ఈకాలమున గౌతముఁడు మహాతపస్సంపన్నుఁడుగా నుండెను. అతఁడు బ్రహ్మచారియు మహావిద్వాంసుఁడును యోగులలో నగ్రే సరుఁడునై యుండెను. అతని కిప్పించుట మంచి దని యాలోచించి యనంతరము గౌతముని యభిప్రాయమును దెలిసికొని యమ్మహర్షి కిప్పింపఁ గుతూహలముతో గౌతమాశ్రమమునకు నారదుఁడు వచ్చెను.

౩౧-౩౧ ఆగౌతమాశ్రమము జంతువిరోధము లేక బహుశాంతముగా నుండు టఁజూచి నారదుఁడు మిక్కిలి యాశ్చర్యము నొందెను.

క్రీడన్మాణవకాంఘ్రీణాం తాడనై రతిజాగ్రతః॥
వ్యాఘ్రిస్యతు నఖైః కండూ వినోదం కురుతే మృగః॥
౩౨-౩౨½

పృసుప్తనకులశ్వాసవాత మత్తి సరీసృపః॥
బిడాలడింభకైస్సాకం తత్ర ఖేలంతి మూషికాః॥ ౩౩-౩౩½

ఏవం మనోన్యమిత్రత్వయుతజంతుం మహామునిః॥
గౌతమస్యాశ్రమం గత్వా తేన సంపూజితో ఽవదత్॥
౩౪-౩౪½

బ్రహ్మచర్యేణ తపసా మునే! జీర్ణం వయస్తవ॥
అద్యవా భజ గార్హస్థ్యం త్వద్వంశస్యాభివృద్ధయే॥
౩౫-౩౫½

గౌతమః—
నైష్ఠికబ్రహ్మచర్యాణాం త్యాజ్యం విషయజం సుఖం॥
తత్రాపి కాంతావిషయం సుతరాం త్యాజ్యమేవ హి॥
౩౬-౩౬½

తపస్వినో ఽతిజీర్ణాంగసంయుతస్య మమాద్యతు॥
కింవా గార్హస్థ్యసౌఖ్యం స్యాద్వద నారద! తత్త్వతః॥
౩౭-౩౭½

౩౨-౩౨½ గౌతమాశ్రమమునందుఁ బెద్దపులులు నిద్రింపుచుండఁగా నచ్చటఁ గ్రీడించుచున్న బాలురు తమపాదతాడనములచే నాపులులను లేపుచుండిరి. ఆపులులు లేచి తిరుగుచుండఁగా వానిగోళ్ళకుఁ దమశరీరమును రాచుకొని లేళ్ళు తమశరీరగత మగు దురదను బోఁగొట్టుకొనుచుండెను.

౩౩-౩౩½ మఱియు నాగౌతమాశ్రమమునందు ముంగిసలు నిద్రించుచు విడుచుచున్న నిట్టూర్పువాయువులను సర్పములు భక్షించుచుండెను. ఎలుకలు పిల్లిపిల్లలతోఁగూడ నచ్చట నాడుకొనుచుండెను.

౩౪-౩౪½ ఈప్రకారము పరస్పరమైత్రితోఁ గూడిన జంతువులు కల గౌతమాశ్రమునకు నారదుఁడు వెళ్లి యమ్మునిచేఁ బూజింపఁబడి యిటుల నమ్మునితోఁ బలికెను

౩౫-౩౫½ ఓగౌతమమహాముని! నీవయస్సంతయు బ్రహ్మచర్యముచేతను దపస్సుచేతను జీర్ణమయినది (అనఁగా నెంతకాల మింక బ్రహ్మచర్య మని భావము). ఇప్పుడైనను వంశాభివృద్ధికొఱకు గృహస్థాశ్రమమును బ్రవేశింపుము. (అని తాను వచ్చిన కార్యమున కనుకూలముగా నారదుఁడు పలికెను)

౩౬-౩౬½ గౌతముఁ డప్పు డిటులఁ జెప్ప నారంభించెను.—ఓనారదా! నైష్ఠికబ్రహ్మచారులకు విషయసుఖము కూడదుగదా! అందునను స్త్రీవిషయక మగు సౌఖ్యము బొత్తిగఁ గూడదు గదా యనెను.

౩౭-౩౭½ మఱియు గౌతముఁ డిటులఁ జెప్పెను.—ఓ నారదా! నీవు గృహస్థాశ్రమములో నన్నుఁ బ్రవేశపెట్టుట కాలోచించుచున్నావుకాని శరీరమంతయు ముడతలు పడి వార్థక్యదశలో నున్న నాకు గృహస్థాశ్రమములో నేమి సౌఖ్యము కలుగునో నీవే యాలోచింపుము.

గృహస్థాశ్రమనిష్ఠానాం క్లేశా న్దృష్ట్వా ప్యహం మునే!
కథం ప్రీతిం వహేయం తద్గార్హస్థ్యే వద నారద! ౩౮-౩౮½

ద్యూతం మద్యం తథా కండూ శ్చాహారః కలహ స్తథా
నిద్రా నారీసేవనా త్తు వర్ధతే నాన్యథా మునే!
౩౯-౩౯½

గృహస్థకష్టదృష్టేశ్చ సంసృతౌ నా స్తి మే రతిః॥
మాప్రవేశయ దేవర్షే గార్హస్థ్యే మాం నమో ఽస్తు తే॥
౪౦-౪౦½

ఇతి సంసారవిరతసంసూచివచనం మునేః॥
నిశమ్య నారదో ఽహల్యాం వర్ణయామాస నైకథా॥
౪౧-౪౧½

బ్రహ్మణా నిర్మితాం సాక్షా దష్టదిక్పాలకై ర్వృతాం॥
త్రిజగన్మోహినీం కన్యా మహల్యాం లోకసుందరీం
తే దాపయితుకామో ఽహం గౌతమాద్య సమాగతః॥
భోక్తుం తాం నా స్తి. యోగ్య స్తే కిం కుర్యా మద్య గౌతమ!
సంచింత్యచ పున స్త్వం మే వద కృత్వా వినిర్ణయం॥
౪౨-౪౪

౩౮-౩౮½ ఓ నారదా ! గృహస్థాశ్రమములోఁ బ్రవేశించియున్నవారలు పడు కష్టములను కండ్లారఁ జూచుచు నట్టిగార్హస్థ్యమునం దెటులఁ బ్రీతిని నేను వహించెదను? వహింప నని భావము.

౩౯-౩౯½ కొలఁదిదివసములు గార్హస్థ్యములోనుండి పిదప తపస్సునకుఁ దిరిగి వెళ్ళవచ్చు నని నారదుఁ డనునేమో యని దానికిఁగూడ ముందుగనే సమాధానము చెప్పుచుండెను. ఓ నారదా ! జూదము, మద్యము, దురదయు, ఆహారము, కలహము, నిద్ర, స్త్రీ వీనిజోలికిఁ బోఁగూడదు వానిజోలికిఁ బోయినచో నవి క్రమముగా నభివృద్ధి యగును. వానిని సేవింపకుండిన యవి యభివృద్ధిచెందవు. (కాన స్త్రీజోలికిఁ బోయినచో జీడివలె నంటుకొని వదలదని భావము)

౪౦-౪౦½ ఓనారదా ! గృహస్థులు పడు పాట్లు చూచుచుండుటవలనఁ గూడ నాకు సంసారమునం దిచ్ఛ లేదు. నన్ను గృహస్థాశ్రమములోఁ బ్రవేశపెట్టు నాలోచనము మాత్రము చేయకుము. నీకు నమస్కార మనియెను.

౪౧-౪౧½ ఈప్రకారముగ సంసారములో విరక్తిని సూచించుచు గౌతముఁడు పలుకఁగా నారదుఁడు విని యప్పుడు తాను వచ్చినకార్యము చెడిపోవుచున్న దని విచారించుచు నహల్యాసౌందర్యాదిగుణములను వర్ణింప నారంభించెను.

౪౨-౪౪ ఓ గౌతముఁడా ! బ్రహ్మదేవుఁడు మనస్సంకల్పముచే నొకకన్యకను సృజించెను. ఆకన్యక త్రిలోకసుందరియై యుండెను. ఆకన్యకనే యహల్య యనెదరు. ఆయహల్యను దేవేంద్రుఁడు మొదలగు దిక్పాలురుగూడఁ బ్రేమించుచుండిరి. అట్టి బ్రహ్మమానసపుత్రిక యగు నహల్యను నీ కిప్పించి వివాహముచేయింపఁగోరికతో నే నిప్పుడు నీయొద్దకు వచ్చితిని. ఆయహల్య ననుభవించుయోగము నీకు లేదు. నే నేమి చేయుదును ? నీవు బాగుగ మఱియొకపర్యాయ మాలోచించుకొని నాకుఁ జెప్పు మని నారదుఁడు గౌతమునితోఁ జెప్పెను.

ఇతి దేవర్షిణా సమ్య క్సంస్తుతాయాస్తు గౌతమః
అహల్యాయాః కులం రూపం శ్రుత్వా కామాంకురాంచితః॥
అర్థాంగీకారభావంతు మునయే౽సూచయ త్తదా॥ ౪౫-౪౫

హృది సంచింతయామాస నారదశ్చ తతఃపరం॥
భూప్రదక్షిణ మాధాయ ప్రథమం య స్సమాపతేత్
తస్మై దేహీ త్యతః పూర్వం బ్రహ్మణ మహ మబ్రువం॥
౪౬-౪౭

భూప్రదక్షిణహీనాయ గౌతమాయ మహర్షయే
దాప యేయం కథం న్వద్య సుతా మాత్మభువ స్త్వహమ్॥
ఇ త్యాలోచయతా తేన గౌతమ స్యాశ్రమే తదా
నవప్రసవభారార్తా ద్విముఖీ గౌ రదృశ్యత॥ ౪౮-౪౯

తదా గౌతమహ స్తంతు స్వహ స్తే నాదద న్మునిః
నీ త్వోభయముఖీగోస్తు మునినా కారయ న్నతిమ్॥ ౫౦

ద్విముఖీగో ర్నమస్కర్తా భూప్రదక్షిణకృత్ఫలం
సమాప్నోతీతి శాస్త్రాణి ఘుష్యంతీ త్యకరో త్తథా॥ ౫౧

తత స్తం గౌతమం నీత్వా నారదో బహ్మణో౽ంతికం
కస్మై ప్రదేయేతి తదా *చింతయంతం విధింప్రతి॥

---

* చింతయంత మితి- కన్యాంప్రతి సర్వదా౽పి పితు ర్విచార ఏవే త్యభియుక్తై ర ప్యుక్తం తథాహి - జాతేతి కన్యా

౪౫-౪౫ ఈప్రకారము నారదునిచే వర్ణింపఁబడిన యహల్యకులశీల రూపాదులను గౌతముఁడు విని కామాంకురము కలవాఁడై యర్ధాంగీకారభావమును సూచించెను (అనఁగా నీయిష్టము వచ్చిన విధముగఁ జేయు మనెను)

౪౬-౪౭ గౌతముఁ డంగీకరించిన యనంతరము నారదమహర్షి తనమనమునం దిటుల నాలోచింపఁదొడగెను (ఏమన) భూప్రదక్షిణము చేసి ముందుగ నెవఁడు నీయొద్దకు వచ్చునో వానికి నీకోమలిత నిచ్చి వివాహముచేయు మని బ్రహ్మదేవునితో నే నిదివరలోఁ జెప్పియుంటిని.

౪౮-౪౯ భూప్రదక్షిణము చేయని గౌతమునకు నే నెటుల నహల్య నిప్పింపఁగల నని నారదుఁ డాలోచింపుచుండిన సమయమున గౌతమాశ్రమమునఁ గ్రొత్తగ నీనుచున్న యొక ద్విముఖి యగు గోవు నారదునకుఁ గన్పడెను. (ద్విముఖి యనఁగా శిశువుయొక్క శిరస్సు వెనుకవైపున నుండెను. ముందొకముఖ ముండెను. కాన నాగోవు ద్విముఖిగో యని చెప్పఁబడును)

౫౦ అప్పుడు నారదుఁడు గౌతమునిహస్తమును బుచ్చుకొని యీనుచున్న గోవుయొద్దకుఁ దీసికొని వెళ్ళి గౌతమునిచే నాగోవుకు నమస్కరింపఁజేసెను.

౫౧ నారదుఁ డటులఁ జేయఁ గారణ మేమనఁగా రెండుప్రక్కలముఖములుగల యీనుచున్న గోవుకుఁ బ్రదక్షిణముచేసినవాఁడు భూప్రదక్షిణముచేసిన ఫలము నొందఁగలఁడని శాస్త్రములు ఘోషించుచుండెను. (కాన నటులఁజేసెను.)

౫౨-౫3 అనంతరమ నారదుఁడు గౌతముని వెంట నిడుకొని బ్రహ్మసమీపమునకుఁ దీసికొని వెళ్లి, "నే నీకన్య నెవని కిచ్చి వివాహము చేయుదునా" యని *విచారించుచున్న బ్రహ్మతో నిటులఁ బలికెను. ఓ

* బ్రహ్మ విచారించుచుండె ననుటచేఁ గన్యకనుగూర్చి తండ్రికి నెల్లప్పుడు విచారమే యని ప్రాచీనులుకూడఁ జెప్పియుండిరి. (ఏమ

ప్రోహేదం వచనం కన్యా మస్మై దేహి పితామహ !
ద్విముఖీ గో ర్భవత్యా ఽభూ దుభ్యపక్షిణవా నయమ్॥ ౫౨-౫౩

తదా స్వయంభూః పరిచింత్య తస్మై నిజాత్మజాం గౌతమ
తాపసాయ, దత్వా వివాహం విధినా విధాయ సంప్రేష్య
కన్యాం * విగతజ్వరో ఽభూత్॥ ౫౪

తౌ నవ్యదంపతీ దృష్ట్వా సంజజల్పు ర్మిథో జనాః
బ్రహ్మణా సుకృతం లోకే ధాంపత్యం నహి దృశ్యతే॥ ౫౫

---

మహతీ విచింతా కస్మై ప్రదేయేతి మహా న్వితర్కః,
దత్తా సుఖం యాస్యతి వా నవేతి కన్యాపితృత్వం ఖలు
నామ కష్టమ్—ఇతి.

* విగతజ్వరో ఽభూ దితి- ఇత్థ మేవ కాళిదాసోఽపి వర్ణితవాన్
తథాహి—శకుంతలాం దుష్యంతనికటంప్రతి ప్రేషయ న్కణ్వ
మహర్షి రపి—అర్థోఽహి కన్యా పరకీయఏవ తా మద్య
సంప్రేష్య పరిగ్రహీతుః, జాతో మ మాయం విశదః ప్రకా
మం ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా॥ ఇతి మన్యే—ఇతి.

పితామహా! అహల్యను గౌతమున కిచ్చి వివాహముచేయుము. ఈ గౌతముఁడు ద్విముఖీగోవునకుఁ బ్రదక్షిణము చేసినకారణమున భూప్రదక్షిణము చేసినవాఁ డయ్యెను.

౨౮ అప్పుడు బ్రహ్మదేవుఁడు ఆలోచించి తనకొమరితె యగు నహల్యను గౌతమమునీంద్రున కిచ్చి యథావిధిగా వివాహముచేసి కన్యను బంపి * పరితాపమును విడిచినవాఁ డయ్యెను.

౨౯ అప్పుడు నూతనదంపతు లగు నహల్యాగౌతములను జూచిన జను లివ్విధముగఁ బరస్పరము మాట్లాడుకొనుచుండిరి. బ్రహ్మదేవుఁడు లోకములో ననుకూలదాంపత్యము నొకదానినైనను జేసినటులఁ గన్పడదు.

---

నఁగా) ఆడపిల్లపుట్టుటతోడనే మొగపిల్లవాఁడు కాకపోయె నని యెడి విచారమును, ఆపిల్ల పెఱుగుచుండఁగా నెవని కిచ్చి వివాహముచేయుదునా యనెడి విచారమును, ఒకని కిచ్చి యాపిల్లను వివాహముచేసినపిదపఁగూడఁ జక్కఁగాఁ దనకొమరితె సుఖపడునో లేదో యను నాలోచనమును దండ్రికిఁ గలుగుచునే యుండు నని. కాన నాడపిల్లలకుఁ దండ్రి యగుటకంటె కష్టతరము మఱియొకటి యుండదు.

* బ్రహ్మదేవుఁడు తనకొమరితను వివాహముచేసి పంపినపిదపఁ బూర్వము తన కుండిన పరితాపమును విడిచె నని వర్ణించిన విధముననే కాళిదాస కవి వర్ణించెను.—శకుంతలను దుష్యంతునియొద్దకుఁ గణ్వమహర్షి పంపినపుడు ఇటులనే తలఁచెను. కన్యక పరునిసొమ్ము కాని మనసొత్తు కాదు. ఇప్పుడు శకుంతల నత్తవారింటికిఁ బంపుటవలన, నొకనింట నెరవుసొత్తును దెచ్చుకొని తిరిగి జాగ్రతగ నప్పగించినపుడు మనస్సు నిర్మలముగా నుండునటుల నాయంతరాత్మకూడఁ గడు నిర్మలముగా నుండెను. (అని తలఁచెను.)

య స్సుందర స్తద్వనితా కురూపా దృశ్యతే క్షితౌ
యా సుందరీ తత్పతిస్తు కురూపో దృశ్యతే ఽవనౌ॥
యతోఽభయం తత్ర భవే ద్దారిద్ర్యంచ విశేషతః
చేష్టితాని విధే ర్నూనం విచిత్రాణి భవంతి హి॥ ౫౬-౫౭

దంతావిశీర్ణాః కేశాస్తు కాశసూనసమా మునేః
గౌతమస్య వయో జీర్ణ మద్యా స్యాహో రతి స్త్రియామ్॥ ౫౮

సా సర్వమంగళా ఽహల్యా సౌఖ్యం కిం లభతే ఽమునా
ఇతి కేచి త్సంజజల్పు స్తద్దాంపత్యదృశో జనాః॥ ౫౯

పాణౌ గృహీతా స్నేహేన వర్థితా కరదీపికా
యథా న స్వోపకారాయ వృద్ధస్య తరుణీ తథా॥
ఇతి కేచి ద్దురాత్మాన శ్చింతయంతిస్మ తద్దృశః॥ ౬౦-౬౦½

అథ తాం గౌతమో ఽహల్యాం నీత్వా నిజనికేతనం॥
స్వాశ్రమం సర్వశోభాఢ్యం చకార స్వతపోబలాత్॥ ౬౧-౬౧½

నవమన్మథరూప స్స న్స్వయ మాసీ త్తపోబలాత్॥
యోగశక్త్యా యువాభూత్వా ఽహల్యయాసౌఖ్యమాపసః॥ ౬౨-౬౨½

౫౬-౫౭ వరుఁడు చక్కనివాఁడుగా నుండిన వధునైన నాకారిగా నుండును. వధువు చక్కనిదియైనచో వరుఁడైనను రూపహీనుఁడుగా నుండును. ఒకానొకచోట దంపతు లిద్దఱును జక్కనివారలై యనుకూలదాంపత్యముచే నొప్పుచున్నచో నచ్చట దారిద్ర్యము విశేషముగా నుండును. కాన బ్రహ్మదేవుని చేష్టలు కడువిచిత్రములుగా నుండును (ఈయహల్యాగౌతముల దాంపత్యము సరిగా లేదని తలఁచిరని భావము.)

౫౮ ఈగౌతమునకుఁ బండ్లూడిపోయినవి. తలవెంట్రుకలు తెల్లపూవువలెఁ దెల్లఁగా నుండెను. గౌతమునివయస్సంతయు జీర్ణమయ్యెను. (అనఁగా వార్థక్యము వచ్చెను.) ఇట్టిస్థితిలో నీగౌతమునకు వివాహాపేక్ష కలుగుటయే యాశ్చర్యముగా నున్నది.

౫౯ సర్వమంగళాస్పదురాలగు నహల్య యీగౌతమునివలన నేమి సౌఖ్యము నొందఁగలదు? (పొందలేదని భావము.) అని యివ్విధముగ వారి దాంపత్యమును జూచిన కొందఱు పరస్పరము సంభాషించుకొనుచుండిరి.

౬౦-౬౦½ మఱికొందఱు దురాత్ములు క్రిందివిధముగఁ దలఁచుచుండిరి. కరదీపిక (చేతికాగడ) చేతితోఁ బట్టుకొనఁబడినదయ్యును, స్నేహముచేఁ (నూనెచే) బెంపుచేయఁబడుచున్నదయ్యును, నితరున కుపకరించిన విధముగ వృద్ధునిభార్యయును నెంతగ భర్తచేఁ జేతిలోఁ బెట్టుకొనఁబడినదైనను, స్నేహముచేఁ (ప్రేమచే) బెంపఁబడు చున్నను, నితరున కుపకరించినటుల భర్త కుపకరించదు. (అని తలఁచుచుండిరి.)

౬౧-౬౧½ అనంతరము గౌతముఁడు తనభార్యయైన యహల్యను దనయాశ్రమమునకుఁ దీసికొని వెళ్లి తనతపోబలముచేఁ దనయాశ్రమమును మిక్కిలిశోభాయమానముగాఁ జేసెను.

౬౨-౬౨½ ఆగౌతమమహర్షి తనతపోబలముచే నవమన్మథుఁడువలె దివ్యసుందరవిగ్రహుఁడై యువకుఁడునై, యహల్యాదేవితోఁగూడ గృహస్థసౌఖ్యముల ననుభవించుచుండెను.

గౌతమాహల్యయో శ్శీఘ్రకాలే పుత్రోద్భవో ఽప్యభూత్॥
శతానందసమాఖ్యాంచ చకార స్వాత్మజస్య సః॥ ౬౩-౬౩½

భూప్రదక్షిణ మాధాయ మహేంద్రో ఽథ సమాగతః॥
అహల్యాం సత్వరం ధాత ర్మహ్యం దేహీతి పృష్టవాన్॥
౬౪-౬౪½

గౌతమా యాఽదదం పూర్వం భూప్రదక్షిణకారిణే॥
అహల్యా మితి కే నోక్త శ్శక్రో వక్రమనా స్తదా
పితామహ మిదం ప్రాహ క్రోధేన మహతావృతః॥ ౬౫-౬౬

యేన కేనా ప్యుపాయేన యస్మి న్కస్మి న్దినేపివా
భుంజీయం కన్యకాం తే ఽహ మిత్యుక్త్వా ఽగాత్సురేశ్వరః॥
అవకాశం విచిన్వాన శ్చిరం తూష్ణీ మతిష్ఠత్॥ ౬౭-౬౭½

కదాచన నిశీథేతు గౌతమాశ్రమ మాగతః॥
చరణాయుధవ త్తత్ర చుకూజ మఘవా పునః॥ ౬౮-౬౮½

ఉషఃకాలో ఽభవ దితి గౌతమో ఽపి నదీం గతః॥
స్నాత్వా తపః కరోతిస్మ నదీతీరే శుభావహే॥ ౬౯-౬౯½.

అథ గౌతమవేషేణ వివే శేంద్రో మునే ర్గృహమ్॥ ౭౦

౬౩-౬౩½ ఆయహల్యాగౌతములకు శీఘ్రకాలములోఁ బుత్రోత్పత్తికూడ నయ్యెను. గౌతముఁడు తనపుత్రునకు శతానందుఁ డని నామకరణము చేసెను.

౬౪-౬౪½ అనంతరము దేవేంద్రుఁడు భూప్రదక్షిణముచేసి బ్రహ్మదేవు నొద్దకు వచ్చి నీపుత్రిక నిచ్చి శీఘ్రముగ వివాహముచేయు మని బ్రహ్మదేవు నడిగెను.

౬౫-౬౬ అప్పుడు బ్రహ్మదేవుఁడు దేవేంద్రునితో నివ్విధముగఁ జెప్పెను. గౌతముఁడు నీకంటె ముందుగ భూప్రదక్షిణముచేసి వచ్చిన కత మున నతనికి నే నహల్య నిచ్చి యింతకుఁబూర్వమే వివాహముచేసి యుంటిని పిల్లవాఁడు కూడఁ బుట్టెను ఇప్పుడు వచ్చిన నే నేమి చేయుదు నన నపుడు దేవేంద్రుఁడు కుటిలమనస్సుకలవాఁడై కోప ముతో బ్రహ్మదేవునిగూర్చి యిటులఁ బలికెను.

౬౭-౬౭½ ఓపితామహుఁడా! నన్ను నీ వింతమోసము చేసెద వని యెఱుఁ గనైతి. నన్ను నీవు వంచించినటులనే నేనుకూడ నేయుపాయముచే నైనను నహల్యను నొకదినముననైనను మోసగించెదను జూడు మని చెప్పి తనస్వర్గమున కింద్రుఁడు వెళ్లెను కాని యవకాశము దొరక నందునఁ జిరకాలము దేవేంద్రుఁ డూరకయే యుండెను.

౬౮-౬౮½ ఒకప్పుడు అర్ధరాత్రియందు దేవేంద్రుఁడు గౌతమాశ్రమము నకు వచ్చి యాశ్రమసమీపమునం దుండి కోడికూసినట్లు కూసెను.

౬౯-౬౯½ ఉషఃకాలము కావచ్చె నని గౌతముఁడు తలంచి నది కేఁగి స్నానముచేసి నదీతీరముననే తపమును జేసికొనుచుండెను.

౭౦ ఆయవకాశమును జూచి దేవేంద్రుఁడు గౌతమునిగృహమును నమ్మునివేషముతోఁ బ్రవేశించెను.

పతివ్రతా పతిం దృష్ట్వా శ్రద్ధయాపరయా సతీ
దేవస్థానేచ వస్తూనాం సంచయం కర్తు ముద్యతా॥ ౭౧

తత స్తా మబ్రవీ ద్దార్త్తో మునివేషధరో హరిః
ప్రద్యుమ్నవశగో వామే! దేహి మే చుంబనాదికమ్॥ ౭౨

ఏతస్మి న్నంతరే. సా ఽపి త్రపాయుక్తా ఽబ్రవీ దిదం
దేవకార్యాదికం త్యక్త్వా వక్తుం నార్హసి మే ప్రభో॥
సర్వం జానాసి ధర్మజ్ఞ ! పుణ్యానాం నిశ్చయం విభో !
శుభకర్మార్హవేళాయా మధునైవ న యుజ్యతే॥ ౭౩-౭౪

తత స్తాం సంనిరీ క్ష్యాహ మఘవా కామపీడితః
అలం ప్రియేన వక్తవ్యం హ్యత్సంమోహో ఽద్య జాయతే॥
కర్తవ్యం చా ప్యకర్తవ్యం పత్యు ర్వచనసంమతం
కరోతి సతతం యాచ సాచ నారీ పతివ్రతా॥ ౭౫-౭౬

లంఘయే ద్యాచ తస్యాజ్ఞాం సురతేచ విశేషతః
పుణ్యం తస్యా ఽభవే న్నష్టం దుర్గతిం చాపి గచ్ఛతి॥
ఇత్యుక్త్వా తాం పరిష్వజ్య కృత స్తేన మనోరథః॥ ౭౭-౭౯

ఏతస్మి న్నంతరే తత్ర సమాధౌ సంస్థితో మునిః॥
శచీపతేస్తు దుర్వృత్తం జ్ఞాత్వా తూర్ణం వినిర్గతః
స్వనికేతన మాగత్య ద్వారదేశే స్థితో ఽభవత్॥ ౮౦-౮౧

౨౧ గౌతమవేషముతో వచ్చిన దేవేంద్రునిజూచి భర్త యనుకొని పతి వ్రత యగు నాయహల్య మిక్కిలిశ్రద్ధాభక్తులతో దేవతాగృహ ములోఁ బూజకుఁ గావలసినవస్తువులను సిద్ధము చేయ నారంభించెను.

౨౨ మునివేషమును ధరించిన యింద్రుఁడు కామపీడితుఁడై యహల్యతో నిర్విధముగఁ బలికెను. ఓప్రేయసి ! నేను కామపీడితుఁడనై యుం టిని. నా కోకమూలు ముద్దిడుము. (అని పలికెను)

౨౩_౨౪ ఈసమయమున నాయహల్యయును లజ్జపడి యిట్లు పలికెను.— ఓనాథా ! దేవపూజాదులను విడిచి యిటులఁ జెప్పఁదగదు. నీవు సర్వ ధర్మముల నెఱిఁగినవాఁడవు. పుణ్యాపాపములనిశ్చయము నెఱుఁగు దువు. శుభకర్మలను జేసికొను సుషఃకాలమున నిటులఁ గామభోగ ములం గోరుట యుక్తము కా దనెను.

౨౫_౨౬ ఆయహల్యను జూచినకొలఁది కామ మెక్కుడుకాఁగా దేవేంద్రుఁ డిటులఁ బలికెను.—ఓప్రేయసీ! చాలు చాలు. నీ విటులఁ జెప్పఁగూ డదు. ఇప్పుడు నాహృదయము పరితపించుచున్నది చేయఁదగిన కార్యమైనను జేయఁదగనికార్యమైనను భర్త చెప్పినటుల నేస్త్రీ చేయునో యాస్త్రీయే పతివ్రత యని చెప్పనగును.

౨౭_౨౭½ ఎవ్వతె కామోపభోగవిషయమై భర్త్రాజ్ఞ నతిక్రమించునో యామె పుణ్యమంతయు నష్టమగుటయే కాక దుర్గతులను గూడ నామె పొందు నని శాస్త్రము చెప్పుచున్నది. నీకు ధర్మము తెలియదు—అని చెప్పుచు దేవేంద్రుఁ డా యహల్యను గౌఁగిలించుకొని తనమనోరథ మును సఫలము చేసికొనెను.

౨౮_౨౯ ఈసమయమున గౌతముఁడు నదీతీరమున సమాధిలో నుండి తన గృహమునందలి దేవేంద్రుని దుర్వృత్తిని దెలిసికొని తొందరగ బయలుదేరి తనగృహమునకు వచ్చి తద్ద్వారప్రదేశమున నిల్వఁబడి యుండెను.

శక్రో ఽపి లబ్ధకామ స్స న్మున్యాగమనశంకయా
నిర్గత్య బహి రాగత్య మునిం వీక్ష్య భయాన్వితః॥
పృషదంశకరూపంతు ప్రాప్య చాపససారహ॥ ౨౦-౨౦౫

ముని స్త త్రావద త్త్వం వై క స్త్వం మార్జాలరూపధృత్॥
భయా త్తస్య మునే రగ్రే శక్రః ప్రాంజలి రాస్థితః॥ ౨౧-౨౧౫

మఘవం తం పురో దృష్ట్వా చుకోప మునిపుంగవః॥
య త్త్వయా చేదృశం కర్మ భగార్థం ఛలసాహసం
కృతం తస్మా త్తవాంగంతు సహస్రభగ ముత్తమం॥
* భవ త్విహతు పాపిష్ఠ! లింగం తే నిపతిష్యతి॥ ౨౨-౨౩౫

గచ్ఛ మే పురతో మూఢ! సురస్థానం శచీపతే!
ఇతి గౌతమసంశ ప్త స్సురజ్యేష్ఠో ఽపి నిర్గతః
మధ్యేమార్గం నిరీ క్ష్యైకం సర స్తత్ర జలే స్థితః॥
ఇంద్రాక్షీసంజ్ఞికాం స్వేష్టదేవీం తుష్టావ బహుధాతథా
త్వత్ప్రసాదాత్తు మే దేవి! వైరూప్యం నాశ మే త్వరం॥
౨౪-౨౬

* అనేన పరదారాభిమర్శనం కృతవతః ప్రాణాత్యయోవా మహా న్క్లేశోవా భవతీతి సూచితమ్.

౭౦-౭౦½ దేవేంద్రుఁడును దనయభీష్టమును నెఱవేర్చుకొని గౌతముఁడు వచ్చు నను సందేహముతో బయలుదేరి బయటికి వచ్చి యచ్చట నున్న గౌతముని జూచి భయపడి పిల్లిరూపముతోఁ దొలఁగెను.

౭౧-౭౧½ గౌతముఁడు పిల్లివేషముతోఁ దొలఁగిపోవుచున్న యింద్రుని జూచి యదలించి యోరి దుర్మార్గుఁడా! మార్జాలవేషమును ధరించిన నీ వెవ్వఁడ వని యడుగఁగా గౌతముఁడు తనను జూచె ననియు, నిఁక బ్రయోజనము లేదనియు, ముని శపించుననియు భయపడి నిజరూపము ధరించి చేతులు జోడించి గౌతమునియెదుట నిలవఁబడెను.

౭౨-౭౩½ * గౌతముఁడు తనముం దున్న యింద్రుని జూచి కోపగించి యిటుల శపించెను ఓరి నీచుఁడా! నీవు ఏభగము (యోనిని) నపేక్షించి యిట్టిదుష్టసాహసకృత్యము నాచరించితివో యాభగములు (యోనులు) సహస్రము నీ శరీరమునం దుండుఁగాక! మఱియు నో పాపిష్ఠా! నీకు లింగముకూడఁ బతన మగుఁగాక!

౭౪-౭౬ ఓరిమూఢుఁడా! నాముందఱనే నీ స్వర్గలోకమునకుఁ బొమ్ము. ఇవ్విధముగా గౌతమునిచే శపింపఁబడి యింద్రుఁడును బయలుదేరి మధ్యమార్గమున నొకసరసును జూచి వికారరూపముతో స్వర్గమునకు నెళ్ళుట కిష్టములేక యాసరోవరమునందలి జలములో నుండి తనయిష్టదేవత యగు నింద్రాక్షి యను దేవతను ననేకవిధములుగ స్తుతించెను. 'ఓదేవి! గౌతమునిచే నాకు సంభవించిన వికారరూపము నీయనుగ్రహముచేఁ దొలఁగిపోవుగాక!' యని మనమునఁ దలఁచుచుండెను.

---

* పరస్త్రీ నపేక్షించువానికిఁ బ్రాణాపాయముకాని, గొప్పకష్టముకాని సంభవించు ననియెడి నీతి యీకథవలనఁ దెలియఁదగినది.

త ముహాచ తతో దేవీ పాపంతు మునిశాపజం
హంతుం బ్రహ్మాదయో దేవా శ్శక్తా నాహం సురేశ్వర!
కింతు బుద్ధిం సృజా మ్యద్య యేన లోకై ర్న లక్ష్యతే
యోనిమధ్యగతం దృష్టిసహస్రం తే భవిష్యతి॥
సహస్రాక్ష ఇతి ఖ్యాత స్సురరాజ్యం కరిష్యసి
ఇత్యుక్త్వా సా జగన్మాతా తత్రై వాంతరధీయత॥ ౮౭-౮౯

ఇంద్రస్య తాదృశావస్థా కామా ద్దైవ సంబభూవహ॥ ౮౯౻

గౌతమోఽపి గృహం గత్వా రుదంతీం తాం పతివ్రతాం॥
పప్రచ్ఛ కి మిదానీం తే కర్మ దారుణ మాగతం॥ ౯౦-౯౦౻

ఇత్యుక్తా వేపమానా సా భీతా పతి మువాచహ॥
తవ రూపం సమాస్థాయ దుర్మతి ర్మఘవా పునః
నాథ! మాం మోహయామాస స్వబుద్ధ్యా నకృతం మయా॥
అజ్ఞానా ద్యత్కృతం కర్మ క్షంతుమర్హసి తై విభో!౯౧-౯౨౻
ఇత్యుక్త్వా పాదయో స్తస్య పతిత్వా రుదతీం సతీం॥
శశాప గౌతమ స్తీవ్రం కరుణారహితో మునిః॥ ౯౩-౯౩౻

పరే ణాభిగతా ఽసి త్వ మమేధ్యా పాపచారిణీ॥
అంత శ్చైతన్యసంయుక్తా శిలారూపం సమాశ్రితా

౮౭-౮౯ అనంతరము, ఇంద్రాక్షీ దేవి ప్రత్యక్షమై దేవేంద్రునితో నిటులఁ జెప్పెను —' ఓయింద్రుడా! గౌతమమహర్షి శాపమువలన నీకుఁ గలిగిన వికారరూపమును బోఁగొట్టుటకు బ్రహ్మాదులకుఁగూడ శక్తి చాల దన నే నెంతదానను. కాన నాకు శక్తిచాలదు. కాని కొంత యుపకారము చేసెదను. లోకులు నిన్నుఁ జూచునపుడు వారికి నీశరీరమునందు సహస్రయోనులున్నట్లు కన్పడకుండ సహస్రనేత్రములు నీశరీరమునం దున్నటుల వారికి గోచర మగునటులఁ జేసెదను. నీవు సహస్రాక్షుఁడ వని ప్రసిద్ధి నొందుదవుకాని సహస్రయోని వని ప్రసిద్ధినొందవు. నీవు వెళ్లి స్వర్గరాజ్యమును బరిపాలించుకొనుము ' అని లోకమాత యగు నింద్రాక్షీ దేవి చెప్పి యచ్చటనే యంతర్ధానము నొందెను. దేవేంద్రుఁడు స్వర్గమునకు వెళ్లెను.

౮౯½ ఇంద్రునకుఁ గలిగిన యీదురవస్థయంతయుఁ గామమువలననే కలిగినదికాన కామము కడుదుష్టమయినది.

౯౦-౯౦½ గౌతముఁడును దన గృహమునకు వెళ్ళి తనను జూచి రోదనము చేయుచున్న పతివ్రతయగు నహల్యను జూచి యిటులఁ బలికెను. ఓసి దుష్టురాలా! ఇప్పుడు నీ కిట్టి దారుణకృత్యము సంభవించిన దేమి? (అని గౌతముఁ డహల్య నడిగెను)

౯౧-౯౨½ ఇటులఁ దనభర్త యడుగఁగా నహల్యయు వణకుచు భయపడుచు నిటుల సమాధానము చెప్పెను. 'ఓనాథా! దేవేంద్రుఁడు నీరూపముతో వచ్చి నన్ను మోసగించెను. కాని నేను బుద్ధిపూర్వకముగ నాచరించిన పని కాదు. నాథా! తెలియక చేసిన యీనాదుష్కృత్యము సహింపుము.'

౯౩-౯౩½ ఇవ్విధముగ భర్తతోఁ జెప్పి యహల్య తనభర్తృపాదములయందుఁ బడి రోదనముచేయుచుండెను. కాని గౌతముఁడు దయారసము లేనివాఁడై తీవ్రముగ నహల్య నిటుల శపించెను.

౯౪-౯౫½ ఓసి పాపాత్మురాలా! నీవు పరునితోఁ గలిసినదానవు కాన నపవిత్రురాలవైతివి. కాన నీవు శిలారూపముతో నుండి లోపల

చిరం స్థాస్యసి చాత్ర త్వాం పశ్యంతుచ జనాః స్త్రియః॥
౯౪-౯౫

ఏతస్మి న్నంతరే తత్ర శతానంద స్సమాగతః
జ్ఞాత్వా సర్వం పితు స్సద్యః పాదయోః పతితో ఽవదత్॥
అజ్ఞానా త్కృతవత్యాగః మమ మాతా సబుద్ధితః
పిత స్త్వం సర్వశాస్త్రాణి పరిశీల్య యథావిధి॥
ప్రాయశ్చిత్తం కారయిత్వా పునీతాం కురు మాతరమ్॥
౯౬-౯౭½

ఇత్యాత్మజప్రార్థిత స్స న్నబ్రవీ ద్గౌతమ స్సుతం॥
పరాభిగతనార్యాశ్చ పితృవాక్య మశృణ్వతః
ప్రాయశ్చిత్తం తు శాస్త్రేషు దృశ్యతే నహి పుత్రక! ౯౮-౯౯

ఇత్యుక్తో జనకే నాథ శతానందో మహాతపాః
దుఃఖిత స్త మువా చేదం శాప స్యాంతో విధీయతాం॥ ౧౦౦

ఇత్యుక్తః కరుణావిష్టో గౌతమో వాక్య మబ్రవీత్॥ ౧౦౦½

భూమే ర్భారాపనోదాయ విష్ణు ర్దాశరథి ర్భవేత్॥
రామచంద్రో దాశరథి ర్లక్ష్మణేన సమన్వితః
కదాచి దాపతే న్మార్గవశా దత్ర సుత! ధ్రువం॥
తత్పాదకంజసంస్పర్శా త్పూతా స్యా జ్జననీ తవ
తావ త్ప్రతీక్ష పుత్ర! త్వం నిర్బంధం త్వద్య మా కురు॥

చైతన్యముమాత్రము కలిగి చిరకాల మిచ్చటనే శిలారూపముతో నుండెదవుగాక ! స్త్రీపురుషాదు లందఱును శిలారూపము నొందిన నిన్నుఁ జూచెదరుగాక యని శపించెను.

౯౬-౯౭½ ఈసమయములో గౌతమపుత్రుఁడైన శతానందుఁ డచ్చటకు వచ్చి వృత్తాంతమునంతను దెలిసికొని తండ్రిపాదములయందుఁ బడి యిటులఁ బ్రార్థించెను. 'ఓతండ్రీ ! నాతల్లి యగు నహల్య తెలి యక యీ యపరాధమును జేసినదికాని స్వబుద్ధిచేఁ జేసినదికాదు కాన నీవు సమస్త ధర్మశాస్త్రములను బరిశీలించి ప్రాయశ్చిత్తమును జేయించి నాతల్లిని బవిత్రురాలనుగాఁ జేయు' మని ప్రార్థించెను.

౯౮-౯౯ ఈప్రకారము పుత్రునిచేఁ బ్రార్థింపఁబడి గౌతముఁడు కుమారునితో నిటులఁ బలికెను.—ఓ పుత్రుఁడా ! పరపురుషుని గలిసిన స్త్రీకిని, తండ్రిచెప్పినమాటను వినని కుమారునకును బ్రాయశ్చిత్తము శాస్త్రములయందుఁ గన్పడదు. వారాదుష్టఫలము ననుభవించియే తీరవలయు ననెను.

౧౦౦ ఇవ్విధముగఁ తండ్రి యగు గౌతముఁడు చెప్పఁగా మహాతపస్సంపన్నుఁ డగు శతానందుఁడు చేయునదిలేక దుఃఖపడి, శాపవిముక్తి నైన ననుగ్రహింపు మని తండ్రిని బ్రార్థించెను.

౧౦౦½ పైప్రకారము పుత్రుఁ డగు శతానందుఁడు చెప్పఁగా గౌతముఁడు దయారసము కలవాఁడై యిటులఁ జెప్పెను.

౧౦౧-౧౦౪½ ఓపుత్త్రుఁడా ! వైకుంఠవాసి యగు విష్ణుమూర్తి భూభారమును బోఁగొట్టుటకు భూమియందు దశరథపుత్త్రుఁడుగా నవతరించును. ఆదశరథపుత్త్రుఁడైన రామచంద్రమూర్తి లక్ష్మణసమేతుఁడై యొక ప్పుడు మార్గవశాత్తుగా నిచ్చటకు వచ్చును. ఆరామచంద్రునిపాదార విందస్పర్శచే నీతల్లి యగు నహల్య పవిత్రురా లగును. ఇప్పుడు నీవు నన్ను నిర్బంధింపకుము. ఓపుత్రా ! నీతల్లి రామచంద్రమూర్తి యిచ్చటకు వచ్చినకాలమునఁ దిరిగి నన్నుఁ గలిసికొనును. ఈప్రకా

తదా మయా సంగతా స్యా జ్జననీ తవ పుత్రిక !
ఇత్యుక్త్వా గౌతమ స్సద్య స్స్వాశ్రమంచ శశాప సః॥
మ మాయ మాశ్రమో రమ్యః నిర్జంతు ర్భవతా దితి॥
౧౦౧-౧౦౪½

ఇతి శప్త్వా స్వాశ్రమంచ తప స్తప్తుం హిమాచలం॥
జగామ గౌతమ స్సద్య స్తత్రైవ న్యవస త్సుఖమ్॥
౧౦౫-౧౦౫½

రామచంద్ర! మునే శ్శాపా దాశ్రమో ఽయం తదాదితః॥
జంతుసంచారరహితో బభూవ రఘుస త్తమ ! ౧౦౬-౧౦౬½

అహల్యాఽపి శిలారూప మాశ్రిత్య మునిశాపతః॥
అంతశ్చైతన్యసంయుక్తా ధ్యాయంతీ త్వత్పదాంబుజం
రామచంద్ర! భవత్పాదసంస్పర్శం కాంక్షతే చిరాత్॥
౧౦౭-౧౦౮

తదాఽఽగచ్ఛ మహాతేజ! ఆశ్రమం పుణ్యకర్మణః
తార యైనాం మహాభాగా మహల్యాం దేవరూపిణీమ్॥ ౧౦౯

ఇత్యుక్త్వా రామహ స్తంతు స్వహ స్తే నాదద న్మునిః
అహల్యాఖ్యశిలోపాంత మానినాయ రఘూ త్తమమ్॥ ౧౧౦

రామచంద్రోఽపి పస్పర్శ శిలాం తాం స్వపదేన సః
తచ్ఛిలా కంపితా పశ్చా ద్దివ్యయుక్తా కఠినత్వతః॥

రము కొమరునితోఁ జెప్పి గౌతముఁడు వెంటనే తనయాశ్రమమును గూడ శపించెను. నాయీయాశ్రమము రమ్యమైనదై జంతురహితమై యుండుగాక! (యని శపించెను)

౧౦౫-౧౦౫½ పైవిధముగ గౌతముఁడు తనయాశ్రమమును శపించి తపస్సు చేసికొనుటకు హిమవత్పర్వతమునుగూర్చి వెళ్ళి యచ్చటనే సుఖముగ నుండెను.

౧౦౬-౧౦౬½ ఓరామచంద్రా! గౌతమశాపమువలనఁ దదాదిగా నీయాశ్రమము జంతుసంచారరహిత మయ్యెను.

౧౦౭-౧౦౮ రామచంద్రా! అహల్యయును గౌతమశాపముచే శిలారూపము నొంది లోపల చైతన్యము కలదియై నీపదాంబుజములను ధ్యానించుచు నీపాదారవిందస్పర్శను జిరకాలమునుండి కోరుచున్నది.

౧౦౯ మహాప్రభావము కల రామచంద్రా! నీవే యహల్యాశాపమును బోఁగొట్టఁదగినవాఁడవు కావున, పుణ్యకర్ముం డగు గౌతముని యాశ్రమమునకు రమ్ము; మహాభాగురాలును దేవతలవంటిరూపము కలదియు నగు నీ యహల్యకు శాపవిముక్తిం జేయుము. అని విశ్వామిత్రుఁడు రామునకుఁ జెప్పెను.

౧౧౦ ఈప్రకారము విశ్వామిత్రుఁడు చెప్పి రామచంద్రమూర్తిహస్తమును దనహస్తముతోఁ బుచ్చుకొని యహల్య యను పేరుతో నున్న శిల యొద్దకు రాముని దీసికొని వెళ్లెను.

౧౧౧-౧౧౨ రామచంద్రమూర్తి తనపాదముచే నాశిలను స్పృశించినంతనే యాశిల కదల నారంభించెను. దానికి రాముఁడు విస్మయము నొందఁ బిదప రాముని కాలిక్రింద నున్న యాశిల కాఠిన్యము వదలి దూది

నారీచ్ఛాయా తత స్తత్ర స్త్రీరూపం ప్రాప సా తతః
హసన్ముఖీ సా త్రపయా నమితాస్యా స్థితా భవత్॥
౧౧౧-౧౧౨

లజ్జమానా మహల్యాం తాం జ్ఞాత్వా రామ స్తతఃపరం
నమశ్చకా రాహల్యాయై రాఘవో ఽహ మితి బ్రువన్॥౧౧౩

చిరా దాత్మపదధ్యానకృతవత్త్యై రఘూ త్తమః
అహల్యాయై దదౌ దివ్యాం దృష్టించ కరుణానిధిః॥ ౧౧౪

తతో ఽహల్యా రాఘవం త మపశ్య త్సూర్యతేజసం
శంఖచక్రగదాపాణిం సర్వాభరణభూషితం॥
శ్యామవర్ణం చతుర్బాహుం పీతాంబరధరం శుభం
తేజసా ద్యోతయంతంచ దిశ స్సర్వా స్సనాతనమ్॥
౧౧౫-౧౧౬

తం దృష్ట్వా సహసా భూమౌ చిరప్రార్థితదర్శనం
నిపత్యోత్పత్య చాహల్యా బద్ధాంజలిపుటా సతీ॥
స్మరంతీచ పతే ర్వాక్యం స్తోతుం సముపచక్రమే॥
౧౧౭-౧౧౮

కృతకృత్యా ఽస్మి దేవేశ! సాంప్రతం తవ దర్శనాత్॥
నమామి శిరసా రామ! సదా త్వాం భక్తవత్సల!
౧౧౯-౧౧౯

పింజరలె మృదుత్వము కలదయ్యెను పిదప నాశిలయందు స్త్రీ ప్రతిబింబ మేర్పడెను. దాని కాశ్చర్యము నొందుచుండ వెంటనే యాశిల స్త్రీరూపమును బొంది హసన్ముఖియై సిగ్గుచేతఁ దలవంచుకొని నిల్వఁబడియుండెను.

౧౧౩ రామచంద్రమూర్తి యా యహల్యాదేవి సిగ్గుపడుచున్న దని తెలిసికొని, అమ్మా! నేను రాఘవుఁడ నని తననామోచ్చారణముచేయుచు నామెకుఁ దానే నమస్కరించెను.

౧౧౪ కరుణానిధి యగు రామచంద్రమూర్తి చిరకాలమునుండి తన పాదారవిందధ్యానముచేయుచున్న యాయహల్యకొఱ కనుగ్రహించి దివ్యదృష్టి నిచ్చెను.

౧౧౫-౧౧౬ అనంతరము అహల్యాదేవి దివ్యదృష్టితో రాముని జూడఁగా నంతకుఁబూర్వము చూచిన రాముడుగాఁ గన్పడక కోటిసూర్యప్రకాశమైన తేజస్సు కలిగి శంఖచక్రగదాపాణియై దివ్యాభరణభూషితుఁడై నీలమేఘనిభుఁడై చతుర్బాహువులు కలిగి పీతాంబరధారియై తనతేజస్సుచే సకలదిక్కులను బ్రకాశింపఁజేయువాఁడై సనాతనుఁడైన విష్ణుమూర్తియే యాయహల్యకు గోచర మయ్యెను.

౧౧౭-౧౧౭½ చిరకాలమునుండి యెవనిదర్శనము నహల్య కోరియుండెనో యాభగవానుఁ డగు రాముని జూచి పూర్వము గౌతమునివాక్యము స్మృతికి వచ్చి భూమియందు సాష్టాంగముగఁ బడుచు లేచుచుఁ జేతులు జోడించి రామచంద్రమూర్తిని గ్రిందివిధముగ స్తోత్రముచేయ నారంభించెను.

౧౧౮-౧౧౮½ రామచంద్రా! నీసందర్శనమువలన నేను కృతార్థురాల నైతిని; ఓభక్తవత్సలా! నీకు సాష్టాంగనమస్కారము చేయుచున్నాను.

జయ విశ్వపతే! రామ! జయ రాఘవ! తే నమః॥
జయ పాపాపహానంత! జయ జన్మజరాపహ!
౧౧౯-౧౧౯౮

ప్రసీద భగవ న్విష్ణో ప్రసీద పురుషోత్తమ!
ప్రసీద దేవదేవేశ! ప్రసీద రఘునందన! ౧౨౦-౧౨౦౮

యోషి న్మూఢా ఽహ మజ్ఞా తే తత్త్వం జానే కథం విభో!
తస్మా త్తే శతశో రామ! నమస్కుర్యా మనన్యధీః॥
౧౨౧-౧౨౧౮

నమ స్తే పుండరీకాక్ష నమ స్తే భక్తవత్సల!
త్రాహి మాం కృపయా రామ! శరణాగతికారిణీమ్॥
౧౨౨-౧౨౨౮

శ్రుత్వా ఽహల్యాస్తుతిం ప్రాహ రాఘవ స్తాం ప్రసన్నధీః॥
తుష్టో స్మ్యహ మహల్యే! త్వం నష్టపాపా ఽసి సాంప్రతం
వరం వరయ చాహల్యే! వరదో ఽహం తవాగ్రతః॥
నాతప్తతపసా ఽహల్యే! ద్రష్టుం సాధ్యో ఽహమంజసా॥
౧౨౩-౧౨౪౮

అహల్యా—
దేవ! మే యత్ర కుత్రాఽపి స్థితాయా అపి సర్వదా
త్వత్పాదకమలే భక్తి మేకాం దేహి జగత్పతే! ౧౨౫-౧౨౫౮

౧౧౯-౧౧౯½ ఓలోకనాయకా! రామచంద్రా! నీకు జయమగుగాక! ఓరాఘవా! నీకు నమస్కారము. ఓసకలపాపసంహారకా! నీకు జయమగుగాక! ఓజన్మజరాపహా! నీకు జయమంగళమగుగాక!

౧౨౦-౧౨౦½ ఓషడ్గుణైశ్వర్యసంపన్నుఁడా! ఓసర్వవ్యాపకా! ఓపురాణపురుషా! ఓదేవదేవా! ఓరఘునందనా! ప్రసన్నుఁడవు కమ్ము.

౧౨౧-౧౨౧½ ఓమహాప్రభో! రామచంద్రా! నేను స్త్రీస్వభావముకలదానను. మూఢురాలను. ఏమియు నెఱుఁగనిదానను. నీతత్త్వము నే నెట్లు తెలిసికొనఁగలను? రామచంద్రా! నీవు చేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకార మేమియుఁ జేయఁజాలను. అనన్యమనస్సుతో నీకు ననేకవందనముల నర్పించెదను.

౧౨౨-౧౨౨½ ఓపుండరీకాక్షా! నీకు నమస్కారము; ఓ భక్తవత్సలా! నీకు వందనము; రామచంద్రా! శరణాగతురాల నగు నన్నుఁ గృపతోఁ గాపాడుము.

౧౨౩-౧౨౪½ ఇట్లు గౌతమపత్ని తనను స్తోత్రముచేయఁగా రామచంద్రమూర్తి విని యామెతో నిటులఁ బలికెను — ఓదేవి! నీస్తోత్రముచే నేను సంతసించితిని; నీవు పాపవిముక్తురాలవైతివి; నీకు నేను వర మీయఁదలచితిని. వరమును గోరుకొనుము; ఓదేవి! తపస్సు చేయనివారలకు నేను జూడ సాధ్యపడ నని యెఱుంగుము.

౧౨౫-౧౨౫½ అప్పు డహల్యాదేవి రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను; ఓదేవా! నే నెచ్చటనుండినను నీపాదారవిందములయందు నిశ్చలమైన భక్తిభావము నాకుఁ గలుగునటుల వర మొసంగుము. (అని యహల్య కోరెను)

రామచంద్రోఽప్యహల్యాయై తథైవ ప్రదదౌ వరం॥
భక్తిర స్త్వచలా తే మే వైష్ణవీ ముక్తిదాయినీ॥
౧౨౬-౧౨౬½
సంప్రాప్యైవంవరంపశ్చాత్తేనానుజ్ఞాతా యయౌపతిమ్।౧౨౭

ఏత స్మిన్నంతరే జ్ఞాత్వా గౌతమ స్సముపాగతః
నీత్వాఽఽశ్రమం చ తా న్సర్వా న్పూజయామాస భక్తితః॥
రాత్రౌ తత్రావస స్సర్వే విశ్వామిత్రపురోగమాః॥
౧౨౮-౧౨౮½

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ద్వాదశసర్గ స్సమాప్తః.



త్రయోదశసర్గ ప్రారంభః

అవాప్య గౌతమానుజ్ఞాం ప్రత్యూషే *విస్మయావహే
గంగాతీరం సమాగు స్తే కౌశికాద్యా మహర్షయః॥
తర్తుం తాం జాహ్నవీం పశ్చా న్మిథిలాం గంతు ముద్యతాః॥
౧-౧½

* ప్రత్యూషస్య విస్మయావహత్వం కుత ఇతిచే దుచ్యతే.
"ప్రత్యూషే, కిల తారకా స్తు విరళా స్సంతో యథా వైకలా। సత్స్వేంతేష్వేవ దూరభావ మగమ ద్ధృష్టం తదానీం తమః। ఘూనీనాం, హృదయం యథా ఽమల మలం

౧౨౬-౧౨౬½ రామచంద్రమూర్తి యహల్యతో నిటులఁ బలికెను.—ఓ దేవి! మోక్షప్రదమును నిశ్చలము నగు వైష్ణవభక్తి నీకుఁ గలుగుగాక! (యని వరమొసగెను)

౧౨౭ ఈప్రకారము రామునివలన వరము నొంది యనుజ్ఞ నొంది యహల్య భర్తసమీపమున కేగెను.

౧౨౮-౧౨౮½ ఈసమయమున గౌతమమహాముని యును దనయాశ్రమము నకు రామచంద్రమూర్తి వచ్చి యహల్యను బునీతురాలనుగాఁ జేసిన వృత్తాంతమునుఁ దెలిసికొని యోగబలముచేఁ దక్షణ మిచ్చటకు వచ్చి విశ్వామిత్రుఁడు మొదలగువారిని దనయాశ్రమమునకుఁ దీసికొని వెళ్లి వారినందఱను భక్తితోఁ బూజించెను. విశ్వామిత్రుఁడు మొదలగువారందఱు నారాత్రియం దచ్చటనే నివసించిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండద్వితీయభాగమునఁ బండ్రెండవసర్గము సమాప్తము.



## పదుమూఁడవసర్గ ప్రారంభము.

౧-౧½ కౌశికుఁడు మొదలగుమహర్షులు మఱుదినమునఁ * విస్మయకర మగు ప్రాతఃకాలముననే గౌతముని యనుజ్ఞనొంది గంగను దాటి యనంతరము మిథిలాపురి కేగఁదలంపుకలవారలై గంగాతీరమునకు వచ్చిరి.

* ప్రాతఃకాలము విస్మయకర మని యేల వర్ణింపఁబడిన దనగాఁ జెప్పఁబడుచున్నది.—కలియుగమున సత్పురుషులువలె ప్రాతఃకాలమున నక్షత్రము లచ్చటచ్చట నరుదుగఁ గన్పడెను. సజ్జనులహృదయము లందుఁ దమస్సు దూరమైనటులఁ బ్రాతఃకాలమునఁ దమస్సు దూరమై యుండెను. (చీకటిపోయినది). మునీశ్వరులహృదయము ఏప్రకారము

గంగాతీరస్థితాయాంతు నావి సర్వే ఽధిరోహితాః॥
రామ స్తదారోహణాయ నిషిద్ధో నావికేన సః॥ ౧-౨

అథ తం నావికం ప్రాహ ప్రహస న్రాఘవ స్తదా॥
అనిరు ధ్యేతరా న్సర్వాన్ కి మేకం మాం రుణ త్స్యహో!
ఇతి రామసమాపృష్టో నావికో ప్యాహ రాఘవమ్॥ ౩-౪

నారోహ యేయం రామ! త్వాం త్వత్పాదక్షాళనంవినా
నదారుదృషదో ర స్తి భిదా కాచి ద్రఘూ త్తమ!
చూర్ణం త్వత్పాదయో ర స్తి మానుషీకరణం త్వితి
లోకే ప్రథా స్థితేః కుర్వే త్వత్పాదక్షాళనం విభో॥ ౫-౬

త్వత్పాదక్షాళనే రామా కృతేసతి తదా పునః
అహల్యాఖ్యశిలే వాద్య దారుభూతా తరీ మమ॥
నారీ భవేద్యది తదా భవే న్మే జీవికాక్షతిః॥ ౭-౮

---

ఖంచా ప్యభూ న్నిర్మలం। పూర్వస్యాం దిశి కర్షకస్య భవనే లక్ష్మీరి వాదృశ్యతే। దోషాన్వితో యథా జాయా సమీపం ప్రాప్నుయా త్పతిః తథాదిత్యోఽపిచ శనై రాగంతుం యతతే తదా." ఇత్యభియుక్తో క్తిః తస్మా త్ప్రత్యూషస్య విస్మయావహత్వ మిత్యుక్తమ్

౨-౨౪ విశ్వామిత్రాదిమహర్షులందఱును గంగను దాటుటకు దత్తీరమునం దున్న నావమీద నెక్కిరి; రామచంద్రమూర్తి యానావమీద నెక్కుచుండ నావికుడుగానున్న గుహుడు రాముని నెక్కుటకు నడ్డగించెను.

3-౮ అనంతరము రామచంద్రమూర్తి మందహాసముచేయుచు నానావికు నితో నిట్లుఁ బలికెను.—ఓగుహుడా! నీ వితరుల్నందఱను నావ మీద నెక్కనిచ్చి న న్నొకనిని నీ వేల నడ్డగించుచుంటి వని యడు గఁగా రామచంద్రమూర్తితోఁ బడవ నడుపు గుహుఁ డివ్విధముగఁ జెప్పెను.

౫-౬ ఓరామచంద్రా! నీపాదారవిందముల బ్రక్షాళనము చేయనిదే నిన్ను నాపడవమీద నెక్కనీయను; (ఏలననగా) ఓరామచంద్రా! రాతికిని కొయ్యకును భేదమేమియు లేదు; నీపాదములయందు మను ష్యులను జేయఁగలిగినయొకచూర్ణ ముండినట్లు లోకమునఁ బ్రసిద్ధి బయలుదేరుటవలన నీపాదములను జక్కఁగఁ గడిగి యెక్క నిచ్చెదను.

౭-౭౪ ఓరామచంద్రా! నీపాదములను గడగకుండగ నిన్ను నానావమీద నెక్కనిచ్చినచో నీవు అహల్యాబండమీదను బాదముంచినతోడనే యాశిలస్త్రీరూపమును ధరించినవిధముగనే నీపాదరేణుస్పర్శచేత నాపడవ కొయ్యకూడ స్త్రీరూపమును ధరించినచో నాజీవనమునకు భంగము కలుగును. నాకుజీవనసాధనమే యిదియై యున్నది.

---

నిర్మలముగా నుండెనో ప్రాతఃకాలమున నటులనే యాకాశము నిర్మల ముగా నుండెను. వ్యవసాయికునిగృహమునందు ధాన్యలక్ష్మి యొప్పు నటులఁ బ్రాతఃకాలమునఁ దూర్పుదిక్కునందు లక్ష్మి యొప్పుచుండెను. మఱియు దోషాన్వితు డగు భర్త మెల్లగా భార్యాసమీపమునకుఁ బోవునటుల బ్రాతఃకాలమున సూర్యుఁడు మెల్లగ వచ్చుటకుఁ బ్ర యత్నించుచుండెను. అని యభియుక్తవచములచేఁ బ్రాతఃకాలము విస్మయావహ మని వర్ణింపఁబడిన దని యెఱుఁగనగును.

తన్నావికవచ శ్శ్రుత్వా ప్రహాస నా్రఘువో౽ బ్రవీత్॥
అహల్యాఖ్యశిలాయాశ్చ నౌకాయా శ్చాస్తినా భిదా
సా పురా మునిపత్న్యేవ మ ద్యై శాపవశా చ్ఛిలా॥
మత్పాదరేణుసంస్పర్శా త్పూర్వరూప మవాప సా
ఇతి రామవచ శ్శ్రుత్వా నావికో ౽ప్యాహ రాఘవం॥

౯-౧౦

ఇయం తరీ పురా క్వాపి మునిపత్నీ భవే న్న కిం ?
శాపితా సా స్వపతినా తరీరూపం భజే న్న కిం ?
యథా ౽హల్యాశిలా తే ౽ద్య పాదస్పర్శంతు కాంక్షతే
తథేయం తే తరీ పాదస్పర్శనం కిం న ప్రతీక్షతే॥ ౧౧-౧౨

తస్మా త్త్వత్పాద మమలం కృత్వా తీరం నయా మ్యహం
నోచే న్మమ తరీ నారీ స్యా చ్చే త్స్యా జ్జీవికాక్షతిః॥ ౧౩

ఏకా గృహే ౽స్తి గృహిణీ కిం కుర్యా మపరాంస్త్రియం
ఇతి నైషాదవచనం శ్రుత్వా రామో ౽బ్రవీ త్తతః॥ ౧౪

నిషాద ! త్వం పరం భక్త మహం వేద్మి గుణో త్తరం
యథేష్ట మాచర క్షిప్ర మానయ త్వం సుపాద్యకం॥ ౧౫

రాఘవస్య వచ శ్శ్రుత్వా ప్రహృష్టవదనో గుహః
గంగాజలం సమానీయ ప్రక్షాళ్య విమలే పదే॥

౮-౧౦ ఇట్లు నావికుడు పలుకగా రామచంద్రమూర్తి విని నవ్వుచు నిటులఁ బలికెను. ఓగుహుడా! అహల్యయను శిలకును నీపడవకును భేద మున్నది. ఆశిల పూర్వము గౌతమమునిభార్యయై యుండునది; మధ్యకాలములో భర్తృశాపముచే నిటుల శిలయైనది. నాపాదరేణు స్పర్శచేఁ బూర్వరూపమును (స్త్రీరూపమును) బొందినది. కాన నీపడవకొయ్యకును నాశిలకును సంబంధములేదని రామచంద్రమూర్తి చెప్పగా నావికుడు తిరిగి రామచంద్రమూర్తితో నిటులఁ బలికెను.

౧౧-౧౨ ఓరామచంద్రా! ఈనాపడవకొయ్యయు నహల్యవలెఁబూర్వము మునిపత్నియై యుండఁగూడదా? ఆయహల్యను గౌతముడు శిలనుగా శపించినటులఁ నేయొకమునియైనను దనభార్యను బడవకొయ్యనుగా శపించకూడదా? ఆయహల్యాశిల నీపాదారవింద స్పర్శను గోరుచున్నటుల నాపడవకొయ్యయును నీపాదారవింద స్పర్శను గోరఁగూడదా? చెప్పుము.

౧౩ రామచంద్రా! అందువలన నీపాదారవిందములను బరిశుభ్రముగాఁ గడిగి పిమ్మట నాపడవమీద నిన్ను నెక్కించి యువతల యొడ్డునకుఁ జేర్చెదను; లేకపోయిన నీపాదధూళిచే నాపడవకొయ్యకూడ స్త్రీ రూపమును ధరించినచో నాజీవనభంగ మగు ననియె.

౧౪ ఓరామచంద్రా! నా కొక స్త్రీ గృహమునం దుండెను. ఈపడవ కొయ్యకూడ స్త్రీరూపమును ధరించినచో రెండవస్త్రీని గూడ నే నేమిచేయుదును? ఇట్లు గుహుడు చెప్పిన వాక్యమును విని రామచంద్రమూర్తి యిటులఁబలికెను

౧౫ ఓగుహుడా! నీవు పరమభక్తుడ వనియు గుణాధికుడ వనియు నెరిగి తిని; నీయభీష్టముచొప్పునఁ జేయుము; శీఘ్రముగఁ గాళ్లుకడుగుటకు నుదకమును దెమ్ము.

౧౬-౧౭ రామచంద్రునివాక్యము విని గుహుడు మందహాసముచే నొప్పుచున్న ముఖముకలవాడై శీఘ్రముగ వెళ్లి గంగోదకమును దెచ్చి రామచంద్రునిపాదములను మాలిన్యములేకుండఁ గడిగి యారామ

రామపాదోదకం మూర్ధ్ని స్వ స్యావోక్ష్య నిపీయచ
స్వంకృతార్థంచ మన్వాన స్తుష్టావ రఘునందనం॥ ౧౬-౧౭

కరుణారససంపూర్ణం శ్రితచాతకనందదం
రామాంబుదం త్వాం భజత స్తాపశాంతి రభూ న్మమ॥ ౧౮

పాదాంబుజం భవతు మే తరణాయ రామచంద్రాబ్జశూల
ముఖచిహ్నయుతం త్వదీయం, య స్యానిశం దివిషద శ్చర
ణారవింద ముత్తంస యంత్యమితభక్తిపరావనమ్రాః॥ ౧౯

హృత్పంకజాని భజతాం ప్రతిబోధయన్తి సంసారసాగరమపి
ప్రవిశోషయన్తి, జ్యోత్స్నా త్వదంఘ్రినఖచంద్రసముద్గతేయం
శ్రీరామచంద్ర! విలస త్యపరా విచిత్రా॥ ౨౦

రామచంద్ర! మహీపాలకీర్తి త్రిపథగా తవ
న కస్య భవతి శ్లాఘ్యా పునానా భువనత్రయమ్॥ ౨౧

పాదోదకమును దనశిరమునందుఁ గొంచెము చల్లుకొని మిగిలినపాదో
దకమును లోనికిఁ బుచ్చుకొని తాను కృతార్థుఁడనైతి నని తలచుచు
రామచంద్రమూర్తి నివ్విధముగ స్తుతించెను.

౧౮ ఓరామచంద్రా! గ్రీష్మముచేఁ దపింపఁబడినవానికి వర్షాకాల
మేఘదర్శన మగుటతోడనే తాపశాంతి యైనటుల నీదర్శనము
వలన నాకు సంసారతాపశాంతి కలిగినది. నీవు వర్షాకాలమేఘు
నితో సమానుడవు. ఆమేఘునియందు జల ముండును, నీయందుఁ
గరుణ యనెడి రసము (ఉదకము) ఉన్నది. వర్షాకాలమేఘదర్శ
నమువలన చాతకపక్షు లానందించును, నీదర్శనమువలన నావంటి
యాశ్రితులు సంతోషించుచుండిరి.

౧౯ ఓరామచంద్రా! పద్మరేఖలు త్రిశూలరేఖలు మొదలగు శుభచిహ్న
ములతోఁగూడుకొనిన నీపాదారవిందము నన్నుఁ దరింపజేయుగాక!
నీపాదారవిందమును భక్తిపరులై వినమ్రులై దేవతలుకూడ శిరో
భూషణమును జేసికొనుచుందురు (అనగా శిరసా ధరించెదరు).

౨౦ ఓరామచంద్రా! నీపాదమునందలి గో రనెడి చంద్రునిలో నుండి
పుట్టిన కాంతి మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. (ఏల నన) లోక
ములోని చంద్రికాంతి పద్మములను ముకుళింపఁజేయును. నీగో
రనెడి చంద్రునిలోని కాంతి నీయాశ్రితులహృదయము లనెడి పద్మ
ములను వికసింపఁజేయుచున్నది. మఱియు లోకములోని చంద్రి
కాంతి సముద్రమును వృద్ధిని బొందించును. నీగోరనెడి చంద్రు
నిలోని చంద్రికాంతి సంసారమనెడి సముద్రమును నెండింపఁ
జేయుచున్నది. కాన నిది విలక్షణమై యొప్పుచున్నది.

౨౧ ఓరామచంద్రా! నీకీర్తి యనెడి గంగానది త్రిలోకములను బవి
త్రము చేయుచున్నందున నెవనికిఁ గొనియాడఁదగినదై యుండదు?
సర్వత్ర కొనియాడఁదగియున్నది.

నిస్సారే భక్తిదూరే ఽస్మి న్సంసారాబ్ధా వహం భ్రమన్
నిమజ్జనోన్మజ్జనాభ్యాం ఖిన్నో ఽహం మాం సముద్ధర॥ ౨౨

సర్వలోకశరణ్య స్త్వం దీనబంధు రనావిలః
దీనో ఽహ మావయో ర స్తి బంధుతా ఽవతు మాంభవాన్॥
౨౩

పురా ఽ స్తి యది దోషో మే క్షమస్వ రఘునాయక!
స్వీయాపరాధసహనం బంధుభావఫలం ఖలు॥ ౨౪

ఇతి వాక్యం నిశమ్యాహ రామచంద్రో గుహం ప్రీతి
తుష్టో స్మ్యహం గుహ! స్తుత్యా వరదో ఽహం వరం వృణు॥
ఇత్యుక్త స్స గుహః ప్రాహ రాఘవం ప్రాంజలి స్తదా॥
౨౫-౨౫½

రామచంద్ర! భవత్పాదతీర్థసేవావశా న్మమ॥
భవితా నపున ర్జన్మ ధన్యో ఽహం త్వత్ప్రసాదతః॥
౨౬-౨౬½

దేవానాం పున రావృత్తి ర్భవే దమృతపాయినాం॥
భవత్పాదామృతాస్వాదకృతాం తు నపునర్భవః॥ ౨౭-౨౭½

రామచంద్ర! భవత్పాదసేవాభాగ్య మభూ న్మమ॥
ఏతస్మా దపరం చాప్యం భాగ్యం నా స్తి క్షితౌ మమ॥
౨౮-౨౮½

౨౨ ఓరామచంద్రా! సారహీనమైనదియు, భక్తికి దూరమైనదియు నగు సంసార మనెడి సముద్రమునఁ బడి మునుఁగుచుఁ దేలుచు మిక్కిలి కష్టము నొందుచుంటిని. నన్ను సంసారసముద్రమునుండి యుద్ధరించుము.

౨౩ ఓరామచంద్రా! సర్వలోకములను రక్షించువాడవును, నిష్కల్మషుడవును నగు నీవు దీనబంధువుడవు, నేను దీనుడను. కాన నీకును నాకును బంధుత్వముకూడఁ గలదు. కాన నన్ను రక్షింపుము.

౨౪ ఓరఘునాయకా! లోగడ నేను చేసిన తప్పు లున్నను వాని నన్నిటిని నీవు క్షమింపవలయును. మనమిద్దరము బంధుగుల మని కూడఁ జెప్పి యుంటిని; స్వకీయులు చేసిన తప్పులను మన్నించుటయేకదా బంధుత్వఫలము.

౨౫–౨౫౹ ఇవ్విధముగ గుహుడు స్తుతింపుచుండగా రామచంద్రమూర్తి విని సంతసించి గుహునితో నిటులఁ బలికెను ఓగుహుడా! నీస్తోత్రముచే నేను సంతోషించితిని. నేను నీకు వర మిచ్చెదను. కోరుకొనుము. అని రామచంద్రమూర్తి చెప్పగా గుహుడు చేతులు జోడించి రామునితో నిటుల విన్నవించెను.

౨౬–౨౬౹ ఓరామచంద్రా! నీపాదోదకమును సేవించుటవలన నాకు జన్మరాహిత్యమయ్యెను. నీయనుగ్రహముచే నేను ధన్యుడనైతిని.

౨౭–౨౭౹ ఓరామచంద్రా! అమృతపానము చేయుచున్న దేవతలకును దిరిగి జన్మయుండవచ్చును; కాని నీపాదామృతమును సేవించిన వారలకుఁ దిరిగి జన్మ ముండ నేరదు.

౨౮–౨౮౹ ఓరామచంద్రా! నీపాదాబ్జములను సేవించుట యను మహాభాగ్యము నాకు లభించెను. ఇంతకంటె వేఱు భాగ్యము నాకు భూమియందుఁ బొందఁదగినది లేదు.

రామచంద్ర! భవా న్లోకే చికిత్సక ఇతి ప్రథా॥
ప్రసూతిమరణవ్యాధి రేకో ఽస్తి మమ వై చిరాత్
చికిత్సాం తస్య కురుషే యది చే త్తదలం మమ॥
కించ త్వత్పాదకమలే భక్తిరేవ సదా ఽస్తు మే॥ ౨౯-౩౦½

ఇత్యుక్త్వా తం ప్రణమ్యాథ తర్యాంత ముపవేశ్య సః॥
గంగాయా స్తు పరం పారం నినాయ రఘునందనం॥ ౩౧-౩౧½

తతో ఽవరుహ్య తర్యాస్తు రాఘవే శ్రితవత్సలే॥
నావికాయ ధనం కించి ద్దాతుకామే ఽబ్రవీ ద్గుహః॥
౩౨-౩౨½

రామచంద్ర! భవాం శ్చాహ మేకవృత్త్యా సమన్వితౌ॥
అహం నదీం తారయితా భవాబ్ధే స్తారకో భవాన్॥
౩౩-౩౩½

నావికా న్నావికో లోకే ధన మాదాయ తం నదీం॥
తారయేచ్చే దద్య మూల్యం గృహ్ణీయాం భవతో ఽప్యహం
నహి సందృశ్యతే తాదృగాచారో భువి రాఘవ! ౩౪-౩౪½

యథా ఽద్య భవతో ఽగృహ్ణ న్నదీం తారితవా నహం
తథా మత్తో ఽనపేక్ష్యత్వం మాం తారయ భవార్ణవాత్॥ ౩౫-

౨౯–౩౦½ ఓరామచంద్రా! నీవు భవరోగమును నివారించుటలో గొప్ప వైద్యుడ వని ప్రసిద్ధి కలదు. నాకు జననమరణవ్యాధి యొకటి కలదు. అది చిరకాలమునుండి నన్ను బాధించుచున్నది. దానికి నీవు చికిత్స చేసినచో నదియే నాకుఁ జాలును. ఇదియునుంగాక నీపాదకమలములయందు నిశ్చలమైన భక్తిభావము నాకు నెల్లప్పు డుండునటుల ననుగ్రహింపుము.

౩౦–౩౧½ ఈప్రకారముగాఁ జెప్పి రామచంద్రమూర్తికి నమస్కరించి యనంతరము రాముని దనపడవమీద గూర్చుండఁ బెట్టి పాటలు పాడుచు సంతోషముతోఁ దాను స్వయముగాఁ బడవను నడుపుచు గంగ యవతలయొడ్డుకు రామచంద్రమూర్తిని జేర్చెను.

౩౨–౩౨½ అనంతరము రామచంద్రమూర్తి పడవనుండి దిగి యాశ్రితవత్సలుఁడగు తాను నావికుడగు గుహునకుఁ బడవదాటించినందునకు గొంచెము ధనము నీయఁబోగా నప్పుడు గుహుడు చేతులు జోడించి యివ్విధముగఁ బలికెను.

౩౩–౩౩½ ఓరామచంద్రా! నేనును నీవును నిద్దఱము ఒకవృత్తికలవారమే; నేను నదిని దాటించుచుందును; నీవు సంసారసముద్రమును దాటించుచుందువు. కాన నిద్దరము దాటించువారమే.

౩౪–౩౫ రామచంద్రా! లోకములో నొకనావికుడు (పడవదాటించువాడు) మఱియొకనావికుడు నదిని దాటుటకు వచ్చినపుడు వాని యొద్ద డబ్బుతీసికొని వానిని దాటించుట యనునది లేదు. అట్లుండిన నేనును నీయొద్దను దీసికొనియెదను. ఇంతదనుక భూమియందట్టియాచార మెచ్చటను గన్పడదు.

౩౬ ఓరామచంద్రా! ఇప్పుడు నీయొద్ద నే నెటుల నేమియుఁ దీసికొనకుండ నిన్ను దాటించితినో యటులనే నీవును నన్నేమియుఁ గోరకుండగ సంసారసముద్రమును దాటించుము.

వ్యవస్థా త్వావయో రేషా మావిస్మర మహాప్రభో!
సమయే తిష్ఠ రామ! త్వం దాసో ఽహం తవ సర్వదా॥ 3౭

ఇత్యుక్తవంతం తం రామ స్సమాశ్లిష్యాబ్రవీ దిదం
మిత్రభూతో ఽసి మే నూనం సుఖీ భవ గుహా! క్షితౌ॥ 3౮

నవిస్మరేయం త్వాం నూనం గచ్ఛ మిత్ర! నికేతనం
ఇత్యుక్త్వా తంచ సంశ్లాఘ్య ప్రేషయామాస రాఘవః॥ 3౯

తదా మహర్షయ స్తత్ర గుహస్య నియతిం ప్రతి
నైకథా శ్లాఘయామాసుః కృతార్థో భూ దయం త్వితి॥ ౪౦

గుహ స్యాచరణం కింను కావా జాతి ర్ధనం కిము
తథాఽపి రామకారుణ్యపాత్రభూతో ఽభవ ద్గుహః॥ ౪౧

భక్త్యైవ తుష్య తీశస్తు నగుణై ర్నధనేనచ
భక్తిప్రియో మాధవ స్స్యా దిత్యూచు ర్మునయో మిథః॥ ౪౨

ఇతి సూతముఖే నోక్తాం కథాం శ్రుత్వా మహర్షయః
కించి త్సందిగ్ధచిత్తా స్తే పప్రచ్ఛు ర్లోమహర్షణం॥ ౪3

3౭ ఓరామచంద్రా! మనయిద్దరికి నిదియే యేర్పాటు. ఈవిషయమును మాత్రము నీవు మఱువకుము. ప్రతినలో నిల్చియుండుము. రామచంద్రా! నేను సదా నీదాసుడను.

3౮ ఈప్రకారముగఁ జెప్పుచున్న గుహుని రామచంద్రమూర్తి కౌగిలించుకొని యిటులఁ బలికెను. ఓగుహుడా! నీవు నాకుఁ బరమమిత్రుడవు నీవు సర్వవిధముల సౌఖ్యవంతుడవై యుండెదవు గాక!

3౯ ఓ మిత్రుడగు గుహుడా! నిన్ను నే నెప్పుడును మఱువను. నీ నివాసమునకుఁ బొమ్ము అని చెప్పి గుహుని గొనియాడి వానికి రామచంద్రమూర్తి యనుజ్ఞ నిచ్చి పంపెను.

౪౦ అప్పుడు మహర్షులందఱును గుహుడు కృతార్థు డని గుహుని భాగ్యము ననేకవిధములుగఁ గొనియాడిరి.

౪౧ గుహుని యాచారమును జూచి రామచంద్రమూర్తి యనుగ్రహించె నందుమా, గుహునియాచారము ఏమి గొప్పయాచారము? గుహుని జాతిని బట్టి రాము డనుగ్రహించె ననుటకును, గుహుడు ఏమి గొప్ప జాతివాడు? గుహుని యైశ్వర్యమునుబట్టి రాము డనుగ్రహించెననుటకును, గుహు డేమి ధనవంతుడు? గుహుడు సదాచారహీనుడైనను జాతిహీనుడైనను ధనహీనుడైనను రామచంద్రుని కరుణకుఁ బాత్రుఁ డయ్యెను.

౪౨ భక్తిచేతను భగవంతుడు సంతసించును కాని ధనముచేతను గుణముచేతను జాతిచేతను భగవంతుడు సంతోషించడు. భగవంతుడు భక్తిప్రియు డని వినుచుంటిమి. గుహునకు భక్తియుండుటవలన భగవంతుడు సంతోషించె నని మహర్షులందఱును పరస్పరము చెప్పుకొనిరి.

౪3 ఈప్రకారము సూతుడు చెప్పిన కథావృత్తాంతమును శౌనకాది మహర్షులు విని కొంచెము సందిగ్ధమనస్కులై తిరిగి సూతుని నిటులఁ బ్రశ్నించిరి.

రామచంద్రకృపాం సూత ! యోగినామపి దుర్లభాం
ప్రాప్తుం గుహః పూర్వభవే కిం తప స్తప్తవా న్వద॥ ౪౪

ఇతి పృష్టో వద త్సూత స్తత్పూర్వచరితం మునీ౯॥ ౪౪॥

రాజా త్వేకో బ్రహ్మహత్యాం కృత్వా తద్దోషమూలతః॥
ఉన్మత్త ఇవ కాంతారే భ్రమతిస్మ పురా ద్విజాః॥ ౪౫-౪౫॥
కదాచి దేకవిపినే చరమాణో నృపాలకః॥
తపశ్చరంతా వేకత్ర ద్వౌ మునీ సందదర్శ౯ సః
తద్దర్శనా జ్జాతమతి స్తయో రేకం సమాగతః॥
ప్రణిపత్య మహర్షిం తం రాజా వచన మబ్రవీత్॥ ౪౬-౪౭॥
మహర్షే! మమ పాపఘ్న ముపాయం సుకరం వద॥
ఇతిరాజ్ఞా సమాపృష్టో మహర్షి ర్నృప మబ్రవీత్॥ ౪౮-౪౮॥
త్రివారం భవతా రామనామ భక్త్యా కృతం యది॥
పాపక్షయ స్తవ భవే ద్విచారం మాగమో నృప ! ౪౯-౪౯॥
తచ్ఛ్రుత్వా తం మునిం ప్రాహ నికటస్థో ఒపరో మునిః॥ ౫౦

ఏకవారోచ్చారణేన సర్వపాపక్షయే సతి
త్రివారం భవతా కార్యం రామనామేతి తం నృపం॥

౪౪ ఓసూతుఁడా ! యోగీశ్వరులకును లభ్యముకాని రామచంద్రుని యను గ్రహమును సంపాదించుకొనుటకు గుహుడు పూర్వజన్మమున నేమి తపముచేసెనో వానిపూర్వజన్మవృత్తాంతమును జెప్పుమని (మహ ర్షులు సూతు నడిగిరి).

౪౪౻ ఈప్రకారముగ మహర్షులచేఁ బ్రశ్నింపఁబడినవాఁడై సూతుడు మహర్షులకు గుహుని పూర్వజన్మవృత్తాంతమునుఁ జెప్ప నారం భించెను.

౪౫-౪౫౻ ఓమహర్షులారా ! పూర్వము ఒకరాజు బ్రహ్మహత్య చేసి తద్దోష మూలకముగఁ బిచ్చివానివలె నరణ్యమునందుఁ దిరుగుచుండెను.

౪౬-౪౬౻ ఆరాజు ఒకవనమునందు సంచరించుచుండగాఁ దపస్సుచేసి కొనుచున్న యిద్దరు మహర్షు లచ్చటఁ గన్పడగా జ్ఞానోదయమై నమ్మహర్షులలో నొకమహర్షియొద్దకు వెళ్లి నమస్కరించి యిటుల బలికెను.

౪౭-౪౭౻ ఓమహాముని ! నేను బహుపాపములను జేసియుంటిని. నాపాప ములు పోవుటకు సులభోపాయమును నాకు జెప్పుమని రాజు మహర్షి నడుగగా నమ్మహర్షి రాజుతో నిట్లు పలికెను.

౪౮-౪౮౻ ఓరాజా ! నీవు మూడుపర్యాయములు భక్తితో రామనామము నుచ్చరించినచో నీపాపములన్నియు భస్మమై పోవును. కావున నీవు విచారమును బొందవల దనియెను

౫౦ ఆమహర్షి రాజుతోఁ జెప్పుచుండగా నాసమీపమున తపస్సుచేసి కొనుచున్న రెండవమహర్షి విని రాజుతోఁజెప్పిన మహర్షితో నిట్టులఁ బలికెను.

౫౧-౫౨ ఓమహర్షీ ! ఒకపర్యాయము రామనామము నుచ్చరించినందుననే సమస్తపాపములు నశించునే మూడుపర్యాయములు రామనామ ముచ్చరించు మని రాజునుగూర్చి నీవు శాస్త్రజ్ఞుడవై యుండియు

శాస్త్రజ్ఞో ఽపి భవా నద్య మునే ఽనృతవచో ఽవదత్
తస్మా న్నిషాదో భవతు భవా నిత్యాహ తం మునిః॥
౫౧-౫౨

ఇతి శప్తో ముని స్తేన నిషాదత్వం గత స్తతః
గుహ ఇత్యాఖ్యయా ఽటవ్యాం చరతిస్మ చిరం పునః॥ ౫౩

ఏకదా నారదం దృష్ట్వా పూర్వస్మృతిగతో గుహః
ప్రణిపత్యతు దేవర్షిం ప్రాహేదం వచనం తదా॥ ౫౪

మంత్రమేకంతు దేవర్షే! సంతర్తుం భవసాగరం
మ మోపదిశ విన్యస్య కృపాదృష్టిం మ మోపరి॥ ౫౫

ఇతి పృష్టో నిషాదేన విచార్య ప్రాహ తం మునిః
కాంచి న్నావం కల్పయిత్వా గంగాతీరే వసే ద్భవాన్॥
గతాగతా న్జనా న్నిత్యం తారయ న్ధర్మతత్పరః
ఏవంస్థితే భావికాలే రామ స్సానుజో జనార్దనః॥
సమాగచ్ఛే దిమం దేశ మహల్యాం చాపి పావయేత్
తదా రాఘవపాదాబ్జప్రక్షాళనం కృతవా న్యది॥
తరిష్యసి నిషాద! త్వ మిత్యుక్త్వా ఽగా ద్దివం మునిః॥
౫౬-౫౯

తదాద్యహల్యాఖ్యశిలాం ప్రత్యహం పశ్య తామునా॥

నన్నృతవచనమున్, శాస్త్రవిరుద్ధమైనదానినిఁ జెప్పితివి కాన నీవు నిషాదుడ వవుదువుగాక యని మొదటమునిని రెండవముని శపించెను. (నిషాదుడనగా నడవిలో సంచరించు బోయెజాతివా డని యర్థము.)

౫3 ఈప్రకారము రెండవమహర్షిచే మొదటి ముని శపింపఁబడి యనంతరము వనములో సంచరించు బోయవాడుగాఁ బుట్టి గుహు డను పేరుతో నడవులయందు చిరకాలము తిరుగుచుండెను.

౫౪ ఇట్లుండ నొకప్పుడు నారదుడు కన్పడగాఁ దద్దర్శనముచే గుహుడు పూర్వస్మృతికలవాడై దేవర్షి యగు నారదునకు నమస్కరించి యిట్లు ప్రార్థించెను.

౫౫ ఓనారదా! నేను భవసాగరమును దరించునట్లు నాయందనుగ్రహముంచి నీవు నా కొకమంత్రము నుపదేశింపు మని (గుహుడు నారదునిఁ గోరెను).

౫౬–౫౭ ఈప్రకారము గుహునిచే నడుగఁబడి నారదుడు గుహునితో నిటుల బలికెను. ఓగుహుడా! నీ వొక నావను గల్పించుకొని గంగాతీరమునం దుండి వచ్చుపోవువారలను దాటించుచు ధర్మబుద్ధితో గంగాతీరమునం దుండుము. ఇట్లుండఁ గొంతకాలమునకు సాక్షాద్విష్ణ్వంశసంభూతు డగు రామచంద్రమూర్తి నీ వున్న ప్రదేశమునకు వచ్చును. నీకు గుర్తుకూడ చెప్పెదను వినుము. గంగాతీరమున నుండిన గౌతమాశ్రమమునం దున్న యహల్యాబండను నేమహనీయుడు పవిత్రముచేయునో యతడే రామచంద్రమూర్తి యని యెఱుంగుము. ఆరామచంద్రమూర్తివచ్చినపుడు నీ వామహాత్ముని పాదములను బ్రక్షాళనము చేసితివేని తరింపగలవు. నీకు మంత్రములతోఁ బనిలేదు. నేను చెప్పినట్లు చేసికొను మని గుహునితో చెప్పి నారదుడు స్వర్గలోకమున కేగెను.

౫౮–౫౯ అదిమొదలుకొని గుహుడు గంగాతీరమునం దుండి యొకనావను గల్పించుకొని వచ్చుపోవువారలను దాటించుచు జీవనముచేయుచుఁ

స్థీయతే నావ మేకాం తు కల్పయిత్వా నదీతటే॥ ౫౯-౫౯½

యదా రామ స్సమాగ త్యాహల్యాం తారితవాం స్తదా॥
నారదస్య వచ స్స్మృత్వా సంనిరుధ్య రఘూ త్తమం
తత్పాదక్షాళనం కృత్వా ధన్యప వాభవ ద్గుహః॥ ౬౦-౬౧

గుహస్య జన్మకర్మాదికథితం పూర్వకాలికం
అనంతరీం కథాం వక్ష్యే రామస్య శృణుత ద్విజాః॥ ౬౨

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
త్రయోదశసర్గ స్సమా ప్తః.



చ తు ర్ద శ స ర్గ ప్రా ర ం భః.

విశ్వామిత్రాదయ స్సర్వే రాఘవాభ్యాం వినిర్గతాః
మిథిలోపాంత మాగత్య తత్ర చూతవనే శుభే॥
నివాసం మునయ శ్చక్రు *ర్వివి క్తే సలిలాన్వితే॥ ౧-౧½

* వివి క్తే సలిలాన్విత ఇత్యనేన ద్విజావాసః వివిక్త సలిలాన్వితే దేశ ఏవ క ర్తవ్య ఇతి సూచితమ్. తథాచ గౌతమః- ఏధో దకయవకుశాదిసమేత మార్యజనభూయిష్ఠం నికేతన మావ సితుం యతే తేతి.

బ్రతినిత్యము నారదుఁడు చెప్పిన గుర్తును (అనగా అహల్యాబండను) జూచుచు నచట నుండెను.

౬౦-౬౧ ఎప్పుడు రామచంద్రమూర్తి యహల్యను బవిత్రము చేసెనో నారదుఁడు చెప్పిన వాక్యము స్మృతికి వచ్చి భగవానుఁ డితఁడే యని రామచంద్రమూర్తిని గుహుఁడు నిరోధించి యా రాముని పాదములను గడిగి పాదోదకమును శిరస్సునందు ధరించి ధన్యుఁ డయ్యెను.

౬౨ ఓ మహర్షులారా! మీర లడిగినవిధముగ గుహుని పూర్వజన్మవృత్తాంతమును జెప్పితిని. అనంతరరామకథను జెప్పెదను వినుఁ డని సూతుఁడు శౌనకాదిమహర్షులకుఁ జెప్పెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండ ద్వితీయభాగమునఁ బదుమూఁడవసర్గము సమాప్తము.



## పదునాల్గవసర్గము ప్రారంభము.

౧-౧౪ విశ్వామిత్రుఁడు మొదలుగాగల సమస్తమునులు రామలక్ష్మణులతోఁ గూడ మిథిలాసమీపమునకు వచ్చి యచ్చట మనోహరమయినదియు స్వచ్ఛమయిన జలముతోఁ గూడినదియు * జనసమ్మర్దము లేనిదియు నగు నొక మామిడితోట యందు నివాసమును కావించుకొనిరి.

---

* జనరహితము జలసహితము నగు ప్రదేశమునందు విశ్వామిత్రాదులు నివసించి రని చెప్పుటచే నట్టి ప్రదేశముననే బ్రాహ్మణులు నివసింపవలయు ననెడి ధర్మము సూచింపఁబడినది. అవ్విధముననే గౌతముఁడును చెప్పెను. "ఉదకము కుశలు మొదలగువానిచే నొప్పునట్టియు నార్యజనులచే సేవింపబడుచున్నదియు నగు స్థానమునందు బ్రాహ్మణులు నివసింపవలయును."

ప్రోక్తం కౌశిక మాకర్ణ్య జనకోఽపి ముదాన్వితః॥
సమానీయ ద్విజా న్స్వాజాద్రివ్యాణ్యాపి వినిర్గతః
కౌశికాంతిక మాగత్య ప్రాహ తం మునిపుంగవమ్॥ ౨-౩

విశ్వామిత్రమహర్షే ఽభివందనం తే ఽస్తు మామకం
ఇత్యుక్తః కౌశికో ఽప్యాహ మిథిలాధిపతిం ప్రతి॥ ౪

శుభం స్యా త్తవ గేహేఽపి కల్యాణం చాస్తు సత్వరం
త్వదుద్యమశ్చ సఫలో భవతా న్నృపస త్తమ! ౫

రాజా॥ అపి తే చాశ్రమస్థానాం కుశలం మునిస త్తమ!
అప్యాశ్రమాశ్చ వర్థంతే విశ్వామిత్రమహామునే! ౬

కౌశికః—

సర్వేషాం కుశలం చా స్తి త్వయి తిష్ఠతి రక్షకే!
ఇత్యుక్తో జనకోఽ ప్యాహ విశ్వామిత్ర మిదం వచః॥ ౭

కౌశి కాగమనా త్తే ఽహం ధన్యో పూజ్యం చ మద్గృహం
భవా న్నిమ్యం కరుణయా ఽనుగ్రహీతుం సమాగతః॥ ౮

త చ్ఛ్రుత్వా వచనం సద్యః విశ్వామిత్రో ఽవద న్నృపం
వినయ స్త్వత్ప్రభుత్వస్య శోభాం జనయతి ధ్రువం॥
తయో రేవంభాషయతో స్సంచార్యచ వనాంతరే
మునే ర్నికట మాయాంతౌ రాఘవౌ వీక్ష్య మైథిలః॥
స్వాత్మ న్యేవం తయోర్మధ్యే చింతయామాస రాఘవం॥ ౯-౧౦

౨-౩ విశ్వామిత్రుని రాకను విని జనకమహారాజు సంతోషమును చెందిన వాడై పూజాద్రవ్యములతో పురమునుండి బయలుదేరి కౌశికుని సమీపమునకు వచ్చి యామునివరునితో నిట్లనెను.

౪ ఓ విశ్వామిత్రమహర్షీ ! నీకు నావందనములు. ఇట్లు వచించిన జనకునిగూర్చి కౌశికు డిట్లనెను.

౫ ఓ రాజశ్రేష్ఠుఁడా ! నీయింట శుభ మగుగాక ! శీఘ్రముగా కళ్యాణమగుగాక ! నీ ప్రయత్నము సఫలమగుగాక.

౬ జనకుఁడు :—ఓ మునిశ్రేష్ఠుఁడా ! నీకును ఆశ్రమవాసులకును కుశలమేనా ? ఓ మహాముని ! మీయాశ్రమములు వర్ధిల్లుచున్నవా ?

౭ కౌశికుఁడు:—నీవు రక్షకుఁడవయి యుండగా మాకు, సమస్తమయిన వారికి కుశలమే యగును. ఇట్లు వచింపబడిన జనకుఁడు విశ్వామిత్రుని గూర్చి యీవిధముగాఁ బలికెను.

౮ ఓ విశ్వామిత్రా ! నీరాకచే నేను ధన్యుడను. నాగృహము పూజింపబడిన దయినది. కరుణతో మీశిష్యుఁడ నయిన నన్ను ననుగ్రహించుటకు వచ్చితిరి.

౯-౧౦౪ ఆ వాక్యమును విని వెంటనే విశ్వామిత్రుఁడు రాజునుగూర్చి యిట్లనెను. నీ వినయము నీ రాజరికమునకు శోభను కలుగజేయుచున్నది. నిజము. ఈవిధముగా మాట్లాడుచుండగా వనమునందు సంచరించి రామలక్ష్మణులు మునిసమీపమునకు వచ్చిరి. వారిని జనకుఁడు చూచి తనమనస్సునం దిట్లు రామునిగూర్చి తలంచెను.

మమ భాగ్యం సుఫలితం ప్రోన్నమయ్య ధను స్త్వయం॥
మాం కృతార్థయితుం చాగా దితి స్ఫురతి మే ధ్రువం॥
౧౧-౧౧౪

ఈదృ క్సద్గుణసంపన్నః ఈదృశో రఘుభూషణః॥
మమ స్యా ద్యది జామాతా మాదృగ్ధన్యో న హి క్షితౌ॥
౧౨-౧౨౪

నీలమేఘనిభ స్యాస్య దర్శనేన మనో మమ॥
నిమగ్న మానందవార్ధౌ కారణం నైవ దృశ్యతే
ఇతి సంచిత్య వైదేహః విశ్వామిత్ర మ థాబ్రవీత్॥
౧౩-౧౪

మందహాసయుతౌ బాలౌ నవమన్మథసన్నిభౌ
విచారితే క్షాత్రతేజో రాజితౌ విన సంస్థితౌ॥
కస్యై తౌ నరశార్దూలౌ పుత్రౌ కౌశిక! మే వద॥ ౧౫-౧౫౪

కింస్వి దేతౌ మునిసుతౌ వాహోస్వి ద్రాజపుత్రకౌ॥
అథవా నేతి శ్రుత్యుక్తబ్రహ్మైవ ద్వివిధా వితి
సంస్ఫుర త్యద్య మే నూనం మునే! త త్త్వం వద ధ్రువం॥
౧౬-౧౭

చంద్రం వీక్ష్య చకోరస్తు యథా తుష్యతి కౌశిక!
నీలమేఘనిభం బాలం దృష్ట్వా తుష్యతి మే మనః॥ ౧౮

ఇతి తద్వచనం శ్రుత్వా ప్రహస్య ముని రాహ తం
పుత్రౌ దశరథ స్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ॥

౧౧ నాభాగ్యము ఫలించినది. ఇతడు ధనువును వంచి నన్ను కృతార్థుని చేయుటకు వచ్చె నని నాకుఁ దోఁచుచున్నది. ఇది నిశ్చయము.

౧౨-౧౨½ ఇటువంటి మంచిగుణములచే శోభ కలిగినవాడును, ఇటువంటి రఘువంశమున కలంకారమైనవాడును నా కల్లు డయినచో నావంటి ధన్యు డీజగతియం దుండడు.

౧౩-౧౮ నీలమేఘముతో సమానమయిన దేహకాంతిగల యితని దర్శనముచే నామనస్సు ఆనందవార్ధియందు మునుగుచున్నది. దానికి కారణము నాకు కాన్పించదు.

ఈవిధముగా జనకుఁడాలోచించుకొని విశ్వామిత్రునితో నిట్లనెను—

౧౫-౧౫½ చిఱునవ్వుతో కూడుకొనినట్టియు మన్మథునితో సమానమయిన ట్టియు క్షత్రియసంబంధ మగు తేజముచేఁ శకాంచుచున్నటుల నున్నట్టియు పురుషశ్రేష్ఠులయినట్టియు ఈ బాలకు లిరువురు నెవరి పుత్రులో కౌశికా! నాకు వచింపుము.

౧౬-౧౭ వీరిరువురు మునికుమారులా ? లేక రాజపుత్రకులా ? అట్లు కాదేని “నేతి నేతి” యను వేదవాక్యమునందుఁ జెప్పబడిన బ్రహ్మయే యిట్లు ఈ యిద్దరు నయ్యెనా యని నాకుతోచుచున్నద. ఓ మునీ ! నీవు ఈవిషయమునుగూర్చి సత్యమును దెల్పుము.

౧౮ ఓ కౌశికా ! చంద్రునిఁ గాంచి చకోర మెట్లు సంతుష్టిని బొందునో యట్లే నీలమేఘముతో సమానమయిన దేహకాంతిగల యీబాలకులనుఁ జూచిన నామనస్సు సంతుష్టినిఁ బొందుచున్నది.

౧౯-౧౯½ ఆమాటలను విని విశ్వామిత్రుఁడు చిఱునవ్వు నవ్వి యిట్లనెను. వీరు దశరథుని పుత్రులు, అన్నదమ్ములు, రామలక్ష్మణులు.

మఖసంరక్షణార్థాయ మయా ఽఽనీతౌ పితుః పురాత్॥
౧౯-౧౯½

ఆగచ్ఛ న్రాఘవో మార్గే తాటకాం విశ్వఘాతినీం॥
శరే ణైకేన హతవా న్మోదితో మే ఽతివిక్రమః॥ ౨౦-౨౦½

తతో మ మాశ్రమం గత్వా మమయజ్ఞవిహింసకాన్॥
సుబాహుప్రముఖాన్హత్వా రరక్ష క్రతుమవ్యయం॥ ౨౧-౨౧½

తతో గంగాతటే ఽహల్యాం శిలారూపా మతారయత్॥ ౨౨

ఇదానీం ద్రష్టుకామ స్తే గృహే మాహేశ్వరం ధనుః
సమాగతో ఽభూ ద్రామో ఽయం మైథి లాద్య శుభా
కృతిః॥ ౨౩

జనకః—

యది బాలా విమా రాజ్యం పాలయంతా విహ స్థితౌ
మహానందో మమ భవే ద్విశ్వామిత్రమహామునే! ౨౪

ఇత్యుక్తః కౌశికో ఽప్యాహ వచనం మైథిలం ప్రతి
త్వత్పుత్రికాద్వయం రాజన్ ద్వయో ర్దత్వా ఽత్ర తావిహ
సంస్థాపయ తవాభీష్టః సేత్స్య త్యేవ నసంశయః॥ ౨౫-౨౫½

జనకః—

భవద్వచ స్సత్యమేవ పణీకృత మిదం ధనుః॥
తస్మా ద్విచారయా వ్యాధ్యావిచారితకృతం మునే!
౨౬-౨౬½

తండ్రి దగ్గరనుండి యజ్ఞసంరక్షణముకొఱకు నాచేఁ దీసికొని రాఁబడిరి.

౨౦-౨౦½ మార్గమునందు వచ్చుచు రాముఁడు అందరిని చంపునదైన తాటక యను రాక్షసిని నాచే ప్రేరేపింపబడ్డవాఁడై యొక్క బాణముచేతఁ గూలనేసెను.

౨౧-౨౧½ అటుపిమ్మట నాయొక్క ఆశ్రమమునకు వచ్చి నాయొక్క యజ్ఞము పాడుచేయునట్టి వారైన సుబాహుమొదలుగాగల రాక్షసులను జంపి నాయాగసంరక్షణమును జేసెను.

౨౨ అటుపిమ్మట గంగాతీరమునందు చటాౢ్రియియై యున్న అహల్యను శాపమునుండి తరింపఁజేసెను.

౨౩ ఓజనకరాజా ! శుభాకారుఁడైన యీరాముఁ డిప్పుడు నీ గృహమునందున్న శివసంబంధమగు విల్లును జూడవలయు నను కోరికకలవాఁడై వచ్చినాఁడు.

జనకమహారాజు—

౨౪ ఓవిశ్వామిత్రమునీ ! ఈబాలుఁడు నారాజ్యమును పాలించుచు నిక్కడున్నచో నాకు మిక్కిలి సంతోషము కలుగగలదు.

౨౫-౨౫½ ఈ ప్రకారముగ జనకుఁడు చెప్ప నమ్మునియును జనకునితో నిటులఁబలికెను :—ఓరాజా ! నీ కుండిన పుత్రికల నిద్దఱను రామలక్ష్మణుల కిద్దఱకు నిచ్చి వివాహము చేసి వారల నిచ్చటనే నిలుపుకొనుము. నీ యభీష్టము సిద్ధించును. సంశయము లే దనియె.

౨౬-౨౬½ జనకుఁ డావాక్యమును విని యిటుల గౌశికునితో జెప్పెను. ఓకౌశికా ! నీవు చెప్పిన వాక్యము నిజమే. కాని యింతకు బూర్వమే శివధనువు నెక్కిడిన వానికి సీత నిచ్చెద నని పణము పెట్టి యుంటిని. అందువలననే యిప్పుడు నేను విచారింపక చేసిన పనిని గూర్చి యాలోచించుచుంటిని.

తచ్ఛ్రుత్వా మైథిలం నీత్వా రహః ప్రోవాచ కౌశికః॥
ఏష రామో మహారాజ! సాక్షా ద్విష్ణ్వంశసంభవః
రక్షార్థం విష్టపానాంతు జాతో దశరథాత్మజః॥ ౨౭-౨౮

అస్మై సీతాం ప్రయచ్ఛ త్వం దేవకన్యా మివ స్థితాం
పణీకృతం త్వయా చాప మి త్యశ్రౌష మహం పురా॥ ౨౯

త దాకర్షయితా రామ స్సంశయం మాకృథా నృప!
త వారసీ మూర్మిళాంచ దేహి సౌమిత్రయే నృప! ౩౦

వరపూజావిధానేన తౌ పురీం నయ మైథిల!
ఆధనుర్భంగపర్యంత మేత త్త్వం మాస్ఫుటం కురు॥ ౩౧

ఇత్యుక్తో మైథిల స్సద్య శ్శోభయిత్వా నిజాం పురీం
వస్త్రాలంకారభూషాద్యై స్సంపూజ్యాచ నృపాత్మజౌ॥
గజయో స్తౌ సమారోప్య మహోత్సవపురస్సరం
నీతవా న్స్వాట్టమార్గేణ మహర్షిజనసంయుతః॥ ౩౨-౩౩

త చ్ఛ్రుత్వా పురనార్యస్తు ప్రాసాదోపరి సంస్థితాః
వవర్షుః పుష్పవర్షంతు రామలక్ష్మణయో స్తదా॥ ౩౪

సమాచార మిమం శ్రుత్వా ద్రష్టుకామాః పుర స్త్రియః
త్వరితా నిర్ధనాః కోశ మి వాగచ్ఛంతి కాశ్చన॥ ౩౫

దృష్ట్వా తౌ సుందరౌ బాలా వక్షిసాఫల్యకారకౌ
పరస్పరం మిళిత్వా తా స్సంజజల్పుశ్చ కాశ్చన॥ ౩౬

౨౭-౨౮ ఆజనకుని వాక్యమును విశ్వామిత్రుఁడు విని యారాజును రహస్యముగాఁ దీసికొని వెళ్లి యిటులఁ జెప్పెను — ఓజనకమహారాజా! ఈరాముఁడు సాక్షాద్విష్ణ్వంశసంభూతుఁడు. లోకరక్షణార్థమై దశరథపుత్రుఁడుగా నవతరించెను.

౨౯ దేవకన్యయో యనున ట్లుండిన నీకొమరిత యగు సీతను ఈరామున కిచ్చి వివాహము చేయుము. నీవు సీతావివాహ విషయమున శివధనువును బణముగాఁ బెట్టినట్లు నే నిదివరకే వినియుంటిని.

౩౦ ఓరాజా! రాముఁ డాశివధనువు నెక్కు పెట్టఁగలఁడు. నీవు సంశయింపకుము. నీయౌరసపుత్రికయైన ఊర్మిళను లక్ష్మణున కీయుము.

౩౧ ఓరాజా! వీరల నిర్వురను వరపూజావిధానముగఁ బురములోనికిఁ దీసికొని పొమ్ము. ధనుర్భంగపర్యంతము నేను చెప్పినవిషయమును వెల్లడింపకుము.

౩౨-౩౩ ఇవ్విధముగ విశ్వామిత్రునిచేఁ జెప్పఁబడినవాఁడై జనకమహారాజు తనపట్టణమును ముత్యాలతోరణములచే నలంకరింపఁజేసి రామలక్ష్మణులను వస్త్రాలంకారాదులచేఁ బూజించి వారలను గజారూఢులను గాఁజేసి వాద్యఘోషములు మొదలగు మహోత్సవములతో మహర్షిసహితుఁడై పురవీథులవెంట నూరేగింపుతో రామలక్ష్మణులను దీసికొని పోవుచుండెను.

౩౪ ఆ వృత్తాంతమును పురస్త్రీలు విని మేడలమీఁద నెక్కి రామలక్ష్మణులమీఁదఁ బుష్పవర్షమును గురిపించుచుండిరి.

౩౫ మఱికొందఱు పురస్త్రీలు ఈసమాచారమును విని, దరిద్రులు ధనము కొఱకు బరుగిడు విధముగఁ ద్వరితముగ రామలక్ష్మణులను జూడ వచ్చుచుండిరి.

౩౬ మరికొందఱు స్త్రీలు కన్నులపంటువుగ నున్న సుందరు లగు రామలక్ష్మణులను జూచి పరస్పరము వారలు కలిసి యివ్విధముగ మాట్లాడుకొనుచుండిరి.

ఏకా వద త్వశ్య సఖి! కామకోటిసమా విమా
ఏతాదృశంతు సౌందర్యం దేవే ష్వపి న దృశ్యతే॥
చతుర్భుజో మహావిష్ణు శ్చతురాస్యో పితామహః
శివః పంచముఖ శ్చాయ ముపమేయో న తై స్సఖి!
౩౭-౩౮

అపరా కాచ నోవాచ నీలమేఘనిభాకృతిం
దృష్ట్వా కా మోహితా న స్యాత్ వద సత్యం వరాననే! ౩౯

ఏకా వద చ్ఛృణుత భో సఖ్యో మే వచనం త్విదం
ఇమా కుమారా సాకేతనాథపుత్రా వితి శ్రుతం॥
విశ్వామిత్రమహర్షే స్తా యాగరక్షార్థ మాగతౌ
యజ్ఞవిఘ్నకరా న్హత్వా క్రతురక్షాంచ చక్రతుః॥
కౌసల్యాతనయ శ్శ్యామః పీతో మగధజాసుతః
జ్యేష్ఠో రామసమాఖ్యో ఽన్యో లక్ష్మణాఖ్యో మహాబలః॥
సానుజో రాఘవ స్త్వద్య ధనుర్యజ్ఞంచ వీక్షితుం
సమాయాతీ త్యశ్రౌష్వం హి తయో ర్వృత్త మహం పునః॥
౪౦-౪౩

ఏతం త్వద్యైవ వా రాజా పణం త్యజతిచే చ్ఛుభం

౩౬-౩౮ వారలలో నొకస్త్రీ యొకచెలికత్తెతో నిటులఁ జెప్పుచుండెను. ఓసఖి! కోటిమన్మథులతో సమానులగు నీబాలురను జూడుము. ఇట్టి సౌందర్యము మనుష్యులయం దుండకపోవుటయేకాక దేవతల యందును గాన్పించదు. దేవతలలోఁద్రిమూర్తులే గొప్పవా రని చెప్పఁదగియుండిరి. ఆముమ్వురిలో విష్ణుమూర్తి సుందరు డనుటకు వలనుపడదు. ఆవిష్ణువునకు నాల్గుచేతు లుండుటవలన నతడు సుంద రుడు కాడు. బ్రహ్మను సుందరునిగాఁ జెప్పుద మన్నను నతడు నాల్గు ముఖములు కలవాడైనందున సందగాడు కాడు. శివుడు పంచ ముఖములు గలవాడైనందున నతడును నందగాడు కాడు. కాన నోచెలీ! ఈయందమైన నల్లపిల్లవానిని వారలతోఁ బోల్చఁగూడ దనియె.

౩౯ మఱియొకతె తనచెలియతో. నిటులఁ బలికెను. ఓచెలీ! మబ్బు రంగు గల యీబాలుని జూచి యొవతె కామమోహితురాలు కాదో నిజము చెప్పు మనియె.

౪౦-౪౩ ఇంకొకతె తనసఖురాండ్రితో నిటులఁ బలికెను. ఓచెలియ లారా! ఈబాలురు అయోధ్యాపురాధిపతి యగు దశరథుని పుత్రు లనియు, విశ్వామిత్రుని యాగరక్షణార్థమై వచ్చి యాగవిఘాతకు లగు రాక్షసులను జంపి యాగరక్షణమును జేసిరనియు, ఆనల్లపిల్ల వాడు కౌసల్యాపుత్రుడనియు, పచ్చనిబాలుడు సుమిత్రాపుత్రు డనియు, పెద్దవాడు రాముడనియు, చిన్నవాడు లక్ష్మణుడనియు, రాముడు తమ్మునితోఁగూడ నిచ్చటకు ధనుర్యాగమును జూచుటకు వచ్చుచున్నాఁ డనియు వారలవృత్తాంతమును నేను వినియుంటి నని (యొకతె వారలతోఁ జెప్పెను).

౪౪ ఇంకొకతె యిటులఁ జెప్పెను:— ఓ చెలియలారా! మనజనక మహారాజు తాను చేసిన పణము నిష్ఫుడైనను విడిచినచో మంచిగా నుండును. మనసీతకును ఈరామునకును దాంపత్యము తగియున్నను

సీతాయోగ్యోఽప్యయం రామః కథమారోపయే ద్ధనుః॥ ४४

శైవం ధనుః కఠోరంహి బాలకః కోమల స్త్వయం
సీతారామవివాహస్తు సమ్మతో ఽపి కథం భవేత్॥ ४५

నవ్యా కాచన చోవాచ స్యా చ్ఛే న్న శ్శుభచింతకః
విధాతా సీతయా సాకం ఘటయే ద్రాఘవం ధ్రువం॥ ४६

ప్రౌఢా కాచ్చన చోవాచ దాంపత్యఘటనే విధేః
ఏతావ దాగతా ఽకీ ర్తి రద్యవా చతురాననః॥
వ్యపోహనాయ స్వాకీర్తే స్సీతారాఘవయో శ్శుభం
కరోతు దంపతీభావం సరూపకులశీలయోః॥ ४౭-४౮

అన్యా ఽబ్రవీ దయం బాలో ఽప్యధిక స్తేజసా సఖి!
నోచే ద్రాక్షసనంహారం కథ మాచరితుం క్షమః॥
తస్మా చ్ఛివధను ర్భంక్తుం క్షమఏవ ననంశయః॥ ४౯-४౯౧

అపరా కాచ సోవాచ స్వసఖిభి రిదం వచః॥
దైవా త్తయో ర్మేళనంచే త్కృతకృత్యా వయం ఖలు॥
౫౦-౫౦౧

ఏవం తత్పురనారీణాం చక్షుఃప్రీతికరౌ వృభౌ॥
ధనుర్బాణలసద్ధస్తౌ చందనాంచితవక్షసౌ
పీతాంబరలసద్దేహౌ గజారూఢౌ మహోత్సవైః॥
విశ్రాంతిగేహం ప్రావేశ్య హట్టమార్గా న్మహర్షిభిః
కారయామాస జనక స్తేషాం భోజనసత్క్రియాః॥౫౧-౫౩

నెటుల రాముడు ధనువు నెక్కు-పెట్టఁగలడు ? (ఎక్కు-పెట్ట లే డని భావము)

౪౫ శివధనువా కఠినమైనది. ఈబాలుఁడా కోమలమైనవాడు. మన సీతకును రామునకును వివాహము సమ్మతమైన ను నెటుల సమకూరు ననియె.

౪౬ మఱియొకతె యిటులఁ బలికెను :— ఓ చెలియలారా! బ్రహ్మదేవుడు మనమేలు నాలోచించినవాడే యైనచోఁ దప్పక సీతారాములకు దాంపత్యమును సంఘటింపఁజేయు ననియె.

౪౭-౪౮ ఇంకొక పౌరాంగన యిటుల సఖులతోఁ బలికెను :— ఓ సఖులారా! ఇంతదనుక బ్రహ్మకు దాంపత్యములను గూర్చుటలో నపకీర్తియే వచ్చెను (అనగాఁ దగినదాంపత్యము నొనఁగూర్పఁడని యపకీర్తి యని భావము) ఇప్పుడైనను తనయపకీర్తిని బోగొట్టుకొనుటకు సమానరూపకులశీలములు కల సీతారాములకు దాంపత్యము నొనఁగూర్చుగాక యనెను.

౪౯-౪౯౧ మరియొకతె యిటులఁ బల్కెను. ఓచెలియలారా! ఇతడు వయస్సునందు బాలుడైనను, తేజస్సులోఁ బెద్దవాడే యని చెప్పనొప్పు. లేనిచో రాక్షససంహారము నెటులఁ జేయఁగలడు ? కావున శివధనువును భంగపరచుటకు సమర్థుడే. సందియము లేద నెను.

౫౦-౫౦౧ మరియొకతె తనచెలియలతో నిటులఁ బలికెను. దైవవశముచే సీతారాములకు సంమేళనమే యైనచో మనమందరము కూడ కృతార్థుల మగుదు మనియె.

౫౧-౫౩ ఈప్రకారము పురస్త్రీలకు నేత్రానందమును జేయుచు రామలక్ష్మణులు ధనుర్బాణములచే నొప్పుచేతులును, మంచిగంధముచే నొప్పు వక్షఃస్థలములును పీతాంబరముచే నొప్పు దేహములును గలవారలై గజారూఢులై మహోత్సవముతోఁ బురవీధులవెంట నూరేగింపుతో విడిదిగృహమును మహర్షులతోఁ బ్రవేశించిరి. జనకుఁడు వారలందరకును దగిన భోజనాదిసత్కారములను గావించెను.

తత స్తౌ రాఘవౌ తత్ర కౌశికోక్తకథా శ్శుభాః
శృణ్వంతౌ నిన్యతు శ్శేష మహ్నా శ్శాంతం మహర్షిభిః॥ ౫౪

ఇ త్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
చతుర్దశ సర్గ స్సమాప్తః.



పంచదశసర్గ ప్రారంభః.

పరేద్యుః ప్రాత రుత్థాయ కాలకృత్యం విధాయ సః
కౌశికం రాఘవః ప్రాప్య నత్వా ప్రాహ సలక్ష్మణః॥ ౧

1 విశ్వామిత్రమహర్షే ఽయం సౌమిత్రి స్సర్వతః పురీం
నిరీక్షితుం స్వమనసి సమీహత ఇవ స్థితః॥
ఆజ్ఞా త్వయా దీయతేచే ద్దృష్ట్వా ఽగచ్ఛేవ సత్వరం॥ ౨-౨౻

ద్వా యువాం సర్వతో దృష్ట్వా శీఘ్ర మాగచ్ఛ తం త్వితి
ముని ర్య దాజ్ఞాపితవా న్నిర్గతౌ తౌ కిశోరకౌ॥ 3-3౻

నిర్గత్య తౌ హట్టమార్గా న్మిథిలారామణీయకం॥
పశ్యంతౌ రాఘవౌ బాలౌ విస్మయం ప్రాపతు స్తదా॥ ౪-౪౻

నగరే బాడబా స్సర్వే సర్వశాస్త్రవిశారదాః
రాజాన శ్శస్త్రకుశలాః వైశ్యా ధనదసన్నిభాః॥ ౫-౫౻

1 కవిః.

౫౮ అనంతరము రామలక్ష్మణులు మహర్షులతోఁగూడ విశ్వామిత్రుడు చెప్పు సత్కథలను వినుచుఁ బగటిశేషమును గడపిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండద్వితీయభాగమునఁ
బదునాల్గవసర్గము సమాప్తము.



## పదునైదవసర్గప్రారంభము.

౧ మఱుదినము ప్రాతఃకాలమున రామచంద్రమూర్తి కాలకృత్యములను నిర్వర్తించుకొని లక్ష్మణసమేతుడై విశ్వామిత్రమహర్షి సమీపమునకు వచ్చి యమ్మునికి నమస్కరించి యిటులఁ బలికెను.

౨–౨½ ఓవిశ్వామిత్రమహామునీ! ఈలక్ష్మణుడు పురమునంతయుఁ జూచి వచ్చుటకు మనమునందుఁ గోరికకలవాఁడువలె నుండెను. నీయానతియైనచోఁ జూచి శీఘ్రముగ వచ్చెదము (అని రాము డడిగెను).

3-3½ రామచంద్రా! మీరలిరువురును బట్టణమునంతటను జూచి శీఘ్రముగ రండు. అని విశ్వామిత్రుఁడు చెప్పుటతోడనే రామలక్ష్మణు లిర్వురును బయలు దేరిరి.

౪–౪½ ఆరామలక్ష్మణులు బయలు వెడలి పురవీధుల నడచుచు పురసౌందర్యమును జూచుచు మిక్కిలి యాశ్చర్యము నొందిరి.

౫–౫½ పురవైభవము వర్ణింపఁ బడుచున్నది— మిథిలాపురమునందలి బ్రాహ్మణు లందఱును సర్వశాస్త్రపారంగతులై యుండిరి. రాజులు శస్త్రాస్త్రపారంగతులై యుండిరి. వైశ్యులు కుబేరునితో సమానమగు ధనికులై యుండిరి.

సర్వేజనా స్సుశీలాశ్చ పవిత్రహృదయా శ్చ తే॥
జ్ఞానినో భగవద్భక్తా స్సత్కర్మనిరతా స్తథా॥ ౬-౬

నగరేతు స్త్రియ స్సర్వాః దేవతాస్త్రీనిభాస్థితాః॥
పురుషాః కామవత్సర్వే సుందరాకృతయో ఽవసన్॥౭-౭

మహోన్నతాని గేహాని మణిభి ర్నిర్మితానిచ॥
సర్వగేహాని రాజన్యసద్మతుల్యాని సంతిచ॥ ౮-౮

సర్వరత్నసమృద్ధ్యాచ శోభంతే చాపణాః పురే॥
వేశ్మాన్యపిచ సర్వాణి వర్తంతే ఽలంకృతానిచ॥ ౯-౯

సరాంసి తత్ర వర్తంతే సోపానానిచ సర్వతః॥
మణిబద్ధాని శోభంతే జలం తత్ర సుధాసమం
సహస్రపత్రకంజాని వర్తంతే తత్ర నైకశః॥
సరోఽంతికే పుష్పవాట్య స్తన్మధ్యే రత్నవేదికాః॥ ౧౦-౧౦

నిబద్ధా ద్విరదా స్తత్ర రాజద్వారేషు పార్శ్వయోః॥
సర్వత్ర పరిశోభంతే చతురంగబలానిచ॥ ౧౨-౧౨

బహిర్ద్వారే పంజరస్థా శ్శుకా వేదాంతచర్చకాః॥
వివాదం కుర్వతే ప్రాజ్ఞై శ్శాస్త్రేషు కుశలై స్సదా॥౧౩-౧౩

పురా ద్బహి ర్నృపాలాస్తు నానాదేశాగతా స్తదా॥
ఉద్యానేషు వసంతిస్మ పటగేహే ష్వలంకృతాః॥ ౧౪-౧౪

౬-౬॥ ఇదియునుంగాక జనులందరును సత్స్వభావము కలవారలును, పవిత్ర హృదయులును, జ్ఞానులును, భగవద్భక్తులును, సత్కర్మనిరతులు నై యుండిరి

౭-౭॥ పురమునందలి స్త్రీలందఱును దేవతాస్త్రీలతో సమానులుగా నుండిరి. నగరమునందలి పురుషులందఱును మన్మథునితో సమాన మగు నాకారము కలవారలై యుండిరి.

౮-౮॥ పురమునందలి గృహములన్నియు మిక్కిలి యెత్తుగా నుండెను. మణులచే నిర్మింపఁబడి యుండెను. సమస్తగృహములును రాజగృహములతో సమానముగా నుండెను.

౯-౯॥ పురమునందలి బజారులు సర్వరత్నసమృద్ధిచే నొప్పుచుండెను. పురమునందలి గృహములన్నియు నలంకరింపఁబడి యుండెను.

౧౦-౧౦॥ మఱియు నాపురమునం దనేకములగు సరస్సు లుండెను. అందలి సోపానములు మణులచేఁ గట్టబడి ప్రకాశించుచుండెను. ఆసరస్సుల యందలి యుదకము లమృతతుల్యములుగానుండెను. మఱియు నచ్చట సహస్రపత్రకమలము లుండెను. ఆసరోవరములతీరమునఁ బుష్పోద్యానవనములును, వానిమధ్యను రత్నవేదికలు నొప్పుచుండెను.

౧౨-౧౨॥ ఆపురమునందలి రాజద్వారములయం దిరుప్రక్కల మదపుటేనుగులు బంధింపబడియుండెను. ఆపురమునందంతటను చతురంగ బలములు ఒప్పుచుండెను.

౧౩-౧౩॥ బహిర్ద్వారములయందు బంజరములయం దున్న చిలుకలు వేదాంత చర్చలను జేయుచు శాస్త్రములయందుఁ గుశలులగు పండితులు వచ్చినపుడు ముందుగ తామే వారలతో శాస్త్రవివాదములఁ జేయుచుండెను.

౧౪-౧౪॥ అనేక దేశములనుండి వచ్చిన రాజపుత్రులందఱును నగరమునకు వెలుపల నున్న యుద్యానవనములందు పటకుటీరములం దలంకృతులై యుండిరి.

క్రమా దేతాదృశపురే పశ్యంతౌ రామణీయకం॥
రాఘవౌ జగ్మతు ర్ద్రష్టుం బాహ్యోద్యానవనంచ తత్
జగామ యత్ర వై దేహీ దుర్గాదేవీంతు సేవితుం॥ ౧౫-౧౬

పూర్వరాత్రౌ స్వప్నగతం రామం భూమిసుతా తదా
సంలిఖ్య చిత్రఫలకే గృహీత్వా తత్పటంశయే॥
బాహ్యోద్యానం గతా తత్ర స్థితే దుర్గాలయే తదా
భక్త్యా ఒర్చతిస్మ దుర్గాం తాం స్వర్ణపుష్పై స్సఖీయుతా॥
౧౭-౧౮

షోడశై రుపచారై స్తాం సంపూజ్య జనకాత్మజా
ప్రార్థయామాస తాం దుర్గాం భక్తాభీష్టవరప్రదాం॥ ౧౯

నగజాతే! నమ స్తుభ్యం త్వం వేత్సి మదభీప్సితం
అహం త్వద్భక్తియుక్తా చే త్స్వప్నదృష్టం పతిం కురు॥ ౨౦

తదా దేవీ సుప్రసన్నా భూమిజా మవద ద్వచః
మాబిభీహి తవ స్వప్నగోచరో భవితా పతిః॥ ౨౧

ఏతస్మి న్నంతరే తత్ర సంచరంతౌ తు రాఘవౌ
భూమిజాయా స్సఖీ దృష్ట్వా సీతాం ప్రత్యాగతా వదత్॥
౨౨

అదృష్ట్వా పంజరస్థంతు శుకం తన్మార్గణం యథా
త్వదంతికస్థం వై దేహి! స్వాభీష్ట మనిరీక్ష్య తం॥
పురుషం చిత్రఫలకే లిఖితం మార్గయ స్యలం॥ ౨౩-౨౪

౧౫-౧౬ ఇట్టిపురమునందలి రామణీయకమును జూచుచు రామలక్ష్మణులు క్రమముగా నొకయుద్యానవనమునకుఁ జేరిరి. అచ్చటకే సీతయును దుర్గాపూజార్థమై వెళ్ళియుండెను. (ఆయుద్యానవనమున నే దుర్గాలయ మొకటి యుండె నని యెఱుఁగునది).

౧౭-౧౮ పూర్వరాత్రియందు సీతకు రామచంద్రమూర్తి స్వప్నములో గోచరింపగా వెంటనే సీతాదేవి యావ్యక్తి రూపమును జిత్రఫలకమున లిఖించి యాపటమును జేతిలో నుంచుకొని తనకు స్వప్నములో గోచరించిన పురుషునే భర్తనుగాఁ జేయు మని దేవిని బ్రార్థింపఁగోరి పురమునకు వెలుపలనున్న యుద్యానవనమున కేగి యచ్చట నున్న దుర్గాలయమునఁ బ్రవేశించి సువర్ణపుష్పములతోఁ నద్దేవిని పూజించుచుండెను.

౧౯ సీతాదేవి దుర్గను షోడశోపచారములతోఁ బూజించి భక్తాభీష్టప్రదురా లగు నద్దేవిని నిటులఁ బ్రార్థించెను.

౨౦ ఓదుర్గాదేవి! నీకు నమస్కారము. నాయభీష్టమును నీ వెఱుఁగుదువు. నేను నీయందు భక్తికలదాన నే యైనచో నాకు స్వప్నములో గోచరించిన పురుషుని భర్తనుగాఁ జేయుము.

౨౧ సీతాప్రార్థనను విని దేవి ప్రసన్నురాలై సీతను గూర్చి యిటులఁ బలికెను. ఓజానకి! నీవు భయపడకుము. నీకు స్వప్నములో గోచరించినపురుషుడే భర్త కాగలడు.

౨౨ ఈసమయమున పుష్పోద్యానవనములో సంచరించుచున్న రామలక్ష్మణులను సీత చెలికత్తె చూచి తొందరగా సీత యొద్దకు వచ్చి యాజానకితో నిటులఁ బలికెను.

౨౩-౨౩½ ఓ జానకి! పంజరములోని చిలుకను గానక యాచిలుకను వెదకినటుల నీ చిత్రపటమునందలి యభీష్టపురుషుని సమీపములో సంచరించుచుండినను జూడక వెదకుచుంటివి.

ఏహ్యేహి సత్వరం దేవి! సో౽య మత్ర సమాగతః॥
పుష్పవాట్యాం చరంతం త మభీష్టం పశ్య భూమిజే!౨౪-౨౪½

సమాప్య పూజాం సీతా౽పి సమాగత్య బహి ర్ద్రుతం॥
పుష్పాపచయక ర్త్రీవ లతాకుంజాంతరే స్థితా
వచ స్త్విదం సఖీం ప్రాహ భూమిజా భావగర్భితం॥ ౨౫-౨౬

సుశీలే సఖి! ప శ్యేమాం వల్లీ తాంబూలనామికా
యథా తరుం తు సంయోక్తుం ప్రయత్నం కురుతే దృఢం॥ ౨౭

సఖీ:— అనుకూలో నాయకస్తు సంభవే చ్చే త్తదా పునః
సర్వా౽పి స్త్రియో వ్యగ్రాః భవేయు ర్భూమిజే ధ్రువం॥
దృష్టాంత మత్ర భవతీ భవ త్యేవాత్ర భూమిజే!౨౮-౨౮½

తచ్ఛ్రుత్వా వచనం సీతా సుశీలా మాహ సై సఖీం॥
తథా త్వమేవ భవసి త్వరమాణా సఖి! ధ్రువం॥౨౯-౨౯½

ప శ్యేమం సఖి! మే తాత స్సాకేతా ద్దాడిమం త్విమం॥
ఆనయామాస తం చేమం ప శ్యేయ మసుసన్నిభం॥30-30½

త చ్ఛ్రుత్వా భూమిజావాక్యం సుశీలా ప్రాహ మైథిలీం॥
తృణం వా ద్రియసే త్వంతు సాకేతా దాగతం సఖి!
తత్కారణ మహం వేద్మి సీతే! త్వత్కథనం వినా॥ ౩౧-౩౨

ఏత స్మిన్నంతరే తత్ర విచరంతం రఘూత్తమం
లోకాభిరామం వైదేహీ దృష్ట్వా మోహవశంగతా॥

౨౪_౨౪౹ ఓ సఖి! శీఘ్రముగా రమ్ము, శీఘ్రముగా రమ్ము. నీయభీష్ట పురుషుఁడు ఈయుద్యానవనమునందే విహరించుచుండెను.

౨౫_౨౬ సీతయును పూజాసమాప్తి చేసి తొందరగా వెలుపలికి వచ్చి పుష్పములను గోయుచున్నట్లు నటించుచు లతాగృహమునఁ దిరుగుచుఁ దనచెలికత్తెతో నిటుల భావగర్భితమగు వాక్యమును బలికెను.

౨౭ ఓసఖి! సుశీలా! ఈతాంబూలపుతీగె యెవ్విధముగఁ జెట్టున కెగఁ బ్రాకుచున్నదో చూడుము (అని సీత పలికెను).

౨౮_౨౮౹ సుశీల యను సఖురాలు సీతతో నిటుల బలికెను. ఓ జానకి! అనుకూలమైన నాయకుడు దొరకినపుడు స్త్రీలందరును తొందర పడువారలే. ఇందునకు దృష్టాంతము నీవే యనెను.

౨౯_౨౯౹ ఆవాక్యమును విని సీత తన సఖితో నిటులఁ బలికెను. ఓసఖి! అట్లు తొందరపాటు కలదానవు నీవేకాని నేను కా ననెను.

౩౦_౩౦౹ ఓచెలి! మాతండ్రియగు జనకుడు ఈతియ్యదానిమ్మ చెట్టును సాకేతపురమునుండి తెప్పించి యిచట స్థాపించెను. దీనిని నేను ప్రాణతుల్యముగాఁ జూచుచుందును. (అని సీత పలికెను.)

౩౧_౩౨ ఆవాక్యమును సుశీల విని సీతతో నిటులఁ బలికెను. ఓజానకి! సాకేతపురమునుండి వచ్చిన తృణమునైనను నీవు ఆదరించెదవు. నీవు చెప్పకుండగనే యాకారణమును నే నెరుగుదును.

౩౩_౩౩౹ సీతయు నా సఖురాలును నిటుల సంభాషించుచుండగనే లోకాభిరాముడైన యారాముడు ఆపుష్పవనమున సంచరించుచు సమీపము నకు రాగా నారాముని సీతజూచి మోహితురాలై తనతండ్రి పెట్టిన పణమును గూర్చి చాల విచారపడెను. (పణ మనగా నెవ్వడు ధనువు

సంస్మృత్యచ పణం పిత్ర్యం మనస్సంక్షోభవ త్యభూత్॥
33-33½

లజ్జితా పరిహాసాచ్చ సఖీనా మంతరే ఽంతరే॥
స్వప్నదృష్టాద్వితీయం తం జ్ఞాత్వా భూమిసుతా తదా
సా కింకర్తవ్యతామూఢా ధ్యాయంతీ తం హృది స్థితా॥
34-35

రామోఽపి తత్ర విచరన్ లతాకుంజాంతరే స్థితాం
నిరీక్ష్య రాజపుత్రీం తాం చింతయామాస మానసే॥ 36
ఏషా త్వంఘ్రియుగేన సారసరుచిం కైసాలశోభాం శయ
ద్వంద్వే నాధరతో ప్రవాళసురుచిం హాసేన సచ్చంద్రికాం,
దృష్ట్వాలిప్రథమానకాంతి మతులాం ధిక్కుర్వతీ దృశ్యతే
ఏతస్యా స్సదృశీ జగత్త్రయతలే ఽన్వేష్టాఽపి నో దృశ్యతే॥37
ధాతా స్వరచనాయాంతు చాతుర్యం దర్శయన్నివ
త్రిలోకసుందరీ మేనాం నిర్మమే రాజపుత్రికాం॥ 38

ఇతి సంచింతయ న్రామ స్సీతాసంలగ్నమానసః
స్వమానసం భూమిజాయాః నివర్తయితు మక్షమః॥
హృదయే తా మభిధ్యాయ న్సామిత్రిం ప్రాహ వై తదా॥
39-39½

రాఘవాణాం మనః క్వాపి నాధర్మం ప్రవిశ త్పురా॥
లక్ష్మణాద్య మనస్సక్తం రాజపుత్ర్యా మహో మమ
నివర్తయితు మ ప్యస్యాః నశక్నోమి మన స్త్వహం॥ 40-41

నెక్కు-పెట్టునో వానికి సీత నిచ్చెద నని ప్రతినచేయుటయని యెరుగనగును.)

౩౪-౩౫ ఆ సీతాదేవి మధ్యమధ్యయందు సఖురాండ్రి పరిహాసమువలన సిగ్గుపడుచు, నపుడు కనపడు పురుషుఁడు తనకు స్వప్నములో సాక్షాత్కరించిన పురుషుఁడే యని తెలిసికొని యేమిచేయుటకుఁ దోచక యారాముని రూపమును తనమనమున ధ్యానించుచు నిల్వఁబడెను.

౩౬ రామచంద్రమూర్తియును నచ్చట సంచరించుచుఁ బొదరింటిచాటున నున్న రాజపుత్రిని జూచి తనమనమునం దిటులఁ జింతించెను.

౩౭ ఓహో! ఈరాజపుత్రి తనపాదయుగముచేఁ బద్మకాంతిని, పాణి ద్వంద్వముచేఁ జిగురుటాకులయందమును, తనయధరోష్ఠముచేఁ బగడపుకాంతిని, తనలేనగవుచే వెన్నెలను, దృష్టిచేఁ దుమ్మెదలకాంతిని ధిక్కరించుచుండెను. ఈకన్యకతో సమానురాలు ముల్లోకముల యందు వెదకిచూచినను గన్పడదు

౩౮ బ్రహ్మదేవుఁడు తనసృష్టియందలి చాతుర్యమును లోకమునకుఁ జూపఁ దలచియో యనునటులఁ ద్రిలోకసుందరి యగు నీరాజపుత్రికను సృష్టించెను.

౩౯-౩౯ ఈప్రకారము రామచంద్రమూర్తి తనమనమున నాలోచించుచు సీతయందు లగ్నమయిన చిత్తము కలవాఁడై తనమనమును సీతనుండి మరలింపలేక హృదయమున నామెను ధ్యానించుచు లక్ష్మణునితో నిటులఁ బలికెను.

౪౦-౪౧ సోదరా! మనరఘువంశపురాజుల మనస్సు లింత దనుక నెచ్చటను నధర్మమునఁ బ్రవేశించియుండలేదు. ఏకారణముచేతనో నా మనస్సు రాజపుత్రికయందు లగ్నమైనది. ఆశ్చర్యము! ఈ రాజపుత్రికవలన మనస్సును మరలించుటకు నేను సమర్థుండను గాకుండనుంటిని.

ఏవ ముక్త్వా ఽతిరాగేణ రామే పశ్యతి తాం దృఢం
దక్షిణా క్ష్యస్ఫుర త్తస్య సీతాయా వామ మక్షి చ॥ ౪౨

తదా విస్మయ మాపన్న స్సౌమిత్రిః ప్రాహ రాఘవం
ఏషైవ రాజపుత్రీతి ధనురాకర్షణం ధ్రువం॥
కరిష్యసి త్వమేవేతి త్వా మేషా వృణుయా దితి
ధ్రువం మే స్ఫురతి భ్రాత ర్నోచే ద్దిష్టం మతి ర్న తే॥
౪౩-౪౪

దృష్ట్వా పరస్త్రియం ద్రష్టుం విముఖస్యతు తే మనః
యత స్తస్యా మభూ ల్లగ్నం తత స్సా స్యా న్నృపాత్మజా॥ ౪౫

కించ తత్పాదసేవాయాం జాయతే మమ వై మతిః
నోదేతి మే మతి స్తస్యాః ముఖచంద్రం నిరీక్షితుమ్॥ ౪౬

గురో ర్నికట మావాంతు న గచ్ఛేవ యది ద్రుతం
ముని ర్నో కుప్యతి భ్రాతః ఏహీ త్యుక్త్వా రఘూత్తమం॥
సౌమిత్రి ర్నీతవా న్సద్యో విశ్వామిత్రాంతికం పునః॥ ౪౭-౪౭½

హృదయే జానకీరూపం స్మరం స్తత్ర రఘూద్వహః
కౌశిక స్యాంతికే భ్రాంత ఇవ సంస్థితవా నభూత్॥ ౪౮-౪౮½

తత్ర సీతా ఽపి రామం తం ధ్యాయంతీ స్వసఖీయుతా॥
స్వగృహం గంతు ముద్యుక్తా కించి ద్ద్వారం గతా ఽభవత్॥
౪౯-౪౯½

౪౨ ఈప్రకారముగ లక్ష్మణునితోఁ జెప్పుచు నా రామచంద్రమూర్తి సీతను జూచుచుండగా నా రామునకుఁ గుడికన్ను అదరెను. ఆసమయముననే సీత కెడమనేత్ర మదరెను.

౪౩–౪౪ అప్పుడు లక్ష్మణుఁడు విస్మయము నొంది రామునితో నిటులఁ బలికెను. అన్నా! పరస్త్రీవిముఖుడ వగు నీ కిట్టి యనురాగ మీమెయందుఁ గలుగుటవలన నీ కన్యకయే జానకి యనియు, నీవు తప్పక ధనువు నెక్కుపెట్టెద వనియు, నిన్ను నీమె వరించు ననియుఁ దోచుచున్నది.

౪౫ కంటితోఁ బరస్త్రీని జూచుటకు విముఖుఁడ వగు నీమనము ఆకన్యక యందు లగ్నమైనకతమునఁ దప్పక యాకన్యక రాజపుత్రికయే యై యుండవలయును.

౪౬ ఇదియునుఁగాక ఆమెయొక్క పాదసేవ చేయుటయందు నాకు బుద్ధిపొడముచున్నది. కాని యామెముఖచంద్రుని జూచుటకు నాకు బుద్ధిపొడముట లేదు. కాన నామె జనకాత్మజయే యని తెలియు చున్నది

౪౭–౪౭½ అన్నా! మన మిర్వురము శీఘ్రముగ గురు వగు కౌశికుని సమీపమునకుఁ బోనిచో నమ్మౌని కోపగించును. కాన రమ్మని చెప్పి లక్ష్మణుడు రాముని గౌశికునిసమీపమునకు దీసికొని వచ్చెను.

౪౮–౪౮½ అచ్చటనుగూడ రాముడు తన మనమున సీతారూపమును స్మరించుచుఁ గౌశికునిసమీపమున చిత్తవిభ్రమము గలవాఁడువలె నుండెను (అనగాఁ బరధ్యానముతో నుండెను).

౪౯–౪౯½ అచ్చట సీతాదేవియును రాముని దనమనమున స్మరించుచుఁ దనసఖురాండ్రతోఁగూడి స్వగృహమునుగూర్చి పోవసెంచి కొంచెముదూరము వెళ్లెను.

ఏతస్మి న్నేవ సమయే దశాస్యో నారదా ద్యతః॥
సీతాస్వయంవరశుభం శ్రుత్వా పరిజనాన్వితః
శూర్పణఖ్యా విరాధేన సహితో మిథిలాం గతః॥
సీతా యత్ర వనే ఽతిష్ఠ త్తద్వనం సముపాగతః
స్వమాయయా ఽదృశ్యరూప శ్చరతిస్మ చ తద్వనే॥ ౫౦-౫౨

రాజపుత్రీవచోమాత్రం శ్రూయతే సా న దృశ్యతే
కి మేత దితి సందిహ్య సంస్థితే రావణే తదా॥
పప్రచ్ఛ భూమిజాం తత్ర తత్సఖీ ప్రియభాషిణీమ్॥ ౫౩-౫౩½

హస్తాభరణయుగ్మంతు నూతనం దృశ్యతే సఖి!
కదా నిర్మాపితం చైత దితి పృష్టా ఽహ సా సఖీమ్॥ ౫౪-౫౪½

ప్రేషితం పరితోషేణ మ మేద మనసూయయా॥
హస్తాభరణయుగ్మంతు రక్షో ఽగోచరతాకరమ్॥ ౫౫-౫౫½

తచ్ఛ్రుత్వా వచనం సద్య స్సహజాం ప్రాహ రావణః॥
ద్విజస్త్రీవేష మాశ్రిత్య సహజే! త్వం గతా ద్రుతం
రాజపుత్రీం మిళిత్వా ఽశీర్వచనంతు విధాయ తాం॥
సంప్రార్థ్య హస్తాభరణయుగ మానీయ దేహి మే॥
౫౬-౫౭½

౫౦-౫౨ ఈసమయమున రావణుడు నారదునివలన సీతాస్వయంవర శుభ వృత్తాంతమును విని విరాధునితోడను శూర్పణఖతోడను బయలు వెడలి మిథిలాపురమునకు వచ్చి సీతయున్న యుద్యానవనమును బ్రవేశించి తన పరిజనసమేతముగ రాక్షసమాయచేఁ దాను అదృశ్యుఁడై యవ్వనమున సంచరించుచుండెను.

౫౩-౫౩½ అవ్వనమునందు రాజపుత్రికయగు సీత మాటలు విన్పడగా రావణుడు విని తనమనమునం దిట్లు సందేహపడెను — రాజపుత్రిక మాట్లాడినటుల నున్నదికాని యాకన్యక నాకుఁ గన్పడుట లేదు. ఇది యేమి యాశ్చర్యము అని రావణుఁడు సందేహపడుచుండగా సీత యొక్క యొకసఖురాలు సీతను నివ్విధముగఁ బ్రశ్నించెను.

౫౪-౫౪½ ఓ జానకీ! నీచేతులయందు నేడు నూతనమగు హస్తాభరణ యుగ్మము గన్పడుచున్నది. ఈయలంకారము లెపుడు చేయింపఁబడినవి యని సఖురాలడుగగా సీత యాసఖితో నిట్లు చెప్పెను.

౫౫-౫౫½ ఓ సఖీ! ఈ హస్తాభరణద్వంద్వమును సంతోషపూర్వకముగా అనసూయామహాదేవి నాకు స్వయంవరశుభము జరుగునని పంపినది. ఈ యలంకారములను ధరించినవారలు రాక్షసులకు గోచరము గూడఁ గారట. అట్టి శక్తి యీ యలంకారములందుఁ గల దనెను.

౫౬-౫౭½ ఆ వాక్యమును అదృశ్యుఁడుగా సంచరించుచున్న రావణుఁడు విని తన చెల్లెలయిన శూర్పణఖతో నిట్లు చెప్పెను. ఓ సోదరీ! నీవు పేదబ్రాహ్మణముత్తైదువవేషముతో శీఘ్రముగా సమీపములో నున్న రాజపుత్రినిఁ గలిసికొని యాకన్య నాశీర్వదించి యాకన్యక చేతుల నున్న నూతనహస్తాభరణములను యాచించి తీసికొని వచ్చి నా కిమ్ము (హస్తాభరణము లామె చేతి నున్నంత పర్యంతము నా కామె కన్పడదు. కాన హస్తాలంకారములను దెమ్మని చెప్పెను)

ఇత్యుక్త్వా సా శూర్పణఖా ద్విజస్త్రీరూప మాశ్రితా॥
జానకీనికటం గత్వా త్వాశిషం కృతవ త్యభూత్
చక్రివర్తి పతి స్తే స్యా త్త్వదభీష్టోఽపి లభ్యతే॥
హస్తాభరణయుగ్మంతు దరిద్రాయై ప్రదేహి మే॥ ౫౮-౫౯

ఇతి ప్రార్థ్యమానాయాః వలయే జానకీ దదౌ॥
స్వహస్తస్థం చిత్రపటం నిక్షిప్యచ మహీతలే
తతోఽపవిశ్య వైదేహీ సంబభాషే తయా యదా॥
తదా శూర్పణఖా సా ఽపి స్వాంతికే సంస్థితం తదా
దశాననపటం తత్ర నిక్షిప్యావని సంస్థితం॥
సీతాసంబంధి త చ్చిత్రపటం రామస్య సా మిథః
గృహీత్వా నిర్గతా తూర్ణం జగామ విజనస్థలమ్॥ ౬౦-౬౩

అథ సీతా వినిర్గత్య గృహీత్వా తత్పటం శయే
మధ్యే మార్గం స్వపాణిస్థం దశాననపటం తదా॥
జ్ఞాత్వా స్వబుద్ధిజాడ్యాయ విచార్యచ పునః పునః
తత్పటం పాతయామాస దూరత శ్చావనీతలే॥ ౬౪-౬౫

తత స్సా మైథిలీ తూర్ణం గత్వా చ స్వ పితుర్గృహం
రామ మేవ హృదా తత్ర ధ్యాయంతీ సంస్థితా ఽవసత్॥ ౬౬

స్వ సా దశాననస్యాపి రామచిత్రపటం కరే
గృహీత్వా విజనే దేశే వనే తస్మిన్ స్థితా ముహుః॥

౫౦-౫౯ ఈప్రకారముగా రావణునిచేఁ గోరఁబడిన యాశూర్పణఖ, పేదబ్రాహ్మణముత్తైదువరూపముతో సీతయొద్దకు వచ్చి సీత నిటుల నాశీర్వదించెను ఓ రాజపుత్రీ! నీకు సార్వభౌముఁడైన భర్త రాఁగలఁడు. మఱియు నీవు మనస్సులోఁ గోరుచున్న నీ యభీష్ట పురుషుఁడే నీకు లభ్య మగును. నేను పేదముత్తైదువను. దరిద్రురాలను. కాన నీచేతి నున్న క్రొత్తహస్తాభరణములను నా కిమ్ము. అని సీతను బ్రాహ్మణముత్తైదువవేషముతో వచ్చిన శూర్పణఖ యాచించెను.

౬౦-౬౩ ఈ ప్రకారముగాఁ దనను బ్రార్థించుచున్న యాపేద ముత్తైదువకుఁ దన నూతనహస్తాభరణయుగళము నిచ్చెను మఱియు సీత యచటఁ గూర్చుండి యాబ్రాహ్మణముత్తైదువతో మాట్లాడుచున్న పుడు తనచేతిలోని రామచిత్రపటమును భూమియందుంచి మాట్లాడు చుండెను. ఆసమయములో రహస్యముగాఁ దన యొద్దనుంచుకొనిన రావణచిత్రపటమును సీత చూడకుండ నచటఁబెట్టి సీతసంబంధమైన యారామచిత్రపటమును రహస్యముగాఁ దీసికొని శీఘ్రముగా యాబ్రాహ్మణముత్తైదువవేషముతో నున్న శూర్పణఖ యొకవిజన స్థలమునకు వెళ్లెను.

౬౪-౬౫ అనంతరము సీతయును భూమియందున్న చిత్రపటమును జేతిలో నుంచుకొని బయలుదేరి కొంతదూరము వెళ్లినతర్వాతను దనచేతి లోని పటమును బరిశీలించిచూడఁగా నది రావణునిపట మయ్యెను. తనబుద్ధిమాంద్యమునకుఁ గడు-విచార మొంది యాపాడుపటమును దూరముగాఁ జెలికత్తెతోఁ బాఱవేయించెను.

౬౬ అనంతరము సీతయును దండ్రిగృహమునకు వెళ్ళి యచ్చట రామునే తనమనమున ధ్యానించుచు నుండెను.

౬౭-౬౯ రావణుని చెలియలైన శూర్పణఖయును రాముని పటమును జేతి యందుంచుకొని యాయుద్యానవనములో నొకమూలను గూర్చుండి

తద్రాఘువపటం మోహా త్పశ్యంతీ రాఘవం హృది
భర్తార మభివాంఛంతీ సీతావేషధరా స్వయం॥
తత్పటం పూజయంతీ సా స్థితా హ్యైకత్ర తద్వనే॥౧౬-౧౭

దశాననో విరాధం త మువా చేదం వచ స్తతః॥
నాగతా మే స్వసా గత్వా తాం సమానయ సత్వరమ్॥
౧౮-౧౯

ఇత్యుక్త స్స న్విరాధోఽపి విచరం స్తద్వనేతు తాం
ఏకత్ర భూమిజావేష మాశ్రితాం తాం నిరీక్ష్య సః
స్వయం రాఘవవేషేణ తస్యా నికట మాయయా॥ ౨౦-౨౧

సా తం దృష్ట్వా ధ్రువం రామం మత్వా తం వృతవ త్యభూత్
సోఽపితాంచధ్రువంసీతాంమత్వాతాంవృతవానభూత్॥ ౨౨

ఏవం పరస్పరప్రేమ్ణా సంయుతౌ తౌ వినిర్గతౌ
గత్వా చ దూరత స్తత్ర విజనే గిరికందరే
సంగతౌ స్పర్శనాలింగ నాలాపై స్స్వస్వ సంగతిం
జ్ఞాత్వా ఽన్యోన్యం దూషయంతౌ స్వరూపౌ రావణం గతౌ॥
౨౩-౨౪

సీతా ఽదర్శనజక్లేశసంయుత స్స దశాననః
తద్వనే పటగేహంతు నిర్మాప్య స్థితవా నహో॥ ౨౫

యారామునిపటమును బలుమారు చూచుచు నాసౌందర్యమునకు మెచ్చుకొనుచు రాముని భర్తనుగాఁ గోరి తాను సీతవేషమును ధరించి యారామ పటమును బూజించుచు నొకచోట నుండెను.

౧౮-౧౯ అప్పుడు రావణుఁడు విరాధునితో నిటులఁ జెప్పెను. ఓవిరాధుఁడా! నాచెల్లెలు వెళ్లి యింతపర్యంతము వచ్చియుండలేదు. కారణము తెలియదు. నీవు వెళ్ళి శీఘ్రముగ నాచెల్లెలను దీసికొని రమ్ము.

౨౦-౨౧ ఇవ్విధముగ రావణునిచేఁ జెప్పఁబడి విరాధుఁడు బయలుదేరి యావనమునందు శూర్పణఖను వెదకుచుఁ దిరుగుచుండగా నొకచోట సీతావేషముతో నున్న యాశూర్పణఖను నిజమైన సీత యనుకొని సీతకు రామునియందు మక్కువయున్నట్లు వినియున్నందునఁ దాను రాముని వేషముతో నబద్ధపుసీతయొద్దకు వచ్చెను.

౨౨ సీతావేషముతో నున్న యాశూర్పణఖ రామవేషముతోఁ దనసమీపమునకు వచ్చిన యావిరాధుని నిజమైన రాముఁడని భావించి వరించెను. అతఁడుమ సీతావేషముతో నున్న యాస్త్రీని నిజమైన సీతనుగా భావించి యామెను తాను వరించెను.

౨౩-౨౪ ఈప్రకారము వారలు పరస్పరప్రేమకలవారలై యచ్చటనుండి బయలుదేరి దూరముగా వెళ్ళి యొకపర్వతగుహలోఁ బ్రవేశించి తమమనోభీష్టములు నెఱవేరిన వని యుభయులు సంతసించుచు నొకరి నొకరు కలిసి యాలింగనము సల్లాపము మొదలగునవి చేయుటలో రాక్షసకృత్యములు బయటపడి పరస్పరము నొకరిసంగతిని మఱియొకరు నిజ మడిగి తెలిసికొని పరస్పరము నొకరి నొకరు తిట్టుకొని నిజరూపముల ధరించి రావణునియొద్దకుఁ జేరిరి.

౨౫ రావణుఁడును సీత తనకుఁ గన్పడని విచారముతో నవ్వనముననే యొకపటగృహమును (డేరాను) నేర్పరుచుకొని యచ్చట నుండెను.

రామో మమ పతి స్స్యాద్వా నవే త్యాత్మని భూమిజాం
విచారయంతం కై రాత స్త్రీవేషేణ సమాగతః॥
రాఘవో భావివృత్తాంత ముక్త్వా సీతా మతోషయత్॥
౭౬-౭౬౫

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
పంచదశస్సర్గ స్సమాప్తః.

---

షోడశసర్గ ప్రారంభః.

పరేద్యు రపరాహ్ణేతు సర్వే నృపకుమారకాః
స్వయంవరసభాస్థానం సమలంచక్రి రద్భుతమ్॥ ౧

రాఘవౌచ గజారూఢౌ విశ్వామిత్రాదిభి ర్యుతౌ
సభాస్థలం వివిశతు ర్వాద్యఘోషపురస్సరమ్॥ ౨

తయో ర్బాలకయో స్తత్ర మునయ శ్చక్రి రాశిషం
సభాస్థలస్థితా స్సర్వే రాఘవాభ్యాం నమస్కృతాః॥ 3

తదా తత్రత్య భూపాలా స్సంజజల్పుః పరస్పరం
మహోత్సవై రిమౌ రాజా బాలకౌ తౌ విహానయత్॥
తథా ౽స్మాక మకృత్వా ౽యం పరాభూతిం సమాచరత్
వయమ ప్యస్య రాజ్ఞో ౽ద్య కరవామ పరాభవమ్। ౪-౫

ఇత్యేవం రాజపుత్రేషు సంజల్పత్సు పరస్పరం
స్వదూతా న్ప్రాహి వై దేహ శ్చాప మానయత త్వరమ్॥౬

౭౬-౭౯ అచ్చట సీతయును నాకు రాముఁడు భర్తగా లభించునో లేదో యని మనమున విచారపడుచుండ సర్వాంతర్యామి యగు రాముఁడు సీతవిచారమును బోగొట్టుటకు యెరుకలవేషము వేసికొని వచ్చి సీతకు సోది చెప్పి సీతను సంతోషపెట్టెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బదునైదవసర్గము ముగిసెను.

---

## పదునాఱవసర్గ ప్రారంభము.

౧ మఱుదినమున మధ్యాహ్నానంతరము రాజపుత్రులందరును నాశ్చర్యకరమగు స్వయంవరసభాస్థానము నలంకరించిరి.

౨ రామలక్ష్మణులును గజారూఢులై విశ్వామిత్రాది మహర్షులతోఁ గూడ వాద్యఘోషపూర్వకముగ సభాస్థలమును బ్రవేశించిరి.

౩ ఆ సభాస్థలమునందలి మహర్షు లందఱకు రామలక్ష్మణులు నమస్కరింపగా నా బాలకులకు నమ్మును లాశీర్వదించిరి.

౪-౫ అప్పు డక్కడనున్న రాజులందరును పరస్పరము సంభాషింపఁ జొచ్చిరి. ఏమన- జనకమహారాజీబాలకు లిర్వురను మహోత్సవములతో నీసభకుఁ దీసికొని వచ్చెను. అవ్విధముగ మనకుఁ జేయకుండగఁ బరాభవమునుఁ జేసెను. కాన మనమును జనకునకుఁ బరాభవమును జేయవలెనని మాట్లాడుకొనుచుండిరి.

౬ ఈ ప్రకారముగ రాజపుత్రులు పరస్పరము మాట్లాడుకొనుచుండగా శివధనువును సభాస్థలమునకుఁ దెమ్మని జనకుఁడు తన దూతలతోఁ జెప్పెను.

మంజూషా మానయామాసు రాజ్ఞా స్తా జనకేన తే
అష్టచక్రవిరాజంతీం దూతాః పంచశతానినై ॥ ౭

చాపే సభాం సమానీతే సదస్యా న్ప్రాహ మైథిలః
నృపా శృణుత మద్వాక్యం సురాసురనరేషువై ॥
య శ్చాప మేత న్నమయే త్తం వృణోతు మదాత్మజా॥
౮-౮౫

తదా దూరా చ్ఛివధను ర్విలోక్యైవచ కేచన॥
కియ దేత దితి భ్రాంత్వా గత్వాఽలింగ్యతు కేచన
చాపం సంస్పృశ్య కేచి చ్చ గాఢ మాబధ్య కేచన॥
సర్వం భుజబలం చాపే సమారోప్యచ కేచన
తర్కయిత్వా గిరిం శైవం చాపం భూపా నమంతి తే॥ ౯-౧౧

కశ్చి త్పరికరం బధ్వా ధనుషో నికటం యయౌ
సర్పాకారంతు తద్దృష్ట్వా పరావృ త్తోఽవదన్నృపాః
ధనుర్మిషేణ సర్పో ఽయ మస్మా న్వంచయతే నృపః.
౧౨-౧౨౫

పున రన్యోఽపి భూపాలో జగామ ధనుషోఽంతికం॥
అంధీబభూవ స స్తత్ర చాపం నైవతు దృశ్యతే
హాస్తా ప్రసార్య పప్రచ్ఛ క్వాస్తి చాపంహి భో జనాః!॥
౧౩-౧౪

౭ పిమ్మట జనకునిచే నాజ్ఞాపింపఁబడినవారలై యైదువందలమందిదూతలు వెళ్లి యెనిమిదిచక్రములఁచే నొప్పు ధనుష్పేటికను (ధనువుండెడి పెట్టెను.) సభాస్థానమునకుఁ దీసికొని వచ్చిరి.

౮-౮౪ శివధనువును సభాస్థలమునకు దూతలు తీసికొని వచ్చినపిమ్మట జనకమహారాజు సభలోని రాజులతో నిటులఁ బలికెను. ఏమనగా—ఓరాజపుత్రులారా! నావాక్యమును మీరలు సావధానులరై వినుఁడు. దేవతలలోఁగాని, రాక్షసులలోఁగాని, మానవులలోఁగాని యెవఁడు ధనువు నెక్కు-పెట్టునో వానిని నాకొమరితయగు సీత వరించుగాత యని జనకుఁడు రాజులతోఁ జెప్పెను.

౯-౧౧ అప్పుడు కొందఱురాజులు శివధనువును జూచి దూరమునుండియే నమస్కరించిరి. మఱికొందరు ఇది యెంత యని భ్రాంతిపడి గాఢముగఁ గౌగిటజేర్చి యిది కొండవలె నున్నదని నమస్కరించిరి. మరికొందఱు ధనువును స్పృశించియు, మరికొందఱు గాఢముగ ధనువును బట్టుకొనియు, మరికొందఱు తమభుజబలము నంతయు నాధనువునందుఁ జూపియు విఫలులై యొక నమస్కారముచేసి వెళ్లిరి.

౧౨-౧౨౪ ఒకఁడు ధనువు నెక్కు-పెట్టవలయు నని పరికరములను బాగుగ బంధించుకొని ధనువునొద్దకు వచ్చి చూడగా వానికి సర్పముగా నా ధనువు కన్పడగాఁ దిరిగి వెనుకకు వెళ్లి సభ్యులతోఁ నీవిధముగఁ జెప్పెను. ఓరాజపుత్రులారా! ధను వనెడి మిషతో నొకసర్పమును మనలను వంచించుటకు నిచటఁ బెట్టెను.

౧౩-౧౪ మఱియొకఁడు ధనుస్సమీపమునకు రాగా ధనువు వానికిఁ గన్పడక పోయెను. అప్పుడు చేతులు చాచి ధను వెక్కడ నున్నదని యచ్చటి వారల నడిగెను.

జనాః-

శ్లో॥ ధనుషో దర్శనం నాస్తి భంజనే తోలనే కిము
ఇత్యేవం జహసు స్తంతు సదస్యాస్తు నృపాలకాః॥ ౧౫

అన్యః కశ్చన భూపాల శ్చచాలచ నిజాసనాత్
సింహగత్యా మహాగర్వా చ్ఛ్మశ్రూణి స్వకరే దధత్॥
తమేవ దర్శయామాస చాప స్సైంహీం తనుం నిజాం
సింహం దృష్ట్వా పతిత్వా ఽసౌ వృత్థాయ తు పలాయితః॥
సింహో ఽయం చాపరూపేణ జనకేన నివేశితః
ధూర్తో ఽయం జనకో రాజా ఘాతయిష్యతి భూపతీన్॥
౧౬-౧౮

పున రన్య స్సముత్థాయ ధనుషో నికటం యయౌ
శివరూపంతు దదృశే చాపం చండీపతే స్తదా॥
నమస్కారం విధా యాసౌ వివేశ చ నిజాసనే॥ ౧౯-౧౯½
ఏకథాతు సముత్థాయ నృపాణాం శత ముత్తమం॥
ఉత్థాపయామాస తదా తథాపి నచచాల తత్॥
ప్రోచు స్తదానీం తే సర్వే మేరుః కిం చాపరూపధృత్
౨౦-౨౧

బలేః పుత్ర స్తదా బాణ శ్చచాల చ నిజాసనాత్
దదర్శ శివరూపంచ ననామచ పునః పునః
ఉవాచ చ సభామధ్యే శివరూపం ధను స్త్విదం
గమ్యతేచ మయా గేహం నాస్తి మే యోగ్యతా త్విహ॥
ఇత్యుక్త్వా బలిపుత్రస్తు గతవా న్స్వపురీం తతః॥ ౨౨-౨౩½

౧౫ ఆచ్చటి జను లివ్విధముగఁ బలికిరి. నీకు ధనువే కన్పడకపోయి నపుడు నీవు ధనువు నేమి యెక్కు పెట్టెదవు? అని యచ్చటి సభ్యులందరును నా రాజును బరిహసించిరి.

౧౬–౧౭ మఱియొక రాజపుత్రుఁడు తన యాసనమునుండి బయలువెడలి సింహమువలె మహాగర్వముతో మీసమునుఁ దన చేతితో మెలియ వేయుచు ధనువునొద్దకు వెళ్ళెను ఆ ధనువు వానికి సింహమువలెఁ గన్పడగా నాసింహమును జూచి యా రాజపుత్రుఁడు క్రిందఁబడి లేచి పరుగిడుచు వచ్చి రాజులతో నివ్విధముగఁ జెప్పెను. ఓ రాజపుత్రులారా! ఇది సింహముకాని ధనువు కాదు. ఈధూర్త డగు జనకుఁడు మనలను ఘాతచేయవలయు నని యిట్లు చేసెను. అని చెప్పెను.

౧౮–౧౯ మఱియొకఁడు నిలిచి ధనువునొద్దకు వచ్చి చూడగా శివధనుస్సు శివరూపముగాఁ గన్పడగా నమస్కారము సేసి తన యాసనమునకు వచ్చి కూర్చుండెను.

౨౦–౨౧ నూర్గురురాజులు గుంపుగా నొకపర్యాయము లేచి వచ్చి ధనువు నెత్తఁజూచిరి. కాని యాధనువు లేవకపోయెను. అప్పుడు వారలంద ఱును నిది మేరువుకాని ధనువుకాదని రాజులతోఁ జెప్పెను.

౨౨–౨౩ బలిపుత్రుఁడగు బాణాసురుఁడు తనయాసనమునుండి లేచి ధనువు నొద్దకు రాగా నాధనువు శివరూపముగాఁ గన్పడెను. అప్పుడు బాణాసురుఁ డాధనువునకు నమస్కరించి సభలో, నిది శివరూపము కాని, ధనువుకాదు. కాన నాకు నిచ్చటనుండఁ బనిలేదు గృహమునకు వెళ్లుచున్నా నని చెప్పి బలిపుత్రుఁడు తనపురమునుఁ గూర్చి వెళ్లెను.

దశాననస్య సచివ స్సమాగత్యాహ మైథిలం॥
వైదేహ! శృణు మే వాక్యం హితార్థం తే వదా మ్యహం
రావణో నామ పౌలస్త్యో రాక్షసేంద్రో మహాబలః॥
స లంకాధిపతి శ్శ్రీమా న్సాక్షా ద్వైశ్రవణానుజః
తస్మై దేహి నిజాంకన్యాం శ్రియ స్తేఽతివిధాస్యతి
కస్మైచి త్కన్యకావశ్యం దేయా ఖలు నృప! త్వయా
లంకేశ్వరాయ కన్యాయాః దానం క్షేమకరం భవేత్॥
తుభ్యం దాస్యతి జిత్వాఽయం పృథ్వీం సాగరమేఖలామ్॥
౨౬-౨౭½

జనకః-
యది సోఽపి సమాగత్య ధనుష స్తోలనం బలాత్
కుర్యా త్తస్మై ప్రదాస్యామి నాన్యథా ప్రదదా మ్యహమ్॥
౨౮-౨౮½

తద్వాక్యం సచివ శ్శ్రుత్వా ప్రాహతం మైథిలం పునః॥
చంద్రమౌళే రయం చాప స్తస్మా న్నేచ్ఛతి రావణః
యది తచ్చాన్యదేవస్య తత్క్షణం చూర్ణతాం నయేత్॥
౨౯-౩౦

నిశమ్య వచనం తస్య ప్రహస్య ప్రాహ తం నృపః
శంభో రావాస మచల ముత్క్షేప్తుం భుజకౌతుకీ॥
మాహేశ్వరం ధనుః క్రష్టు మర్హతే దశకంధరః॥౩౧-౩౧½

తద్వచస్తు నిశ మ్యాథ సచివో ఽప్యాహ మైథిలమ్॥

౨౫-౨౬½ అనంతరము రావణుని మంత్రివచ్చి జనకుని గూర్చి యిటులఁ జెప్పెను. ఓ జనకమహారాజా ! నేను చెప్పెడివాక్యమును వినుము. నీహితమునకై చెప్పెదను. పులస్త్యబ్రహ్మమనుమడును, రాక్షస రాజును, కుబేరునితమ్ముఁడును, లంకాధిపతియును శ్రీమంతుడు నగు రావణు డను వాఁడొకఁడు కలఁడు. అతనికి నీకొమరిత నిచ్చినచో నీకు శ్రేయస్సును నతఁడు చేయఁగలఁడు. ఎవనికైన నొకనికి నీకన్యక నీయవలసినదే కాన నా రావణున కిచ్చుట నీకు క్షేమకర మగును. అతఁడు చతుస్సముద్రపర్యంతమగు భూమిని జయించి నీ కీయఁగలఁడు అని చెప్పెను.

౨౭-౨౮½ ఆవాక్యమును విని జనకుఁడు రావణమంత్రితో నిటులఁ జెప్పెను. ఓ మంత్రీ ! ఆ రావణుఁడు వచ్చి ధనువు నెక్కు పెట్టి నచో వాని కపుడు నాకొమరిత నిచ్చెదను గాని మఱియొకవిధముగ నీయ ననియె.

౨౯-30 ఆ జనకుని వాక్యమును రావణమంత్రి విని తిరిగి యాజనకునితో నిటులఁ జెప్పెను. ఓ రాజా ! ఇది శివధనువు కాన నెత్తుటకుఁగాని, విరుచుటకుఁగాని శివభక్తుఁ డగు మారావణుఁ డిష్టపడఁడు. ఇదియే యితర ధనువైనపక్షమునఁ జూర్ణముచేసివేయును. అని చెప్పెను.

3౧-3౧½ ఆ వాక్యమును విని జనకుఁడు నవ్వుచు నామంత్రితో నిటులఁ జెప్పెను. శివుని నివాసస్థాన మగు కైలాసము నెత్తిన రావణుడు శివధనువును నెత్తుటకు నర్హుఁడే యనెను.

3౨-33 ఆమాట విని రావణుని మంత్రి జనకునితోఁ నివ్విధముగఁ జెప్పెను. ఓ జనకా ! నీవు సజ్జనుఁ డగు రావణుని సంబంధబాంధవ్య

వృథా* సజ్జనసంబంధగౌరవే ణాద్య వంచితః
పౌల స్త్యవశగా సీతా భవిష్యతి న సంశయః॥ 3౨-33

శ్రుత్వా తద్వచనం భూపః ప్రాహ తం రజనీచరం॥
హరణం యది కన్యాయాః రావణ స్తు కరిష్యతి
నాశాయ దశకంఠస్య సీతా చైవ భవిష్యతి॥ 3౪-3౪౫

ఏవం బ్రువాణం జనకం భర్త్సయిత్వా నిశాచరః॥
రావణం ప్రావద త్సర్వం సభాం గంతు ముపోదయత్॥
3౫-3౫౫

రావణోఽపి సభాం గత్వా వచనం ప్రాహ మైథిలం॥
హేరంబ షణ్ముఖగిరీశ గిరీంద్రజాభి రాకీర్ణమ త్యధికభృత్య
గణై శ్చ పూర్ణం, ఉద్ధృత్య సంస్థితవతో రజతాద్రి మస్య
కేయం మమాపి పున రద్య తు దోఃపరీక్షా॥ 3౬-3౭

జనకః-

శాంభవం ధను రాకృష్య యస్తు మాం తోషయిష్యతి
భూమిజా గృహిణీ తస్మై భవిష్యతి దశానన॥ 3౮

---

* సజ్జనః రావణః తేన సంబంధః జామాతృశ్వశురసంబంధః తేన గౌరవాతిశయేన వంచితః నిష్కారణం త్యక్తో ఽసి. అతిసజ్జన రావణశ్వశురనిబంధన మాత్మగౌరవం నిష్ప్రయోజనమేవ త్యక్తవా నసి. యద్వా అసజ్జనాః ఇక్ష్వాకవః తైస్సహ సంబంధో నిరర్థకః.

గౌరవమును* వ్యర్థముగఁ బోగొట్టుకొనుచుంటివి. సీత రావణుని వశము నెట్టులైనను గాఁగలదు. సంశయము లే దనెను.

౩౪_౩౪½ ఆమాట విని జనకుఁడు రావణుని మంత్రితో నిటులఁ బలికెను. నీవు చెప్పినవిధముగ రావణుఁడు సీత నెత్తికొనిపోయెనేని సీతయే రావణునకు మృత్యువు గాఁగలదు.

౩౫-౩౫½ ఈ ప్రకారము చెప్పుచున్న జనకుని రావణమంత్రి భయపెట్టుచు వెళ్ళి రావణునితోఁ వృత్తాంతము నంతయుఁ జెప్పెను. మఱియు నతఁడు జనకసభకు వెళ్లుటకు రావణునిఁ బ్రేరేపించెను.

౩౬_౩౭ రావణుఁడును సభాస్థానమునకు వెళ్లి జనకునితో నిటులఁ బలికెను. ఓ రాజా! విఘ్నేశ్వరుఁడు కుమారస్వామి పార్వతీపరమేశ్వరులును ప్రమథగణములు మొదలగువారలతో నిండియున్న కైలాసపర్వతము ననాయాసముగ నెత్తిన నాకును బాహుపరీక్ష కావలయునా! (అనఁగా నేనుకూడ ధనువు నెత్తవలయునా! నా సామర్థ్యము నీకుఁ దెలియదా యని భావము.)

౩౮ జనకుఁడు రావణునివాక్యమును విని వానితో నిటులఁ బలికెను. ఓ రావణా! ఎవఁడు శివధనువు నెక్కుపెట్టి నన్ను సంతోషపెట్టునో వానికి నా కొమరిత యగు సీత గృహిణి కాఁగల దనెను.

---

* సజ్జనుఁడగు రావణునిసంబంధ మనఁగా రావణుఁ డల్లుఁడు. నీవు వానికి మామ వనే సంబంధ మని భావము. అట్టి సంబంధగౌరవమును వ్యర్థముగా వదులుకొనుచుంటి వని భావము. లేక అసజ్జనులైన ఇక్ష్వాకులతోడి సంబంధము నిరర్థక మని చెప్పనొప్పు నని యెఱుఁగునది.

ఇత్యుక్త్వా రావణం స్వాంతే చింతయామాస మైథిలః
హా సీతే! త్వం రావణస్య హస్తే పతసి వాత్మజే॥
హా మహిత్వత్సుతాయాస్తు యోగ్యం సంబంధమప్యహం
నహి కల్పయితుం శక్తో ఽభవం కా గతి రద్య మే॥
విశ్వంభరే ఽవిచార్యాహం కృతవాన్ దుష్కరం పణమ్॥
౩౯-౪౦½

ఇతి సంచింత్య జనకే ఖిద్యమానే మహీం తదా॥
అశరీరేణ వచసా ప్రాహేదం మైథిలం మిథః
మాబిభీహి నృపశ్రేష్ఠ! రావణోఽయం పరాభవం
సంప్రాప్య స్వపురీం గంతా ఫలే త్తవ మనోరథః॥ ౪౧-౪౨½

తచ్ఛ్రుత్వా జనకో రాజా మోదమానో వసద్ధృది॥ ౪౩

దశానన స్తద్ధనుష స్త్వధీశ మీశం త్వనత్వా బహుగర్వ
యుక్తః। స్వవామహస్తేన ధనుస్తు ధర్తు ముద్యుక్తవాం
స్తన్నచచాల చాపమ్॥ ౪౪

ఆత్మాన మప్రిణ మ్యాయ ముద్ధర్తుం యతతే జడః
ఇతి క్రుధా శివశ్చాపే సర్వశక్తిం వ్యనిక్షిపత్॥
తస్మాత్సమభవచ్చాపం బహుభారంతు రక్షసః॥ ౪౫-౪౫½

అథ దక్షిణహస్తేన దశాస్యో ధర్తు ముద్యతః॥
తథాపి న చలం చాపం కే మేత దితి విస్మితః
ద్వాభ్యాం శయాభ్యాం ప్రోద్ధర్తు ముద్యతోఽభూ చ్చలం
న తత్॥
౪౬-౪౭

౩౯-౪౦½ ఇట్లు జనకుఁడు రావణునితోఁ జెప్పి యనంతరము తన మనము నం దిటుల విచారింపసాగెను. ఓ పుత్రీ ! నీవు రావణుని చేతిలోఁ బడెదవా ! ఓ భూదేవి ! నీ కౌమరితకుఁ దగిన సంబంధమునైనను నేను సమకూర్ప నసమర్థుడ నైతిని. నాగతి యేమి ? ఓ లోకజననీ ! నే నాలోచన లేకుండగ నెవ్వరు నెఱవేర్పలేని పణమునుఁజేసి యిపుడు విచారపడుచుంటిని.

౪౧-౪౨½ ఈ ప్రకారము విచారించి జనకుఁడు ఖేదపడుచుండగా భూదేవి యును నశరీరవాక్కుతో రహస్యముగ జనకునకుమాత్రము వినఁ బడునటులఁ బలికెను ఓ జనకా ! నీవు భయపడకుము. రావణుడు పరాభవము నొంది తన పట్టణమున కిపుడే పోగలఁడు. నీ మనోరథము కూడ సఫలము కాగల దనెను.

౪౩ జనకుఁ డా వాక్యమును విని తనమనమునందు సంతోషించుచుండెను.

౪౪ పిమ్మట రావణుఁడు ధనువున కధిపతియగు పరమేశ్వరుని నమస్క రింపకుండగ బహుగర్వముతోఁ దనయెడమచేతితో నాధనువును నెత్తుటకుఁ బ్రయత్నించెను కాని యాధనువు కదలకపోయెను.

౪౫-౪౫½ ధనువున కధిపతియగు తనకు నమస్కరింపకుండగ నీమూర్ఖుఁడగు రావణుఁడు ధనువు నెత్తఁబ్రయత్నించుచుండె ననెడి కోపముచే పరమేశ్వరుఁడు తన సర్వశక్తిని నాధనువునం దుంచెను. ఆకారణము వలన నాధనువు రావణునకుఁ జాలబరువుగా నుండెను.

౪౬-౪౭ అనంతరము రావణుఁడు కుడిచేతితో ధనువు నెత్తుటకు బ్రయత్నించెను కాని యప్పటికిని కదలకపోయెను. ఇది యేమి యని యాశ్చర్యపడి రెండుచేతులతో నెత్తుటకుఁ బ్రయత్నించెను కాని యాధనువు కదలకపోయెను.

ఏకోనవింశహస్తై శ్చ ప్రోద్ధర్తుం న క్షమః క్రమాత్
శ్రమే ణోద్ధృతవా నంతే ధను ర్వింశతిభి శ్శయైః॥
ఏతస్మి న్సమయే భూమ్యా మపత ద్ధనుషోగుణః
ఏకోనవింశహస్తైస్తు చాపమూర్ధ్వం సముద్ధరన్॥
ఏకహస్తేన భూమిష్ఠం గృహీతుం గుణ ముద్యతః
ఏతస్మిన్నంతరే చాపం తద్వక్షసి పపాత హ॥ ౪౯-౫౦

తద్ధను ర్నహి కేనాపి శక్యం చాలయితుం తతః
అథ సర్వే చాలయితుం మైథిలే నార్థితా నృపాః॥
మ్రియతా మయ మిత్యుక్త్వా తత్ర తూష్ణీం స్థితా స్తదా
ధనుషో ఽధఃపతిత్వా సః మర్తుం సిద్ధో ఽభవ త్తదా॥ ౫౧-౫౨

మాం సముద్ధర సర్వేశ మాం సముద్ధర శంకర
ఇతి మందం దశాస్యస్తు ప్రార్థయామాస శంకరమ్॥ ౫౩

అథ మైథిలభూపాల స్సమాహూయ స్వసేవకాన్
ఆజ్ఞాపయామాస చాప మపసారయ తేతి హ॥ ౫౪

రాజభృత్యా స్సమాగత్య శతశో ఽథ సహస్రశః
శ్రమే ణోచ్చాలయామాసు ర్వక్షసో రక్షసాంపతేః॥ ౫౫

ఏవ మేనం శతఘటప్రమాణం స దశాననః
హాసద్భూపకులా లోకే లజ్జితో నమితాననః॥
శైవచాపా ద్విముక్త స్స న్నమాత్యకృతరక్షణః
స్వవిమానం సమారుహ్యా గచ్ఛతి స్మ నిజాం పురీమ్॥ ౫౬-౫౭

౪౯-౫౦ అపుడు రావణుఁడు క్రమముగఁ బందొమ్మిదిచేతులతోఁ గూడ ధనువు నెత్తలేక తుదకు నిరువదిచేతులతో బహుశ్రమచే ధనువును రావణు డెత్తెను కాని యంతలో నాధనువున కుండెడి నారితాడు జారి క్రిందఁబడెను. అపుడు రావణుఁడు పందొమ్మిదిచేతులతో ధనువునెత్తిపట్టి యొకచేతితోఁ గ్రిందబడిన యానారితాడును వంగి తీసికొనువంతలో నాధనువు బలువై యారావణుని రొమ్ముమీఁదఁ బడెను.

౫౧-౫౨ ఆధనువు నెవ్వఁడును కదల్చుటకు వీలులేకుండెను. అనంతరము జనకుఁడు ధనువును నవతలకుఁ ద్రోయుడని సభలోని రాజులనుఁ బ్రార్థించెను. కాని రావణుఁడు చచ్చుగాకయని యారాజు లూర కుండిరి. రావణుఁడు ధనుస్సుక్రిందఁబడి చచ్చుటకు సిద్ధమయ్యెను.

౫౩ అప్పుడు రావణుడు మెల్లగా శంకరుని నిటులఁ బ్రార్థించుచుండెను. ఓ సర్వేశ్వరా! నన్నుద్ధరింపుము. ఓ శంకరా! నన్నుద్ధరింపుము (అని ప్రార్థించెను.)

౫౪ అనంతరము జనకమహారాజు తన సేవకులతో రావణుని రొమ్ము మీఁదఁబడిన ధనువును దొలగింపు డని చెప్పెను.

౫౫ అనంతరము జనకదూతలు ననేకులు వచ్చి రావణుని రొమ్ముమీఁదఁ బడిన ధనువును నతికష్టముచేఁ దొలగించిరి.

౫౬-౫౭ అప్పుడు రావణుఁడు నూరుకుండల నురుగును గ్రక్కుకొని, రాజులు తననుఁ జూచి నవ్వుటకు సిగ్గుపడుచుఁ దలవంచికొని, యెట్టకేలకు నివ్వి ధనువునుండి విముక్తుడై మంత్రిభక్షణముతో దన విమాన మెక్కి లంక కేగుచుండెను.

మధ్యేమార్గం దేవముని ర్దృష్ట్వా తంతు దశాననం
పరిపప్రచ్ఛ కిం న్వేషా దుర్దశేతి ముహు ర్ముహుః॥
తదా ప్రాహ దశాస్యో౽పి నారదం నమితాననః॥ ౫౮-౫౯

కార్యాంతరవశా త్తూర్ణం గచ్ఛా మ్యద్యతు నారద!
పశ్చా త్తవ వదిష్యామీ త్యుక్త్వా గతుం సముద్యతం
దశాననం తదా ప్రాహ నారదః ప్రహస న్వచః॥ ౫౯-౬౦

దశాస్య రాఘవ శ్చాప మారోపయతిచే త్తదా
రామం తం పరమాత్మానం భవా నంగీకరోతి వా॥ ౬౧

తదా దశానన స్త్వాహ దేవర్షే శృణు మద్వచః
పురేశ్వరభుజాపీడా వీతసార మభూ ద్ధనుః॥
మద్వక్ష స్యద్రిసంకాశే పతనా దద్య. తద్ధనుః
భగ్నప్రాయ మభూ ద్భూయ స్తద్ధను స్స్పర్శమాత్రతః॥
భగ్నం భవే త్తత్ర నస్యా ద్రామస్య మహిమా మునే!
౬౨-౬౩

ఇత్యుక్త స్సతు దేవర్షి ర్వచనం ప్రాహ రావణం॥
సుబాహుప్రముఖాదీనాం హననా ద్వాపి రాఘవం
పరాత్పరం న జానాసి కి మహో మూఢతా తవ॥ ౬౪-౬౫

ఇత్యుక్త స్స దశాస్యో౽పి నారదం ప్రాహ వై వచః
కౌశికేన ప్రదత్తస్య మంత్రగ్రామస్య వై బలం॥
సుబాహుప్రముఖాదీనాం వినాశే కారణం మునే!
న తత్ర రామమహిమా కించిద ప్యస్తి నారద! ౬౬-౬౭

౫౭-౫౮ మధ్యమార్గమున నారదుఁడు రావణునిఁజూచి యీదుర్దశ యేమి యని యతని నడిగెను.

౫౯-౬౦ అప్పుడు రావణుండును తలయొంచుకొని నే నిపుడు కార్యాంతరమువలనఁ దొందరగా వెళ్లుచుంటిని. అనంతరము సావకాశముగ నీకుఁ జెప్పెదనని చెప్పి తొందరగఁబోవ నుద్యుక్తుఁడగు రావణునితో నారదుఁడు నవ్వుచు నిటులఁ బలికెను.

౬౧ ఓరావణుఁడా! రాముఁడు ధనువు నెక్కుపెట్టినచో నప్పుడు నీవు రాముని బరాత్పరుఁగా నంగీకరించెదవా! అని ప్రశ్నించెను.

౬౨-౬౩ ఓనారదా! నామాటవినుమని రావణుఁడు చెప్పఁదొడఁగెను. ఈ ధనువు పూర్వమునం దీశ్వరుని భుజపీడనముచేత నే సారహీనమై యుండెను. పెద్దపర్వతమువంటి నాబొమ్మమీద నిపుడా ధనువు పడుటవలన మరింత భగ్నప్రాయ మయ్యెను. అట్టి భగ్నప్రాయమైన ధనువును నెవడు తాకినను పుటుక్కున విరుగును. అట్టిస్థితిలో శిథిలమైన యాధనువును విరుచుటలో రాముని మహిమ యే మున్నదనియెను.

౬౪-౬౫ ఇవ్విధముగ రావణుఁడు చెప్పగా నారదుఁడు తిరిగి యారావణునితో నీక్రిందివిధముగఁ బలికెను. ఓరావణా! సుబాహుఁడు మొదలగు రాక్షసులను రాముఁడు సంహరించినందువలననైన రాముఁడు పరాత్పరుఁ డని యేల దెలిసికొనవు. నీమూఢతనుఁ జూచిన యాశ్చర్యముగా నున్నదనియెను.

౬౬-౬౭ ఇవ్విధముగ నారమునిచేఁ జెప్పఁబడి రావణుఁడు నమ్మునితో నిట్లు చెప్పెను, ఓనారదా! విశ్వామిత్రుఁ డిచ్చిన మంత్రముల బలముచేఁ దాటకాసుబాహువులు మొదలగు రాక్షసులు నశించిరి కాని యారాక్షసమరణమున రాముని మహిమ యేమియు లేదనెను.

ఇత్యుక్త స్తం దేవమునిః ప్రాహేదం వచనం పునః
అహల్యాతారణా ద్వాఽపి రాఘవం తం పరాత్పరం॥
కథం న మనుషే భ్రాంత ఏవ ముక్తో ఽబ్రవీ త్స తం
అహల్యాశాపమోక్షో ఽపి నిరధార్య కృపా దతః॥
ఇత్యుక్త్వా రాఘవం త్వల్పం మత్వా ఽగా త్స దశాననః॥
౬౮-౬౯౹

అథ దేవముని శ్చాపి దశాస్యస్య పరాభవః॥
సమభూ దితి సంతుష్య యయౌ స్వర్గపురీం ద్రుతం॥ ౭౦-౭౦౹

జనకో ఽపి స్వమనసి విచారం గతవా నితి॥
దశాస్యో ఽపీద్మశో జాతః క్షుద్రా శ్చాన్యే మహీభుజః
పినాకారోపణం శుల్కం హా సీతే కిం భవిష్యసి!
ఇతి సందిహ్యా వై దేహ శ్శతానంద మథాబ్రవీత్॥ ౭౧-౭౨౹

సదస్యా న్ప్రేరయ మునే! ధనురారోపణాయ వై
ఇత్యుక్తో జనకే నాథ శతానందో ఽబ్రవీ న్నృపాన్॥ ౭౩-౭౩౹

భో భో నృపా శ్శృణుత మద్వచనం తు చాప మారోపయం
తి యది పాశుపతం భవంతః, ఆదౌ వరిష్యతి చ వో విజ
యాభిధా శ్రీః పశ్చా ద్వరిష్యతి చ భూమిసుతాభిధా శ్రీః॥
౭౪-౭౪౹

తస్మా త్తత్రి భవంతో ఽద్య భవంత శ్చాపతోలనే
కుర్వంతుయత్న మిత్యుక్తా స్తే వద న్గౌతమాత్మజం॥ ౭౫-౭౫౹

౧౮_౧౮½ ఈ రావణునిమాట విని నారదుఁడు తిరిగి రావణునితో నిటులఁ బలికెను. ఓ రావణా! అహల్యను బునీతురాలనుఁగాఁజేసినందువల్లనైనా రాముని బరాత్పరునిగా నెందుకుఁ దలఁచ వని యడిగెను. అపుడు రావణుఁడు నారదునితో నిటుల దానికి సమాధానము చెప్పెను.

ఓ నారదా! అహల్యాదేవిని గౌతముఁడు శపించినపుడే రామచంద్ర మూర్తి పాదస్పర్శ కలిగినపుడు తిరిగి శాపవిముక్తి కలుగు నని కూడ నతఁడే చెప్పియుండెను. అందున రాముని మహిమ యేమున్నదని చెప్పి రావణుడు రాముని నల్పునిగాఁ దలఁచుచుఁ దనపురమునకు వెళ్లెను.

౨౦_౨౦½ అనంతరము నారదుఁడు, విల్లు నెత్తుటలో రావణునకుఁ గలిగిన పరాభవమునకు సంతోషించుచుఁ దొందరగా స్వర్గమున కేగెను.

౨౧_౨౨½ జనకుఁడు తన మనమునం దిటుల విచారపడెను. కైలాసము నెత్తిన రావణుఁడే యిటుల భంగమునుఁ బొందగాఁ దదితరులగు క్షుద్రపు రాజులసంగతి యేమి చెప్పవచ్చును? హా పుత్రీ! విచారణ లేకుండఁగ శివధనువును శుల్కముగాఁ బెట్టియుంటిని. నీ వేమి కాఁ గలవో కదా యని జనకుఁడు సందేహించుచుఁ దన పురోహితుఁ డగు శతానందునితో నివ్విధముగఁ జెప్పెను.

౨౩_౨౩½ ఓ శతానందమునీ! విల్లెక్కుపెట్టుటకు సభలోనున్న రాజులనుఁ బ్రోత్సహింపు మనఁగా నపుడు శతానందుఁడు రాజులతో నివ్విధ ముగ లేచి చెప్పెను.

౨౪_౨౪½ ఓ రాజపుత్రులారా! నావచనమును మీరలు సావధానమనస్కులరై వినుఁడు. ఈ శివధనువును మీలో నెవ్వఁ డెక్కుపెట్టునో వానిని మొదట విజయలక్ష్మియునుఁ, బిమ్మట సీతామహాలక్ష్మియును వరించును.

౨౫_౨౫½ ఆ కారణమువలనఁ బూజనీయు లగు మీరలు ధనువు నెక్కుపెట్టుటలోఁ బ్రయత్నమునుఁ జేయుదురు గాత యని చెప్పఁగా నారాజులు శతానందునితో నివ్విధముగఁ జెప్పిరి.

శతానం దాభవ న్నందో నాస్మాకం త్వద్వచ శ్శ్రుతేః
త్వదు క్తవిషయో ఽస్మాభి ర్జ్ఞాతపూర్వో విరమ్యతాం
ఇత్యుక్త్వా తే నృపా స్సర్వే లఘుం తం మేనిరే తదా॥ ౭౬-౩౭

తచ్ఛ్రుత్వా రాజపుత్రాణాం వచః ప్రేరయితుం నృపాన్
ప్రేషయామాస సచివం మిథిలాధిపతి స్తతః॥ ౭౮

జనకేన ప్రేషిత స్స స్సచివ స్తద్విబోధనే
గతః ప్రత్యేకశ స్తా నైవ ప్రేరయామాస తా న్నృపాన్॥ ౭౯

వంగేశ! కిం వదసి కార్ముకతోలనే ఽస్మి న్నిత్థం విదేహావి
భుమంత్రివరేణ పృష్టః। సో ఽప్యబ్రవీ త్వరిణయో మమ
పూర్వ మాసీ ద్వ్యర్థప్రయాస ఇహ సంభవ తీతిమన్యే॥ ౮౦

కాళింగ! తే భుజయుగస్య బలం విభు ర్మే విశ్వస్య శుల్క
మిద మాఢ్య చకార పూర్వం। ఇత్యుక్తవ సతు లఘ్వ
వదత్సు మంత్రి న్నస్మి న్నృరే జలవిభేదవశా చ్చ రుగ్ణః॥ ౮౧

మాగధోఽపి సమాపృష్ట స్సచివం త మ థాబ్రవీత్
గృహాన్నిర్గమనే మే ఽభూ న్మార్గాలస్య తు దర్శనం॥
తస్మా దాలోచయా మ్యద్య నాన్య త్కారణ మస్తి మే॥
౮౨-౮౪

పాంచాలోఽపి సమాపృష్ట స్సచివం ప్రాహ వై తదా॥
గిరివ ద్వర్తతే చాపం నా స్త్యా రోపయితుం బలం॥
౮౫-౮౬

౭౬_౭౭ ఓ శతానందుఁడా! నీమాటలను వినుటవలన మాకు మహానంద మేమియు లేదు. నీవు చెప్పెడివిషయము మాకందరకుఁ దెలిసిన విషయమే కాని క్రొత్తవిషయము కాదు. కానఁ జాలింపు మని యా రాజులు శతానందుని దేలికగాఁ జూచిరి.

౭౮ ఆరాజపుత్రులమాటలను జనకుఁడు విని యారాజులనుఁ బ్రోత్సాహిం చుటకుఁ దన మంత్రినిఁ బంపెను.

౭౯ రాజులను బోధించుటకు జనకునిచేఁ బంపఁబడిన యామంత్రి వెళ్ళి ప్రత్యేకప్రత్యేకముగా రాజుల నీక్రిందివిధముగఁ బ్రేరేపించెను.
౮౦ ఓవంగదేశాధిపా! ఈధనువు నెక్కుపెట్టుట విషయమై యేమి చెప్పె దవు? అని మంత్రి వంగదేశపురాజు నడుగఁగా నతఁడు మంత్రితో నిటులఁజెప్పెను. ఓమంత్రీ! నాకు వివాహము పూర్వమే యయ్యెను. కాన నీవిల్లెక్కుపెట్టుట వ్యర్థప్రయాస మని తలంచుచుంటి నని యనెను.

౮౧ ఓకళింగరాజా! నీ భుజపరాక్రమమును మారాజు నమ్మి యీపణ మును జేసెను. ఈవిషయమై నీ వేమి చెప్పెదవనఁగా నాకళింగరాజు జనకమంత్రితో నిటులఁ బలికెను. ఓమంత్రీ! నేనైతే యట్టి సమర్థుఁ డనే కాని యీపురములోని నీరు క్రొత్త చేయుటవలన నాకు జబ్బుగా నున్న దని యనెను.

౮౨_౮౨½ జనకమంత్రి మగధరాజును నటులనే యడుగఁగా నారాజు జనక మంత్రితో నిటులఁ జెప్పెను. ఓమంత్రీ! నే నిల్లుబయలుదేర నపుడు పిల్లి యెదురుగా వచ్చినందున మంచి శకునము కాలే దని యాలోచించుచుంటిని. కాని యెత్తకపోవుటకు వేఱుకారణము లే దనియెను.

౮౩_౮౩½ అటులనే జనకమంత్రి పాంచాలరాజు నడుగఁగా నారాజు జనక మంత్రితో నిటులఁ జెప్పెను. ఓమంత్రీ! ఈవిల్లు కొండవలె నున్నదికాన నా కెక్కుపెట్టుటకు శక్తి చాల దనియెను.

నేపాళ! త్వమిదం చాప మాకర్ష్టుం యత్న మాచర॥
ఇతి వై దేహమం త్ర్యుక్తః ప్రాహ తం తన్నృపాలకః
నేదం ధనుః ప్రకాండం స్యాత్తదిరస్య న సంశయః॥
తద్దర్శయిత్వా నమయే త్యుక్తే కోవా యతిష్యతి
నమోఽస్తు తస్మై ధనుషే గచ్ఛామీతి జగామ సః॥ ౮౪-౮౬

మాళవోఽపి సమాపృష్ట స్సచివం త మథాబ్రవీత్
కల్పయిత్వా మ మాశాంతు సమాహూయ నిజాం పురీం॥
సముద్ధర్తు మశక్యం త దుద్ధరే త్యుక్తి ర ప్యహో॥ ౮౭-౮౭½

విదర్భోఽపి సమాపృష్ట స్సచివం ప్రాహ తం వచః॥
ఏకపత్నీవ్రతస్థోఽహం వివాహ శ్చ పురాఽభవత్
విఫలం మమ తచ్చాపనమనం భవితే త్యహం॥
సముపేక్షితవా నత్ర దృష్టు మాగా మహం ధ్రువం॥
౮౮-౮౯½

ఇతి సర్వే నృపాః పృష్టాః ప్రతికూలం వచోఽబ్రువన్॥
తదా జనకభూపాల స్సదస్యా న్ప్రాహ భూపతీన్॥ ౯౦-౯౦½

నిర్వీర్యం నృపమండలం త్వితి నృపా స్స్వేష్వపి ఽనా మన్యతే త్యేవం మైథిలభాషితంతు వచనం శ్రుత్వా సుమిత్రాసుతః, రోషావేశవశో ఽబ్రవీ న్నృప మిదం మే భ్రాతరం రాఘవం దృష్ట్వా భాషయ; రాఘవం మునివరం వీక్ష్య భజం శాంతతాం॥ ౯౧-౯౧½

౨౫-౨౬ పిమ్మట జనకునిమంత్రి నేపాళరాజు నడుగఁగా నారాజు నమ్మంత్రితో నిటులఁ జెప్పెను ఓమంత్రి! ఇది చంద్రమౌద్దుకాని ధనువుకాదు. ఆమొద్దును జూపి వంచు మన నెవఁడు యత్నించును? ఆధనువునకు నొక నమస్కారము. నేను వెళ్లుచుంటి నని చెప్పి యా రాజు వెళ్లిపోయెను.

౨౭-౨౮। జనకమంత్రి మాళవరాజును నడుగఁగా నతఁడును మంత్రితో నిటులఁ జెప్పెను. ఓమంత్రీ! నాకు గొప్పయాశనుఁగల్పించి తనపురమునకు రప్పించి యెత్తుటకు శక్యముగాని యాధనువు నెత్తు మనుట కూడ నాశ్చర్యముగానే యున్న దనెను.

౨౯-౩౦। పిమ్మట జనకమంత్రి విదర్భరాజు నడుగఁగా నతఁడు జనకమంత్రితో నిటులఁ జెప్పెను. ఓమంత్రీ! నేను ఏకపత్నీవ్రతము కలవాఁడను. వివాహము పూర్వమే నా కయ్యెను. కాన శివధనువును వంచుట నాకు వ్యర్థప్రయాస మగు నని యుపేక్షించితి కాని చేతఁ గాక కాదు. అయితే యిచ్చటి కెందునకు వచ్చితివి యని యడిగెదవేమో చెప్పెదను వినుము. ఈమహోత్సవమును జూచుటకే నిశ్చయముగా వచ్చితి ననియెను.

౩౦-౩౦। ఈప్రకారముగ రాజులందఱును నడుగఁబడినవారలై ప్రతికూలముగ సమాధానము చెప్పిరి. అప్పుడు జనకభూపాలుఁడు సభలో రాజులతో నివ్విధముగఁ బలికెను.

౩౧-౩౧। ఓరాజపుత్రులారా! రాజమండలమంతయు వీర్యహీనమైన దని నేను స్వప్నములోఁగూడఁ దలఁపనైతిని అని జనకుఁడు పలుకఁగా లక్ష్మణుఁడు విని రోషావేశముతో జనకునితో నిటులఁ బలికెను. ఓజనకుఁడా! నాయన్నగా రగు రాముఁ డిచ్చట నుండగానే రాజలోకము నిర్వీర్య మనియెదవా? రాముని జూచి మాట్లాడుము. మాగురు వగు విశ్వామిత్రుని జూచియు, రాముని జూచియు నీమాటలను సహించితి ననియె.

హామిత్రిం తం శాంతయిత్వా కౌశికః ప్రాహ రాఘవం॥
సముద్ధర్తు మిదం చాపం యత స్వాద్యైవ రాఘవ!
ఇత్యేవం ప్రేరయామాస రామచంద్రంతు కౌశికః॥౯౨-౯౩

సింహాసనోదయాద్రేస్తు రామరూపదివాకరః
నిర్గత స్సత్కంజగణం తదాలం ప్రవికాసయన్॥
దుష్టోత్పలగణం ప్రాప మీలయ న్చాపసన్నిధిం॥౯౪-౯౪½

తం దృష్ట్వా౽౽నాగరా స్సర్వే రామం కోమలవిగ్రహం॥
ధనురారోపణార్థాయ స్వపుణ్యాని దదు స్తదా॥ ౯౫-౯౫½

బాలో ఽయం చాప ముద్ధర్తుం కథం శక్తో భవే దితి
రాజ్ఞీంవిచారయంతీంతాంతదాప్రాహు స్సుమధ్యమాః॥
౯౬-౯౬½

మంత్రో ఽల్పో౽పి యథా వశ్యా న్బ్రహ్మాదీ న్కురుతే సఖి!
యథా పుష్పశరో లోకా న్విజయే ద్రాజ్ఞిసత్తమే!
తథా బాలో౽ప్యయం రామ శ్చాప మారోపయే ద్ధ్రువం॥
ఇత్యుక్త్వా రాజమహిషీ మాశ్వసంత్యః స్థితా స్త్రియః॥
౯౭-౯౮½

సీతా స్వమానసే త్వేవం దుర్గాం సస్మార వై తదా॥
దుర్గే భర్గప్రియే దేవి! సత్యం కురు వచ స్తవ॥౯౯-౯౯½

అథ సర్వా న్సుమనసః ప్రార్థయామాస జానకీ॥

౯౨-౯౩ అప్పుడు విశ్వామిత్రుఁడు లక్ష్మణుని శాంతింపఁజేసి "ఓరామ చంద్రా! ఇంక నాలస్య మేల? శివధనువు నెత్తుటకుఁ బ్రయత్నింపుము" అని కౌశికుఁడు రాముని బ్రేరేపించెను.

౯౪-౯౪½ రామచంద్రమూర్తి యను సూర్యుఁడు సింహాసన మను మదయ పర్వతమునుండి బయలుదేరి సజ్జనులను పద్మములను వికసింపఁ జేయుచు దుర్మార్గులను కలువలను ముకుళింపఁజేయుచు ధనుస్సమీప మునకు వచ్చెను.

౯౫-౯౫½ కోమలశరీరము కల యాబాలునిఁ జూచి, పురవాసులు తాము చేసినపుణ్యములను నారాముఁడు విల్లెక్కుపెట్టుటకు సమర్పించిరి.

౯౬-౯౬½ ఈబాలుఁడు మహత్తర మగు శివధనువు నెక్కుపెట్టఁగలఁడో లేఁడో యని విచారపడుచున్న రాణి యగు జనకపత్నితో నప్పుడు కొందఱు స్త్రీ లిటులఁ బలికిరి.

౯౭-౯౭½ ఓదేవీ! మంత్రము చిన్నదైనను బ్రహ్మాదిదేవతల నెటుల వశముచేసికొనునో, పుష్పబాణుఁడైనను (మన్మథుఁడు) లోకముల నెటుల వశముచేసికొనునో, యటులనే యీరాముఁడును బాలుఁడై నను ధనువును వశము చేసికొని యెక్కుపెట్టఁగలఁడు. విచారపడ కుము (అని చెలికత్తెలు రాణి నోదార్చుచుండిరి).

౯౯-౯౯½ సీతాదేవియును దనమనమునం దిటుల దుర్గాదేవిని స్మరించుచుం డెను. ఓదుర్గా! నేను నీపూజచేసి నాయభీష్టమును నెఱవేర్పు మని ప్రార్థించినపుడు నీవు నాకుఁ జెప్పిన వాక్యమును సత్యమునుజేయుము. (అని ప్రార్థించుచుండెను)

౧౦౦-౧౦౧ దుర్గను బ్రార్థించి పిమ్మట సీతాదేవి దేవతలనందరిని నిటులఁ బ్రార్థించుచుండెను. ఓదేవతలారా! మీ కందరకు నమస్కారమును

నమో ఽస్తు సర్వదేవేభ్య స్సర్వం బాహుబలంతు వః
ప్రావేశయత రామే ఽద్య నమస్కుర్వే పునఃపునః॥
౧౦౦-౧౦౧

కోమలం రాఘవ స్యాంగం కుత్ర వా కఠినం ధనుః
ద్వయోః కథం సంఘటతే ఇ త్యమాత్యా భయం గతాః॥
౧౦౨

తదా సుమిత్రాతనయ స్సంతోషా దాహ దిగ్గజాన్
భన క్తి రామచంద్రో ఽయం ధను ర్జాగృత దిగ్గజాః॥ ౧౦౩

ఏతస్మి న్సమయే రామః ప్రణమ్య హృది శంకరం
చాపాయ చ నమస్కృత్య హ స్తే జగ్రాహ త ద్ధనుః॥ ౧౦౪

గృహీతే హరకోదండే రామే పరిణయోన్ముఖే
పస్పంద నయనం వామం జానకీజామదగ్న్యయోః॥ ౧౦౫

1 ఉత్క్షి ప్తం సహ కౌశికస్య పులకై స్సార్థం ముఖై ర్నామితం।
భూపానాం జనకస్య సంశయధియాసాకం సమాస్ఫాలితం।
వైదేహీమనసా సమంచ సహసా ఽఽకృష్టం తతో భార్గవ
ప్రౌఢాహంకృతిదుర్మదేన సహితం తద్భగ్న మైశం ధనుః॥
౧౦౬

1. హనుమద్రామాయణమ్.

జేయుచున్నాను. మీ బాహుబలమునంతను క్షణకాలము రాముని యందుఁ బ్రవేశ పెట్టుఁడు. మీరు చేసెడి యుపకారమునకుఁ బ్రత్యుపకారముగ మీకు సహస్రవందనము లర్పించెదను (అని దేవతలను ధ్యానించుచుండెను).

౧౦౨ రాముని శరీరమా కోమలమైనది. ధనువా కఠినమైనది. ఈరెండిటికి నెటుల సంఘటన మగు నని మంత్రులు భయపడుచుండిరి.

౧౦౩ అప్పుడు లక్ష్మణుడు సంతసముతో దిగ్గజముల నుద్దేశించి యిటులఁ బలికెను. ఓదిగ్గజములారా! మారాముఁడు శివధనువు నెక్కుపెట్ట బోవుచుండెను. విల్లు పెళ్లు మని విరుగునేమో జాగ్రతగా నుండుడు (అని పలికెను).

౧౦౪ ఈసమయమున రాముఁడు మనస్సునందు ధనువున కధిపతి యగు శంకరుని ధ్యానించి నమస్కరించి ధనువునకును నమస్కరించి యా విల్లును జేతితోఁ బట్టుకొనెను.

౧౦౫ రాముఁడు శివధనువును జేతితోఁబట్టుకొనుటతోడనే సీతాదేవికిని బరశురామునకును నెడమక న్నదరెను. (స్త్రీల కెడమక న్నదరుట శుభసూచకము. పురుషుల కెడమకన్నదరుట యశుభ మని భావము)

౧౦౬ రాముఁడు శివధనువును గౌశికుని రోమాంచముతోఁగూడ నెత్తెను (అనఁగా ధనువు నెత్తుటతోడనే కౌశికునకు గగుర్పాటు కలిగెను). రాజులముఖములతోఁ గూడ ధనువును వంచెను (అనఁగా రాముఁడు ధనువును వంచుటతోడనే రాజులుకూడ తలలను వంచుకొనిరి). జనకుని సంశయముతోఁగూడ రాముఁడు ధనువును పెళ్లు మనిపించెను (జనకున కుండిన సంశయము భంగ మయ్యెను). సీతాదేవి మనస్సుతోఁబాటు ధనువు నాకర్షించెను. పిమ్మట బరశురాముని గర్వముతోఁగూడ ధనువును విరిచెను (అనగాఁ బరశురాముని గర్వభంగ మయ్యె నని భావము).

[1] తస్య శబ్దో మహా నాసీ త్త్రిలోకా న్వ్యపూరయత్
భూకంపం జనయామాస దళయామాస ఖం తథా॥
వార్ధీ న్సంక్షోభయామాస రాక్షసాం శ్చా ప్యమర్దయత్।
గిరీ న్సంభేదయామాస పూరయామాస వై దిశః॥
ఏవం చండప్రచండో౽భూ ల్లోకోదండధ్వని రద్భుతః॥
౧౦౭-౧౦౮

ద్విధా భగ్నం ధను స్తత్రాపాతయ ద్రాఘవ స్తతః॥ ౧౦౯

గగనే దుందుభిముఖా వాదితాశ్చ సురై స్తదా
గంధర్వాశ్చ ప్రగాయంతి ననృతు శ్చాప్సరోగణాః॥
బ్రహ్మాదిదేవతా స్సర్వాః ప్రశశంసు శ్చ రాఘవం॥
౧౧౦-౧౧౧

మునయ శ్చాశిషం తస్మై ప్రకుర్వంతి ముదాన్వితాః
సర్వత్ర చ తదా ౽భూచ్చ జయశబ్దో మహోన్నతః॥
౧౧౧-౧౧౧

వందిమాగధసంఘానాం సూతానాం విజయధ్వనిః॥
భేరీమృదంగసంరావః యువతీమంగళధ్వనిః
ఏకవారమభూ త్తస్మిన్కాలే రామస్సమంతతః॥ ౧౧౨-౧౧౩
విశ్వామిత్రమహర్షే శ్చ జనకస్య చ భూపతేః
రాజ్ఞ్యా శ్చ భూమిజాయా శ్చ ముదం కో భువి వర్ణయేత్॥
సీతాయా ముఖశోభాంతు వర్ణితుం కో ౽పి న క్షమః॥
౧౧౪-౧౧౫

1. కవిః.

౧౦౭-౧౦౮½ ఆ విల్లును విరుచుటవలనఁ గలిగిన గొప్పధ్వని ముల్లోకములందున వ్యాపించెను. భూకంపము కలిగెను. ఆకాశము బ్రద్దలయ్యెను. ఆ ధ్వనివలన సముద్రము లల్లకల్లోలమయ్యెను. రాక్షసులగుండె లవిసెను. మఱియు నా ధ్వని పర్వతములను భేదించెను. సర్వదిక్కులను బూరించెను. ఇవ్విధముగఁ జండప్రచండమగు నావిల్లుధ్వని యాశ్చర్యకరముగ నప్పు డుండెను.

౧౦౯ అనంతరము రామచంద్రమూర్తి రెండువిధములుగ విరిగిన తన చేతిలోని యావిల్లును భూమియందుఁ బాఱవేసెను.

౧౧౦-౧౧౦½ అప్పుడు దేవతలు గగనభాగమున దుందుభులు మొదలగువాద్యములను వాదింపఁజేసిరి. గంధర్వులు గానములు చేయుచుండిరి. అప్సరస్త్రీలు నృత్యములు చేయుచుండిరి. బ్రహ్మాదిదేవతలందఱు రామచంద్రమూర్తి ననేకవిధములుగఁ బ్రశంసించుచుండిరి.

౧౧౧-౧౧౧½ మహర్షులును సంతోషముతో రామున కాశీర్వాదములఁ జేయుచుండిరి. అంతటను మహోన్నతమగు జయశబ్దములు బయలు దేరెను.

౧౧౨-౧౧౩ ఆసమయమున వందిమాగధుల విజయధ్వనులును భేరీమృదంగధ్వనులును స్త్రీలమంగళధ్వనులును నొకపర్యాయము బయలు దేరెను.

౧౧౪-౧౧౪½ విశ్వామిత్రమహర్షికిని జనకునకును రాణికిని సీతకును గలిగిన సంతోషమును నెవఁడు వర్ణింపఁగలఁడు? సీతయొక్క ముఖశోభను వర్ణించుటకును నెవ్వఁడును సమర్థుఁడు కాఁడు.

కోదండధ్వనినా మూర్ఛాంగతా నృపకుమారకాః॥
పశ్చాత్తస్మృతి మవాప్తాస్తే ధనుర్భంగం మృషా వదన్॥
౧౧౫-౧౧౫½

కోలాహలో నృపాణాం తు శ్రుత్వా సౌమిత్రి రాగతః॥
ధనుష్ఖండౌ స్వపాణిభ్యా ముద్ధృత్యాదర్శయ న్నృపాన్॥
౧౧౬-౧౧౬½

శతానందానుమత్యా సా భూమిజాఽపి సఖీయుతా॥
జయమాలాం సమాదాయ నిర్యయౌ రాఘవాంతికం॥
౧౧౭-౧౧౭½

విలసత్కాశనీకాశసూక్ష్మచేలధరా సతీ॥
అష్టమీచంద్రతులితకల్యాణతిలకాంచితా
రత్నఖచితసౌవర్ణభూషాభూషితకాయయుక్॥
వామహస్తం సఖీబాహౌ విన్యస్యాపరహస్తతః
పుష్పమాలాం దధానా సా లజ్జయా కర్షితా తదా॥
పశ్చాద్రాఘవసంప్రీత్యా చాగ్రతో కర్షితా బలాత్
మత్తమాతంగగమనా స్వయంవరసుమంటపం॥
సమాగతా గుణోపేతా ఽవనీజాతా ముదాన్వితా॥
౧౧౮-౧౨౦½

లోకాభిరామం తం రామం సమీక్ష్య జనకాత్మజా॥
పశ్యంతీ తచ్ఛవిం చిత్రప్రతిమే వావతస్థుణాం॥ ౧౨౨-౧౨౨½

౧౧౫-౧౧౫½ ధనువు విరిగినపుడు బయలుదేరిన ధ్వనిచే మూర్ఛితు లగు రాజపుత్త్రులు పిమ్మట స్మృతికలిగి లేచి ధనువును రాముడు విరుచుట యబద్ధమని కోలాహలము చేయుచుండిరి.

౧౧౬-౧౧౬½ ఆ రాజపుత్రుల కోలాహలమును లక్ష్మణుడు విని వచ్చి విరిగి యున్న ధనుష్ఖండముల రెండిటిని దన చేతులతో నెత్తి యా రాజపుత్రులకుఁ జూపించెను. (దీనివలన లక్ష్మణుని బలపరాక్రమములు కూడ వెల్లడి యయ్యెను)

౧౧౮-౧౧౮½ పిమ్మటఁ బురోహితు డగు శతానందుని యానతిచే సీతాదేవియును దన చెలికత్తెలతోఁ గూడి జయమాలికను దీసికొని రాముని సమీపమునకు బయలుదేరెను.

౧౧౯-౧౨౧½ గుణవతియగు సీతాదేవి రెల్లుపుష్పమువలె శుభ్రమైన సన్నని పట్టువస్త్రమును ధరించినదై, అష్టమీదినమునందలి చంద్రునివంటి కల్యాణపుబొట్టుచే నొప్పుచున్నదై, రత్నములచేఁ గూర్పబడిన సువర్ణాభరణములచే నలంకరింపఁబడిన శరీరము కలదియై, యెడమ చేతినిఁ జెలికత్తెయొక్క బుజముమీద నుంచి కుడిచేతితోఁ బుష్పమాలికను ధరించి సిగ్గు వెనుకకులాగ రాముని యందలి యనురాగము ముందుకులాగ బలాత్కారముగ మందగమనముతో స్వయంవరమంటపమునకు వచ్చెను.

౧౨౨-౧౨౨½ ఆ సీత లోకాభిరాముడగు రామునిఁ జూచియు, రాముని దివ్యకాంతిని జూచియు క్షణకాలము చిత్తరువులోని బొమ్మవలె నిశ్చేష్టురాలై నిల్వబడెను.

సఖి జ్ఞాత్వా తదా సీతాం బోధయామాస విస్మృతాం॥
రామచంద్రగళే మాలాం నిక్షిప్యాస్మై నమస్కురు॥
౧౨౩-౧౨౩౪

తత్సఖీబోధితా సీతా లజ్జితా పుష్పమాలికాం॥
జయసంసూచికాంసద్యోరాఘవస్యాక్షిపద్గళే।౧౨౪-౧౨౪౪

తదా సుమనస స్తస్మి న్వవృషుః కుసుమావళిం
నిరీక్ష్యసీతారామౌద్వౌతుతుషుర్మనయ స్తదా॥౧౨౫-౧౨౫౪

సఖీభి శ్శిక్షితా సీతా నా నమ ద్రాఘవం భియా॥
గౌతమస్య వధూం స్మృత్వా శిరసా రత్నభూషిణా॥
౧౨౬-౧౨౬౪

లజ్జా కీర్తి ర్జానకీ చ రాఘవం భేజిరే తదా॥
అంత్యాపరిగ్రహా ద్రాద్యా భూపా న్సర్వాం స్తదా వృణోత్
మధ్యమా సా దిగంతాం శ్చ జగా మా త్మాపరిగ్రహాత్॥
అథ సీతా మోదమానా ప్రవివేశ పితు ర్గృహం॥
౧౨౭-౧౨౭౪

యః కరోతి ధను స్సజ్యం స నరపాలో జనకజామాతా॥
య స్సజ్యం న కురుతే తస్యా ప్యాసీ చ్ఛ జనకజా మాతా॥
౧౨౮-౧౨౮౪

౧౨౩-౧౨౩½ సీతయొక్క చెలికత్తె యీసంగతినిఁ దెలిసికొని మైమఱచియున్న సీతను నిటుల బోధించెను. ఓచెలీ! రామచంద్రుని కంఠమునందు బుష్పమాలిక నుంచి నమస్కరింపుము (అని బోధించెను).

౧౨౪-౧౨౪½ చెలికత్తెచే బోధింపఁబడిన సీత సిగ్గుపడుచు జయసూచక మగు పుష్పమాలికను వెంటనే రామునికంఠమునం దుంచెను.

౧౨౫-౧౨౫½ అప్పుడు దేవతలు పుష్పవర్షమునుఁ గురిపించిరి. ఆ సీతారాములనుఁ జూచి మునులు సంతోషించిరి.

౧౨౬-౧౨౬½ సఖురాండ్రచే సీత బోధింపఁబడియును నహల్య జ్ఞప్తికి వచ్చి మణిభూషణములచే నొప్పు శిరముచే రామునకు నమస్కరింపకపోయెను (అనగా రాముని పాదస్పర్శచే అహల్యాశిల స్త్రీ యైనటులఁ దాను నమస్కరించునపుడు తన రత్నశిరోభూషణమునందలి రాళ్లు రాముని పాదములకుఁదగిలి స్త్రీలయినచోఁ దనకు సవతి పోరాటము సంభవించు నేమో యని సీత భయపడి రామునకు నమస్కరింపలే దని భావము).

౧౨౭-౧౨౭½ ఆ సమయమున లజ్జ, కీర్తి, జానకి యను ముప్వురుకన్యలు తనను వరించుటకు రాగాఁ జివరవచ్చిన సీతను రాముడు గ్రహించి నందునఁ గోపమువచ్చి మొదటిది యగు లజ్జయను కన్యక రాజుల నందరను వరించెను. రెండవది యగు కీర్తి యను కన్య రాముడు తనను వరించలే దని యంతట సాటించుటకో యన యన్ని దిక్కులకు వెళ్లెను (అనగా సీత రాముని మెడలోఁ బుష్పమాలిక వేయగా రాజులు సిగ్గుపడి రనియు, రాముని కీర్తి దిగంతములవరకు వ్యాపించె ననియు భావము). అనంతరము సీత తన పితృగృహమును బ్రవేశించెను.

౧౨౮-౧౨౮½ ఎవడు ధనువునెక్కుపెట్టెనో వానికి జనకజామాతృత్వము (జనకుని యల్లుడగుట) సంభవించెను. కాని ధనువు నెక్కుపెట్టని వానికిఁగూడ జనకజా మాతృత్వము సంభవించుట యాశ్చర్యము (వి ల్లెక్కుపెట్టలేనివారలు జనకజను (సీతను) మాతృభావముతోఁ జూచి రని భావము).

అథ దుష్టనృపాలా స్తు మంత్రిం చక్రుః పరస్పరం॥
అద్య యుద్ధ్వా విజేతవ్య శ్శ్రీరామో ఽయం రణాంగణే
యదా రామం బాణభిన్నం పశ్యామః పతితం రణే॥
కృతకృత్యా భవిష్యామ స్తదా సర్వే వయం నృపాః
తదా ఽస్మదవమానస్య విముక్తిరపి సంభవేత్॥ ౧౩౦-౧౩౨
తేషాం మధ్యే కేచి దూచు ర్నృపా స్తత్ర దుష్టమానసాః
నిరుంధంతు త్వరం సీతాం రాఘవౌ బంధయంతు తౌ॥
జనకస్తు సహౌఘు శ్చే ద్బంధయంతు చ మైథిలం॥౧౩౩-౧౩౪
తదా సుమతయో భూపా స్త్వాహు ర్దుర్మంత్రిణో నృపాన్॥
దుర్ముహూర్తే భవంత స్తు సదనేభ్యో వినిర్గతాః
యుష్మాక మస్మి న్సమయే విజయో న భవే ద్ధ్రువం॥
౧౩౫-౧౩౬

అస్మాకం తు బలం వీర్యం మర్యాదా పౌరుషం తథా
ధనుర్భంగేన సహితం భగ్న మే వేతి మన్యతాం॥ ౧౩౭
మద మీర్ష్యాం క్రోధం త్యక్త్వా ముదా పశ్యత రాఘవం॥
లక్ష్మణక్రోధదావాగ్నౌ భవంతో మాపతంతు చ॥ ౧౩౮

గరుత్మతా యథా సర్పాః పంచాస్యేన యథా గజాః
తథా సౌమిత్రిణా యూయం నిహతా స్స్య ర్న సంశయః॥
౧౩౯

సౌమిత్రి రరుణే నేత్రే కృత్వా సంఘూర్ణయం స్తతః
అనుజ్ఞాం దేహి మే భ్రాత ర్నిహంతుం కునృపా నితి॥

౧౩౦-౧౩౨ అనంతరము దుర్బుద్ధికల రాజపుత్రులు పరస్పర మిట్లాలోచించిరి. ఇప్పుడు శ్రీరామునితో మనము యుద్ధముచేసి జయింపవలయును. ఎప్పుడు రాముడు బాణభిన్నుడై రణాంగణమునందుఁ బతితుడగునో యప్పుడు మన మందరము కృతకృత్యుల మగుదుము. అప్పుడు మన యపమానమునకు విముక్తియును సంభవించును (అని యాలోచించిరి).

౧౩౩-౧౩౩౪ వారిలోఁ గడు దుష్టాత్ములగు కొందఱు రాజు లిటులఁ బలికిరి. సీతను శీఘ్రముగా నడ్డగింపుడు. రామలక్ష్మణులను వెంటనే బంధింపవలయును. జనకుడు రామలక్ష్మణులకు సహాయముగా వచ్చెనేడ నా జనకునిఁగూడ బంధింపుడు (అని పలికిరి).

౧౩౪-౧౩౫ అప్పుడు మంచిబుద్ధికల రాజులు కొందఱు దురాలోచన చేయుచున్న రాజులతో నిటులఁ జెప్పిరి. మీర లందఱును దుర్ముహూర్తములో గృహములనుండి బయలు దేరితిరి. లేనిచో నిట్లు పరాభవము కలుగదు. కాన నీసమయములో మీకు జయముకలుగుట దుర్లభము.

౧౩౬ ఇదియునుగాక మన బలము వీర్యము మర్యాదయు పౌరుషము నివన్నియు ధనుర్భంగముతోఁగూడ భగ్నములయ్యె ననియే తలపవలయును.

౧౩౭ ఓరాజపుత్త్రులారా! మదము, ఈర్ష్య, కోపము అను వీనిని విడిచిపెట్టి నేత్రోత్సవ మగునటుల రాముని జూడుడు. మీరలు లేనిపోని విరోధభావమును వహించి లక్ష్మణుని కోపమను కార్చిచ్చులోఁ బడకుండ నుందురుగాక!

౧౩౮ గరుత్మంతునితో విరోధముపెట్టుకొని సర్పములు హతమయినట్లును, సింహముతో విరోధించి యేనుగులు హతమయినట్లును మీరలు లక్ష్మణునితో విరోధించిన హతులగుటకు సందియములేదని సజ్జనులు చెప్పిరి.

౧౩౯-౧౩౯౪ అనంతరము లక్ష్మణుఁడు నేత్రముల నెఱ్ఱఁజేసి త్రిప్పుచు రామునితో నిటులఁ బలికెను. అన్నా! ఈరాజులు దురాలోచనా

భ్రాతరం పృష్టవాం స్తేన రుద్ధ స్తూష్ణీ మువాస సః॥
౧౩౯-౧౩౯½

తదా దుర్మతయో భూపా బోధితా స్స న్నృపాలకైః॥
సాకేతగమనే రామం నిరుంధ్మ ఇతి మంత్రిణం
కృత్వాపున స్తతోజగ్ముర్యథాస్థానంయథాగతం॥ ౧౪౦-౧౪౧
అథాఽగత్య మునిం నత్వా ప్రాహేదం వచనం నృపః
రాఘవ స్తు బభం జేదం భవదాశీర్బలా న్మునే!
ఇతఃపరం తు కర్తవ్య మాజ్ఞాపయ మహామునే! ౧౪౨-౧౪౨½
త చ్ఛ్రుత్వా వచనం ప్రాహ మైథిలం కౌశికో ఽపి సః॥
మైథిల! శృణు మే వాక్యం వివాహ స్తు ధనుర్వశః
యదా ఽభవ ద్ధనుర్భంగ స్తదా పరిణయో ఽ ప్యభూత్॥
౧౪౩-౧౪౪
తథా ఽపి త్వత్కులాచారో యథా వర్తత మైథిల!
శతానందం సమాపృష్ట్వా త్వం తథా కురు సత్వరం॥
దూతం ప్రేషయ సాకేతం వితీర్య శుభపత్రికాం
యథా ద్రుతం సమాయా త్తత్పురా ద్దశరథో నృపః॥
౧౪౫-౧౪౬
ఇతి కౌశికసందిష్ట స్తథే త్యుక్త్వా నృపోత్తమః
సంప్రేషయామాస తదా దూతా న్దశరథాంతికం॥ ౧౪౭

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
షోడశ స్సర్గ స్సమాప్తః.



పరులై యుండిరి వీరిని హతముచేయుటకు నా కనుజ్ఞనీయుము. అని యన్న నడుగఁగా నారామచంద్రమూర్తి లక్ష్మణునిఁ దొందర పడకుము అని యడ్డగింపఁగా నూరకుండెను.

౧౮౦-౧౮౧ అప్పుడు దుర్బుద్ధికల రాజులు సద్బుద్ధికల రాజులచే బోధింపఁబడి, 'రాముఁడయోధ్యకు వెళ్లు సమయమున మధ్యమార్గమున నిరోధించుదము' అని యాలోచించి తమతమతావులకు వెళ్లిపోయిరి.

౧౮౨-౧౮౨౹ అనంతరము జనకభూపాలుఁడు విశ్వామిత్రునియొద్దకు వచ్చి యిటులఁ బలికెను. ఓవిశ్వామిత్రమహామునీ! నీయాశీర్వాదబలముచే రాముఁడు ధనువును విరిచెను. ఇటుపిమ్మటఁ జేయఁదగిన పని నాజ్ఞాపింపుము.

౧౮౩-౧౮౪ ఆవాక్యమును విని విశ్వామిత్రుఁడు జనకునితో నివ్విధముగఁ జెప్పెను. ఓరాజా! వివాహము ధనుర్వాశమయినది. ఎప్పుడు రాముఁడు విల్లు నెక్కుపెట్టెనో యపుడు వివాహమయినట్లే భావింపవలయును.

౧౮౫-౧౮౬ అయినప్పటికి నీకులాచార మెట్లుండెనో యావిధముగ నీ పురోహితు నడిగి వివాహమహోత్సవమును జరుపుము. దశరథుఁడు సపరివారముగ శీఘ్రముగ వచ్చునటుల శుభపత్రిక నిచ్చి యయోధ్యకు దూతనుఁ బంపుము.

౧౮౭ ఈవిధముగఁ గౌశికునిచే నాజ్ఞాపింపఁబడి జనకుఁడు నవ్విధముగనే పంపెద నని చెప్పి దశరథునిసమీపమునకు శుభపత్రిక నిచ్చి దూతలను బంపెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బదునాఱవసర్గము ముగిసెను.



సప్తదశసర్గ ప్రారంభః.

అథ దూతా ద్రుతంగత్వా శ్రీరామశుభసూచికాం
పత్రికాం పుత్రమోహాయ దదు ర్దశరథాయ తే॥ ౧

స్వయం జనకదూతాశ్చ సందేశం చ న్యవేదయన్
సందేశం జనక స్యేమం మహారాజ ! నిశామయ॥ ౨

పూర్వం ప్రతిజ్ఞా విదితా వీర్యశుల్కా మ మాత్మజా
గృహీతా తవ పుత్రేణ రామే ణామితతేజసా॥
ధనుష స్త్రోటనా త్తస్మా ద్భవా నాగత్య సేనయా
పుత్రాభ్యా మృషిభి స్సార్థం వివాహం కారయ ప్రభో! ౩-౪

తేషాం త ద్వచనం శ్రుత్వా దృష్ట్వాచ శుభపత్రికాం
తదా ఽవద ద్దశరథః పురోహితముఖా న్ప్రతి॥ ౫

జానక్యా రామచంద్రస్య వివాహం ప్రవదం త్యమీ
రోచతే భవతా మేత ద్యది యోగ్యం భవే దిహ॥ ౬

ఊచుశ్చ మంత్రిణ స్సర్వే వసిష్ఠశ్చ మహామనాః
వివాహః క్రియతాం రాజన్ ! జనకేషు న సంశయః॥ ౭

ఆనందాశ్రూణి తత్యాజ నేత్రాభ్యా మజపుత్రకః
శ్రుత్వా సర్వే శుభాంవార్తాంమహానందయుజో ఽభవన్॥౮

## సప్తదశసర్గ ప్రారంభము.

౧ అనంతరము జనకునిదూతలు సాకేతపురమున కేగి పుత్రమోహము కల దశరథమహారాజునకు సీతాకల్యాణసూచక మగు శుభలేఖ నందఁజేసిరి.

౨ ఆ జనకదూతలు శుభలేఖ నిచ్చుటయేకాక స్వయముగఁగూడ జనక సందేశమును దశరథున కిటుల వినిపించిరి.

3_౪ ఓరాజా! నా కొమరితయగు సీతయొక్క వివాహవిషయమై పూర్వము నేను చేసిన శివధనురారోపణరూపమగు పణము నీకుఁ దెలిసియే యుండును. అమితతేజస్సుకల నీ కొమరు డగు రాముడు శివధనువు నెక్కుపెట్టినందున సీతను జేపట్ట నర్హతకలవా డయ్యెను. కాన నీవు పుత్రమిత్రపరివారముతోఁగూడ వచ్చి యీ సీతారామ వివాహోత్సవమును నెఱవేర్పఁ బ్రార్థించుచున్నాడ నని జనకుడు మీకుఁ జెప్పుమనెను (అని దూతలు చెప్పిరి).

౫ దశరథమహారాజు జనకదూతలవాక్యమును విని శుభపత్రికనుఁ జూచియు, వసిష్ఠుడు మొదలగువారలను గూర్చి యివ్విధముగఁ బలికెను.

౬ ఓ వసిష్ఠాదిపురోహితులారా! మంత్రులారా! ఈ జనకదూతలు సీతారాముల వివాహవిషయమై యిట్లు ప్రశంసించుచుండిరి. మీ కందరకు నిష్టమైనచో మఱియు జనకుని సంబంధము యోగ్య మని తోచినచోఁ జెప్పు డనియెను.

౭ వసిష్ఠుడును మంత్రులు నైకకంఠ్యముతో జనకుని సంబంధము యోగ్య మనియు వివాహము చేయు మనియు దశరథునితోఁ జెప్పిరి.

౮ అప్పుడు దశరథుఁడు బ్రహ్మానందము నొంది యానందబాష్పము లనుఁ గన్నులవెంట విడుచుచుండెను. ఈ శుభవార్త నందరును వినిన వారై మహానందము నొందిరి.

భరతోఽపి నిశమ్యాష్టవాక్యాద్భ్రాతృశుభం తదా
పులకాంచితగాత్రోఽభూద్బ్రహ్మానందగతో యథా॥ ౯

స్వపుత్రశుభవార్తాం తాం శ్రుత్వానందమహోదధౌ
నిమగ్నా కోసలసుతా తన్ముదం వర్ణయేత్తు కః॥ ౧౦
తతో దశరథస్సర్వాన్ప్రేరయామాస నాగరాన్
నిర్గంతుం మిథిలాం బంధుమిత్రభృత్యపురోహితాన్॥ ౧౧
దివసే శుభనక్షత్రే ప్రస్థానమకరోన్నృపః
గజానామయుతేనైవ వాజినాం నియుతేన చ॥
రథాష్షష్టిసహస్రాణి దశలక్షం చ పత్తయః
నర్తకా వారముఖ్యాశ్చ గాయకాశ్చ సహస్రశః॥
కోశాధ్యక్షాః ప్రయాతా నై ధనైః పుష్కలరాశిభిః
నిర్గతా నగరాత్సర్వే జనా మంగళపాణయః॥
పురంధ్ర్యశ్శుభవస్త్రైశ్చ కలశైర్మూర్ధ్ని చాస్థితైః
గాయంత్యశ్చ వివాహస్య మంగళాని వినిర్గతాః॥ ౧౨-౧౫
ఏవం దశరథో రాజా సబంధుస్ససుహృజ్జనః
సోపాధ్యాయస్ససైన్యశ్చ రథారూఢో సపుత్రకః॥
సదారో నిర్గతో మార్గే నీత్వా దినచతుష్టయం
పంచమేఽహని వైదేహపురీం ప్రతి సమాయయౌ॥ ౧౬-౧౮
సమాగతం దశరథం శ్రుత్వా రాజా ముదాన్వితః
ప్రత్యుజ్జగామ జనకశ్శతానందపురోధసా॥
నేతుం గజం పురస్కృత్య సమస్తైర్బాంధవాదిభిః॥ ౧౯-౧౯

౯ భరతుడును తన యన్నయగు రాముని కల్యాణమహోత్సవమును నాప్తులవలన విని బ్రహ్మానందమునుఁ బొందినవాడువలె రోమాంచిత మగు దేహముకలవా డయ్యెను.

౧౦ తన పుత్త్రుని శుభవార్తను విని కౌసల్య యానందసముద్రమున మునిగి పోయెను. ఆ కౌసల్యయొక్క సంతోషము నెవడు వర్ణింపఁగలడు?

౧౧ అనంతరము దశరథుడు, బంధుమిత్త్రపురోహితభృత్య జనులను పుర వాసులను నందరిని మిథిలాపురమునకు బయలు దేరఁ బ్రోత్సహించెను.

౧౨–౧౫ అనంతరము దశరథుడు శుభనక్షత్త్రయుక్త మగు దినము నందుఁ బ్రయాణము చేసెను. పదివేల యేనుగులు లక్ష గుఱ్ఱములు నరువదివేల రథములును బదిలక్షల కాల్బలమును మిథిలకు బయలు దేరిరి. మఱియు నర్తకులును, వేశ్యలును, గాయకులును వేలకొలది బయలు దేరిరి. పుష్కలమైన ధనరాసులతో ధనాఢ్యులు పయన మైరి. జనులందరును మంగళద్రవ్యములనుఁ జేతులయం దుంచుకొని పయనమైరి. స్త్రీలు శుభ్రమైన చీనాంబరములను ధరించి పూర్ణ కలశములను శిరములయం దుంచుకొని మంగళగీతములనుఁ బాడుచు బయలు దేరిరి.

౧౬–౧౭ ఈ ప్రకారము దశరథమహారాజు బంధుమిత్త్రపరివారములతోడను, బురోహితులతోడను, బుత్త్రులతోడను, భార్యలతోడను రథా రూఢుడై బయలు దేరి మధ్యమార్గమున నాలుగుదినములుఁ గడపి యైదవదినమున మిథిలాపురమునకు వచ్చెను.

౧౮–౧౯ జనకమహారాజు దశరథుడు తన పురసమీపమునకు వచ్చుచున్న సంగతి దెలిసికొని యా రాజును దీసికొని వచ్చుటకు సంత సముతో శతానందు డను పురోహితునిఁ దన బంధుమిత్త్రాదులను వెంటనిడుకొని యొక మదపుటేనుగును ముందుంచుకొని దశరథుని కెదురుగా వచ్చెను.

రథా దు త్తీర్య రాజాఽపి వసిష్ఠాదిభి రన్వితః॥
జనకాభిముఖ శ్చాగా న్మహానందనిమగ్నహృత్॥ ౧౯-౧౯½

ననామ జనకో రాజా వృద్ధం దశరథం నృపం॥
స తం దోర్భ్యాం పరిష్వజ్య క్షేమం పప్రచ్ఛ మైథిలం॥
౨౦-౨౦½

సారథ్యం చ స్వయం కుర్వ న్సంస్థా ప్యాజసుతం రథే॥
గృహే తం వేశయామాస జనకో ఽత్యంతశోభితే
సేనాం నివేశయామాస పురస్య నికటే నృపః॥ ౨౧-౨౨

రాఘవో లక్ష్మణ శ్చాథ పితురంతిక మాగతౌ
భ్రాతరౌ రాజరాజ స్యాగ్రహీష్టాం చరణౌ పితుః॥
పుత్రౌ సంకృష్య రాజాఽపి దోర్భ్యాం కృత్వా తు వక్షసి
స్నాపయామాస తౌ ప్రేమ్నా నేత్రాభ్యాం వారిబిందుభిః॥
౨౩-౨౪

ఏతస్మి న్సమయే త త్రాయాంతం వీక్ష్య చ కౌశికం
ఉత్థాయ పాదౌ జగ్రాహ విశ్వామిత్రస్య రాజరాట్॥ ౨౫

కౌశికో ఽ ప్యాహ తం భూపం తదా దశరథం వచః
పుత్రౌ గృహీష్వ రాజేంద్ర! న్యాసభూతౌ సమర్పితౌ॥ ౨౬

తథా దశరథః ప్రాహ విశ్వామిత్ర మిదం వచః
కృపయా తవ విప్రేంద్ర! సంబంధో హీదృశో ఽభవత్॥
పరోపకారిణ స్సర్వే సాధవ స్సమదర్శినః॥ ౨౭-౨౮½

౧౯-౧౯½ దశరథుడును తన కభిముఖముగా వచ్చుచున్న జనకునిఁ జూచి రథమునుండి దిగి వసిష్ఠాదులతోఁ గలిసి జనకున కభిముఖముగా మహాసంతోషముతో వచ్చెను.

౨౦-౨౦½ జనకుడును వృద్ధుడైన దశరథమహారాజునకు నమస్కరింపగా నా దశరథుడును జనకునిజేతులతో గాగిలించుకొని క్షేమము నడిగెను.

౨౧-౨౨ పిమ్మట జనకుడు దశరథుని రథమునందుఁ గూర్చుండబెట్టి తాను స్వయముగ రథసారథ్యమునుఁ జేయుచు దీసికొని వెళ్లి మిక్కిలి శోభాయమానమైన యొక భవనమునందుఁ బంధుమిత్రాదిసమేత ముగ నద్దశరథుని బ్రవేశపెట్టెను. దశరథుని సైన్యమునంతనుఁ దన పురసమీపములోఁ బ్రవేశపెట్టెను.

౨౩-౨౪ అనంతరము రామలక్ష్మణులు తండ్రి సమీపమునకు వచ్చినవారలై తండ్రిపాదములకు నమస్కరించిరి. దశరథుడును పుత్రులను గాగి లించుకొని ప్రేమచే నానందబాష్పములచే వారిని స్నానము చేయించెను.

౨౫ ఈసమయమున నచ్చటకు వచ్చుచున్న విశ్వామిత్రునిఁ జూచి దశ రథుడు తొందరగ లేచి యెదురుగ వెళ్లి యా మునిపాదములకు నమస్కరించెను.

౨౬ విశ్వామిత్రుడును దశరథునిగూర్చి యివ్విధముగఁ బలికెను. ఓ దశ రథా! నాకు నీ వప్పగించిన నీ పుత్రులను దిరిగి నీ కప్పగించు చున్నాను. గ్రహింపు మనియెను.

౨౭-౨౭½ అప్పుడు దశరథుడు విశ్వామిత్రునితో నివ్విధముగఁ బలికెను. ఓబ్రహ్మర్షి! విశ్వామిత్రా! నీకృపచేతనే నాకు జనకుని సంబంధ బాంధవ్యము లభించెను. మీవంటి సత్పురుషు లందరు సదా పరోప కారస్వభావముకలవారును సమదర్శులును కదా!

ఇతి సంభాషమాణౌ తౌ పరస్పర మలం ముదా॥
కౌశికాజనుతౌ తస్మి న్విశ్రాంతిభవనే స్థితౌ॥ ౨౮-౨౯

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
సప్తదశస్సర్గ స్సమాప్తః.



అష్టాదశసర్గప్రారంభః.

1 ఆజ్ఞాపయామాస చైవం మైథిలో ఽథ స్వసేవకాన్
పురాలంకరణం తూర్ణం భవంతః కారయం త్వితి॥ ౧

ఉచ్ఛ్రీయంతాం పతాకాః ప్రతినృపతిపథం సౌధవీథీషు
చిత్రా। స్సిచ్యంతాం రాజమార్గాః కుసుమచయయుతై రం
బుభి శ్చందనాఢ్యైః। ధూప్యంతాం ధూపసారై ర్మణిరుచిర
గృహాప్రాంగణాని ప్రకామం। లింపంతాం ద్వారవేద్యో
మృగమదకలితై స్సాంకవై ర్గంధపంకైః॥
సన్నహ్యంతాం తోరణానాం శ్రేణయః ప్రతిమందిరం
కల్ప్యతాం రంగవల్ల్య శ్చ ద్వారదేశేషు మౌక్తికైః॥ ౨-౩

త చ్ఛ్రుత్వా సేవకా స్సద్య స్త థే త్యుక్త్వా గతా స్తథా
కారయంతి స్మ భృత్యై స్తత్పురాలంకరణం ద్రుతం॥ ౪

అథ కాంశ్చి త్సమాహూయ చిత్రకర్మవిశారదాన్
నియుక్తవా న్స్వభవన మలంకర్తుం చ మైథిలః॥ ౫

1. కవి.

౨౮-౨౯ ఈప్రకారముగ దశరథవిశ్వామిత్రులు పరస్పరము సంతోషముతో నిష్ఠాగోష్ఠిమాటలు మాట్లాడుకొనుచు నా విడిదిగృహమున నుండిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బదునేడవసర్గము సమాప్తము.



## పదునెనిమిదవసర్గ ప్రారంభము.

౧ అనంతరము జనకమహారాజు యీక్రిందివిధముగఁ బురము నలంకరించు నటులఁ దన సేవకుల నాజ్ఞాపించెను.

౨-౩ ప్రతి రాజమార్గమునందునను మేడలయందును విచిత్రములైన జండాలు కట్టఁబడునట్లును, రాజమార్గము లన్నియు మంచిగంధపు నీటితోఁ దడిపి పుష్పములు చల్లబడునట్లును, మణులచే నిర్మింపఁ బడిన భవనములముందు నగరుధూపములు వేయఁబడునట్లును, ద్వారములకుఁ గస్తూరిఁ బూయునట్లును, ప్రతిమందిరమున ముత్యాల తోరణములు కట్టునట్లును, ద్వారభాగములయందు ముత్యములతో రంగవల్లులు పెట్టునట్లును (ఆజ్ఞాపించెను).

౪ ఆ జనకుని వాక్యమును సేవకులు విని యా విధముగనే చేయించెద మని చెప్పి వెంటనే వెళ్ళి యవ్విధముగనే నౌకరులచేఁ బురమును నలంకరింపఁ జేయుచుండిరి.

౫ అనంతరము జనకమహారాజు రంగుపనులనుఁ జేయువారలనుఁ గొందఱనుఁ బిలిచి తనభవనము నలంకరింప నాజ్ఞాపించెను.

కిం చ కర్తు మలంకర్తుం కల్యాణం మణ్డపం చ తాణ్
తదా నియుయుజే రాజా జనక శ్చిత్రకారకాణ్॥ ౯

తే ద్రుతం సమలంకృత్య భవనం జనకస్య వై
కల్యాణమండపం చక్రు రలంచక్రు శ్చ నైకథా॥ ౧౦

తద్బ్రహ్మణ స్సభాస్థానం ధిక్కృత్యా ఒసీచ్చ మణ్డపః
దేవతామునయ స్తస్మి న్మణ్డపే పక్షిణ స్తథా॥
కృతిమా శ్చిత్రకారై స్తు నిర్మితా బహుశో ఒవసణ్
ఇంద్రనీలమణీనాం చ ముక్తానాం చ సుతోరణై ః॥
పద్మరాగాదిగుచ్ఛై శ్చ మణ్డప స్సమలంకృతః
మంగళార్థై స్స్వర్ణకుంభై ః రత్న స్తంభై ర్ధ్వజై స్తథా॥
రత్నదీపై శ్చాదిసీభి ర్మణ్డప స్సమలంకృతః॥ ౮-౧౦౪

జనకస్య గృహే యాదృ గలంకార స్తు దృశ్యతే॥
ప్రతిగేహం తథా పుర్యా మలంకార స్తు దృశ్యతే॥ ౧౧-౧౧౪

తస్మి న్పురే మహాలక్ష్మీ ర్న్మాయికం రూప మాశ్రితా॥
ప్రతిగేహం సంచరంతీ మోదమానా ఒవస త్తదా॥౧౨-౧౨౪

రాజభృత్యై రలంకార స్తత్పురే కారితో ఒధికః॥
న కో ఒపి క్షమతే భూమ్యాం వర్ణితుం తత్పురశ్రియం॥ ౧౩-౧౩౪

౫॥ మిథిలా నానాపతాకోపశోభితా వివిధప్రాసాద గోపురదేవతాయతనోపశోభితా పరస్పరకేళిచతురయువతిజనానుకీర్ణా చోశీరవిరచితమహాప్రపా వివిధపణ్యోపశోభితరథ్యా తత్ర

౬ మఱియు జనకుడు కల్యాణమండపమును నేర్పరచి దాని నలంక రించుటకును నా చిత్రకారులనే నియమించెను.

౭ ఆ చిత్రకారులు జనకుని భవనమును బాగుగ నలంకరించి కల్యాణ మండపము నేర్పరచి యా మండపమును ననేక విధములుగ నలంక రించిరి.

౮-౧౦½ ఆ కల్యాణమండపము బ్రహ్మదేవుని సభాస్థానమును ధిక్కరించి యుండెను. ఆ మండపమునందుఁ గృత్రిమము లగు దేవతలను మునుల‌ను బక్షులను విచిత్రముగఁ జిత్రకారులు నిర్మించిరి. మఱియు నా మండపము ముత్యాల తోరణములచేతను, నింద్ర నీల మణి తోరణములచేతను, బద్మరాగమణుల గుత్తులచేతను నలంకరింపఁజేయఁబడెను. మఱియు నమ్మండపము మంగళార్థకమయిన సువర్ణకలశముల చేతను, రత్న స్తంభములచేతను, ధ్వజములచేతను, రత్న దీపములచేతనుఁ జాందినీలచేతను నలంకరింపఁబడెను.

౧౧-౧౧½ జనకుని గృహమునం దెట్టి యలంకారము కన్పడుచుండెనో పురమున ప్రతిగృహమునం దట్టి యలంకారము కన్పడుచుండెను.

౧౨-౧౨½ ఆ మిథిలాపురమునందు లక్ష్మీదేవి మూఁడురూపములతోఁ బ్రతి గృహమున సంచరించుచు సంతోషించు చుండెను.

౧౩-౧౩½ రాజభృత్యులు మిథిలాపురమునంతను బాగుగ నలంకరింపఁ జేసిరి. ఆపుర వైభవమును వర్ణించుటకు భూమియందు సమర్థుఁ డెవ్వఁడును లేడని చెప్పవచ్చును.

౧౪-౧౪½ (పురవైభవము వర్ణింపఁబడుచున్నది) ఆ మిథిలాపురము జండాల చేతను, ననేకములగు గోపురప్రాసాద దేవాలయములచేతనుఁ బ్రకా శించు చున్నదియును, బరస్పరక్రీడలయందుఁ జతురతకల స్త్రీ

తత్ర బ్రహ్మఘోషోపశోభితమతా ప్రతిమందిరం మీమాం
సాది వ్యాఖ్యానసంపాదనీమాధ్యయనా సుపుణ్యాహావిర్గంధ
సామాది స్వర పద క్రమ శ్రుతి బ్రాహ్మణవాటికా
మృదుల వసనతాంబూలరక్తదంతచ్ఛదకామినీ సంజ్ఞా
నివారిత కఠినవచనకరజనా వివిధోపాయనాహరణ కరజనో
పశోభితా మాలాకార సహస్రోపశోభితా పుణ్యాసవ
సముల్లసన్మందిరా తత్ర తత్ర విచిత్రతోరణా విశుద్ధవీథికా
శోభతే స్మ. ౧౪-౧౪½

కిం చ చూతప్రవాళై శ్చ రచితా మాలికా శ్శుభాః॥
భవనద్వారభాగేషు రంభా స్తంభాః పరిష్కృతాః
సుగంధిభి ర్జలై స్సిక్తా రాజమార్గా స్త్వలంకృతాః॥ ౧౫-౧౬

క్వణంతి మురజాః పుర్యా మామంద్రధ్వనయో బహు
తంత్రీవరా శ్చ సర్వత్ర మూర్ఛంతి నృపవేశ్మసు॥
సింజానరత్నభూషాభి ర్నృత్యంతి గణికా స్తథా॥ ౧౭-౧౭½

ధూపై రాగరవై రాసీ దభ్రభ్రాంతి ర్నభ స్స్థలం॥
సమున్నద్ధస్ఫురద్రత్నతోరణప్రభయా పునః
తత్ర సంజాయతే భ్రాంతిర్మహేంద్రధనుష స్స్థలం॥ ౧౮-౧౯

పురుషులచే వ్యాప్తమైనదియును, పట్టివేళ్లచే నిర్మింపబడిన పందిళ్లు కలదియును, అనేకవస్తుసమృద్ధిచే నొప్పుచుండిన బజారులుకలది యును, నచ్చటచ్చట వేదఘోషములచే శోభించు మఠములు కలది యును, మీమాంసాది వ్యాఖ్యానమవధిగాఁగల యధ్యయనముకలమంది రములు కలదియును, పుణ్యప్రదమగు హోమద్రవ్యములు, సుగంధము, సామగానము, పదక్రమములు మొదలగువానిచే నొప్పుచుండిన బ్రాహ్మణవాటికలు కలదియును, మృదువస్త్రములు ధరించినట్టియు, తాంబూలచర్వణముచే నెఱ్ఱనైన యధరోష్ఠము కలిగినట్టియు స్త్రీలచే నొప్పుచున్నదియు, బిగ్గరగ మాట్లాడువారిని సంజ్ఞలచే నివారించు భృత్యజనముచే రాజిల్లుచున్నదియు, కానుకలను దీసికొనవచ్చిన యితరజనులచే శోభించునదియును, ననేకులగు మాలాకారులచే (పూలదండలను జేయువారలచే) నొప్పుచుండినదియు, ననేకములగు మద్యవస్తువులచే నొప్పు గృహములుకలదియును, నచ్చటచ్చట విచిత్ర తోరణములు కలదియు, పరిశుద్ధ వీధులు కలదియు నై ప్రకాశించు చుండెను.

౧౫-౧౬ ఇదియునుంగాక పురమునందలి గృహద్వారములయందు లేతమా మిడి చిగుళ్లచేఁ దోరణములు కట్టఁబడెను. అరటిస్తంభములు ద్వార ములయొద్ద నలంకరింపఁబడెను. రాజమార్గములు సుగంధజలముచేఁ దడుపఁబడి యలంకరింపఁబడెను.

౧౬-౧౭½ ఆపురమునందంతటను మృదంగధ్వనులు గొప్పగ వినఁబడుచుండెను. రాజగృహములయందు వీణాధ్వనులు వ్యాపించుచుండెను. వేశ్యలు రత్నాభరణములు ధ్వనించునటుల నృత్యములఁ జేయుచుండిరి.

౧౮-౧౯ ఆపురమునందలి యగరుధూపములచే నాకసమున మబ్బుపట్టెనా యనెడి భ్రాంతి కలుగుచుండెను. మేడల పైభాగమునఁ గట్టఁబడిన రత్నతోరణముల కాంతిచే నాకాశమున నింద్రధనుస్సు బయలు దేరినదేమో యను భ్రాంతి కలుగుచుండెను.

అథ మైథిలభూపాల శ్శతానందపురస్సరః
నృపం దశరథం ప్రాప్య ప్రాహేదం వచనం మహత్॥ ౨౦
సీతాం రామాయ భద్రం తే ఊర్మిళాం లక్ష్మణాయ చ
దదామి పరమప్రీతో వధ్వౌ తే నృపపుంగవ! ౨౧
మఖా హ్యద్య మహాబాహో! పరశ్వః ఫల్గునీ భవేత్
ఫల్గున్యా ముత్తరే రాజన్! తస్మి న్వైవాహికం కురు॥ ౨౨
త ముక్తవంతం వైదేహం విశ్వామిత్రమహామునిః
ఉవాచ వచనం వీరం వసిష్ఠసహితో నృపం॥ ౨౩
భరతస్య కుమారస్య శతుఘ్నస్య చ ధీమతః
కుశధ్వజస్య రాజర్షే! రూపే ణాప్రతిమం భువి॥
సుతాద్వయం నరశ్రేష్ఠ! పత్న్యర్థం వరయామహే॥ ౨౪-౨౫

జనక స్తద్వచ శ్శ్రుత్వా ప్రాహ తౌ మునిపుంగవౌ॥
ఏవం భవతు భద్రం వః కుశధ్వజసుతే ఇమే
పత్న్యౌ భజేతాం సహితౌ శత్రుఘ్నభరతా వుభౌ॥ ౨౬-౨౭
ఏకాహ్న రాజపుత్రీణాం చతసౄణాం మహామునే
పాణీ న్గృహ్ణంతు చత్వారో రాజపుత్రా మహాబలాః॥ ౨౮
జనకస్య వచ శ్శ్రుత్వా విశ్వామిత్రో ఽవద న్నృపం
* సదృశో ధర్మసంబంధ స్సదృశో రూపసంపదా॥

---

* సదృశ ఇతి విశ్వామిత్రవచనేన కులశీలపరీక్షాపూర్వకం

౨౦ ఇవ్విధముగఁ బురము నలంకరించిన పిదప జనకుడు తన పురోహితు డగు శతానందునితోఁగూడ బయలుదేరి దశరథుని సమీపమునకు వచ్చి యిటుల నారాజుతోఁ బలికెను.

౨౧ ఓరాజా! రామునకు సీతను, లక్ష్మణునకు నాయౌరసకన్య యగు నూర్మిళను నీకుఁ గోడండ్రిగా నిచ్చెదను.

౨౨ ఓ రాజోత్తమా! నేడు మఖానక్షత్రము. ఎల్లుండి యుత్తరా నక్షత్రము. కాన నాయుత్తరానక్షత్రయుక్త దినముననే వివాహముచేయ నంగీకరింపు మనియెను.

౨౩ ఆ ప్రకారము చెప్పుచున్న జనకునితో నచ్చటనున్న విశ్వామిత్రుఁడు వసిష్ఠునితో సంప్రతించి యిటులఁ బలికెను.

౨౪–౨౪½ ఓ రాజోత్తమా! కుశధ్వజుని పుత్రికల నిర్వురను భరతున కొకతెను, శత్రుఘ్నునకు రెండవదాని నిచ్చి యావివాహములు కూడఁ జేయు మని మేము కోరుచుంటిమి (అని విశ్వామిత్రుఁడు పలికెను) (ఇటులఁ గోరుటకు కారణ మేమనగాఁ బెద్దవా డగు భరతునకు వివాహము కాకుండగఁ జిన్నవా డగు లక్ష్మణునకు వివాహము కూడదు కాన నట్లు కోరిరి).

౨౫–౨౬ జనకు డావాక్యమును విని నాతమ్ముఁడగు కుశధ్వజునిఁ గూతులగు మాండవీ శ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకు నిచ్చుటకు నాకు సమ్మతమే.

౨౭ ఓమహామునీ! దశరథపుత్రులకు నల్వురకును నొక దినముననే పాణిగ్రహణములు జరుగవలయు ననెను.

౨౮–౨౮½ ఆజనకునివాక్యమునువిని విశ్వామిత్రుడు సంతసించి యారాజుతో నిటులఁ బలికెను. వధూవరులకు *కులశీల వయోరూపాదులు సర్వవిధ

* కులశీల రూపాదులు సమానములుగా నున్నవని చెప్పుటచే కులశీల

ఇత్యేవం తత్కులద్వంద్వం శ్లాఘయామాస కౌశికః॥
౨౮-౨౮ ½

తదా దశరథః ప్రాహ మైథిలం నృపసత్తమం॥ ౨౯

అనుగ్రహో మ య్యధునా భవద్భ్యాం సహోదరాభ్యాం
సమదర్శి రాజన్ । ఇతి స్తువ న్మైథిలరాజవర్యం సన్మాన
యామాస తదా ఽజపుత్రః॥ ౩౦

వసిష్ఠకౌశికానుజ్ఞాం లబ్ధ్వా దశరథానతిం
సంప్రాప నిలయం స్వీయం మిథిలాధిపతి స్తతః॥ ౩౧

*అ థాభ్యుదయికం కర్మ కృత్వా దశరథ స్తతః
గోదాన ముత్తమం ప్రీత శ్చకార విధినా నృపః॥ ౩౨

---

వధూవరయోః కులశీలవయోరూపసంపన్నయో రేవ వివాహః కర్తవ్య ఇతి సూచితమ్. తథాచ యమః- 'కులంచ శీలంచ వపు ర్వయ శ్చ విద్యాం చ విత్తం చ సనాథతాంచ, ఏతా న్గుణా న్సప్త పరీక్ష్య దేయా కన్యా బుధై శ్శేష మచింతనీయం' ఇతి.

*ఆభ్యుదయికం కర్మేతి— అనేన మంగళకర్మసు ఆదా వాభ్యుదయం శ్రాద్ధం కర్తవ్య మితి సూచితమ్. తథా చ విష్ణుపురాణే— 'కన్యాపుత్రవివాహేషు ప్రవేశేషు చ వేశ్మనః, శ్రాద్ధ మాభ్యుదయం కుర్యా' దితి. గోదానవిషయే ఽపి

ములఁ దగియున్నవి. మీరలిర్వురును వియ్యమునుఁ బొందుట తగి యున్నదని కౌశికుడు ఉభయుల వంశములనుఁ గొనియాడెను.

౨౯ అప్పుడు దశరథుడు జనకమహారాజుతో నిటులఁ బలికెను.

౩౦ ఓరాజా! నాయం దిపుడు మీసోదరులిర్వురును మిక్కిలి యను గ్రహమునుఁ జూపితిరి. అని జనకుని స్తుతించుచు దశరథుడు విశేష ముగా నమ్మైథిలుని సన్మానించెను.

౩౧ జనకమహారాజు వసిష్ఠకౌశికుల యనుమతిని దశరథుని యానతి నొంది తన గృహమునకు వెళ్లెను.

౩౨ అనంతరము దశరథుఁడు *అభ్యుదయకర్మను అనగా నాందిని జేసి పిమ్మట గోదానవ్రతమునుఁ గూడఁ జేసెను.

---

పరీక్షా పూర్వకముగ కులశీల వయోరూపసంపన్నులగు వధూవరులకే వివాహము చేయవలయునని సూచితమగు చున్నది. స్మృతి యందు నట్లే చెప్పబడినది. కులము శీలము వయస్సు ఆకారము విద్య ధనము దక్షత యను నీయేడుగుణములనుఁ బరీక్షించి కన్య నీయవలయును. మిగిలినవి యనవసరము.

* అభ్యుదయకర్మనుఁజేసెనని చెప్పుటచే శుభకర్మలయందు అభ్యుదయ శ్రాద్ధమునుఁ జేయవలయునని సూచితమగుచున్నది. అవ్విధముననే విష్ణుపురాణమునందునఁ జెప్పఁబడుచున్నది. కన్యావివాహమునందునఁ, బుత్రవివాహమునందున, గృహప్రవేశములయందున అభ్యుదయ శ్రాద్ధము చేయవలయునని. గోదానవిషయమై ఖాదిరగృహ్యసూత్ర మున నిటులఁజెప్పఁబడినది.—గోదానమునందు, జౌలమువలెఁ గల్ప ము జెప్పఁబడినది. గోదానమనగా ( గోశబ్దమునకు రోమము లర్థము. దాన మనగా ఖండనము. కేశఖండనము అని యర్థము )

సుముహూర్తే తు సంప్రాప్తే శతానందం స మైథిలః
సమానేతుం దశరథం ప్రేషయామాస సాత్మజం॥ 33

స గత్వా ఽజసుతం భూపం ప్రాహేదం గౌతమాత్మజః
నిర్గచ్ఛ రాఘవేంద్ర! త్వ మగ్రే కృత్వా కుమారకాన్॥
జనకస్య గృహం శీఘ్రం లగ్నార్థం సకలై స్సమం
త థే త్యుక్త శ్శతానందః ప్రత్యగా జ్జనకాలయం॥ 34-35

భూషయిత్వా స్వయం స్వీయా న్కుమారా నజపుత్రకః
రథారూఢా న్సుతా న్కృత్వా సదార స్సపురోహితః॥
సమిత్రజ్ఞాతిపౌర శ్చ వాద్యఘోషపురస్సరం
నిర్జగామ స్వపుత్రాణాం లగ్నార్థం బంధుభి స్సహ॥ 36-37

ఆలోకనాయ రామస్య కాచి త్పరమసుందరీ
ధమ్మిల్ల మ ప్యబధ్నంతీ వాతాయన మథాయయౌ॥ 38

కాచి చ్చేలం ధరంతీ సా శ్రుత్వా ఽయాంతం రఘూత్తమం
నీవీం కరేణ ధృత్వా శు ద్రష్టుం వాతాయనం ఽఽగతా॥ 39

ఏవం పురజనానందకర శ్శ్రీరాఘవ స్తతః
స్వభ్రాతృభి స్స్వపిత్రా చ మాతృభి ర్బంధుభి స్సమం॥
జనకస్య గృహం ప్రాప మహోత్సవపురస్సరం॥ 40-41

---

ఖాదిరగృహ్యే— 'గోదానే చౌలవ త్కల్పః సలోమం వాపయేత్. గో అశ్వాది మిథునాని దక్షిణా' ఇతి.

౩౩ సుముహూర్తసమయము సమీపించుచుండ జనకమహారాజు దశరథుని బుత్త్రసమేతముగాఁ దీసికొని వచ్చుటకు శతానందునిఁ బంపెను.

౩౪-౩౫ ఆ శతానందుడు దశరథునియొద్ద కేగి కుమారులతోడను సమస్త బంధు పరివారముతోడను లగ్నమునకు బయలు దేరి రావలసినదిగా దశరథునితోఁ జెప్పెను. దశరథుడు నవ్విధముననే బయలుదేరు చుంటినని చెప్పగా శతానందుడు తిరిగి జనకునిగృహమున కేగెను.

౩౬-౩౭ అనంతరము దశరథుడు తనపుత్త్రులకుఁ దాను స్వయముగ నలం కారముల నలంకరించి కుమారులను రథము నెక్కించి తన భార్యల తోడను, బంధుగులతోడను, పురోహితులతోడను, మిత్త్రులతోడను, పరివారముతోడను బురవీధుల నూరేగింపుతో సమస్త వాద్యఘోష ములతో లగ్నమునకు వచ్చుచుండెను.

౩౮ రాముడు పురవీధివెంట నూరేగింపుతో వచ్చుచున్నట్లు విని పుర స్త్రీయొకతె రామచంద్రమూర్తినిఁ జూచుటకుఁ దలదువ్వుకొనిన దయ్యును కొప్పు పెట్టుకొనకుండగనే పరుగిడుచు కిటికియొద్దకు వచ్చి రామునిఁ జూచుచుండెను.

౩౯ ఇంకొక పురస్త్రీ చీరెనుఁ గట్టుకొనుచు రాముడు వచ్చుచున్నట్లు విని కోకముడిసఁ జేతితోఁబుచ్చుకొని తొందరగాఁ గిటికీయొద్దకు వచ్చెను.

౪౦-౪౧ ఈప్రకారముగఁ బురజనుల కానందమునుఁ గొల్పుచు రామచంద్ర మూర్తి తన సోదరులతోడను పితృమాతృబంధుజనులతోడను జనకుని గృహమును మహోత్సవముతో బ్రవేశించెను.

---

వపనము చేయించవలయుననియు, గోమిథునము లేక అశ్వమిథునము లేక మేకలజంట దక్షిణగా నీయవలయుననియుఁ జెప్పఁబడినది.

స్వర్ణపీఠేషు రామాదీ నుపవేశ్యతు మాతరః॥
సత్వరం మంగళస్నానం స్వపుత్త్రాణా మకారయన్
అథతా న్భూషయామాసు ర్భూషణై ర్మాతర స్స్వయం॥
౪౧-౪౨

మణిభూషణవస్త్రాద్యై రలంకృతవతీ సుతం
కౌసల్యా రాఘవ స్యాంగే లిప్త్వా చందన మప్యథ॥
ఫాలే బధ్వా భూషికంచ విధాయ తిలకం శుభం
విన్యస్య స్వర్ణముష్ణీషం రామచంద్రస్య మూర్ధని॥
విన్యస్య పాదయోర్లాక్షాం పరమానంద మాప సా॥౪౩-౪౪

సౌవర్ణపీఠేఽథ నివేశ్య సీతాం ముదా తదాంతఃపురయోషి
త స్తు। అకారయ న్మంగళమజ్జనం తాం దత్వా ఽఽరతీ ర్మాం
గళికా స్సుగీతైః॥ ౪౫-౪౫

కాచి త్సఖీ భూమిజాంగస్థితార్ద్రత్వం ప్రమృజ్యతు॥
జాంబూనదాం చలం చేలం బబంధ చ కటీతలే॥ ౪౬-౪౬

ఏకా సఖీ పదో ర్లాక్షా మలంకృత వతీ తతః॥
అన్యా సఖీ భూమిజాయా మధ్యం కాంచ్యా త్వభూషయత్॥
౪౭-౪౭

జానక్యా రామపత్న్యై త్వే లిఖితాం వేధసో లిపిం॥
ద్రష్టుకామేవ సీమంత మపరా వ్యభజ త్సఖీ॥ ౪౮-౪౮

కాచిత్సఖీ మృగమదేన చకార సద్య స్సీతాముఖే తు తిలకం
హాసితేందుబింబే। అన్యాకరో న్నసి సఖీ నవమౌక్తికం చ
వక్త్రాంబుజాంతరచరస్మితహంసికాండం॥ ౪౯-౪౯

౪౧_౪౨ అచ్చటఁ గౌసల్య మొదలగు తల్లులు రామలక్ష్మణభరతశత్రు ఘ్నులను బంగారపు పీటలయందుఁ గూర్చుండఁబెట్టి తనపుత్త్రులకు శీఘ్రముగ మంగళస్నానములనుఁ జేయించి యనంతరము స్వయ ముగ వారలు తమ పుత్త్రుల కలంకారములనుఁ జేసిరి.

౪౩_౪౪ అనంతరము కౌసల్యాదేవి పుత్త్రుని మణిభూషణములచేతను దివ్య వస్త్రములచేతను నలంకరించి రాముఁశరీరమందు చందనముపూసి, కల్యాణపు బొట్టుపెట్టి ఫాలమునందు భాషికమునుఁ గట్టి, సువర్ణ వికారమగు టోపీని రాముని నెత్తిమీఁదఁబెట్టి, పాదములకుఁ బారాణి పెట్టి, యివ్విధముగ నలంకరించి మహాసంతసముతో నుండెను.

౪౫_౪౫½ అనంతరము అంతఃపురస్త్రీలు సీతను సువర్ణపీఠమునందుఁ గూర్చుండఁబెట్టి పాటలుపాడుచు మంగళారతులనిచ్చి మంగళ స్నానము జేయించిరి.

౪౬_౪౬½ అనంతరము ఒకచెలికత్తె సీత శరీరమునందలి తడి తుడిచి బంగా రపుసరిగెతోనొప్పుచున్న పట్టుచీరెను గటిప్రదేశమునఁ గట్టెను.

౪౭_౪౭½ మఱియొక సఖురాలు సీత పాదములకుఁ బారాణి పెట్టెను. ఇం కొక సఖురాలు సీత నడుమునకు బంగరపు టొడ్డాణము నలంకరింపఁ జేసెను.

౪౮_౪౮½ వేఱొక సఖురాలు సీత రాముని భార్య యగునని బ్రహ్మవ్రాసిన వ్రాతనుఁ జూచుటకో యనునట్లు సీతకుఁ బాపిట తీయుచుండెను.

౪౯_౪౯½ ఒకసఖురాలు చంద్రబింబమువంటి సీతముఖమునందు కస్తూరీతిల కము పెట్టెను. ఇంకొక సఖురాలు ముక్కునఁ గొ్రిత్తముత్తెము నలంక రించెను. ఆముత్తెము సీత ముఖమనే పద్మమందు సంచరించు చున్న చిఱునగవనే యాడుహంసయొక్క గ్రుడ్డో యనునట్లుండెను.

కాచిత్సఖీ వా క్తికకర్ణపత్రే తథా ఉపరా ప్యంజన మక్షి
యుగ్మే, అన్యా చ జాంబూనదహా స్తభూషాః కాచి ద్వపు
స్సర్వ మలంచకార॥ ౫౦-౫౦౪

కాచి త్సఖీ కుంతలాంత ర్బబంధ కుసుమావళిం॥
కాచి ద్వక్షసి సీతాయా స్సిందూరం చా ప్యకల్పయత్
సీతాలలాటే రాజ్ఞ్యాఽపి కల్యాణతిలకం కృతమ్॥ ౫౧-౫౨

భూషణాని స్త్రియో ఽంగాని భూషయం తీ త్యభూత్ప్రథా
సీతాంగా న్యేవ భూషాణాం జనయామాస సచ్ఛవిం॥ ౫౩

అ థోర్మిళాదికన్యానాం కారయిత్వా సుమజ్జనం
అలంకృతిం తథా చక్రు స్సఖ్యో ముదితమానసాః॥ ౫౪

ఏవం పరిష్కృతాం సీతా మూర్మిళాద్యా వధూ ర్నృపః
నీత్వా దేవగృహం తత్ర తాభి ర్గౌరీ మపూజయత్॥ ౫౫

ఇ త్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
అష్టాదశసర్గ స్సమా ప్తః.



౫౦-౫౦౪ ఒకసఖురాలు మంచిముత్తెములతో నమర్చఁబడిన సువర్ణకర్ణభూషణములనుఁ జెవుల కలంకరించెను. మఱియొక సఖురాలు సీతకన్నులకు గాటుక పెట్టెను. ఇంకొక సఖురాలు బంగరు కంకణములనుఁ జేతులనుఁ బెట్టెను. మఱియొకతె శరీరమునంత నలంకరించెను.

౫౧-౫౨ ఇంకొక సఖురాలు సీత తలలోఁ బూలను ముడుచుచుండెను. మఱియొక సఖురాలు సీత వక్షఃస్థలమునందు సిందూరము నలంకరించెను. జనకునిభార్య, సీతలలాటమున కల్యాణపు బొట్టుపెట్టెను. ఇవ్విధముగ సఖురాండ్రు తమ సంతసమును వెలిబుచ్చిరి.

౫౩ అలంకారములు స్త్రీలయవయవముల నలంకరింపఁ జేయునని ప్రసిద్ధి కలదు. కాని సీత యవయవములే యలంకారములకు నలంకారమునుఁ గలుగజేసెను. ఆశ్చర్యము (దీనివలనఁ దెలిసికొనవలసిన దేమన సహజసౌందర్యము లేనివారలకు అలంకారములు అలంకారమునుఁ జేయును గాని సహజసౌందర్యముకలవారికి భూషణములవలన నలంకారము లేదని భావము).

౫౪ అనంతరము ఊర్మిళ మొదలగు నూతన వధువులకు సఖురాండ్రు మంగళస్నానమునుఁ జేయించి యవ్విధముగనే యలంకరించిరి.

౫౫ ఈప్రకారముగ నలంకరింపఁబడిన సీత మొదలగు నూతన వధువులను జనకమహారాజు దేవతాగృహమునకుఁ దీసికొని వెళ్ళి గౌరీపూజను వారలచేఁ జేయించెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ

బదునెనిమిదవ సర్గము ముగిసెను.



## ఏ కో న విం శ స్స ర్గః.

అథా వాద్యంతవాదిత్రా ణ్యనేకాని పునః పునః
తత్రైవ గాయకా స్సర్వే జగుః పరమమంగళం॥
నర్తక్యో నన్నృతు స్సర్వాః కల్యాణే మణ్డపే తదా॥ ౧-౧౪
వసిష్ఠో ఽథ సమాగత్య రాఘవాదీ న్వరా న్పునః॥
వేదవిద్భి స్సుసంబాధం రత్నస్తంభపరిష్కృతం
కల్యాణమండపం నీత్వా వాద్యఘోషపురస్సరం॥
ఉపవేశితవాం స్తత్ర సౌవర్ణే ష్వాసనేషు వై॥ ౨-౩౪
వసిష్ఠో ఽథ శతానందం పురస్కృత్య చ కౌశికం॥
గణాధిపతిపూజాం చ స్వస్తివాచనకం తథా
కారయామాస విధివ ద్రాఘవై ర్ముదిత స్తదా॥ ౪-౫

1 కిం బ్రూమహే చిత్ర మభూతపూర్వ మన్యోన్యసక్తా వపి
దంపతీ తౌ, పరస్పరం ప్రాహిణుతాం ద్విజేంద్రా న్స్వయం
వరార్థం చతురః ప్రియో క్త్యాక్॥ ౬

౫॥ అథ తత్ప్రవృత్తై స్సుహృద్భి ర్విప్రవరై ర్వధూజనకనికటే
త్రిజగత్కల్యాణమహోత్సుకా యాచింత్యాద్భుతయౌవన
లావణ్యరత్నాకరా యాఖిలలోకపవిత్రగోత్రోద్భవాయ
శ్రీమహావిష్ణుస్వరూపాయ సూర్యవంశపావనాయ తత్త్వాతీ
తాయ శ్రీరామచంద్రాయ వరాయ సాక్షా ల్లక్ష్మీరూపిణీం
సీతానామ్నీం కన్యాం వృణీమహి, ఇత్యుచ్చై రిగదద్భి

1 శ్రీ. రా. చం.

## పందొమ్మిదవసర్గప్రారంభము.

౧-౧౪ అనంతరము వాద్యములన్నియు వాయింపఁబడుచుండెను. గాయకులు మంగళప్రదముగ గానములు చేయుచుండిరి. వారకాంతలు కల్యాణమండపమున నృత్యము చేయుచుండిరి

౨-౩౪ అనంతరము వసిష్ఠుడు వచ్చి వేదవేత్తలతోఁ గ్రిక్కిరిసి యున్నట్టిదియు రత్నస్తంభములచే నలంకరింపఁ బడినట్టిదియుం నగు కల్యాణమండపమునకు రామలక్ష్మణభరతశత్రుఘ్నులను సమస్తవాద్యఘోషపూర్వకముగఁ దీసికొని వెళ్ళి యచ్చట సువర్ణకల్యాణ పీఠములయందు నూతనవరులనుఁ గూచుండ పెట్టెను.

౮-౨ అనంతరము వసిష్ఠుడు శతానందుని విశ్వామిత్రునిఁ దన సమీపమందుంచుకొని రామాదులచే గణాధిపతిపూజనుఁ బుణ్యాహవాచనమునుఁ జేయించెను.

౬ పరస్పరము నిరంతరసంసక్తులయిన సీతారాముల విషయమై కన్యావరణార్థము నల్వురు బ్రాహ్మణులు బయలుదేరిరి.

౭ కన్యావరణార్థము బయలుదేరిన బ్రాహ్మణోత్తములు నల్వురును జనకుని యొద్దకు వచ్చి యిటులఁ బలికిరి. మూల్లోకములకుఁ గల్యాణములను సమకూర్చువాడును సకలలోకపవిత్రమైన గోత్రమునందు జన్మించినవాడును సూర్యవంశమునుఁ బవిత్రము చేయువాడును మహావిష్ణుస్వరూపుడును తత్త్వాతీతుడు నగు శ్రీరామచంద్రమూర్తి కొఱకు సాక్షాల్లక్ష్మిరూపిణియగు సీతయను నీకన్యకనుఁ గోరుచుంటిమని యుచ్చైస్స్వరముతోఁ బలుకగా, జనకుడును సత్యసంకల్పులగు మీసంకల్పప్రకారమగుగాక యని తిరిగి బదులుచెప్పగా నాబ్రా

స్సత్యసంకల్పానాం భవతాం సంకల్ప స్తథా స్త్వితి ప్రత్యు
క్తై స్తై రేవ కృతార్థా వయ మి త్యావేదితం॥ ౭

1 జితంత ఇతి మంత్రేణ రాఘవస్య కరే తదా
బబంధ కంకణం సద్యః వసిష్ఠో భగవా న్మునిః॥ ౮

జగత్కుటుంబినే ఽనంతబ్రహ్మాండేశాయ మైథిలః
ప్రదదౌ రామచంద్రాయ స్స్వర్ణయజ్ఞోపవీతకం॥ ౯

ఆబ్రహ్మ స్తంబకీటేషు సూత్రభూతో బభూవ యః
సో ఽపి త్రివృత మాపేదే చిత్రం యజ్ఞోపవీతకం॥ ౧౦

తతః ప్రతద్విష్ణు రతీరయ న్మనుం ప్రక్షాళ్య పాదౌ తు రఘూ
త్తమస్య, వితీర్య తస్మై మధుపర్క మార్ఘ్యో ఽహతం తు
పశ్చా త్ప్రదదౌ సుచేలం॥ ౧౧

మాయాజవనికామధ్యగతా న్సర్వా న్కరోతి యః
తస్యా ఽపి కల్పితా చిత్రం తదా యవనికా విభోః॥ ౧౨

అథోపయామోచితభూషణాఢ్యా మానీయ సీతా ముప
వేశ్య రాజా, జగాద రామం మిథిలాధిప స్తు కల్యాణపీఠే వర
సమ్ముఖే సః॥ ౧౩

కన్యాం సుశీలసంపన్నాం కనకాభరణోజ్జ్వలాం
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా॥ ౧౪

1 కవిః.

హ్మణోత్తములు నల్వురను కృతార్థులమై మేము వచ్చితిమని తిరిగి పెండ్లికొమరునివారితో జెప్పిరి.

౮ అనంతరము వసిష్ఠుడు "జితంతే" అను మంత్రముచేతను రాముని హస్తమునందుఁ గంకణమునుఁ గట్టెను.

౯ అనంతరము జనకమహారాజు లోకకుటుంబియును ననంతబ్రహ్మాండనాయకుడునగు శ్రీరామచంద్రునకు సువర్ణయజ్ఞోపవీతము నిచ్చెను.

౧౦ ఏమహనీయుడు బ్రహ్మాదిస్తంబపర్యంతమగు జగత్తునందు మాత్రప్రాయుడై యుండెనో యతడుకూడ యజ్ఞసూత్రమును (యజ్ఞోపవీతమును) బొందెను.

౧౧ పిమ్మట జనకుడు "ప్రతద్విష్ణుః" అను మంత్రముచే రాముని పాదప్రక్షాళనము చేసి మధుపర్కప్రాశనము చేయించి యనంతరము చింపని సువర్ణవస్త్రయుగ్మమును రామునకు సమర్పించెను.

౧౨ ఎవడు ప్రజలనందఱనుఁ దనమాయ యను తెరలో నుండునట్లు చేయునో యతనికిఁగూడఁ దెర కల్పింపఁబడినది. ఆశ్చర్యము (అనగాఁ దెరపట్టిరి).

౧౩ అనంతరము వివాహమునకుఁ దగినయలంకారములచే నొప్పుచున్న సీతాదేవిని జనకుడు లోపలనుండి తీసికొనివచ్చి కల్యాణపీఠమునందు రామున కెదురుగాఁ గూర్చుండఁబెట్టి జనకుడు రామచంద్రమూర్తితోఁ నిటులఁ బలికెను.

౧౪ ఓరామచంద్రా! సత్స్వభావము కలదియు, స్వర్ణాభరణములచే నొప్పుచున్నదియు నగు సీతను బ్రహ్మలోకప్రాప్తిరూపపరమపురుషార్థలాభమునకై శ్రీమహావిష్ణుస్వరూపుడవగు నీకు నే నిచ్చుచున్నాను గ్రహింపుము.

కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే
ప్రియతో ఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థసిద్ధయే॥ ౧౫

* ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥ ౧౬

పతివ్రతా మహాభాగా ఛాయే వానుగతా సదా
ధర్మప్రజాసంపదర్థ మేనా ముద్వహ రాఘవ॥
ఇత్యుక్త్వా సహిరణ్యాం తు కన్యాహస్తం విభోశ్శయే
సాక్షతోదకపూర్వం చ ప్రాక్షిప న్మైథిల స్తదా॥ ౧౭-౧౮
తతో గోభూమిముఖ్యాని మహాదానాని షోడశ
ప్రాదా ద్ద్విజేభ్యో జనకః ప్రీతయే పరమాత్మనః॥ ౧౯
అథోచ్చై ర్జగదు ర్విప్రాః మంగళాష్టక మద్భుతం॥ ౧౯½

శబ్దార్థా వివసంగతౌ తదపి తా వన్యోన్యసంవీక్షణే సోత్కంఠా
ప్రతిసీరికాంతరగతౌ శ్రీరాఘవౌ సస్మితం, తత్తన్మంత్ర
మిషా త్త్వరం ధ్రువ మితి న్యస్తే సజీరే గుడే తా వానంద
మవాపతా మవికలం వీక్షాభి రన్యోన్యతః॥ ౨౦-౨౦½

* ఏతస్మి న్శ్లోకే విశేషార్థబాహుళ్యా త్ప్రత్యేకగ్రంథ స్సం
ముద్రిత ఇ త్య త్రోపేక్షితం విశేషార్థప్రకటనమ్.

౧౫ పాతివ్రత్యాది గుణములచే నొప్పుచున్నదియును నలంకృతురాలునగు సీతయను కన్యను నీ కిచ్చుచున్నాను గ్రహింపుము. 'నా కేమి లాభ' మని యనెదవేమో నీకును నీమెవలన ధర్మకామార్థములు సిద్ధించును.

౧౬ * నాకొమరిత సీత ఇదిగో! నీకు సహధర్మచారిణిగా నుండును. ఈకన్యక నిచ్ఛయింపుము. నీకు శుభము కలుగుగాక! నీహస్తముచే నీమె హస్తమును పరిగ్రహింపుము.

౧౭-౧౮ ఈకన్యక పాతివ్రత్యాది గుణశాలినియును సదృష్టవతియును నీడవలె నిన్నెల్లప్పుడు ననుసరించునదియు నగును. ధర్మప్రజాసంపత్తి కొఱకీమెను వివాహము చేసికొనుము. ఇవ్విధముగ జనకుడు రాముని తోఁ జెప్పి హిరణ్యాక్షతోదకపూర్వకముగ సీతహస్తమును రాముని హస్తమునం దుంచెను.

౧౯ అనంతరము జనకమహారాజు గోదానము భూదానము సువర్ణదానము మొదలగు షోడశమహాదానములనుఁ జేసెను.

౧౯½ అనంతరము బ్రాహ్మణులు సుముహూర్తసమయము సంప్రాప్త మగుటతోడనే మంగళాష్టకమునుఁ బఠించుచుండిరి.

౨౦-౨౦½ సుముహూర్తము ప్రాప్తించుటతోడనే శబ్దార్థములవలె నెడతెగని సంబంధముకలవారలైనను బరస్పరము నొకరినొకరు చూచుకొనుటకుఁ దొందరపడుచు తెరచాటునున్న సీతారాములు చిఱునగవుతో "అరంధ్రువం" అను మంత్రమును బురోహితులు పఠించుటతోడనే జీలకర్ర బెల్లమును నొకరిశిరమునం దొకరుంచుకొని యొకరినొకరు చూచుకొని పరమానందము నొందిరి. పిదపఁ దెరను గూడఁ దీసివేసిరి.

---

* ఈశ్లోకమున విశేషార్థము లనంతములుగా నుండుటవలన ప్రత్యేక సంపుటముగా ముద్రింపఁబడునుగాన నిచ్చట విశేషార్థవివరణ ముపేక్షింపఁబడినది.

శ్రీరామచంద్రస్య తు దివ్యవిగ్రహం నిరీక్ష్య యాదృ ఙ్మద
మాప భూమిజా, తత్తన్మదం వర్ణయితుం తు కల్పశతావధా
నాల మహీశ్వరో ఽపి॥ ౨౧-౨౧½

శ్రీరామేణ సమో వర స్త్వవనిజాతుల్యా వధూ ర్యాతత్రే
వైదేహాజసుతౌ యథా ఽవనితలే సంబంధినౌ క్షత్రినః,
లభ్యైర స్తీతి నై ముదా సుమనసో భూదేవరూపాశ్రితాః
కల్యాణోత్సవ మీక్షితుం లఘు సమే త్యావేక్ష్య మోదం
గతాః॥ ౨౨-౨౨½

బ్రహ్మా తదుత్సవం దృష్ట్వా త్వష్టా ఽఽసీ న్నైవ మే ఽవసర
ఇతి చింతాం గత శ్శక్రం స్మృత్వా తత్ర ద్విజాకృతిః॥ ౨౩-౨౩½

తతో ఽపి చతురాధిక్యా త్తుతోష చ షడాననః॥
శివ స్తు దశనేత్రైస్తు నతృప్తి మగమ త్తదా
విషమాక్షీణి సౌమ్యాని కృత్వా ఽపశ్య త్తదీక్షణైః॥ ౨౪-౨౪½

ఇంద్ర స్తదుత్సవం దృష్ట్వా శాపం స్వై గౌతమస్య తు
సమీచీనం తు మన్వాన స్తుతోష బహుధా హృది॥ ౨౫

దేవస్త్రియ స్సమాగత్య ద్విజస్త్రీవేషసంయుతాః
గౌరీకల్యాణగీతాని జగుః కల్యాణమండపే॥ ౨౬

౨౦-౨౧౹ అప్పుడు శ్రీరామచంద్రుని దివ్యమంగళవిగ్రహమునుఁ జూచి సీత యెట్టిసంతోషము నొందెనో యామె సంతోషమును వర్ణించుటకు నూఱుకల్పములవఱకు నాదిశేషునకు గడువిచ్చినను వర్ణింపలేడని చెప్పుట యతిశయము కానేరదు.

౨౨-౨౨౹ శ్రీరామచంద్రమూర్తితో సమానుడగు వరుడును సీతాదేవితో సమానురాలగు వధువును జనకదశరథులతో సమానమగు వియ్యంకులును భూమియందు మన కెచ్చటఁ గన్పడుదురని దేవతలు వారలనుఁ జూచుటకు బ్రాహ్మణవేషముతో వచ్చి కల్యాణమండపమునందుఁ గూర్చుండి యా యుత్సవమునుఁ జూచి యానందించుచుండిరి.

౨౩-౨౩౹ బ్రాహ్మణవేషముతో వచ్చి యచ్చటనున్న బ్రహ్మదేవు డా యుత్సవమునుఁ జూచి చూచుటకు నా కెనిమిదికన్నులే యుండెనే దేవేంద్రునకు వెయ్యినేత్రము లుండుట వలన నతనికిఁ గన్నులపండువైనట్లు నాకు లేకపోయెఁగదా యని విచారపడెను.

౨౪-౨౫౹ బ్రహ్మకంటెఁ దనకు నాలుగునేత్రము లధికముగా నుండుటవలన నాఱుముఖములు కల కుమారస్వామి యాయుత్సవమునుఁ జూచి సంతోషించెను. పంచముఖుడగు శివుడు తన పదినేత్రములతోఁ జూచినందునకుఁ దృప్తినొందక విషమనేత్రముల నైదింటినిఁ గూడ సౌమ్యములుగాఁజేసి యా నేత్రములతోఁ గూడఁ గల్యాణమును జూచుచుండెను.

౨౬ ఇంద్రు డా యుత్సవమునుఁ జూచి గౌతమశాపమును సమీచీనమునుగాఁ దలచుచు మనస్సునం దనేకవిధములుగ సంతోషించుచుండెను (గౌతమశాపమువలననే యింద్రునకు వెయ్యికన్నులు ప్రాప్తించినవని యెఱుగునది).

౨౭ దేవతాస్త్రీలు బ్రాహ్మణముత్తైదువవేషములను ధరించి కల్యాణ మండపమునందు గౌరీకల్యాణపు పాటలనుఁ బాడుచుండిరి.

బ్రహ్మసృష్ట్యాదితో నూన మేతావ జ్జగతీతలే
ఏతాదృగనుకూలం తు దాంపత్యం న హి వీక్షితం॥
ఇతి భూదేవరూపా స్తే సంజజల్పు ర్మిథ స్సురాః॥ ౨౮-౨౮½

తతో గళే మంగళదేవతాయా బబంధ మాంగళ్యగుణం
రమేశః, స ఏవ లోకత్రితయస్య తావ దనంతకల్యాణగుణాయ
రేజే॥
౨౯-౨౯½

సమృధ్యతాం ప్రజాకామో మమే త్యుక్త్వా స రాఘవః
మౌక్తికారోపణం సద్య శ్చకా రావనిజోపరి॥ 30-30½

దేవ్యాః పాణిపయోజసంపుటగతా యే గుంజపుంజప్రభాః
ప్రక్షిప్తా హరిమ స్తకే సముచితే కుందప్రసూనత్విషః,
ప్రస్రస్తా ఘనదేహకాంతికలితా స్సాంద్రేంద్రనీలోజ్జ్వలా
భూయాంసు ర్జగతాం శుభాయ మణయ శ్శ్రీరామవైవా
హికాః॥
3౧-3౧½

'యోనైతా' మితి మంత్రేణ బ్రహ్మగ్రంథిం విధే స్సుతః॥
సీతారాఘవయో స్సద్య శ్చకార సహిరణ్యకం॥ 3౨-3౨½

ఊర్మిళాం చౌరసీం రాజా లక్ష్మణాయ దదా వథ॥
త థైవ మాండవీదేవీం శ్రుతకీర్తిం గుణోత్తరాం
భరతాయ దదా వేకాం శత్రుఘ్నా యాపరాం దదౌ॥ 33-3౪

వసిష్ఠస్య మతే స్థిత్వా చత్వార స్తే నృపాత్మజాః
అగ్నిం ప్రదక్షిణం చక్రు ర్గృహీత్వా కన్యకాశయాన్ ॥ 3౫

౨౮-౨౮½ బ్రహ్మసృష్టి మొదలుకొని యింతవరకు భూమియం దిట్టి యనుకూలదాంపత్యమునుఁ జూచి యుండలేదని బ్రాహ్మణవేషములతో వచ్చి యచ్చటనున్న దేవతలు పరస్పరము మాట్లాడుకొనుచుండిరి.

౨౯-౨౯½ అనంతరము మంగళ దేవతయగు సీతయొక్క కంఠమునందు రామచంద్రమూర్తి మంగళసూత్రమునుఁ గట్టెను. ఆమాంగళ్యమే ముల్లోకముల కనంత కల్యాణములను గలుగఁజేయ సమర్థమై యొప్పుచుండెను.

౩౦-౩౦½ పిమ్మట "ప్రజాకామో మే సమృధ్యతాం" అను మంత్రమును రామచంద్రమూర్తి చెప్పుచు సీతశిరమునందు ముత్తెములను తలబ్రాలనుగా బోయుచుండెను.

౩౧-౩౧½ తలఁబ్రాలుగాఁ బోయుచున్న యాముత్తెములు మొదట సీత దోసిలిలో నున్నప్పుడు గురివిందగింజల కాంతితో నొప్పుచుఁ బిమ్మట రామచంద్రమూర్తి శిరమునం దుంచఁబడినప్పుడు మల్లెపూల శోభ కలిగి రాముని శరీరమునందు జారి పడినప్పుడు నల్లని శరీరచ్ఛాయతోఁగలిసినందున నింద్రనీలమణులవలె నొప్పుచుండిన సీతారాముల వివాహమహోత్సవమునందలి తలబ్రాలయిన యాముత్తెములు లోకకల్యాణము నొనఁగూర్చుగాత!

౩౨-౩౨½ పిమ్మట బ్రహ్మపుత్రుఁడగు వసిష్ఠుడు "యోవైతాం" అను మంత్రముచే సీతారాములకు సహిరణ్యకముగ బ్రహ్మముడులను వేసెను.

౩౩-౩౪ అనంతరము జనకమహారాజు తన యౌరసపుత్రికయగు నూర్మిళను లక్ష్మణునకును మాండవీ శ్రుతకీర్తులను తన సోదరపుత్రికలను భరతశత్రుఘ్నులకు నిచ్చి యథావిధిగాఁ గన్యాదానములను జేసెను.

౩౫ పిమ్మట వసిష్ఠుని యనుమతిచే నల్వురు రాజపుత్రులు తమ తమ నూతనవధువుల చేతులనుఁ బట్టుకొని యగ్నులకుఁ బ్రదక్షిణము చేసిరి.

ఏవం విశ్వజనీనవిభ్రమపదే సీతోపయామాభిధే కల్యాణే వితతే నభ స్యపి ముదా జాతో మహా నుత్సవః, నేదు ర్దుందుభయో ననర్తు రభితో దివ్యా స్తు వారాంగనా గంధర్వాః ప్రజగుః కలం సుమచయాసారస్సమంతాదభూత్॥ ౩౬

మార్తాండో రురుచే హవి ర్హుతవహో ధత్తే విధూమ ప్రభః పాటీరాచలకందరా త్పరివహో మందానిల శ్శీతలః, భూమి స్సస్యవతీ నిరీతి రభవ త్కాష్ఠా స్తథా నిర్మలాః పుష్పిణ్యో లలితాలతా శ్చ తరవ స్సద్యః ఫలై స్సన్నతాః॥ ౩౭

సీతాకల్యాణ మాధ్వీం నయనమధుకరై స్సాశ మాపీయ పౌరా స్తత్రిత్యాః పార్థివేంద్రా వివశితహృదయా విస్మృతాత్మీయకృత్యాః। భూపా రత్నోజ్జ్వలశ్రీవిరచితసురరాట్చాపభారా స్సభాయాం తత్ర న్యస్తా బభూవుః కనకమణికృతాః పుత్రికావ త్ప్రశస్తాః॥ ౩౮

నాకుండలీ నామణికంకణో వా నాపరిస్ఫుర న్మౌక్తికరమ్యహారః, సౌవర్ణచీనాంబరవర్జితో వా బభూవ తత్రత్యజనేషు కశ్చిత్॥ ౩౯

అన్యోన్యదృష్టా వన్యోన్యాశయసంగ్రహణే తథా
మిథ శ్శరీర పులకే ముక్తారోపణకర్మణి॥
ఊహాపోహేచ వలయోద్ధరణే పాణిపీడనే
త్యక్త్వాలజ్జాంకృతాన్యోన్యవధూవరకృతి స్తదా॥
ముదితాభి ర్నుతా చాసీ త్తత్పాణిగ్రహణోత్సవే॥ ౪౦-౪౧.౫

౩౬ ఈప్రకారముగ సీతాకల్యాణమహోత్సవ మిచ్చట జరుగుచుండగా నాకాశమునందును గొప్ప మహోత్సవము జరిగెను. దుందుభులను దేవతలు మ్రోయించుచుండిరి. అప్సరస్స్త్రీలు నృత్యములఁ జేయుచుండిరి. గంధర్వులు మధురముగ గానములఁ జేయుచుండిరి. పుష్పవర్షమునుఁ బైనుండి గురిపించుచుండిరి.

౩౭ సీతారాముల కల్యాణమహోత్సవ సమయమున సూర్యుడు మిక్కిలి ప్రకాశించెను. అగ్నులు ధూమరహితములై ప్రజ్వరిల్లుచు నాజ్యాది హవిస్సులను గ్రహించుచుండెను. మలయమారుతము చక్కగ వీచుచుండెను భూమి సస్యసమృద్ధికలిగి యీతిబాధలు లేనిదయ్యెను. దిక్కులన్నియు నిర్మలములై యుండెను. లతలు పుష్పించెను. వృక్షములు ఫలించెను.

౩౮ పురజనులును, నింద్రధనుస్సులవలె ప్రకాశించుచున్న నానా రత్నభూషణములచే నొప్పుచున్న రాజోత్తములును, సీతాకల్యాణమహోత్సవ మను మకరందమును తమ నేత్రములనే తుమ్మెదలచేతను నాశకొలది త్రాగి దేహస్మృతి తెలియనివారలై బంగరపు బొమ్మలవలె నిశ్చేష్టులై యచ్చట నుండిరి.

౩౯ ఆసభలోనున్న వారిలో నొక్కడుకాని కుండలములు లేనివాడును, మణికంకణములు లేనివాడును, ప్రకాశించుచున్న ముత్యాలహారము లేనివాడును, సువర్ణాంచలములు కల చీనాంబరములను ధరించని వాడును లే డని చెప్పవచ్చును

౪౦-౪౧ పరస్పరము నొకరినొకరు చూచుటలోఁగాని, యొకరిచేతి నొకరు పట్టుకొనుటలోఁగాని, పరస్పరము శరీరము గగుర్పాటు చెందుటలోఁగాని, తలబ్రాలనుఁ బోసికొనుటలోఁగాని, యూహాపోహలలోఁగాని, కమ్మకడియములనుఁ బైకి యెత్తుటలోఁగాని, చెయ్యి పట్టుకొన్నట్టుపట్టుకొని చేతులను నలుపుటలోఁగాని, సిగ్గు విడిచి యొకరికొకరు తీసిపోని సీతారాముల కృత్యములను నచ్చట స్త్రీలందఱును నా వివాహోత్సవమునఁ గొనియాడుచుండిరి.

రత్నాని దివ్యాని బహూని దత్వా రామాయ వస్త్రా
ణ్యతిశోభనాని, హ స్త్యశ్వదాసా నపి మైథిల స్తు దాసీజనాం
శ్చ ప్రదదౌ ధనం చ॥ ౪౨-౪౨½

అథ రాజా దశరథ స్సదస్యా న్బ్రాహ్మణా న్బహూ॥
మానయామాస బహుధా స్వర్ణరత్నాంబరాదిభిః॥ ౪౩-౪౩½

జటాఘనక్రమపదై స్సామభి శ్చ ద్విజా స్తతః॥
నవ్యా న్వధూవరా నుచ్చై రాశీర్భి స్త్వభ్యనందయన్॥
౪౪-౪౪½

అథ సర్వా న్నృపా న్విప్రా న్బంధూ న్సంబంధిన స్తతః॥
మానయామాస బహుధా వైదేహ శ్చాంబరాదిభిః॥
౪౫-౪౫½

వధూవరా న్మైథిలభూపతి స్తు రథం సమారోప్య సువాద్య
ఘోషైః, విశ్రాంతిగేహం బహుమంగళై శ్చ ప్రవేశయా
మాస ముదా తదానీం॥ ౪౬-౪౬½

తత స్సర్వే సుమనస స్సీతాకల్యాణవైభవం॥
స్మరంత స్సంస్మరంత స్తౌ సీతారామౌ వగు ర్ముదా॥
౪౭-౪౭½

ఇతి సూతముఖే నోక్తరామకల్యాణవైభవం॥
శ్రుత్వా ద్విజా శ్శౌనకాద్యా ముదితా స్సూత మబ్రువన్॥
౪౮-౪౮½

౮౨-౮౨॥ అప్పుడు జనకమహారాజు రామచంద్రమూర్తికి ననేకములగు దివ్యమైన రత్నములను, గొప్పవిలువకల చీనాంబరములను, ఏనుగులను, గుఱ్ఱములను, దాసదాసీజనులను, ధనమును విశేషముగా నిచ్చెను.

౮౩-౮౩॥ అనంతరము దశరథమహారాజు సభలోని బ్రాహ్మణుల నందఱను సువర్ణరత్నాంబరాదులచే ననేకవిధములగ సన్మానించెను.

౮౪-౮౪॥ పిమ్మట బ్రాహ్మణోత్తములు వదక్రిమజటాఘనలచేతను సామములచేతను నూతన వధూవరులను నాశీర్వదించిరి.

౮౫-౮౫॥ అనంతరము జనకుడు బ్రాహ్మణులను రాజులను బంధువులను సంబంధికులను దివ్యవస్త్రములచేఁ దగునటుల సన్మానించెను.

౮౬-౮౬॥ జనకమహారాజు వాద్యఘోష పూర్వకముగ వధూవరులను రథారూఢులనుగాఁజేసి యూరేగింపుతో మంగళద్రవ్యములతో విడిది గృహములలో బ్రవేశ పెట్టెను.

౮౭-౮౭॥ అనంతరము దేవతలందఱు సీతారాముల కల్యాణవైభవమును స్మరించుచు సీతారాములను తమ హృదయములయందు సంస్మరించుచు దమతమ తావుల కేగిరి.

౮౮-౮౮॥ ఈప్రకారము సీతారాములకల్యాణమహోత్సవమును సూతుడు చెప్పగా శౌనకాదిమునులు విని తిరిగి సూతునితో నివ్విధముగఁ బలికిరి.

పౌరాణి కోర్మిళాదేవీమాండవీశ్రుతకీర్తయః॥
కా వా వద పురా సూత ! తత్పూర్వచరితం శుభం
శ్రోతుకామా వయం సర్వే కృపయా వద న స్త్వరం॥
౪౯-౫౦

ఇతి ద్విజై స్సమాపృష్టః ప్రాహ తా న్రోమహర్షణః
పురైకదా భార్గవీ య త్ప్రాహ వాసంతికాం సఖీం॥
తద్వచ్మి విప్రా శ్శృణుత సావధానా స్తు తద్వచః॥ ౫౧-౫౧½

అయం మమ పతి శ్శ్రీమా న్శేషేణ చ దరేణ చ॥
సుదర్శనే నాయోధ్యాయాం గృహే దశరథస్య చ
రామలక్ష్మణశత్రుఘ్నభరతా ఇతి సంజ్ఞయా॥
అహం కన్యా భవిష్యామి జనకస్య మహీతలాత్
శేషశక్తి స్తూర్మిళా చ ఔరసీ జనకస్య చ॥
పత్నీ తు పాంచజన్యస్య మాండ వీతి ప్రకీర్తితా
శ్రుతకీర్తి స్తు చక్రస్య కుశధ్వజసుతే ఇమే॥
ఉత్పత్స్యంతే మహాభాగే విమలే ప్రస్తుతే జనైః॥ ౫౨-౫౫½

౪౯-౫౦ ఓ పౌరాణికోత్తమా! సీతాజన్మవృత్తాంతమును నీవు పూర్వము చెప్పియుంటివి కాని యూర్మిళా మాండవీ శ్రుతకీర్తులు ఎవరో వారి పూర్వచరిత్రము లెట్టివో విన కుతూహలముగా నుండుటవలన మాకు వారలపూర్వజన్మవృత్తాంతమును వినిపింపు మని యడిగిరి.

౫౧-౫౧½ ఇవ్విధముగ శౌనకాదులచే నడుగఁబడినవాఁడై సూతుడు వారలతో నివ్విధముగఁ బలికెను. ఓమునులారా! పూర్వ మొకప్పుడు లక్ష్మీదేవి తన సఖురాలగు వాసంతికతోఁ జెప్పినవిషయమును మీకుఁ జెప్పెదను సావధానులరై వినుడనియెను.

౫౨-౫౫½ (లక్ష్మీదేవి వాసంతిక యను సఖురాలకుఁ జెప్పిన విషయమే చెప్పబడుచున్నది) ఓవాసంతికా! ఓసఖి! నాభర్తయగు విష్ణుమూర్తి తన పాన్పయిన యాదిశేషునితోడను, పాంచజన్యమను శంఖముతోడను, సుదర్శన మను చక్రముతోడను నయోధ్యయందు దశరథుని గృహమునందు రామలక్ష్మణభరతశత్రుఘ్నులను సంజ్ఞతో నుద్భవింపఁగలడు. నేనును భూమియందు జనకుని గృహమునందు సీతయను పేరుతో నొప్పుచుండెదను. శేషుని భార్య జనకుని యౌరస పుత్రికయై యూర్మిళయనుపేరుతో నొప్పుచుండును. శంఖము యొక్క భార్యయును జనకుని సోదరుడగు కుశధ్వజునకుఁ బుత్రికగాఁ బుట్టి మాండవియను పేరుతో నొప్పుచుండును. చక్రము యొక్క భార్యయు కుశధ్వజునకే పుత్రికగా జనించి శ్రుతకీర్తియను పేర బరగును. ఈమాండవీశ్రుతకీర్తులు జనులచేఁ గొనియాడఁదగిన నిమివంశమునఁ గుశధ్వజుని కొమరితలై పుట్టఁగలరు. (అని పూర్వము వాసంతికతో లక్ష్మీదేవి చెప్పెను). శంఖచక్రములకు భార్యలనగాఁ దదధిదేవతల భార్య లని యర్థము).

ఇతి సూతముఖే నోక్తం తత్పూర్వచరితం శుభం॥
ద్విజా శ్శ్రుత్వా ముముదిరే బ్రహ్మానందగతా యథా॥
౫౬-౫౭

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ఏకోనవింశస్సర్గ స్సమాప్తః.



## వింశస్సర్గ ప్రారంభః

[1] అథ రాజా విదేహానాం దదౌ కన్యాధనం బహు
గవాం శతసహస్రాణి బహూని మిథిలేశ్వరః॥
కంబళాని చ ముఖ్యాని క్షౌమకోట్యంబరాణి చ
హస్త్యశ్వరథపాదాతం దివ్యరూపం స్వలంకృతం॥
దదౌ కన్యాపితా తాసాం దాసీదాస మనుత్తమం
హిరణ్యస్య సువర్ణస్య ముక్తానాం విద్రుమస్య చ॥
* దదౌ పరమసంహృష్టః కన్యాధన మనుత్తమం॥ ౧-౩౪

* అనేన వివాహానంతరం కన్యాపితా కన్యాయై గవాశ్వాది బహుధనం దేయ మిత్యుక్తం. తథా చాదిపర్వణి ద్రౌపదీ వివాహే యాతకం- కృతే వివాహే ద్రుపదో ధనం దదౌ మహారథేభ్యో బహురూప ముత్తమ మితి. సుభద్రా వివాహే- తేషాం దదౌ హృషీకేశః కన్యార్థే ధనముత్తమ మితి.

1. వాల్మీకిరామాయణమ్.

౫౬-౫౬౺ ఈప్రకారముగ సూతుడు చెప్పిన వారల పూర్వజన్మచరిత్రను శౌనకాదులు విని బ్రహ్మానందమునుఁ బొందినవారివలె సంతోషించిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమునఁ బందొమ్మిదవసర్గము సమాప్తము.



ఇరువదియవసర్గ ప్రారంభము

౧-౩౺ అనంతరము జనకమహారాజు తన పుత్రికలకు ధనమును విశేషముగ నిచ్చెను. మఱియు ననేకలక్షల గోవులను ముఖ్యమైన రత్నకంబళములను, పట్టుచీరెలను, గజతురగరథపదాతులను, సుందరులును శ్రేష్ఠులునైన దాసదాసీజనులను, హిరణ్యమును, మంచిముత్తెములను, బగడములను సంతోషముతో జనకుడు *కన్యాధనమునుగాఁ దన పుత్రికల కిచ్చెను.

---

* కన్యాధనము నిచ్చెనని చెప్పుటచేత కన్యాదాత కన్యకకు గవాశ్వాది రూపమగు బహుధనము నీయవలయునని సూచింపఁబడుచున్నది. ఆప్రకారమే భారతములో నాదిపర్వమున ద్రౌపదీవివాహమునఁ జెప్పఁబడినది. ద్రుపదరాజు వివాహముచేసి మహారథికులగు ధర్మరాజాదులకు బహువిధముగా ధనము నిచ్చెనని (యున్నది). సుభద్రావివాహసందర్భమునఁగూడ నిటులనే చెప్పఁబడియున్నది. "కృష్ణుడు శ్రేష్ఠమయిన కన్యాధనము నిచ్చె"నని.

తతో దశరథః ప్రాహ వచనం కౌశికం ప్రతి॥
1 మృదుకేశతతి ర్గ్రంధే నాఽగచ్ఛ త్యనయో ర్యదా
తదాత్మజౌ మే నీత్వా త్వం సర్వశిక్షా స్త్వశిక్షయః॥
తాటకాదీ న్మారయిత్వా స్తై ర్దేహేన సమం మమ
బాంధవం కల్పయం శ్చాసి త్వత్కృతేః కిం కరో మ్యహం॥
సహస్రవందనేభ్యో ఽహం పరం కర్తుం న హి క్షమః॥ ౪-౬½

అయోధ్యా మపి చాగత్య ప్రవేశం కారయే త్యహం॥
ప్రార్థయే త్వాం మునే గాధిపుత్రరత్న! నమో ఽస్తు తే॥ ౭-౭½

ఇత్యర్థితః కౌశికో ఽపి తథే త్యంగీచకార సః॥ ౮

తతో దశరథ శ్చాపి స్నుషాజాయాత్మజాదిభిః
ప్రయాణం కృతవా నాప్తజా సాకేతం బంధుభి స్సహ॥ ౯
సీతాద్యా నిర్గతా ముగ్ధా స్సాశ్రునేత్రా స్సువిహ్వలాః
సాంత్వయిత్వా సుమేధాద్యా రాజపత్న్య స్తదా పునః॥
శిక్షయిత్వాగ్రయామాసుస్సుతాశ్శ్వశ్రూజనస్యతు॥ ౧౦-౧౦½
తదా దశరథం ప్రాహ జనక స్సాశ్రులోచనః॥
శ్వస న్కవోష్ణమానాస్యో విరహో ద్గద్గదాక్షరః
ఏతావత్కాలపర్యంతం సీతాద్యా లాలితా మయా॥
అధునా త్వ మిమా స్స్వగే లాలయస్వ కృపేక్షణైః
ఇత్యుక్త్వా నృపతిం నత్వా స్వగేహం జనకో యయౌ॥ ౧౧-౧౩

1 కవిః.

౪-౬½ అనంతరము దశరథుఁడు విశ్వామిత్రునిగూర్చి యిటులఁ బలికెను. ఓవిశ్వామిత్రమహామునీ ! నాకుమారులగు రామలక్ష్మణులకు మృదువైనవెంట్రుకలు ముడికిరానికాలమునందు (అనగా నతిబాల్యమున) నీవు వారలను దీసికొనివెళ్లి సమస్త మంత్రరహస్యములను నేర్పితివి. ఇంతియేకాక తాటకా సుబాహు మొదలగు రాక్షసులను వధింపఁ జేసితివి. ఇదియునుంగాక జనకచక్రవర్తితో సంబంధబాంధవ్యములను నాకుఁ గలుగఁజేసితివి. నీవు చేసినదానికి నేను ప్రత్యుపకారము నేమి చేయఁగలను ? నీకు సహస్రవందనముల నర్పించుటకంటె నేను వేఱొండుచేయ నసమర్థుడను.

౭-౭½ ఓవిశ్వామిత్రమహర్షీ ! నీ వయోధ్యకుఁగూడ వచ్చి గృహప్రవేశమునుఁగూడఁ జేయించి వెళ్లుమని ప్రార్థించుచున్నాను. నీకు నమస్కారము (అని దశరథుఁడు పలికెను).

౮ విశ్వామిత్రుఁడును దశరథునిచే నిట్లు ప్రార్థింపఁబడి యటులనే వచ్చెదనని యంగీకరించెను.

౯ అనంతరము దశరథుఁడును తన భార్యాపుత్రులతోడను నూతనవధువులతోడను బంధుపరివారముతోడను నయోధ్యకు బయలువెడలెను.

౧౦-౧౦½ కన్నులవెంట నీరు విడుచుచు మిక్కిలి కష్టముతో బయలుదేరిన తమ పుత్రికలను సుమేధ మొదలగు జనకపత్నులు లాలనచేయుచు నీతులను జెప్పి కౌసల్యమొదలగు దశరథపత్నుల కప్పగించిరి.

౧౧-౧౩ అప్పుడు జనకుడు కన్నీరుతోఁగూడిన నేత్రములుకలవాడై నిట్టూర్పు విడుచుచుఁ బుత్రికావియోగమువలనఁ గలిగిన గద్గదస్వరముతో దశరథునితో నిటులఁ బలికెను. ఓరాజా ! ఇంతపర్యంతము సీత మొదలగు బాలికలను నేను గారాబముగాఁ బెంచితిని. ఇప్పటి నుండి నీ కప్పగించితిని. నీవుకూడఁ గృపారసముతో నాబాలికలను లాలన చేయుచుండవలయును. అని చెప్పి దశరథునకు నమస్కరించి తదానతిచేఁ దన గృహమున కేగెను.

అథ గచ్ఛతి శ్రీరామే మైథిలా ద్యోజనత్రయం
నిమిత్తా న్యతిఘోరాణి దదర్శ నృపస త్తమః॥
తదా దశరథః ప్రాహ వసిష్ఠం తు భయాన్వితః
కి మిదం హృదయోత్కంపి మనో మమ విషీదతి॥
ఇతి రాజ్ఞా సమాపృష్టః కౌశికో ఽ ప్యాహ తం నృపం॥
౧౪-౧౫

ఉపస్థితం భయం ఘోరం మృగాః ప్రశమయ న్తి తే॥
సంతాప స్త్యజ్యతాం రాజ న్విజయ స్సంభవిష్యతి॥౧౬-౧౬

తేషాం సంవదతాం తత్ర వాయుః ప్రాదుర్బభూవ హి॥
కంపయ న్మేదినీం సర్వాం పాతయం శ్చ ద్రుమా న్బహూన్॥
౧౭-౧౭

తమసా సంవృత స్సూర్యః సర్వా నప్రబభు ర్దిశః॥
భస్మనాచావృతం సర్వం సంమూఢమివ తద్బలం॥ ౧౮-౧౮

వసిష్ఠో మునయ శ్చాన్యే రాజా చ ససుత స్తదా॥
ససంజ్ఞా ఇవ తత్రా ఽస న్సర్వ మన్య ద్విచేతనం॥ ౧౯-౧౯

జ్వల న్త మివ తేజోభి ర్జటామండలధారిణం॥
స్కంధే చాసజ్య పరశుం ధను ర్విద్యుద్గణోపమం
ప్రగృహ్యా శరముఖ్యం చ త్రిపురఘ్నం యథా హరం॥
సమాయాంతం జామదగ్న్యం నిరీ క్ష్యాహు ర్మిథోజనాః॥
౨౦-౨౧

౧౪–౧౫॥ అనంతరము శ్రీరామచంద్రమూర్తి సకుటుంబ సపరివారముగ మిథిలనుండి బయలుదేరి యయోధ్యకు వెళ్లుచుండగా మూడామడల దూరము వెళ్లినపిదప మిక్కిలి ఘోరమైన దుశ్శకునములు కలుగగా దశరథుఁడు ఆదుశ్శకునములనుఁ జూచి భయపడి వసిష్ఠునితో నిటులఁ బలికెను. ఓగురువర్యా! నాహృదయమునుఁ గంపింపఁజేయునట్లు దుశ్శకునములు కలుగుచున్నవేమి? నామనస్సు కడు విషాదము నొందుచున్నది కారణమేమి? అని దశరథు డడుగగా వసిష్ఠు డివ్విధముగ దశరథుఁతోఁ జెప్పెను.

౧౬–౧౬॥ ఓరాజా! భయము కలుగనున్నది, కాని మృగములు ప్రదక్షిణముగా సంచరించుటవలన శుభమే కలుగును.• సంతాపమును విడువుము. విజయము సంభవించును (అని వసిష్ఠుడు చెప్పెను).

౧౭–౧౭॥ వసిష్ఠ దశరథులు పైవిధముగ మాట్లాడుచున్నంతలో భూమి యంతయు కంపించునట్లును వృక్షములన్నియు పడునట్లును గొప్ప సుడిగాలి బయలు దేరెను.

౧౮–౧౮॥ మఱియు సూర్యుడు తమస్సుచే నావరింపఁబడెను. దిక్కులన్నియు ప్రకాశహీనము లయ్యెను. సమస్తసైన్యము ధూళిచేఁ గప్పఁబడి జ్ఞానహీనమై యుండెను.

౧౯–౧౯॥ వసిష్ఠుడును నితరమునులును దశరథుడును దశరథపుత్రులును నా సుడిగాలిలోఁ దెలివితో నుండిరికాని యితరులందఱును చైతన్యహీనులై యుండిరి.

౨౦–౨౦॥ తేజస్సులచేఁ బ్రజ్వరిల్లుచున్నట్టియు, జడలను ధరించినట్టియు, బుజముమీదను గండ్రగొడ్డలినిఁ జేతులయందు మెరుపువలెఁ బ్రకాశించుచున్న ధనువును శ్రేష్ఠమైన బాణమునుఁ బెట్టుకొని వచ్చుచున్నట్టియు, త్రిపురసంహారకుడగు శివునివలె నున్నట్టి పరశురామునిఁ జూచి యచ్చటిజనులు పరస్పరముగ నిట్లు చెప్పకొనిరి.

కార్తవీర్యస్య బాహూనాం వనం చిచ్ఛేద యో మునిః॥
త్రిస్సప్తకృత్వో భూమ్యాం నైప్పార్థివా న్నిజఘాన యః
క్షత్రియాణాం వధాద్యేన భూమే ర్భారో ఽవతారితః॥
భూమి ర్యే నాఖిలా దత్తా కశ్యపాయ మహాత్మనే
స ఏవ జామదగ్న్యాఖ్యః ప్రాదుర్భూతో ఽద్య కిం భవేత్॥
ఇతి సర్వే జనా భీతా వినా చేష్టా స్థిసితా స్తదా॥ ౨౨-౨౮॥

కుర్వ న్నో్క్‌ష్పా దుదంచిదప్రివికిరణనటాపాటలై ర్దృష్టిపాతై
రద్యా ఽపి క్షత్రకంఠచ్యుతరుధిరసరిత్సిక్తధారం కుఠారం
తీవ్రై ర్నిశ్వాసపాతైః పునరపిభువనోత్పాత మాసూచయద్భి
ర్గర్జ న్మౌర్వీకచాప స్త్రిభువనవిజయీ జామదగ్న్య స్సమేతి॥
ఇ త్యుక్త్వా భయసంత్రస్తో రాజా దశరథ స్తదా॥
అఘ్ర్యాదిపూజాం విస్మృత్య త్రాహి త్రాహీతి చాబ్రవీత్॥
౨౫-౨౬॥

స్త్రీషు ప్రవీరజననీ జననీ తవైవ దేవీ స్వయం భగవతీ
గిరిజా ఽపి యస్యై, త్వద్దోర్ద్వశీకృతవిశాఖముఖావలోక
వ్రీడావిదీర్ణహృదయా స్పృహయాం చకార॥ ౨౭-౨౮॥

దండవ త్ప్రణిప త్యాహ పుత్రప్రాణా న్ప్రయచ్ఛ మే॥
ఇతి బ్రువన్తం రాజాన మనాదృత్య రఘూత్తమం
రాఘవాభిముఖో రామ స్సమాయా తో్క్రధమూర్ఛితః॥
౨౯-౩౦

౨౨-౨౪॥ ఏమహాత్ముడు కార్తవీర్యార్జునుని సహస్రబాహువులను నరణ్యమును ఛేదించెనో, ఏమహనీయుడు ఇరువదియొకమారు భూమినంతను దిరిగి వెదకి వెదకి దుష్టక్షత్రియులను సంహరించెనో, ఏమహాత్ముడు దుష్టసంహారమునుజేసి భూభారమునుఁ దొలగించెనో, ఏమహామహుడు భూమినంతనుఁ గశ్యపునకు దానముచేసెనో యమ్మహనీయుఁడైన పరశురాముఁడు వచ్చుచుండెను ఇప్పు డిక నేమి జరుగనున్నదో యని జనులందఱును భయపడుచుఁ జేష్టల నుడిగి యుండిరి.

౨౫-౨౬॥ పరశురాముఁడు కోపముచేత సూర్యకిరణములవలె నెఱ్ఱనైన దృష్టిప్రసారములచేతను తన గండ్రగొడ్డలిని నిప్పటికిని క్షత్రియ కంఠములఁ దెగనఱకుటవలన స్రవించుచున్న రక్తధారలచేఁ దడుపఁబడిన యంచులుకలదియో యనునట్లు చేయుచుఁ దిరిగి లోకోపద్రవమును సూచించు తీవ్రమైన నిట్టూర్పుల విడుచుచు ధనుష్టంకారమునుఁ జేయుచు వచ్చుచుండెను. అని చెప్పుచు దశరథుడు భయపడి యర్ఘ్యాదిపూజనుఁగూడ మరచి రక్షింపు రక్షింపు మని పరశురామునితోఁ బలికెను.

౨౭-౨౮॥ మఱియు దశరథుడు పరశురాముని నిటుల స్తుతించెను ఓభార్గవా! పూర్వము నీవును కుమారస్వామియును శివునియొద్ద ధనుర్విద్యాభ్యాసము చేసినపుడు మీయిర్వురకుఁ దగవు వచ్చి యెవరుగొప్పవారో తేల్చుకొనుటకు మీర లిర్వురును కొట్లాడగాఁ గుమారస్వామి యోడిపోయినపుడు తన పుత్త్రుని ముఖమునుఁజూచి సిగ్గుపడి పార్వతీదేవి నీతల్లిని స్త్రీలలో వీరమాతనుగా గొనియాడెను (కుమారస్వామి వంటివానిని నీవు జయించినవాడ వని భావము).

౨౯-౩౦ పిమ్మట సాష్టాంగనమస్కారము చేసి పుత్రభిక్షనుఁ బెట్టుమని చెప్పుచున్న దశరథుని లక్ష్యముచేయక పరశురాముడు రామాభిముఖుడై కోపముతో వచ్చుచుండెను.

తదా దశరథం భీతం నిశ్చేష్టం బ్రాహ్మణ స్సుతః
మిథః ప్రోవాచ భగవా న్వసిష్ఠ స్తపతాంవరః॥ 30

భవతా నృప! రామార్థే న కార్యం దుఃఖ ము ణ్వపి!
పిత్రా వా మాతృభి ర్వా ఽపి అన్యై ర్భృత్యజనై రపి 3౧

అయం వా నృప! తే రామ స్సాక్షా ద్విష్ణు స్సు తే గృహే
జగతః పాలనార్థాయ జన్మ ప్రాప్తో న సంశయః॥ 3౨

యస్య సంకీర్త్య నామా ఽపి భవభీతిః ప్రశామ్యతి
స్వయంమూర్తం బ్రహ్మ నృప! భయాదే స్తత్ర కా కథా॥33

యత్ర సంకీర్త్యతే రామకథామాత్ర మపి ప్రభో!
నోపసర్గభయం తత్ర నాకాలమరణం నృణాం॥ 3౪

తచ్ఛ్రుత్వా వచనం రాజా ప్రాహేదం వచనం శనైః
ధైర్యాయ మే వసిష్ఠ! త్వ మర్థవాదా న్బ్రవీ ష్యహో॥
బాలస్య స్తవనే నాలం ధాత్రీభూతస్య తే గురో! 3౫-3౫౪

ఇత్యుచ్యమానే గురుణా భార్గవో ఽప్యాగతో ఽంతికం॥
రాఘవం ప్రాహ వచనంభీషయ న్నివ తం ముహుః॥3౬-3౬౪

రేరే క్షత్రకులాధమ! ప్రకటితం బ్రాహ్మణ్య మస్త్రేణ తే
వ న్యేకాం రజనీచరీం త్వ మవధీః మాతా న మే తాటకా,

౩౦ ఆసమయమున భయపడి నిశ్చేష్టుఁడైయున్న దశరథునితో రహస్యముగ బ్రహ్మపుత్త్రుడైన వసిష్ఠు డివ్విధముగఁ బలికెను.

౩౧ ఓరాజా! తండ్రియైన నీవుకాని తల్లులుకాని యితరులుకాని రాముని విషయమై యణుమాత్ర మయినను దుఃఖింప నవసరములేదు.

౩౨ ఓరాజా! సాక్షా ద్విష్ణుమూర్తియే జగత్పరిపాలనార్థమై నీగృహము నందు రాముడుగా నవతరించెను. సందియము లేదు.

౩౩ ఓరాజా! ఎవనినామమునుఁ గీర్తించిన మాత్రమున భవభీతి (సంసారభయము) శాంతించునో ఎవడు సాకారమైన బ్రహ్మయో యట్టి వానికి భయము కలుగునని నీవు తలచుట వెఱ్ఱితనము సుమా!

౩౪ ఓరాజా! ఎచ్చట రామకథ కీర్తింపఁబడునో యచ్చట నరిష్టభయము కాని, యకాలమరణభయముకాని యుండనేరదు (ఇట్లు వసిష్ఠుఁడు దశరథునితోఁ జెప్పెను).

౩౫-౩౫½ దశరథుఁడు వసిష్ఠుని వాక్యములను విని మెల్లగ నిటులఁ బలికెను. ఓగురువర్యా! నాకు ధైర్యమునుఁ గలుగఁజేయుటకు నీ విటుల నర్థవాదములను (స్తుతివాక్యములను)బలుకుచుంటివి. నీశిష్యుడగు బాలుని నింతగా స్తవముచేయుట చాలుననియె.

౩౬-౩౬½ ఈప్రకారము వసిష్ఠుడు దశరథునితోఁ జెప్పుచుండగాఁ బరశురాముడును రాముని సమీపమునకు వచ్చి భయపెట్టుచు నిటుల సంభాషించెను.

౩౭-౩౭½ప—ఓక్షత్రియకులాధముఁడా! అని పరశురాముడు రామునిబిలిచెను.
రా—నీచేతిలోని యస్త్రమే నీబ్రాహ్మణ్యమునుఁ బ్రకటనచేయుచున్నదనెను (అనగా క్షత్రియులకుఁ జేతిలోనుండవలసిన యస్త్రము నీవు బ్రాహ్మణుడవై యుండియుఁ జేతబట్టితివి. కాన నీవు బ్రాహ్మణ కులములో నధముడవుకాని నేను క్షత్రియకులములో నధముడను కానని భావము).

నిఃక్షత్రా పృథివీకృతా ఖలు మయా కో௨హం భవా
న్నత్యవా గిత్థం భార్గవరోషపోషణపటుః పాయాత్స నో
రాఘవః॥ 32-324

త్వం రామ ఇతి నామ్నా తు చరసి క్షత్రియాధమ !
త్యజ త్వం రామసంజ్ఞాం వా మయా వా సంగరం కురు॥
33-334

రాఘవ స్త్వంజలిం బధ్వా ప్రణనామ చ భార్గవం
సమరే విజయీ భూయా దిత్యాశిష మయం దదౌ॥ 34-344
భార్గవో௨పి విచార్యాథ చింతయామాస చాత్మని॥ 40

రామే చంద్రాభిరామే వినయవతి శిశౌ కిం ప్రకుప్యాతి
మాత్రం హుం చాపం చంద్రమౌళే శ్చపల మతిరసౌ
వితుఖండం బభంజ, బాలా వైధవ్యదీక్షాం జనకనృపసుతా
నార్హతీయం మదస్త్రాత్ అశ్మాంతో మే కుఠారః కథ
మయ మధునా రేణుకాకంఠశత్రుః॥ 41

ప—నీవే నా స్త్రీహత్య చేసినవాడవనెను (అనగా తాటకయను నాడుదానినిఁ జంపితివని పరిహసించెను).

రా—తాటక నాతల్లి కాదనెను (అనగా నీవు తల్లినే జంపినవాడవు. నేనట్లు చేయలేదు. లోకోపద్రవముచేయు రాక్షసినిఁ జంపితి వని భావము).

ప—నే నెవడనో యెఱుఁగుదువా! భూమిలో క్షత్రియుడనువానిని లేకుండ జేసినవాడ ననెను.

రా—భూమియందు క్షత్రియులు లేకుండఁ జేసితినంటివే, నేను క్షత్రియుడ నేకదా! ఎంత సత్యవాది వనెను. ఇట్లు రాముడు పరశురామునకుఁ గోప మభివృద్ధి యగునట్లు మాట్లాడెను.

౩౭—౩౭½ పరశురాముడు తిరిగి రామునితో నిటులఁబలికెను. క్షత్రియాధమా! నీవు రాము డని పేరుతోఁ దిరుగుచుంటివి. నా కుండఁదగిన రామ యను పేరును నీవు వదలిపెట్టెదవా? లేక నాతో యుద్ధము చేసెదవా? యనెను.

౬౮—౩౮½ రాముడు దోసిలిజోడించి పరశురామునకు నమస్కరించెను. పరశురాముడును "విజయీ భవ" అని రాము నాశీర్వదించెను.

౪౦ పిదప పరశురాముడు తా నట్లాశీర్వదించుటకు విచారించి తన మనమునం దిట్లాలోచించెను.

౪౧ చంద్రబింబమువలె సుందరుడును వినయముకలవాడును బాలుడునగు రామునిఁజూచి యీ రామునిమీదఁ గోప మేల యని తలచెను. కాని ధనుర్భంగము జ్ఞప్తికి వచ్చి తిరిగి తనమనమున నిట్లాలోచించెను. నాగురువగు శివునిధనువును జెఱుకుగడ విరిచినట్లు విరిచివేసెను. కాన నుపేక్షింపఁగూడ దనుకొనెను. సీతనుజూచి తిరిగి తనమనమున నిట్లనుకొనెను. జనకపుత్రియగు సీత నాయస్త్రముచే వైధవ్యమునుఁ బొందఁదగినది కా దనుకొనెను. గండ్రగొడ్డలిని జూచి తిరిగికోపముతో ని ట్లాలోచించెను. నాతల్లియగు రేణుకయొక్క కంఠమునుఁ దెగ నరికిననిర్దయమగు నాగండ్రగొడ్డలి యిప్పుడు దయతో నెట్లు శాంతించు ననుకొనెను.

తతః ప్రాహ రఘూత్తంసం భార్గవః క్రోధమూర్ఛితః॥౪౧½

చండీశకార్ముకవిముగ్ధవివర్ధమానదర్పావలేపసవిశేషవికాస
భాజోః, బాహ్వో స్తవాహ మధునా మధునాసమానై
రారాధయామి రుధిరైః కఠినైః కుఠారం॥ ౪౨-౪౨½

రా—భగవం స్తే ఽనుగ్రహస్య నిగ్రహ స్యా ప్యహం వశః॥
పరం తు కోపబీజం తే జ్ఞాతు మిచ్ఛామి భార్గవ! ౪౩-౪౩½

భా—శాఖా మాంకస్య పతనే కారణం పృష్టవా నసి॥
య త్త్వయా రామ! భగ్నం త జ్జగద్గురుశరాసనం॥
౪౪-౪౪½

రా—అలీకలోకవార్తాయా నిరాగసి మయి ప్రభో!
ముధా కోపకలంకో ఽసి భృగువంశవిభూషణ! ౪౫-౪౫½

భా—త త్కిం గిరిశచాపస్య స్వ స్తి నే త్యాహ రాఘవః॥
తత్కథం త్వం నిరాగాస్తు భవ సీ త్యాహ భార్గవః॥౪౬-౪౬½

రా—మయా స్పృష్టం న వా స్పృష్టం కార్ముకం పురవైరిణః॥
భగవ న్నాత్మనై వేద మభజ్యత కరోమి కిం॥
భో భార్గవ! నమ స్తుభ్యం క్షమస్వ మమ చాపలం॥
డింభస్య దుర్విలాసా స్తు గురూణాం హి ముదే ద్విజ!౪౭-౪౮½

భా—కథం రే చందనాదిగ్ధం నారాచం హృది నిక్షిపన్॥

౪౧½ అనంతరము పరశురాముడు కోపముతో రాముని గూర్చి యిటులఁ బలికెను

౪౨-౪౨½ శివధనువును విరుచుటవలన వృద్ధిబొందిన గర్వము గల నీ బాహువులను ఛేదించి మధురమైన యారక్తముచే నా గండ్రగొడ్డలినిఁ దృప్తి బరచెదను (చూడుమనియెను).

౪౩-౪౩½ రాముడు—ఓ భార్గవా! నీ నిగ్రహానుగ్రహములకు నేను వశుడనై యుంటిని కాని నీకు నామీద గోపమువచ్చుటకుఁ గారణ మేదియో తెలిసికొనఁ గోరుచున్నాడ ననియెను.

౪౪-౪౪½ పరశురాముడు—ఓ రామా! లోకగురువగు శివుని వింటిని విఱిచి కోపకారణ మేమి యని నన్ను నీ వడుగుట చెట్టుకొమ్మ నూపి యాకొమ్మమీద నున్నవాడు క్రిందబడుటకుఁ గారణ మేమి యని యడిగినట్లుండె ననియె.

౪౫-౪౫½ రాముడు—ఓ భృగువంశమున కలంకారమైనవాడా! అబద్ధపు లోకవార్తను నాధారము చేసికొని నిరపరాధుడ నగు నాయందు వ్యర్థముగ నాగ్రహమునుఁ బూనితివనెను.

౪౬-౪౬½ అట్లైతే శివధనువు మంచిగానే యున్నదా యని భార్గవుడు ప్రశ్నింపగా రాముడు విరిగిపోయినదనెను. అటులైతే నీవు నిరపరాధివి యెట్లు కాగలవు? అని పరశురాముడనెను.

౪౭-౪౭½ రాముడు—ఓ పూజ్యుడా! నేను శివధనువును దిన్నగా ముట్టుకొంటినో లేదో దానియంతటికదియే విరిగెను. నే నేమి చేయుదును? ఓ భార్గవా! నీకు నమస్కారము, నాచాపల్యమును సహింపుము. పిల్లవాని దుశ్చేష్టలు పెద్దవారికి సంతోషకరమే యై యుండును. కాని కోపకారణములు కావుగదా యనెను.

౪౮-౫౦ పర—ఓరిదుష్టుడా! పైనఁజందనముచేఁ బూయఁబడిన శల్యమును హృదయమున నాటింపఁజేసి హృదయమును జల్లనిదానినిగాఁజేయుట

హృదయం శీతలయసి తదలం తిష్ఠ దుర్మతే !
హేరామ కామరిపుకార్ముకకర్మఘాతసంజాతపాతక తనైవ
కఠోరధారః, సీతాకరవ్యతికరపతిత్రికూలబంధుః కంఠం పురా
విశతు నిష్కురుణః కుఠారః॥ ४९-५०

రా—నిహంతుం హంతగోవిప్రా న్న శూరా రాఘవావయం
అయం కంఠః కుఠార స్తే కురు రామ యథోచితం॥
హారః కంఠం విశతు వా కుఠారో వా విశ త్వలం
య ద్వా త ద్వా భవతు మే న శూరో ఒహం త్వయి ద్విజే॥
५१-५२

భా—రామ మాం మనుషే వాల్పద్విజవ త్ప్రిణాతి క్షమం
న జానీషే రణే స్కందం జితవంత మముం జనం॥
కి మాత్థరే బ్రాహ్మణేషు న ప్రవీరా వయం త్వితి
తృణాయ మనుషే బ్రహ్మజాతిం క్షాత్రిమదేన కిం॥
ఇదానీ మావయోర్జాతిః కా ప్రగు ర్వీతి రాఘవ !
విజ్ఞాపయే దర్ణితులాప్రవీణో భవతా ద్భవాక్॥ ५३-५५

రా—భో బ్రహ్మ న్భవతా సాకం యుద్ధవార్తాఽపి నో హి నః
సర్వే వయం హీనబలాః యూయం బలవతాం వరాః॥ ५६

ల—శరాసన మిదం త్వేకగుణం భార్గవ ! నో బలం

కటులఁ జేసితి నని చెప్పినట్లు నీమాట లుండె ననియె. శివధనువును విరుచుటవలనఁ గలిగిన పాతకముగల రామా! తీక్ష్ణమైన యంచులు కలదియును సీతకుఁ బ్రీతికూలబంధువును దయారసము లేనిదియు నగు నా గండ్రగొడ్డలి నీ కంఠమునుఁ బ్రవేశించుచున్నది చూడు మనియెను.

౫౧-౫౨ రాముడు—ఓ పరశురామా! రఘువంశమునఁ బుట్టినవారలందరము మేము గోవులను బ్రాహ్మణులనుఁ జంపుటకుమాత్రము శూరులము కాము (మా శౌర్యమును గోబ్రాహ్మణుల విషయమై యుపయోగింప మని భావము). ఇదిగో నాకంఠము. గండ్రగొడ్డలి నీయొద్దనే యున్నది. నీయిష్టము వచ్చినట్లు చేయుమనియె. ఓ భార్గవా! నాదు నిశ్చయమును దెల్పెదను వినుము. నాకంఠమున హారము ప్రవేశించినను, కుఠారము (గండ్రగొడ్డలి) ప్రవేశించినను ప్రవేశించనిమ్ము. ఎట్లు జరిగినను నిష్టమే. కాని బ్రాహ్మణుడవగు నీవిషయమై నాశౌర్యమును వినియోగింప ననియె.

౫౩-౫౪ పర—ఓ రామా! యుద్ధమునందుఁ గుమారస్వామి వంటివానిని జయించిన నన్నుఁగూడ నమస్కార పాత్రుడగు సామాన్య బ్రాహ్మణునిగానే తలచుచుంటివా? ఏమంటివి? బ్రాహ్మణుల విషయమై మేము శూరులము కామని యనియెదవా? క్షాత్రమదముచే బ్రహ్మజాతినిఁ దృణప్రాయముగాఁ దలచుచుంటివా? అనెను. ఇప్పుడు బ్రహ్మక్షత్రియ జాతులలో నేజాతి గొప్పదియో యుద్ధమనెడి త్రాసే తెలియఁజేయును. కాన నీవు వీర్యవంతుడ వగు మనియె.

౫౬ రా—బ్రాహ్మణుడా! నీతో మాకు యుద్ధవార్తయే కూడదుగదా! మేము మీకంటె బలహీనులము. మీరలు కడు బలవంతు లనియెను.

౫౭ అప్పుడు లక్ష్మణుడు పరశురామునితో నిట్లు పలికెను. ఓ భార్గవా! ఒకగుణముకల (ఒక నారిత్రాడుగల) యీధనువు మాకు బలము.

యజ్ఞోపవీతం భవతాం బలం నవగుణం ఖలు॥ ౫౮

రా—వత్సాల మిహ మాన్యే ఽస్మిన్మనో దుర్వినయేన తే॥ ౫౮౪

భా—తదా ఽఽహ భార్గవో రామం న దోషో ఽస్య మమైవ సః॥
దారైర్ముక్తకుచాంశుకైః పరివృతం ప్రాచీన మేషాం
నృపం నాహింసీద్యదసౌ కుఠారహతక స్తస్యైత దుజ్జృం
భితం, యన్నారీకవచాన్వయప్రణయినాం క్షత్రాధమానా
మిమా దుర్వాచః ప్రవిశంతి మే శ్రవణయో ర్ధిక్క్షత్రగోత్రే
కృపాం॥ ౫౯-౫౯

రా—భార్గ వాల మిహ క్షీరకంఠే కఠినకోపతః
తత్క్షంతవ్యం స తు ప్రాహ విషకంఠ స్త్వయాం ఖలు॥ ౬౦

ల—శితికంఠస్య శిష్యేణ క్షంతవ్యం చ విశేషతః॥ ౬౦౪

భా—విషకంఠాభిధాసామ్యాత్కిం భవా నపి మే గురుః॥ ౬౧

మీ బ్రాహ్మణులకుఁ దొమ్మిది గుణములుకల (తొమ్మిది పోగులు కల) యజ్ఞోపవీతము బలమైనది. మాకంటె మీరలే బలవంతులనియె (మీ బ్రాహ్మణు లేమి యుద్ధము చేసెదరని పరిహాసముగా మాట్లాడె నని భావము).

౫౭½ రాముడు లక్ష్మణునితో నిట్లనియెను. తమ్ముడా! పూజనీయుడైన యీపరశురాముని విషయమై దుర్వినయము పనికిరాదనియెను.

౫౮-౫౯ పర—అప్పుడు పరశురాముడు రామునితో నిటులఁ బలికెను. ఓరామా! నీతమ్ముని తప్పుదన మేమియు లేదు. నాదియే తప్పు. చెప్పెదను వినుము. ఓరామా! స్త్రీలచేఁ జుట్టు నావరింపబడి చీరెను రెవికను ధరించి స్త్రీలమధ్య దాగియుండిన నీపూర్వీకుడగు నారీకవచుడను రాజును నాగండ్రగొడ్డలి తెగనరుకకుండగ వదలిన కారణముచే నీతమ్ము డిప్పు డిట్లు విజృంభించి మాట్లాడఁగలిగెను. అట్లు మీమూల పురుషునిఁ జంపకపోవుటవలన క్షత్రియాధములగు మీయొక్క దుర్వాక్యములు వినవలసివచ్చెను. మీక్షత్రియవంశములయందుఁ గృపనుంచుట చాలును (అనగా మీమూలపురుషునిఁ జంపితే మీ వంశమే యంతరించెడిది. మీరలే యుండకపోదురని భావము).

౬౦ రాముడు సామవాక్యములతోఁ బరశురామునితో నిటులఁబల్కెను. ఓభార్గవా! క్షీరకంఠుడగు (బాలుడైన) లక్ష్మణునియందుఁ గఠినమైన కోపము చాలును. క్షమింపవలయును. అని చెప్పగా విని పరశురాము డిట్లు పలికెను. నీతమ్ముడు విషకంఠుడుకాని క్షీరకంఠుడు కాడనియెను.

౬౦½ లక్ష్మణుడు పరశురామునితో నిటులఁ బలికెను. నీవు విషకంఠునకు (శివునకు) శిష్యుడవుకాన తప్పక క్షమించవలయుననియె.

౬౧ ఆవాక్యమును విని పరశురాముడు లక్ష్మణునితో నిట్లనెను. విషకంఠుని నామ సామ్యముచే నీవుకూడ నాకు గురువవేనా యనెను.

ల—కిరీట మధిరూఢే ఽపి బాలే ప్రాలేయరోచిషి
శితికంఠస్య కిం చిత్తే ధత్తే కోపాంకురః పదం॥ ౬౨

భా—కృత్వా త్రిస్సప్తకృత్వ స్సమితి విశసనం పూర్వ
ముర్వీపతీనాం కృత్వా ఽన్య త్సప్తకృత్వః పున రపి కదనం
దుర్మదానాం నృపాణాం, నిర్మాయ క్ష్మాపతీనాం ప్రతిసమర
తలా దాహృతై రుత్తమాంగైః కాపాలీ మక్షమాలాం
ఝుడితి భగవతో భైరవ స్యార్పయామి॥ ౬౩

రా—తప శ్శాంతం చేత స్స్ఫటికమణిమాలాపరికరః కుశాః
కుండీ దండ స్సతత ముటజావాసనిరతిః, మునీనా మేత ద్వ
స్సముచిత ముదగ్రం న వచనం నవక్రభ్రూభంగో నశర
ధనుషీ నాపి పరశుః॥ ౬౪

పవిత్రగాత్రం తే కుత్ర కుత్ర తే కఠినం ధనుః
కుత్ర నారాచహేలా తే పర్ణశాలా క్వ తే ద్విజ॥ ౬౫

ప్రసీద రోషా ద్విరమ కురు చేతసి మే గిరం
బహువారై ర్జిత మభూ త్ప్రయాసై ర్భవతా జగత్॥
౬౬

భా—నాద్యాహ మాడంబరపండితేషు యుష్మాసు వాణీః
ప్రచురాః ప్రయుంజే, బాణాన్ రిపుప్రాణహరా న్మదీయా
న్సర్వే ఽపి యూయం సహితా స్సహధ్వం॥ ౬౭

౬౨ లక్ష్మణు డనంతర మిటులఁ బలికెను. ఓభార్గవా! బాలుఁడైన చంద్రుఁడు తన నెత్తిమీద నెక్కి తొక్కుచుండినను నీగురువైన శివుఁడు కోపగించెనా? అట్లే పిల్లవాని చేష్టలకు నీవు కోపగింపఁ జన దని భావము.

౬౩ పర—ఓరామా! పూర్వము నే నిరువదియొక్కమార్లు భూమి నంతయు వెదకి రాజులనందరిని వధించి తద్రక్తముచేఁ బితృతర్పణము చేసితిని కాని యంతమాత్రమునఁ జాలదు. తిరిగి నేనిపుడు ఇంకొక యేడుపర్యాయములు భూమినంతయుఁ దిరిగి దుష్టక్షత్రియులను వధించి యారాజుల కపాలములచే నొకమాలనుఁ జేసి భగవంతుఁడగు భైరవున కర్పించెద ననియెను.

౬౪ అప్పుడు రాము డిట్లనియెను.
ఓపరశురామా! మీవంటి మునీశ్వరులకు తపస్సు, శాంతము, స్ఫటిక మాలయును, కుశలు, దండకమండలములు, పర్ణశాలావాసము తగినవి కాని భయంకరమైన యిట్టి కఠినవచనములు కాని, బొమముడియలు ధరించుటకాని, గండ్రగొడ్డలి ధనుర్బాణములు కాని తగవనియెను.

౬౫ ఓభార్గవమునీ! పవిత్రమైన నీశరీర మెక్కడ? కఠినమైన యీధను వెక్కడ? నీపర్ణశాల యెక్కడ? బాణములతోఁ గ్రీడయెక్కడ? (అనగా పర్ణశాలలో తపము చేసికొనుచుండెడి పవిత్రమైన శరీరకముకల నీకు ధనుర్బాణములను ధరించుట తగదనిభావము).

౬౬ ఓభార్గవా! నీ వనుగ్రహించి కోపమును విడువుము. నామాటలను మనస్సునఁ జొరనిమ్ము. నీ విదివరకు ననేకపర్యాయములు బహు ప్రయాసములచే రాజులను జయించి విజయములనుఁ బొందితి వనెను.

౬౭ పరశురాముడు రామునితో నిటులఁ బలికెను. ఓరామా! నే నిపుడు వాగాడంబరపండితులగు మీమీదను విశేషముగ వాక్కులనుఁ బ్రయోగింపను (అనగా మీతో నెక్కుచగా మాట్లాడదలచలేదు). శత్రు సంహారకములగు నాదుబాణములను మీమీదనుఁ బ్రయోగింపఁ దలచితిని. మీరలందరును కలిసికూడ నాబాణములను సహింపు డనియెను.

ఈష త్త్వ క్త పురాణచాపదళన ప్రోద్భూతగర్వోద్ధతి వ్యగ్ర
స్త్వం కతర స్సమే తవ గురు స్సోఢుం న శక్త శ్శరాన్,
తుష్టా దిష్టవరప్రదా ద్భగవతః పద్మాసనా త్సాదరం
మన్నా రాచభయా దయాచత కిల బ్రాహ్మం తనుం కౌశికః॥
౬౮

రా—కరోషి త్వ మధిక్షేపం గురో శ్మే కౌశికస్య తు
నాతఃపర మహం త్వాం తు సోఢుం శక్నోమి భార్గవ॥ ౬౯

భా—జామదగ్న్యస్య పురతో చండధామ్నో భవా న్పునః
విరాజసే వా ఖద్యోత శ్శక్తో ఽసి యది యుధ్యతాత్॥ ౭౦

యచ్చాపం వీతసారం తద్భగ్న. మత్యల్ప త్త్వైవ తే
శక్తో ఽసి యది మే చాప మాకర్ష మురవైరిణః॥ ౭౧

తచ్ఛ్రుత్వా ధను రాచ్ఛిద్య రామ స్త త్తేజసా సహ
తూణీరా ద్బాణ మాదాయ సంధా యాకృష్య వీర్యవాన్॥
లక్ష్యం దర్శయ బాణస్య హ్యమోఘో మమ సాయకః
బ్రాహ్మణో ఽ సీతి పూజ్యో మే విశ్వామిత్రకృతేన చ॥
౭౨-23

ఏవం రామే తు వదతి భార్గవో వికృతాననః
సంస్మర న్పూర్వవృత్తాంత మిదం వచన మబ్రవీత్॥ ౭౪

౧౮ ఓ రామా! నీగురువగు విశ్వామిత్రుడును క్షత్రియుడుగా నుంటే నాబాణముల దెబ్బల ననుభవించవలసి వచ్చునని భయపడి నా బాణములను సహింపలేకనే తపస్సుచేసికొని యాతపస్సుచే బ్రహ్మ దేవుని సంతోషపెట్టి యాచతుర్ముఖునివలన బ్రాహ్మణశరీరమును (బ్రాహ్మణ్యమును) సంపాదించుకొనెనుకదా! అట్టిస్థితిలోఁ దుర్బలమై పట్టియున్న శివధనువును విరిచితి నని గర్వించు నీ వెంతవాడ వనెను.

౧౯ రాముడు పరశురామునితో నిటులఁ బలికెను. ఓభార్గవా! నీ వింత దనుక నన్నుఁ దూలనాడినను సహించితిని. నీ విపుడు నాగురువగు కౌశికుని దూషించుచుంటివి. ఇటుపిమ్మట నిన్ను సహించననియెను.

౨౦ ఆవాక్యమును విని పరశురాము డిట్లనెను. ఓరామా! పరశురాము డను సూర్యునిముందు నీవు మెరుగుడుపురుగువంటి వాడవు. నీకు సమర్థతయున్న యుద్ధము చేయుమనియెను.

౨౧ సారహీనమైన శివధనువును విరిచితి వనుటలో నీకు గొప్పతనము లేదు. నీవు సమర్థుడవైనచో నావైష్ణవధనువు నాకర్షింపు మనియెను.

౨౨-౨౩ అనంతరము రామచంద్రమూర్తి యాగ్రహముతోఁ బరశురాముని చేతినుండి వైష్ణవధనువును పరశురామునిలో నుండిన వైష్ణవ శక్తితోఁగూడ లాగుకొని తన యమ్ములపొదినుండి బాణమునుఁదీసి ధనువునందు సంధించి యెక్కుపెట్టి నాబాణము అమోఘమగుట వలన నాబాణమునకు లక్ష్యమునుఁ జూపింపుము. బ్రాహ్మణుడ వగుటవలనను; విశ్వామిత్రునకు నీవు బంధువుడవగుటవలనను నన్నింత గా గౌరవింపవలసివచ్చెను.

౨౪ ఈప్రకారము రాముఁడు చెప్పుచుండగాఁ బరశురాముఁడు వికారగ రూపమునొందిన ముఖముకలవాఁడై పూర్వవృత్తాంతమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని రామునితో నిటులఁ బలికెను.

రామ రామ మహాబాహో జానే త్వాం పరమేశ్వరం
పురాణపురుషం విష్ణుం జగత్సర్గలయోద్భవం॥ ౭౫

పూర్వవృత్తం శృణు విభో! రామచంద్ర మహాప్రభో!
బాల్యే ఽహం తపసా విష్ణు మారాధయితు మంజసా॥
చక్రతీర్థం తతో గత్వా ఽతోషయం తపసా హరిం॥ ౭౬-౭౬

మయా సంపూజితో దేవః ప్రసన్నః ప్రాహ కేశవః॥
ప్రీతో ఽస్మి తపసా విప్ర! భవతో నియతాత్మనః
సంప్రదాస్యామి తే విప్ర! మచ్ఛక్తిం పరమాం శుభాం॥
ఆవేశితో ఽథ మచ్ఛక్త్యా జహి దుష్టా న్నృపోత్తమాన్
భూభారకవినాశాయ దేవానాం చ హితాయ చ॥ ౭౭-౭౯

ఇత్యుక్త్వా ప్రదదౌ దేవః పరమం శత్రుధర్షిణం
వైష్ణవం చ మహాచాపం దివ్యాస్త్రా ణ్యప్యనేకశః॥
దత్త్వా ప్రోవాచ భగవా న్జామదగ్న్యం తు మాం పునః
మదోత్కటా న్నృపా న్హత్వా కార్తవీర్యం నిహత్య చ॥
కృత్స్నాం భూమిం కశ్యపాయ దత్త్వా శాంతి మవాప్నుహి
త్రేతాయుగే దాశరథి ర్భూత్వా రామో ఽహ మవ్యయః॥
ఉత్పత్స్యే పరయా శక్త్యా తదా ద్రక్ష్యసి మాం తతః
మత్తేజః పున రాదాస్యే త్వయి దత్తం మయా పునః॥
ఇత్యుక్త్వాఽంతర్హితో దేవః వరం మహ్యం వితీర్య సః॥
౮౦-౮౩

౭౨ ఓమహాపరాక్రమశాలి వగు నోరామచంద్రా! నీవు జగత్సృష్టిస్థితి లయములకుఁ గారణమైనవాఁడవును, పురాణపురుషుడవును విష్ణుమూర్తివియు నని యిప్పుడు తెలిసికొంటిని.

౭౬-౭౬౺ ఓరామచంద్రప్రభూ! నాపూర్వవృత్తాంతమును జెప్పెదను వినుము నేను బాల్యమునఁ దపస్సుచే *విష్ణుమూర్తి నారాధింపఁ దలచి చక్రతీర్థ మను నొకక్షేత్రమునకు వెళ్లి యచ్చట గొప్పతపమునుజేసి విష్ణుమూర్తిని సంతోషపెట్టితిని.

౭౭-౭౯ అట్లు నాచేఁ బూజింపఁబడిన భగవానుఁ డగు శ్రీహరి ప్రసన్నుడై నాతో నిటులఁ జెప్పెను. ఓభార్గవా! * నీతపస్సునకు నేను సంతసించితిని. గొప్ప నావైష్ణవతేజమును నీయందుఁ బ్రవేశపెట్టెదను. నాతేజముచే నావేశింపఁబడినవాడవై భూభారము తొలగుటకును, దేవతాహితమునకును దుష్టు లగు రాజులను సంహరింపుము.

౮౦-౮౩౺ ఈప్రకారము చెప్పి శ్రీహరి శత్రుసంహారక మగు తన వైష్ణవ ధనువును దివ్యాస్త్రములను నా కిచ్చి తిరిగి నాతో నిటులఁ బలికెను. మదించి యున్న రాజులను, గార్తవీర్యార్జునుని సంహరించి భూమినంతయును గశ్యపప్రజాపతి కిచ్చి శాంతిని బొందుము త్రేతాయుగమున నేను దశరథునకుఁ బుత్త్రుఁడనుగా నవతరించి రాముఁడను పేరుతో నొప్పెదను. అప్పుడు నన్నుఁ దిరిగి చూడఁగలవు. నీయందు నే నిపుడు ప్రవేశపెట్టిన నావైష్ణవతేజమును దిరిగి నేనపుడు నీనుండి తీసికొనియెదనని భగవానుఁడు నాకు వరమిచ్చి యంతర్థానము నొందెను.

తత స్సహస్రబాహుం తం హత్వా ఽహం పృథివీ మిమాం॥
నిక్షత్రాం కృతవా నస్మి మాతామహకులం వినా॥౧౪-౧౪॥

* మాతామహాన్వయత్వా చ్చ రేణుకావచనా త్తథా॥
రక్షితం చ మయా దేవ ఇక్ష్వాకో స్తు మహాత్కులం॥౧౫-౧౫॥

విష్ణు రేవ భవా న్జ్ఞాతో జ్ఞాతో ఽ స్యద్య మయా విభో!
నిక్షి ప్తం మయి తే తేజ స్త్వ య్యేవ పున రాహృతం॥౧౬-౧౬॥

అద్య మే సఫలం జన్మ ప్రతీతో ఽసి మహాప్రభో!
బ్రహ్మాదిభి రలభ్య స్త్వం ప్రకృతేః పారగో మతః॥౧౭-౧౭॥

నమః కారుణి కానంత! నమ స్తే భ క్తభావన!
నమో ఽస్తు జగతాం నాథ! రామచంద్ర! నమో ఽస్తు తే॥
౧౮-౧౮॥

దేవ! యద్యత్కృతం పుణ్యం మయా లోకజిగీషయా॥
తత్సర్వం తవ బాణాయ భూయా ద్రామ! నమో ఽస్తు తే॥
౧౯-౧౯॥

---

* మాతామహ ఇతి వైవస్వతమనోః పుత్రః శర్యాతిః. తస్య కన్యాం సుకన్యానామ్నీం చ్యవనః పరిణీతవాన్. చ్యవనస్య సుతః ఋచీకః. తస్య పుత్రః జమదగ్నిః. తత్సుతః పరశురామ ఇతి సంబంధః.

౭౪-౭౫॥ అనంతరము నాతండ్రిని జంపిన కార్తవీర్యార్జునుని నేను జంపి నామాతామహవంశమునుమాత్రము వదలి పిమ్మట భూమియందలి దుష్టక్షత్రియుల నందరిని సంహరించితిని.

౭౫-౭౫॥ నాతల్లి యగు రేణుకాదేవి చెప్పుటవలనను,* మాతామహవంశము కావునను నిక్ష్వాకువంశమును మాత్రము నేను కాపాడితిని.

-౭౬-౭౬॥ ఓరామచంద్రా ! నీవు సాక్షాద్విష్ణుమూర్తి వని యిప్పుడు నేను తెలిసికొంటిని. నాయందు నీవు పూర్వము ప్రవేశపెట్టిన వైష్ణవ తేజమును నీవే తిరిగి తీసికొంటివి

౭౭-౭౭॥ఓరామచంద్రప్రభూ! నీదర్శనముచే నాజన్మము సఫలమయ్యెను. ప్రకృతిబద్ధుఁడవు కానివాఁడవును, బ్రహ్మాదులకు నగోచరుఁడ వగు నీయొక్క సాక్షాత్కారమయ్యెను.

౭౮-౭౮॥ఓకరుణాసముద్రా! ఓయనంతా! ఓజగన్నాథా! ఓరామచంద్రా! నీకు నమస్కారము.

౭౯-౭౯॥ ఓరామచంద్రా ! నేనుచేసిన పుణ్యమును నీబాణమునకు లక్ష్యము నుగా నిచ్చుచుంటిని. ఆనాపుణ్యమంతయు నీబాణమునకు లక్ష్య మగుగాక ! నీకు నమస్కారము.

---

* మాతామహవంశము - వైవస్వతమనువుయొక్క పుత్త్రుఁడు శర్యాతి మహారాజు. ఆశర్యాతిమహారాజుయొక్క పుత్త్రిక యగు సుకన్య యను నామెను చ్యవనమహర్షి వివాహము చేసికొనెను. చ్యవనుని యొక్క కుమారుఁడు ఋచీకమహర్షి యై యుండెను. ఆఋచీకుని పుత్త్రుఁడు జమదగ్నిమహర్షి యై యుండెను. జమదగ్నియొక్క పుత్త్రుడు పరశురాముఁడు కాన నిక్ష్వాకువంశము మాతామహవంశ మయ్యెను.

యది తే ఽనుగ్రహో రామ! మ య్యస్తి మధుసూదన!
త్వద్భక్తసంగ స్త్వత్పాదే దృఢా భక్తి స్సదా ఽస్తు మే॥
౯౦-౯౦౪

గచ్ఛ దేవ! యథా కామం దేవకార్యం చ వై కురు॥
దుష్టానాం నిధనం కృత్వా శిష్టాం శ్చ పరిపాలయ॥౯౧-౯౧౪

తథా కృత్వా రాఘవో ఽపి జామదగ్న్య మ థాబ్రవీత్॥
పశ్య మాం స్వేన రూపేణ చక్షు స్తే వితరా మ్యహం॥
౯౨-౯౨౪

తతో రామశరీరే వై రామో ఽపశ్య త్స భార్గవః॥
అదిత్యా న్సవసూ న్రుద్రా న్సాధ్యాం శ్చ సమరుద్గణాన్॥
దేవర్షీం శ్చైవ కాత్స్న్యేన సముద్రా న్పర్వతాం స్తథా॥
స తు విహ్వాలతాం గత్వా ప్రతిలభ్య చ చేతనాం
రామః ప్రత్యాగతప్రాణః నమస్కృత్వా పురాతనం॥
విష్ణునా సో ఽభ్యనుజ్ఞాతో మహేంద్ర మగమ త్పునః॥
౯౩-౯౫౪

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
వింశతమస్సర్గ స్సమాప్తః.



౯౦-౯౦౪ ఓరామచంద్రా! నీకు నాయం దనుగ్రహ ముండినచో నీభక్తుల సంబంధమును, నీపాదారవిందములయం దెడతెగని భక్తియును నాకుఁ గలుగునటుల ననుగ్రహింపుము.

౯౧-౯౧౪ ఓరామచంద్రా! యథేష్టముగ వెళ్లుము. దేవకార్యమును జేయుము. దుష్టసంహారమును జేసి శిష్టులను బరిపాలింపుము.

౯౨-౯౨౪ ఆపరశురాముఁడు చెప్పినట్లు రామచంద్రమూర్తియును బరశురాముని బుణ్యమును దనబాణమునకు లక్ష్యమునుగాఁ జేసి పరశురామునితో నిటులఁ బలికెను. ఓభార్గవా! నానిజరూపమును జూడు మని రాముఁడు దివ్యదృష్టి నిచ్చెను.

౯౩-౯౫౪ అనంతరము పరశురాముఁడు రాముని శరీరమునందు ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, సాధ్యులను, మరుద్గణమును, దేవర్షులను, సముద్రములను, పర్వతములను దివ్యదృష్టితోఁ జూచి పరవశత నొంది కొంతసేపటికిఁ జైతన్యము నొంది పురాణపురుషుఁ డగు రామచంద్రమూర్తికి నమస్కరించి యారాముని యనుజ్ఞ నొంది మహేంద్రపర్వతమునకుఁ దపముచేసికొనుట కేగెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమున
నిరువదియవసర్గము సమాప్తము.



## ఏకవింశస్సర్గ ప్రారంభః.

అథ రాజా దశరథో రామం మృత మివాగతం
దృఢ మాలింగ్య హర్షేణ నేత్రాభ్యాం జల మత్యజత్॥ ౧

తతో రాజా స్వసైన్యేన స్వపుత్రజ్ఞాతిబంధుభిః
నిర్జగామ పురీం రమ్యా మయోధ్యాం తుష్టమానసః॥ ౨
ఆగచ్ఛంతం నృపం జ్ఞాత్వా మంత్రిణః పురవాసినః
పతాకతోరణాద్యైశ్చ దివ్యచందనసేచనైః॥
నగరీం భూషయిత్వా తే నృత్యగీతాదిమంగళైః
నిన్యుః కుటుంబసహితం రాజానం నగరీం ప్రతి॥ 3-౪

రామ మాగత మాజ్ఞాయ గోపురాట్టాలపంక్తిషు
అంకే నిధాయ బాలాన్స్వాన్ స్త్రియః స్థిత్వా నిజైః కరైః॥
సువర్ణకుసుమాద్యైశ్చ వవర్షుః పుష్పవృష్టిభిః॥ ౫-౫౪

కాశ్చి న్మార్గోపరి స్థిత్వా కుంభదీపాదిమంగళైః॥
ఆర్తిక్యాద్యైశ్చ రాజానం సరామం శాంతికారకైః
పూతయంతి స్మ తా స్సర్వా నాత్రిజమార్గే పృథక్పృథక్॥౬-౭

ఏవం నానాసముత్సాహై ర్నర్తనై ర్వారయోషితాం
దుందుభీనాం నినాదైశ్చ గాయకానాం చ గాయనైః॥
సౌధోపరిగవాక్షేషు స్త్రీముక్తసుమవృష్టిభిః
యయౌ స్వభవనం రాజా వీజ్యమాన స్సుచామరైః॥౮-౯

## ఇరువదియొకటవసర్గ ప్రారంభము.

౧ అనంతరము దశరథుఁడు భార్గవునినుండి విముక్తుఁడై తనసమీపమునకు వచ్చిన రామచంద్రమూర్తిని, మృతినొంది తిరిగి జీవించివచ్చిన వానివలెఁ దలఁచి గాఢముగఁ బుత్త్రుని నాలింగనము చేసికొని యానందబాష్పములను విడిచెను.

౨ అనంతరము దశరథుఁడు తనపుత్త్రమిత్త్రజ్ఞాతిబంధుపరివారములతోఁ గూడినవాఁడై యయోధ్యాపురికి వచ్చెను.

౩-౪ దశరథుఁడు పురమునకు వచ్చుచున్నట్లు మంత్రులును, పురజనులును దెలిసికొని పతాకములచేతను, ముత్యాలతోరణములచేతను, మంచి గంధపుజలములచేఁ దడుపుటచేతను బురము నలంకరింపఁజేసి నృత్యగీతవాద్యఘోషములతో దశరథమహారాజును సకుటుంబముగాఁ బురమునకుఁ దీసికొనివచ్చిరి.

౫-౬ రామచంద్రమూర్తి యూరేగింపుమహోత్సవముతోఁ బురవీధుల వెంట వచ్చునప్పుడు స్త్రీలు మేడలపైభాగములయం దుండి తమ పిల్లలను దొడలమీఁద నుంచుకొని చేతులతో సువర్ణపుష్పములను రామునిమీఁదఁ జల్లుచుండిరి.

౭-౮ మఱికొందరు స్త్రీలు రాజమార్గములయం దుండి మంగళప్రదము లగు కుంభదీపాదులచేతను, మంగళారతులచేతను వేఱ్వేఱు నారతుల నిచ్చుచుండిరి.

౯-౧౦ ఈప్రకారము గొప్పయుత్సాహములతోడను, వేశ్యలనృత్యగీతములతోడను, దుందుభిధ్వనులతోడను, గాయకుల గానములతోడను, మేడలమీఁదనుండి స్త్రీలచేఁ జల్లఁబడుచున్న పుష్పవర్షములతోడను దశరథమహారాజు సకుటుంబముగాఁ దనగృహమును బ్రవేశించెను.

యత్ర రత్నోపలాభిత్తౌ హేమ్నః పంకో ఽస్తి యత్ర వై
యత్ర స్తంభా స్స్ఫాటికాశ్చ యత్ర మారకతోద్భవాః॥
రత్నదీపాః ప్రకాశంతే సదైవాగ్నిశిఖోపమాః॥ ౧౦-౧౦½

వధూగృహప్రవేశం చ కారయిత్వా చ బాలకైః॥
రమాపూజాం కారయిత్వా దదౌ దానాని భూపతిః॥
౧౧-౧౧½

తదా ఽలంకారవస్త్రాద్యైః స్సుహృదః పార్థివాదయః॥
రామాదీన్పూజయామాసు స్తథా దశరథం నృపం॥౧౨-౧౨½

సర్వా న్దశరథ స్తాం శ్చ పూజయామాస వైభవైః॥
తత స్తే సుహృద స్సర్వే నృపా శ్చ స్వస్థలం యయుః॥
౧౩-౧౩½

1 కోసలో భానుమంతో ఽథ మగధ శ్చిత్రభూషణః॥
యుధాజి త్కేకయాధీశో కాశీనాథః ప్రతర్దనః
పృథ క్షోడశసంఖ్యాకాః దుహితౄః పుణ్యలక్షణాః॥
భూనీలా విమలాఖ్యానా శ్చాష్టావింశాధికం శతం
గృహీత్వా ఽఽగత్య సాకేతం ప్రాహు ర్దశరథం నృపం॥
౧౪-౧౬

కన్యా స్త్విమా జన్మకాలే రాఘవార్థే నిమంత్రితాః
తస్మా త్త్వ మేతత్కన్యా స్తు స్నుషాత్వేన గృహాణ వై॥ ౧౭

1. దూర్వాసరామాయణమ్.

౧౦-౧౦౪ దశరథుఁడు ప్రవేశించిన గృహము రత్నములచేఁ గట్టఁబడిన గోడలు కలిగియుండెను. మఱియు బంగారపు రేకులతోఁ బ్రకాశించు చున్న భూభాగము కలదియు నై యుండెను. మఱియు నాభవన మున స్ఫటికపురాళ్ళచేఁ గట్టఁబడిన స్తంభములు ప్రకాశించుచుం డెను. రత్నదీపములు ఎల్లప్పుడు ప్రకాశించుచుండెను.

౧౧-౧౧౪ దశరథమహారాజు నూతనవధూవరులచే గృహప్రవేశమును లక్ష్మీ పూజను జేయించి యాసమయమున ననేకము లగు దానములను జేసెను.

౧౨-౧౨౪ అప్పుడు సామంతరాజులును, మిత్రులును రాముఁడు మొదలు గాఁగల నూతనవధూవరులకును, దశరథునకును వస్త్రాలంకారము లను గానుకలనుగా సమర్పించిరి.

౧౩-౧౩౪ దశరథమహారాజును వారలందఱను దనవైభవము కొలఁది సన్మానిం చెను. పిదప వారలందఱును దమతమస్వస్థలముల కేగిరి.

౧౪-౧౬ అనంతరము కోసలుఁడు, భానుమంతుఁడు, మగధుఁడు, చిత్ర భూపణుఁడు, యుధాజిత్తు, కేకయరాజు, కాశీరాజు, ప్రతం బనుఁడు బైయెనమండ్రుగురు రాజులును శుభలక్షణములు కల వారును భూదేవి, నీలాదేవి, విమలాదేవి మొదలగు నామములు కలవారు నగు నూటయిరువది యెనమండ్రుగురు పుత్రికలను దీసికొని యయోధ్యకు వచ్చి దశరథమహారాజుతో నివ్విధముగఁ బలికిరి. (పైరాజులలో నొక్కొక రాజునకుఁ బదునారుగురు కొమరితల చొప్పున యెనమండ్రుగురురాజుల కొమరితలును గలిసి నూటయిరు వది యెనమండ్రుగు రని తెలియ నగును)

౧౭ ఓరాజా! ఈ మాకన్యకలు పుట్టినపుడే రాముని కిచ్చుట కుద్దేశించి తిమి. కాన మాపిల్లలను నీవు కోడండ్రునుగాఁ బరిగ్రహింపుము అని కోరిరి.

ఇత్యుక్తం నృపతీనాం తు శ్రుత్వా దశరథ స్తదా
ప్రాహేదం వచనం భూపా న్కోసలాద్యా న్విచార్య తాన్॥
౧౮

భర్తా రామ స్తత స్తం తు పృష్ట్వా ంగీకృతి ఉపేత్య చ
ద త్తేమాః కన్యకా స్తస్మై భూపా యూయం ముద స్తు మే॥
౧౯

ఇత్యుక్తా స్తే నృపా స్సర్వే మిళిత్వాహు శ్చ రాఘవం
రామచంద్ర! త్వదర్థే ఽస్మత్కన్యా నియమితా జనౌ॥
నాన్యస్మై తు న దాస్యామో వృణ్వతే నేతరం త్వమాః॥
౨౦-౨౦½

భవా నిమా నవృణుతే చే త్తదా త్వద్గృహే స్థితాః॥
దాసీత్వ మపి తే కర్తు మిచ్ఛం త్యేతా న చాపరం॥౨౧-౨౧½

తదా రామ స్స్వజనకం సర్వ మ ప్యవద ద్రిహః॥
తదా ప్రాహాత్మజం రాజా విచా ర్యాజనుతః పునః
సీతా త్వనుమతిం దద్యా ద్యది గృహ్ణా తు వై భవాన్॥
౨౨-౨౩

తత స్సీతానుమత్యా తు రాఘవ స్తన్నృపాత్మజాః
ఏకపత్నీవ్రతం స్వీయం సంశ్రుత్య నియమాన్వితః॥

౧౮ ఆరాజులవాక్యమును దశరథుఁడు విని యాలోచించి యాకోసలుఁడు మొదలగు రాజులతో నివ్విధముగఁ బలికెను.

౧౯ ఓరాజోత్తములారా! ఈకన్యకలను భరించువాఁడు రాముఁడు కాన నతని నడిగి యతఁ డంగీకరించినచో నతనికి భార్యనులగా నీయుఁడు. నాకును సంతోషమే యనెను.

౨౦-౨౦౧ దశరథుఁడు పైవిధముగాఁ జెప్పుటతోడనే కోసలుఁడు మొదలగురాజులందఱును గలిసి రామునితో నిటులఁ బలికిరి. ఓరామచంద్రా! మాకన్యకలు నీకొఱకు నిదివఱకే యుద్దేశింపఁబడిరి (అనగాః బుట్టుటతోడనే). కాన మే మీకన్యకలను నితరుల కిచ్చునది లేదు మే మితరుల కీయఁ దలఁచినను నీకన్యక లితరుని వరింపఁ దలఁచుట లేదు

౨౧-౨౧౧ నీవు వీరలను వరింపనిచో నప్పుడు నీగృహమునం దుండి దాసీతనమునైనను జేయఁదలఁచిరి కాని యితరులను వరించుటకు నిచ్ఛగింపరు (అని రాజులు రామునితోఁ జెప్పిరి)

౨౨-౨౩ అప్పుడు రామచంద్రమూర్తి తనతండ్రి యగు దశరథునితో రహస్యముగ రాజులు చెప్పినదంతయుఁ జెప్పఁగా నాదశరథుఁడు విచారించి కుమారునితో నిటులఁ జెప్పెను. ఓపుత్రా! నీవు సీత నడిగి సీత యనుమతి యిచ్చినచో గ్రహింపు మనియెను.

౨౪-౨౫ అనంతరము రామచంద్రమూర్తి సీత నడిగి సీత యనుమతి యిచ్చినను, నే నేకపత్నీవ్రతుఁడను కాన ధర్మార్థము కాని, భోగార్థము కాని మీపుత్రికలను నేను బరిగ్రహింపను. సేవార్థమై మాత్రము నేను మీకొమరితలను బరిగ్రహించెద నని రాజులతోఁ బ్రీతినఁజేసి చెప్పి సేవార్థమై నూటయిరువదియెనమండ్రుగురు రాజపుత్రికల

* జగ్రాహ పాణినా పాణిం స్నేహార్థం కేవలం పునః
న ధర్మాయ న భోగాయ నాదదే రాఘవ స్తు తాః॥ ౨౮-౨౫

---

* నను దాసీత్వే పరిగృహీతానాం పాణిగ్రహణ మదృష్ట చర మితిచే న్న. మైత్రీదార్ఢ్యార్థ మేవేతి జ్ఞేయం. న చ పాణీగృహీతానాం న దాసీత్వం. కిం తు భార్యాత్వ మేవేతి వాచ్యం. తర్హి యది పాణినా గ్రహణ మేవ భార్యాత్వే ప్రయోజకం. తదా శ్రీరామసుగ్రీవయోః పాణి గ్రహణ స్యాగ్నిసాక్షికం కృతత్వాత్ సుగ్రీవస్య శ్రీరామ భార్యా త్వాపత్తేః. ఏవ మేవ రాజకన్యానాం పాణిగ్రహణం స్వదాసీత్వదార్ఢ్యార్థ మేవేతి నిశ్చితమ్. రామస్య బహుపత్నీక త్వోక్తౌ బహుగ్రంథవిరోధాపత్తేః.

న చైవం సతి పుత్రీప్రదానం కుర్వతా మష్టరాజ్ఞా మపి సంతోషావహం న భవ తీతి వాచ్యం. యోగినా మ ప్యగోచరే రామచంద్రే స్వపుత్రీణా మనురాగాతిశయం విభావ్య అస్మత్పుత్రీణాం శ్రీరామదాసీభావేన ప్రదాన మస్మాకం పరమపురుషార్థనిధాన మిత్యష్టరాజ్ఞా మ ప్యతి శయమోదావహత్వేన న్యూనతానవకాశాత్. కిం చ దేవతాస్త్రీణా మపి శ్రీరామసేవోత్కంఠాతిశయేన పట్టణా వరణాది పాలకత్వాపేక్షాయాం మనుష్యసాధారణ రాజ స్త్రీణాం శ్రీరామసేవోత్సుకతాయాం కిము వక్తవ్య మితి సర్వం సుస్థమ్.

౧౦-౧౦½ దశరథుఁడు ప్రవేశించిన గృహము రత్నములచేఁ గట్టఁబడిన గోడలు కలిగియుండెను. మఱియు బంగారపురేకులతోఁ బ్రకాశించు చున్న భూభాగము కలదియు నై యుండెను. మఱియు నాభవనమున స్ఫటికపురాళ్ళచేఁ గట్టఁబడిన స్తంభములు ప్రకాశించుచుండెను. రత్నదీపములు ఎల్లప్పుడు ప్రకాశించుచుండెను.

౧౧-౧౧½ దశరథమహారాజు నూతనవధూవరులచే గృహప్రవేశమును లక్ష్మీపూజను జేయించి యాసమయమున ననేకము లగు దానములను జేసెను.

౧౨-౧౨½ అప్పుడు సామంతరాజులును, మిత్రులును రాముఁడు మొదలు గాఁగల నూతనవధూవరులకును, దశరథునకును వస్త్రాలంకారములను గానుకలనుగా సమర్పించిరి.

౧౩-౧౩½ దశరథమహారాజును వారలందఱను దనవైభవము కొలఁది సన్మానించెను. పిదప వారలందఱును దమతమస్వస్థలముల కేగిరి.

౧౪-౧౮ అనంతరము కోసలుఁడు, భానుమంతుఁడు, మగధుఁడు, చిత్రభూపణుఁడు, యుధాజిత్తు, కేకయరాజు, కాశీరాజు, ప్రతర్దనుఁడు పై యెనమండ్రుగురు రాజులును శుభలక్షణములు కలవారును భూదేవి, నీలాదేవి, విమలాదేవి మొదలగు నామములు కలవారు నగు నూటయిరువది యెనమండ్రుగురు పుత్రికలను దీసికొని యయోధ్యకు వచ్చి దశరథమహారాజుతో నివ్విధముగఁ బలికిరి. (పైరాజులలో నొక్కొక్కరాజునకుఁ బదునారుగురు కొమరితల చొప్పున యెనమండ్రుగురురాజుల కొమరితలును గలిసి నూటయిరువది యెనమండ్రుగు రని తెలియ నగును)

౧౭ ఓరాజా! ఈ మాకన్యకలు పుట్టినపుడే రామునికిచ్చుట కుద్దేశించితిమి. కాన మాపిల్లలను నీవు కోడండ్రనుగాఁ బరిగ్రహింపుము అని కోరిరి.

ఇత్యుక్తిం నృపతీనాం తు శ్రుత్వా దశరథ స్తదా
ప్రాహేదం వచనం భూపా న్కోసలాద్యా న్విచార్య తాన్॥
౧౮

భర్తా రామ స్తత స్తం తు పృష్ట్వా ంగీకృతి ఉమేత్య చ
ద త్తేమాః కన్యకా స్తస్మై భూపా యూయం ముద స్తు మే॥
౧౯

ఇత్యుక్తా స్తే నృపా స్సర్వే మిళి త్వాహు శ్చ రాఘవం
రామచంద్ర! త్వదర్థే ఽస్మత్కన్యా నియమితా జనౌ॥
నాన్యస్మై తు న దాస్యామో వృణ్వతే నేతరం త్విమాః॥
౨౦-౨౦౪

భవా నిమా నవృణుతే చే త్తదా త్వద్గృహే స్థితాః॥
దాసీత్వ మపి తే కర్తు మిచ్ఛం త్యేతా న చాపరం॥ ౨౧-౨౧౪

తదా రామ స్స్వజనకం సర్వ మ ప్యవద ద్రహః॥
తదా ప్రాహాత్మజం రాజా విచా ర్యాజసుతః పునః
సీతా త్వనుమతిం దద్యా ద్యది గృహ్ణా తు వై భవాన్॥
౨౨-౨౩

తత స్సీతానుమత్యా తు రాఘవ స్తన్నృపాత్మజాః
ఏకపత్నీవ్రతం స్వీయం సంశ్రుత్య నియమాన్వితః॥

౧౮ ఆరాజులవాక్యమును దశరథుఁడు విని యాలోచించి యాకోసలుఁడు మొదలగు రాజులతో నివ్విధముగఁ బలికెను.

౧౯ ఓరాజోత్తములారా! ఈకన్యకలను భరించువాఁడు రాముఁడు కాన నతని నడిగి యతఁ డంగీకరించినచో నతనికి భార్యనులగా నీయుఁడు. నాకును సంతోషమే యనెను.

౨౦–౨౦½ దశరథుఁడు పైవిధముగాఁ జెప్పుటతోడనే కోసలుఁడు మొదలగురాజులందఱును గలిసి రామునితో నిటులఁ బలికిరి. ఓరామచంద్రా! మాకన్యకలు నీకొఱకు నిదివఱకే యుద్దేశింపఁబడిరి (అనగాఁ బుట్టుటతోడనే). కాన మే మీకన్యకలను నితరుల కిచ్చునది లేదు మే మితరుల కీయఁ దలఁచినను నీకన్యక లితరుని వరింపఁ దలఁచుట లేదు

౨౧–౨౧½ నీవు వీరలను వరింపనిచో నప్పుడు నీగృహమునం దుండి దాసీతనమునైనను జేయఁదలఁచిరి కాని యితరులను వరించుటకు నిచ్చగింపరు (అని రాజులు రామునితోఁ జెప్పిరి)

౨౨–౨౩ అప్పుడు రామచంద్రమూర్తి తనతండ్రి యగు దశరథునితో రహస్యముగ రాజులు చెప్పినదంతయుఁ జెప్పఁగా నాదశరథుఁడు విచారించి కుమారునితో నిటులఁ జెప్పెను. ఓపుత్రా! నీవు సీత నడిగి సీత యనుమతి యిచ్చినచో గ్రహింపు మనియెను.

౨౪–౨౫ అనంతరము రామచంద్రమూర్తి సీత నడిగి సీత యనుమతి యిచ్చినను, నే నేకపత్నీవ్రతుఁడను కాన ధర్మార్థము కాని, భోగార్థము కాని మీపుత్రికలను నేను బరిగ్రహింపను. సేవార్థమై మాత్రము నేను మీకొమరితలను బరిగ్రహించెద నని రాజులతోఁ బ్రీతినఁజేసి చెప్పి సేవార్థమై నూటయిరువదియెనమండ్రుగురు రాజపుత్రికల

* జగ్రాహ పాణినా పాణిం నైవార్థం కేవలం పునః
న ధర్మాయ న భోగాయ నాదదే రాఘవ స్తు తాః॥ ౨౪-౨౫

---

* నను దాసీత్వే పరిగృహీతానాం పాణిగ్రహణ మదృష్ట చర మితిచే న్న. మైత్రీదార్ఢ్యార్థ మేవేతి జ్ఞేయం. న చ పాణీగృహీతానాం న దాసీత్వం. కిం తు భార్యాత్వ మేవేతి వాచ్యం. తర్హి యది పాణినా గ్రహణ మేవ భార్యాత్వే ప్రయోజకం. తదా శ్రీరామసుగ్రీవయోః పాణి గ్రహణ స్యాగ్నిసాక్షికం కృతత్వాత్ సుగ్రీవస్య శ్రీరామ భార్యా త్వాపత్తేః. ఏవ మేవ రాజకన్యానాం పాణిగ్రహణం స్వదాసీత్వదార్ఢ్యార్థ మేవేతి నిశ్చితమ్. రామస్య బహుపత్నీక త్వోక్తౌ బహుగ్రంథవిరోధాపత్తేః.

న చైవం సతి పుత్రీప్రదానం కుర్వతా మష్టరాజ్ఞా మపి సంతోషావహం న భవ తీతి వాచ్యం. యోగినా మ ప్యగోచరే రామచంద్రే స్వపుత్రీణా మనురాగాతిశయం విభావ్య అస్మత్పుత్రీణాం శ్రీరామదాసీభావేన ప్రదాన మస్మాకం పరమపురుషార్థనిధాన మిత్యష్టరాజ్ఞా మ ప్యతి శయమోదావహత్వేన న్యూనతానవకాశాత్. కిం చ దేవతాస్త్రీణా మపి శ్రీరామసేవోత్కంఠాతిశయేన పట్టణా వరణాది పాలకత్వాపేక్షాయాం మనుష్యసాధారణ రాజ స్త్రీణాం శ్రీరామసేవోత్సుకతాయాం కిము వక్తవ్య మితి సర్వం సుస్థమ్.

* పాణిగ్రహణముచేసెను (ధర్మభోగములనిమిత్తము మాత్రము వారలను బరిగ్రహింప లే దని యెఱుఁగునది).

---

* దాసీలనుగా గ్రహింపఁబడినవారలను బాణిగ్రహణముచెసికొనుట యనునది లోకములో నెచ్చటను జూడఁబడియుండలే దని యాశంక కలుగవచ్చును. కాని పాణిగ్రహణముచేయుట (తనచేతితో వారల చేతులను బట్టుకొనుట) మైత్రియొక్క దృఢతకొఱకే యని తెలియనగు. పాణిగ్రహణము చేయఁబడిన వారలు భార్య లగుదురు కాని దాసీలు కా రని యాశంక కలుగును. కాని యంతమాత్రముననే పాణిగ్రహణమే భార్య లగుటకుఁ బ్రయోజకమైనచో శ్రీరామ సుగ్రీవులు మిత్రత్వముయొక్క దార్ఢ్యమునకై అగ్నిసాక్షికముగాఁ బాణిగ్రహణము (ఒకరిచేతి నొకరు పట్టుకొనుట) చేసినట్లు కనఁబడుచుండుటవలన సుగ్రీవుఁడుకూడ శ్రీరామునకు భార్య కావలసియుండును. కాన నచ్చట మైత్రీదార్ఢ్యమునకు శ్రీరాముఁడు సుగ్రీవుని పాణిగ్రహణముచేసినట్లు ఇచ్చటను స్వదాసీత్వదృఢముకొఱకే రాజకన్యలను బాణితో (చేతితో) గ్రహించుట యని నిశ్చితము. రామునకు వారలందఱును భార్య లని చెప్పినచో రాముఁ డేకపత్నీవ్రతముకలవాఁ డని చెప్పు బహుగ్రంథములతో విరోధము కలుగును. ఇట్లైనచోఁ (అనఁగా రాముఁడు రాజపుత్రికలను దాసీలనుగా గ్రహించినచో) దమపుత్రికలను సమర్పించిన యెనమండ్రుగురు రాజులకును సంతోష ముండదుగదా! యని యాశంక కలుగును. కాని యోగులకుఁగూడా గోచరముకాని రామునియందుఁ దమ పుత్రికలయొక్క అనురాగాతిశయములఁ జూచి మనపుత్రికలను శ్రీరామునకు దాసీలనుగా నిచ్చుటకూడ మనకుఁ బరమపురుషార్థసాధనమే యని యారాజులకు సంతోషమే యుండుటవలన న్యూనత కవకాశము లేదనియే చెప్పవలయును. ఇంతియే కాదు. దేవతాస్త్రీలకును శ్రీరాముని సేవించవలయు నని వేడుక కలిగి యయోధ్యాపురిలో నుద్యానవనాదులను బరిపాలించు స్త్రీలుగానుండ మనుష్యసాధారణులైన రాజస్త్రీలకు శ్రీరాముని సేవింపవలయు నను వేడుక కలుగుట విషయమై చెప్పున దేమి?

పున స్త్రిరాత్రినిద్రార్థం రామాద్యానయనాయ చ
సాకేతం ప్రేషితా స్సద్యో జనకేన స్వమంత్రిణః॥ ౨౬
తా నాగతా స్దశరథ శ్శీఘ్రం సత్కృత్య సాదరం
పప్రచ్ఛాగమనే హేతుం తే ఽపి నత్వా త మబ్రువన్॥ ౨౭
పున స్త్రిరాత్రినిద్రార్థం భవ న్తం సకుటుంబకం
ఆహ్వాయామాస వై దేహ స్సపుత్రం ససుహృజ్జనం॥ ౨౮

త త్తేషాం వచనం శ్రుత్వా తథే త్యుక్త్వా నృపాలకః
ప్రయాణం కారయామాస నిర్గంతుం మిథిలాం నిజాం॥ ౨౯

సుముహూ ర్తే తతో రాజా హ స్త్యశ్వరథప త్తిభిః
స్వబంధుమిత్రై స్సహితో నిర్యయౌ మిథిలాం ప్రతి॥ ౩౦

రాజ్ఞః పృష్ఠే సమాజగ్ము ర్గజోపరి విరాజితాః
రామాదయో బాలకా స్తే సర్వభూషణభూషితాః॥ ౩౧
ఆగతం నృపతిం శ్రుత్వా జనకః పౌరవాసిభిః
ప్రత్యుజ్జగామ హర్షేణ నినాయ నగరీం ప్రతి॥ ౩౨

అభ్యంగోద్వ ర్తనాద్యై శ్చ పరిపక్వాన్నభోజనైః
గోదాసదాసీదానై శ్చ హ స్త్యశ్వరథప త్తిభిః॥
చకార తుష్టా న్జామాతౄన్ జనకో నృపతి స్తథా॥౩౩-౩౩౺.

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ఏకవింశతమస్సర్గ స్సమాప్తః.



# ఇరువదియొకటవసర్గ ప్రారంభము.

౧ అనంతరము దశరథుఁడు భార్గవునినుండి విముక్తుఁడై తనసమీపమునకు వచ్చిన రామచంద్రమూర్తిని, మృతినొంది తిరిగి జీవించినచ్చిన వానివలెఁ దలఁచి గాఢముగఁ బుత్త్రుని నాలింగనముచేసికొని యానందబాష్పములను విడిచెను.

౨ అనంతరము దశరథుఁడు తనపుత్త్రమిత్త్రజ్ఞాతిబంధుపరివారములతోఁ గూడినవాఁడై యయోధ్యాపురికి ఛచ్చెను.

౩-౪ దశరథుఁడు పురమునకు వచ్చుచున్నట్లు మంత్త్రిలును, పురజనులును దెలిసికొని పతాకములచేతను, ముత్యాలతోరణములచేతను, మంచి గంధపుజలములచేఁ దడుపుటచేతను బురము నలంకరింపఁజేసి నృత్యగీతవాద్యఘోషములతో దశరథమహారాజును సకుటుంబముగాఁ బురమునకుఁ దీసికొనివచ్చిరి.

౫-౬ రామచంద్రమూర్తి యూరేగింపుమహోత్సవముతోఁ బురవీథుల వెంట వచ్చునప్పుడు స్త్రీలు మేడలపైభాగములయం దుండి తమ పిల్లలను దొడలమీఁద నుంచుకొని చేతులతో సువర్ణపుష్పములను రామునిమీఁదఁ జల్లుచుండిరి.

౭-౮ మఱికొందరు స్త్రీలు రాజమార్గములయం దుండి మంగళప్రదము లగు కుంభదీపాదులచేతను, మంగళారతులచేతను వేశ్యలు నారతుల నిచ్చుచుండిరి.

౯-౧౦ ఈప్రకారము గొప్పయుత్సాహములతోడను, వేశ్యలనృత్యగీతములతోడను, దుందుభిధ్వనులతోడను, గాయకుల గానములతోడను, మేడలమీఁదనుండి స్త్రీలచేఁ జల్లఁబడుచున్న పుష్పవర్షములతోడను దశరథమహారాజు సకుటుంబముగాఁ దనగృహమును బ్రవేశించెను.

యత్రి రత్నోపలాభిత్తౌ హేమ్నః పంకోఽస్తి యత్రి వై
యత్రి స్తంభా స్స్ఫాటికాశ్చ యత్రి మారకతోద్భవాః॥
రత్నదీపాః ప్రికాశంతే సద్వై వాగ్నిశిఖోపమాః॥ ౧౦-౧౦½

వధూగృహప్రవేశం చ కారయిత్వా చ బాలకైః॥
రమాపూజాం కారయిత్వా దదౌ దానాని భూపతిః॥
౧౧-౧౧½

తదాఽలంకారవస్త్రాద్యై స్సుహృదః పార్థివాదయః॥
రామాదీన్పూజయామాసు స్తథా దశరథంనృపం॥౧౨-౧౨½

సర్వా న్దశరథ స్తాం శ్చ పూజయామాస వై భవైః॥
తత స్తే సుహృద స్సర్వే నృపా శ్చ స్వస్థలం యయుః॥
౧౩-౧౩½

1 కోసలో భానుమంతోఽథ మగధ శ్చిత్రిభూషణః॥
యుధాజి త్కేకయాధీశో కాశీనాథః ప్రితర్దనః
పృథ క్షోడశసంఖ్యాకాః దుహితౄః పుణ్యలక్షణాః॥
భూనీలా విమలాఖ్యానా శ్చాష్టావింశాధికం శతం
గృహీత్వా ఽఽగత్య సాకేతం ప్రాహు ర్దశరథం నృపం॥
౧౪-౧౬

కన్యా స్త్విమా జన్మకాలే రాఘవార్థే నిమంత్రితాః
తస్మా త్త్వమేతత్కన్యా స్తు స్నుషాత్వేన గృహాణ వై॥ ౧౭

1. దూర్వాసరామాయణమ్.

* పాణిగ్రహణము చేసెను (ధర్మభోగములనిమిత్తము మాత్రము వారలను బరిగ్రహింప లే దని యెఱుఁగునది).

---

* దాసీలనుగా గ్రహింపఁబడినవారలను బాణిగ్రహణము చెసికొనుట యనునది లోకములో నెచ్చటను జూడఁబడియుండలే దని యాశంక కలుగవచ్చును. కాని పాణిగ్రహణము చేయుట (తనచేతితో వారల చేతులను బట్టుకొనుట) మైత్రతయొక్క దృఢతకొఱకే యని తెలియనగు. పాణిగ్రహణము చేయఁబడిన వారలు భార్యలగుదురు కాని దాసీలు కా రని యాశంక కలుగును. కాని యంతమాత్రముననే పాణిగ్రహణమే భార్య లగుటకుఁ బ్రయోజకమైనచో శ్రీరామ సుగ్రీవులు మిత్రత్వముయొక్క దార్ఢ్యమునకై అగ్నిసాక్షికముగాఁ బాణిగ్రహణము (ఒకరిచేతి నొకరు పట్టుకొనుట) చేసినట్లు కనఁబడుచుండుటవలన సుగ్రీవుఁడుకూడ శ్రీరామునకు భార్య కావలసియుండును. కాన నచ్చట మైత్రీదార్ఢ్యమునకు శ్రీరాముఁడు సుగ్రీవుని పాణిగ్రహణముచేసినట్లు ఇచ్చటను స్వదాసీత్వదృఢముకొఱకే రాజకన్యలను బాణితో (చేతితో) గ్రహించుట యని నిశ్చితము. రామునకు వారలందఱును భార్య లని చెప్పినచో రాముఁ డేకత్నీవ్రతముకలవాఁ డని చెప్పు బహుగ్రంథములతో విరోధము కలుగును. ఇట్లైనచోఁ (అనఁగా రాముఁడు రాజపుత్రికలను దాసీలనుగా గ్రహించినచో) దమపుత్రికలను సమర్పించిన యెనమండ్రుగురు రాజులకును సంతోష ముండదుగదా! యని యాశంక కలుగును. కాని యోగులకుఁగూడా గోచరముకాని రామునియందుఁ దమ పుత్రికలయొక్క అనురాగాతిశయములఁ జూచి మనపుత్రికలను శ్రీరామునకు దాసీలనుగా నిచ్చుటకూడ మనకుఁ బరమపురుషార్థసాధనమే యని యారాజులకు సంతోషమే యుండుటవలన న్యూనత కవకాశము లేదనియే చెప్పవలయును. ఇంతియే కాదు. దేవతాస్త్రీలకును శ్రీరాముని సేవించవలయు నని వేడుక కలిగి యయోధ్యాపురిలో నుద్యానవనాదులను బరిపాలించు స్త్రీలుగానుండ మనుష్యసాధారణులైన రాజస్త్రీలకు శ్రీరాముని సేవింపవలయు నను వేడుక కలుగుట విషయమై చెప్పున దేమి?

పున స్త్రిరాత్రినిదార్థం రామాద్యానయనాయ చ
సాకేతం ప్రేషితా స్సద్యో జనకేన స్వమంత్రిణః॥ ౨౬
తా నాగతా స్దశరథ శ్శీఘ్రం సత్కృత్య సాదరం
పప్రచ్ఛాగమనే హేతుం తే ఒపి నత్వా త మబ్రువన్॥ ౨౭
పున స్త్రిరాత్రినిదార్థం భవ న్తం సకుటుంబకం
ఆహ్వాయామాస వై దేహ స్సపుత్రం ససుహృజ్జనం॥ ౨౮

త త్తేషాం వచనం శ్రుత్వా తథే త్యుక్త్వా నృపాలకః
ప్రయాణం కారయామాస నిర్గంతుం మిథిలాం నిజాం॥ ౨౯

సుముహూర్తే తతో రాజా హ స్త్యశ్వరథప త్తిభిః
స్వబంధుమిత్రై స్సహితో నిర్యయా మిథిలాం ప్రతి॥ ౩౦

రాజ్ఞః పృష్ఠే సమాజగ్ము ర్గజోపరి విరాజితాః
రామాదయో బాలకా స్తే సర్వభూషణభూషితాః॥ ౩౧
ఆగతం నృపతిం శ్రుత్వా జనకః పౌరవాసిభిః
ప్రత్యుజ్జగామ హర్షేణ నినాయ నగరీం ప్రతి॥ ౩౨

అభ్యంగోద్వ ర్తనాద్యై శ్చ పరిపక్వాన్నభోజనైః
గోదాసదాసీదానై శ్చ హ స్త్యశ్వరథప త్తిభిః॥
చకార తుష్టా న్జామాతౄన్ జనకో నృపతి స్తథా॥౩౩-౩౪

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ఏకవింశతమస్సర్గ స్సమాప్తః.



లేచుటతోడనే యోషధులను లక్ష్మణుఁడు బలాత్కారముగాఁ దీసికొనివెళ్లిన వృత్తాంతమును జెప్పిరి.

౨౫-౨౬ ఆముద్గలుఁడు తన శిష్యులవాక్యమును విని యాశ్చర్యపడి వారలతో నిటులఁ బలికెను. ఓ శిష్యులారా! లక్ష్మణుఁ డెవ్వఁడు? ఎవనియాజ్ఞచే నోషధులను దీసికొని వెళ్లెను? చెప్పుడనఁగా శిష్యులు ముద్గలమహామునితో నిట్టులఁ జెప్పిరి. గురువర్యా! రాముని యానతిచే నేను తీసికొని పోవుచున్నా నని చెప్పి యోషధులను బలాత్కారముగా లక్ష్మణుఁడు సీసికొని పోయె నని చెప్పిరి.

౨౭-౨౭½ ముద్గలమహర్షియు సమస్తవృత్తాంతమును యోగదృష్టిచేఁ దెలిసికొని శిష్యులను దొందరగ రండని చెప్పి శిష్యసమేతుఁడై శ్రీరామున జూడగలందులకు సంతోషముతో మార్గమునుండి వచ్చుచుండెను.

౨౮-౨౮½ ఈసమయమున నచ్చట దశరథమహారాజు సందేహపడి సంజీవని మొదలగు నోషధులసమాచారమును రామచంద్రమూర్తి నడిగెను.

౨౯-౩౦ ముద్గలాశ్రమమునుండి యాయోషధులను లక్ష్మణునిచేఁ దెప్పించితి నని రాముఁడు దశరథునితోఁ జెప్పఁగా దశరథుఁడు రాముని దిరిగి యిటులఁ బ్రశ్నించెను పుత్రా! ముద్గలమహర్షితోఁ జెప్పి యామునియానతిమీఁదనే లక్ష్మణుఁడు సంజీవని మొదలగు నోషధులను దెచ్చెనా? చెప్పకుండగఁ దెచ్చెనా? అని ప్రశ్నింపఁగా రాముఁ డిటులఁ జెప్పెను.

౩౧-౩౧½ ఓ తండ్రీ! ముద్గలమహర్షి సమాధిలో నుండుటవలన నమ్మునికిఁ జెప్పకుండఁగనే లక్ష్మణుఁడు సంజీవని మొదలగు నోషధులను దీసికొని వచ్చెనని రాముఁడు చెప్పఁగా విని దశరథుఁడు ముద్గలమహర్షి శాపమువలని భయముచే వణకుచుండెను.

తతో దశరథః పుత్రా న్సమానీయ భయాన్వితః॥
పాదచారీ ముద్గలస్య నిర్జగా మాశ్రమం శుభం॥ 3౨-3౨౪

కియ ద్దూరే గతే రాజ్ఞి సపుత్రే ముద్గలో ఒపి సః॥
సశిష్యో ఒభిముఖ స్త్వాసీ ద్రామదర్శనకాముకః॥ 33-33౪

తదా దశరథ స్తస్మై ముద్గలాయ సపుత్రకః॥
నమస్కృ త్యాహ వచనం ప్రాంజలి ర్భయవిహ్వలః॥ 3౪-3౪౪

మదాత్మజాపరాధం తు క్షమస్వ మునిస త్తమ!
ఇత్యర్థితో ముద్గలో ఒపి ప్రాహ తం వచనం త్విదం॥ 3౫-3౫౪

మాబిభేహి నృప శ్రేష్ఠ! త్వత్పుత్రా న్మమ వై ధ్రువం॥
ఉపకారో మహా న్జాతో నాపకారో ఒభవ న్మమ॥ 3౬-3౬౪

నోచే త్కథం దర్శనం మే ధ్యానస్థస్య సుతస్య తే॥
ఇ త్యుక్త్వా రాఘవం స్వాంకే చోపవేశ్య పునఃపునః
సమాలిం గ్యానందబాష్పకణాం శ్చ ముముచే మునిః॥ 3౭-3౭౪

తత స్తా న్స్వాశ్రమం నీత్వా ముద్గలః పర్యపూజయత్॥ 3౮

రామస్య భావికాలీనం ఫలం దశరథ స్తతః॥
రహః పప్రచ్ఛ తం మౌనిం ముద్గలం వినయాన్వితః॥ 3౯-3౯౪

3౨-3౨½ అనంతరము దశరథుఁడు భయపడి తనపుత్త్రులను దీసికొని పాదచారియై ముద్గలమహర్షి యాశ్రమమునకు బయలుదేరెను.

33-33½ దశరథమహారాజు పుత్త్రసహితుఁడై కొంతదూరము వెళ్ళఁగా ముద్గలమహర్షియును శిష్యసహితుఁడై రాముని దర్శించుటకు నెదురుగా వచ్చుచుండెను.

3౪-3౪½ అప్పుడు దశరథుఁడు పుత్త్రసమేతముగా నాముద్గలమహర్షికి నమస్కరించి భయపడుచుఁ జేతులు జోడించి యమ్మునితో నిటులఁ బలికెను.

3౫-3౫½ ఓమునిశ్రేష్ఠుఁడా! నాకుమారులయపరాధమును క్షమింపుమ అని దశరథుఁడు ప్రార్థింపఁగా ముద్గలుఁడును నాదశరథునితో నిటులఁ బలికెను.

3౬-3౬½ ఓరాజోత్తమా! నీవు భయపడకుము. నీపుత్త్రునివలన నాకు గొప్ప యుపకారము జరిగెను కాని యపకారము లేదని యెఱుఁగుము.

3౭-3౭½ నీకుమారుఁడు వచ్చి యోషధులను దీసికొని వెళ్ళకపోయినచో సమాధిలోనున్న నాకు నీకుమారునిదర్శన మెట్లు లభించును? అని ముద్గలుఁడు చెప్పుచు రామచంద్రమూర్తిని దన తొడమీఁదను గూర్చుండఁబెట్టుకొని యాలింగనముచేసికొని యానందబాష్పములను విడుచుచుండెను.

3౮ అనంతరము ముద్గలమహర్షి దశరథుఁడు మొదలగువారల నందఱను తనయాశ్రమమునకుఁ దీసికొని వెళ్లి యర్ఘ్యపాద్యాదులచేఁ బూజించెను.

3౯-3౯½ అనంతరము దశరథుఁడు రామునకు ముందుజరుగఁబోవు శుభాశుభఫలములను (అనగా జాతకఫలములను) జెప్పవలసినదిగా ముద్గలమహర్షిని రహస్యముగ నడిగెను.

తదా దశరథం ప్రాహ ముద్గల స్తు రహః స్థలే॥
తవ పుణ్యవశా జ్జాత స్తవ పుత్రో రఘూత్తమః
వినాశనం చ దుష్టానాం సజ్జనానాం చ పాలనం॥
కరిష్యతి మహా నేష స్స ప్తద్వీపపతి ర్భవేత్॥ ४०-४०५

ద్వౌ తౌ భవిష్యతః పుత్రౌ చతస్ర శ్చ స్నుషా స్తథా॥
చతుర్వింశతిపౌత్రా శ్చ పౌత్ర్య స్తు ద్వాదశై వ హి
అసంఖ్యాతాః ప్రపౌత్రాద్యాః భవిష్యంతి సుతస్య తే॥ ४२-४३

దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని సః
పాలయిష్యతి రాజ్యం చ సర్వసౌఖ్యాని భోక్ష్యతి॥ ४४

అల్పకాలే భవాం శ్చాపి దివ మేష్యతి పార్థివ!
ఇతఃపరం న వక్తవ్యం వక్తవ్యం ప్రతిపాదితం॥ ४५

ఇత్యుక్త శ్చో ఽపి రాజా చ మునిం నత్వా తదానతిం
గృహీత్వా సాత్మజ శ్శీఘ్రం సైన్యం ప్రతి సమాగతః॥ ४६

సర్వే నిర్గత్య సాకేతం ప్రాప్య రామాదయ స్తతః
స్వపిత్రా మాతృభి స్సాకం సుఖ మూషు స్స్వవేశ్మసు॥ ४७

తతో రాజా దశరథ స్స్వపుత్రాధిక్యతోషితం
బ్రహ్మానందం యథా ప్రాప్త స్తిష్ఠతిస్మ ముదాన్వితః॥ ४८
ఇ త్యాశ్చర్యరామాయణే బాలకాండే ద్వితీయభాగే
ద్వావింశతితమస్సర్గ స్సమాప్తః.



౪౦-౪౧ అప్పుడు ముద్గలమహర్షియును రహస్యస్థలముననే దశరథునితో నిటులఁ బలికెను ఓరాజా! ఈరాముఁడు నీవు చేసిన పుణ్యావశము వలన నీకుఁ బుత్త్రుఁడుగాఁ బుట్టెను. ఇతఁడు దుష్టులను సంహరించి శిష్టులను బరిపాలించును. మఱియు సప్తద్వీపములకుఁ ప్రభువు కాఁగలఁడు.

౪౨-౪౩ ఓరాజా! నీకుమారుఁ డగు రామునకు నిద్దరుకుమారులును, నలుగురుకోడండ్రును, నిరువదినలుగురు మనుమలును, బండ్రెండుగురు మనుమరాండ్రును, నసంఖ్యాకు లగు ప్రపౌత్త్రులును గలుగఁ గలరు

౪౪ మఱియు నతఁడు పదునొకండువేలసంవత్సరములు రాజ్యమును బాలించఁగలఁడు. సర్వసౌఖ్యముల ననుభవింపఁగలఁడు.

౪౫ ఓరాజా! కొద్దికాలములో నీవు స్వర్గమున కేగఁగలవు. ఇంతకంటె నెక్కువగఁ జెప్పఁగూడదు. చెప్పఁదగినదంతయుఁ జెప్పితిని (అని ముద్గలుఁడు దశరథునితోఁ జెప్పెను).

౪౬ ఇవ్విధముగ ముద్గలుఁడు చెప్పఁగా దశరథుఁడు విని సంతసించి ముద్గలమహర్షికి నమస్కరించి యామునియానతిని బొంది తన పుత్త్రులతోడ శీఘ్రముగ సైన్య మున్న స్థలమునకు వచ్చెను.

౪౭ అనంతరము రాముఁడు మొదలగు దశరథపుత్త్రులందఱును దమ తల్లిదండ్రులతో బయలుదేరి యయోధ్యకు వెళ్లి తమతమగృహముల యందు సుఖముగ నుండిరి.

౪౮ దశరథుఁడు తనపుత్త్రోత్కర్షను జూచి మహానందమును బొందుచుండెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున ద్వితీయభాగమున
నిరువదిరెండవసర్గము ముగిసెను.



## త్రయోవింశతితమస్సర్గ ప్రారంభః.

తత స్సర్వే ష్వుత్సవేషు జనకో వార్షికేషు చ
నినాయ మిథిలాం రామం మాతృభిః పార్థివేన చ॥ ౧

మాసై ష్షడ్భి ర్జనకజా లక్ష్మీ శ్శ్రీరాఘవా చ్ఛుభా
లగ్నే హ్యేకాదశే వర్షే రజోయుక్తా బభూవహ॥ ౨

తతో వసిష్ఠో మునిభి ర్గర్భాధానవిధిం సమం
కారయామాస రామేణ సీతాయా శ్చాతిహర్షితః॥ ౩
రామం వస్త్రై రలంకారై ర్జనకో ఉపూజయ త్తదా
మాస మేకం వ్యతిక్రమ్య యయౌ స్వనగరీం శుభాం॥ ౪

రామో ఽపి సీతయా సార్థం నానాభోగా న్సుపుష్కలాన్
బుభుజే హేమరత్నాదినిర్మితేషు గృహేషు సః॥
రుక్మమండనయుక్తాభి ర్దాసీభి ర్వీజిత స్సుఖం॥ ౫-౫½
ఏవం తాసాం నృపసుతపత్నీనాం చ పృథ క్పృథక్॥
యథాకాలే విధానేషు గర్భాధానాదికేషు చ
ఆగత్య జనక శ్చక్రే నానోత్సాహా న్ముదాన్వితః॥ ౬-౭
అయోధ్యానగరీమధ్యే వాద్యఘోషో గృహేగృహే
మంగళాని చ సర్వత్ర న కుత్రా ప్య స్త్యమంగళం॥
న దరిద్రో ఋణీ నాసీ న్నాధివ్యాధిపరిపీడితః॥ ౮-౮½

## ఇరువదిమూఁడవసర్గ ప్రారంభము.

౧ అనంతరము పండుగల కన్నిటికిని జనకమహారాజు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను దల్లిదండ్రులతోఁగూడఁ దనమిథిలాపురమునకుఁ దీసికొని పోవుచు గౌరవించుచుండెను.

౨ శ్రీరామచంద్రమూర్తి కంటె సీతాదేవి యారుమాసములు చిన్నదిగా నుండెను. పదునొకండవ సంవత్సరమున సీతాదేవి రజస్వల యయ్యెను.

౩ అనంతరము వసిష్ఠుఁడు మునులతోఁగూడి సంతోషముతో సీతారాములకు నిషేకశుభమును జేయించెను

౪ జనకమహారాజు వస్త్రాలంకారాదులచే రాముని బూజించి యొక మాసమువరకు నచ్చటనే యుండి యనంతరము తన పట్టణమును గూర్చి వెళ్లెను.

౫-౫౪ రాముఁడును స్వర్ణరత్న నిర్మితములగు భవనములయందుండి దాసీలచేఁ బరిచర్య చేయఁబడుచు సీతతోఁగూడ ననేకభోగములను బుష్కలముగ ననుభవించెను.

౬-౭ ఈప్రకారముగ రాజపుత్రులకు నాయాకాలములయందు గర్భాధానాదిశుభములు జరిగినప్పుడు జనకుడు వచ్చి సంతోషముతో ననేకములగు నుత్సాహకరమైన పనులనుఁ జేయుచుండెను.

౮-౮౪ అయోధ్యాపట్టణమునఁ బ్రతిగృహమునందున నెల్లప్పుడు శుభములును వాద్యఘోషములును జరుగుచుండునుగాని యెచ్చటను నమంగళ మనునది లేదు. మఱియు నాపురమునందు దరిద్రుఁడుకాని, ఋణగ్రస్తుఁడుకాని, యాధివ్యాధులచేఁ బీడింపఁబడువాడుకాని యొక్కఁడైనను లేకుండెను.

రామాదిభి శ్చతుర్భి స్తై ర్భ్రాతృభి స్తదనంతరం॥
పృథ గ్గేహేషు భార్యాభి ర్గార్హస్థ్యంచాధ్యనుష్ఠితం॥౮-౮½

రామః ప్రాత స్సముత్థాయ కృతశౌచాదిసత్క్రియః॥
ఆరుహ్య శిబికాం దివ్యాం స్నానార్థం సరయూం నదీం
గత్వా కూలే వాహనం తు విసృజ్య రఘునందనః॥
స్నాత్వా నిత్యవిధిం కృత్వా బ్రాహ్మణానాం యథావిధి
దత్వా దానా న్యనేకాని గోభూధాన్యధనాదిభి॥
సంపూజ్య సరయూం గేహం నిర్యయౌ సద్ద్విజై ర్వృతః॥
౧౦-౧౨½

నిజవేశ్మ సమాగత్య కృత్వా చాగ్నిక్రియా స్తతః॥
శివపూజాం తతః కృత్వా పురాణశ్రవణం తతః
వసిష్ఠముఖత శ్శ్రుత్వా సంపూజ్య చ గురుం తతః॥
ఉపాహారం విధా యాథ స్వర్ణచేలాంబరాదికం
ధృత్వా రథం సమారుహ్య గత్వా వై మాతృమందిరం॥
కౌసల్యాయై నతిం కృత్వా తదాశిష మవాప్య చ
సాపత్న్యమాతృగేహాని గత్వా తాసాం ప్రణమ్య చ॥
లబ్ధ్వా తదాశీర్వాదాం శ్చ సభాస్థల ముపాగతః॥౧౩-౧౮½

ప్రణమ్య పితరం తస్మా దాశిషం ప్రాప్య రాఘవః॥
తదానత్యా తన్నికటే చోపవిష్ట శ్శుభాసనే
రాజకార్యాణి సర్వాణి పరిశీల్య పున స్తతః॥
పిత్రానత్యా రథారూఢో నిజవేశ్మ సమాగతః
నిజాగమనపశ్యంత్యా సీతాయా ప్రీతిపూర్వకం॥

౭-౯॥ పిమ్మట రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నల్వురుసోదరులు వేర్వేఱ గృహములయందుఁ దమతమభార్యలతో గృహస్థసౌఖ్యముల ననుభవించుచుండిరి.

౧౦-౧౨॥ రాముఁడు ప్రాతఃకాలముననే లేచి శౌచాదిక్రియల నాచరించి మేనా యెక్కి స్నానార్థమై సరయూనదియొద్దునకు వెళ్లి వాహనమునుండి దిగి నదిలో స్నానము చేసి నిత్యకృత్యములను నెఱవేర్చుకొని బ్రాహ్మణులకు గోభూధాన్యాదిదానముల ననేకముగాఁ జేసి సరయూనదిని బూజించి బ్రాహ్మణులచే నావరింపఁబడి తన గృహమునకు బయలుదేరుచుండును.

౧౩-౧౬॥ తనగృహమునకు రామచంద్రమూర్తి వచ్చి యగ్నిహోత్రములను జేసి పిమ్మట శివపూజఁజేసి యనంతరము వసిష్ఠుని ముఖమునుండి పురాణశ్రవణము చేసి గురువును బూజించి యుపాహారమును (ఫలహారమును) జేసి బంగారుసరిగగల వస్త్రములను ధరించి రథమునెక్కి తల్లిగృహమున కేగి కౌసల్యకు నమస్కరించి యామె యాశీర్వాదము నొంది సవతితల్లుల గృహముల కేగి వారలకు నమస్కరించి వారల యాశీర్వాదములఁ గైకొని సభాస్థలమునకు వచ్చుచుండును.

౧౭-౨౦ పిమ్మట రామచంద్రమూర్తి తండ్రికి నమస్కరించి తదాశీర్వాదము నొంది తండ్రియానతిచేఁ దత్సమీపముననే యొకసింహాసనమునందుఁ గూచుండి రాజకీయములగుపనులనన్నిటిని క్షణకాలములో బరిశీలించి చక్కఁబెట్టి తండ్రియానతి నొంది తిరిగి రథారూఢుఁడై తనగృహమునకు వచ్చి తనరాక కెదురుచూచుచున్న సీతాదేవిచేఁ బ్రేమపూర్వకముగ లోపలికిఁ దీసికొని పోఁబడి ప్రక్షాళనము

ప్రక్షాళితపద శ్చాంత ర్నీత స్స్నాత్వా పున స్తతః
మాధ్యాహ్నికంసంవిధాయభుక్త్వా శేతేస్మసోఽచిరం॥ ౧౭-౨౦

విశ్రమ్య రామ స్సాయాహ్నే సహాసై స్సఖిభిస్సహ
రథారూఢః పుష్పవాటీం గత్వా త త్రోపవిశ్య చ॥
తత్రతత్ర చ సంచార్య సాయ మాగత్య వేశ్మనః
సాయంకృత్యాని కృత్వా ఽగ్నికర్మ చాపి విధాయ సః॥
భుక్త్వా ఽథ కించి త్సంచార్య నిద్రాస్థానం మనోహరం
హేమరత్నమయం దివ్యం గేహం వై కుంతసన్నిభం॥
గత్వాసౌవర్ణమంచే తు సీతయాశయితోఽభవత్॥ ౨౧-౨౩½
ఉషఃకాలే సముత్థాయ ప్రాతః స్మరణకృ త్తతః॥
ప్రాతఃకృత్యాని సర్వాణి కరోతిస్మ యథావిధి॥ ౨౪-౨౪½
ఏవం రామ స్త్వ నుదినం కుర్వన్లోకహితాయ వై॥
విజహార బహూన్వర్షా న్సీతయా సహ వేశ్మని॥ ౨౫-౨౫½

గద్య

ఇతి శ్రీరామచంద్రచరణకమలసేవాతత్పరేణ రామాయణకేస
రీత్యాదిబిరుదాంకితేన విశ్వామిత్రగోత్రోద్భవేన లక్కావఝల
వంశముక్తాఫలేన సుబ్బమాంబాజానే స్సుబ్రహ్మణ్యసిద్ధాం
తిన స్తనూజేన వేంకటకృష్ణశాస్త్రిణా విరచితే
ఆశ్చర్యరామాయణే బాలకాండే
ద్వావింశతితమ స్సర్గః.
బాలకాండ స్సమాప్తః.
శ్రీభద్రాచలరామచంద్రార్పణ మస్తు.

చేయఁబడిన పాదములు గలవాఁడై లోనికి వెళ్ళి తిరిగి స్నానముచేసి మాధ్యాహ్నికకృత్యములఁ జేసి భుజించి కొలఁదికాలము నిద్రించు చుండును.

౨౦-౨౩½ అనంతరము రామచంద్రమూర్తి సాయంకాలమున దన సోదరులతో రథారూఢుఁడై యుద్యానవనమున కేగి యచ్చట గూర్చుండి పిమ్మట నచ్చటచ్చట సంచరించి గృహమునకు సంధ్యాసమయమునకు వచ్చి సంధ్యావందనమును నగ్నిహోత్రమును జేసికొని యనంతరము భుజించి సువర్ణరత్నఖచితమును, మనోహరమును, వైకుంఠసదృశము నగు పడకటింటిలోని సువర్ణమయ మగు మంచమున బ్రవేశించి సీతతోఁగూడ శయనించుచుండును.

౨౪-౨౪½ ఉషఃకాలముననే లేచి ప్రాతఃస్మరణమును జేయుచుఁ బ్రాతః కృత్యముల నన్నిటినిఁ జేయుచుండెను.

౨౫-౨౫½ ఈప్రకారము రాముఁడు ప్రతిదినము లోకసంగ్రహార్థము కృత్యములను జేయుచు సీతాదేవితోఁగూడ స్వగృహమునందు బహు సంవత్సరములు (అనగా బండ్రెండు సంవత్సరములు) విహరించెను.

గద్య

ఇది శ్రీరామచంద్రచరణకమలసేవాతత్పరుఁడును, రామాయణకేసరీత్యాది బిరుదాంకితుఁడును, విశ్వామిత్రగోత్రోద్భవుఁడును, లక్ష్మీవర్ఘుల వంశముక్తాఫలుఁడును, సుబ్బమాంబా సుబ్రహ్మణ్యసిద్ధాన్తుల తనూజుఁడును నగు వేంకటకృష్ణశాస్త్రిచే రచియింపఁబడిన ఆశ్చర్యరామాయణమునందు బాలకాండమున ద్వితీయభాగమున నిరువదిమూఁడవ సర్గము సమాప్తము.

బాలకాండ సమాప్తము.

శ్రీభద్రాచలరామచంద్రార్పణ మగుఁగాక !

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 10 | బుద్ధయ | బుద్ధయః |
| 14 | 4 | పభోమా | పరిభోపమాం |
| 22 | 4 | సర్వా | సర్వాః |
| 42 | 6 | రక్షో | రక్షః |
| 45 | 20 | గూడుకొని | గూడుకొనిన |
| 58 | 3 | సంగతో | సంగతః |
| 75 | 10 | న ధ | నర్ధ |
| 82 | 11 | పమేవశ్యామి | మేవపశ్యామి |
| 103 | 1 | దవరధుడు | దశరథుడు |
| 120 | 1 | పుతారి | పితారి |
| 132 | 16 | ఉతిష | ఉత్తిష్ఠ |
| 135 | 20 | సంధ్యమున | సంధ్యవలన |
| 137 | 5 | కమరిముగా | క్రిమముగా |
| 138 | 10 | సర్వథా | స్సర్వథా |
| 140 | 11 | కుతో | కుతః |
| 141 | 12 | వర్ణనను | వర్ణనమును |
| 158 | 16 | హన | జహి |
| 166 | 10 | శ్రిమతి | శ్రిమమితి |
| 168 | 7 | సంపృష్టో | సంపృష్టః |
| 172 | 9 | మన్వానో | మన్వానః |
| 178 | 2 | నాశయిష్యామ | నాశయేమతు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 182 | 10 | సమా_ | సమాప్త |
| 182 | 12 | మహా_ | మహార్షి |
| 188 | 8 | చతురో | చతురః |
| 188 | 10 | దాయః | దయః |
| 192 | 8 | భవష్యసి | భవిష్యసి |
| 204 | 9 | సమాపృష్టో | సమాపృష్టః |
| 208 | 2 | సహాస్రి | స్వకీయ |
| 209 | 3 | వెయ్యినేత్రములు | నేత్రములు |
| 224 | 5 | దదం | దదాం |
| 224 | 9 | భుంజీయం | భుంజీయ |
| 224 | 10 | తూష్ణీమతిష్టత్ | తూష్ణీంస్మతిష్ఠతి |
| 226 | 14 | తస్యా౨ | తస్యా |
| 228 | 13 | స్వేష్ట దేవీం | దేవీం |
| 230 | 11 | సమాప్తాయ | సమాసాద్య |
| 232 | 6 | పునీతాం | పూతాంమే |
| 232 | 12 | విష్ణో | విష్టో |
| 263 | 11 | _శికాంచు | ప్రికాశించు |
| 264 | 25½ శ్లోకము తరువాతను 12 - 12½ శ్లోకములను వాటి భావములను చదువుకొన వలయును. | | |
| 266 | 16 | _స్త్రియః | స్త్రియః |
| 268 | 3 | శ్చతురాస్యో | శ్చతురాస్యః |
| 284 | 1 | నారదాద్యతః | నారదాస్యతః |
| 286 | 3 | చక్రివ_ర్తి | చక్రివర్తి |
| 290 | 2 | విచారయంతం | విచారయంతీం |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 298 | 2 | భవిభ్యతి | భవిష్యతి |
| 298 | 6 | న్రారాక్షసో | న్రాక్షసో |
| 303 | 21 | నివ్వి | నిట్లు |
| 305 | 22 | మంత్రిమురి | మంత్రిముల |
| 310 | 3 | తదిరస్య | త్థదిరస్య |
| 316 | 10 | ముదాన్వితాం | ముదాన్వితాః |
| 316 | 14 | రామ | రావ |
| 342 | 14 | వాతాయనం౨౨ | వాతాయనం |
| 356 | 20 | గృహిత్వా | గృహీత్వా |
| 370 | 16 | న్పలయచ్ఛమే | న్ప్రియచ్ఛమే |
| 384 | 8 | విరాజసే | విరాజతే |
| | | శక్తోస్సి | శక్తోస్తి |
| 385 | 20 | నన్నిం | నిన్నిం |
| 39౨ | 8 | అడిత్యా | ఆదిత్యా |
| 396 | 12 | గృహ్ణాతు | గృహ్ణోతు |
| 402 | 18 | విధ్యా | విథ్వా |
| 412 | 4 | స్పష్ట | స్పష్ట |
| 413 | 15 | వివి | విని |
| 416 | 21 | సీతాయా | సీతయా |



# బాలకాండఫలశ్రుతిః

॥ రామాదీనాం చతుర్ణాం తు ప్రసూతిం యశ్శృణోతి హి
సపుత్రపౌత్రైస్సంయుక్తః స్థిత్వా రామపదం వ్రజేత్॥ ౧
ఋషేః పూజాం సమాకర్ణ్య ఋణాన్ముక్తో భవేన్నరః
తాటకావధ మాకర్ణ్య హ్యవిద్యానాశ మాప్నుయాత్॥ ౨
గంగాయా వైభవం శ్రుత్వా గంగాసాయుజ్యమాప్నుయాత్॥
శాపముక్తిం చ భార్యాయా శ్శృత్వా చేద్గౌతమస్య హి
నరః పాపాద్విముచ్యేత నారీ వా వ్యభిచారజాత్॥ ౩౪
యశ్శృణోతి నరో భక్త్యా జానక్యా మంగళోత్సవం
సర్వసౌఖ్యాని లభతే రామచంద్రప్రసాదతః॥ ౪౫
బాలకాండకథాం సర్వాం యే శృణ్వంతి నరోత్తమాః
విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకం సనాతనం॥

---

# మంగళశ్లోకాః

। మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం॥ ౧
॥ విశ్వామిత్రాంతరంగాయ రక్షోఘ్నాయ శుభాంగినే
జానకీదేహభూషాయ రఘువీరాయ మంగళం॥ ౨
భద్రాచలనివాసాయ భక్తాభీష్టప్రదాయచ
చారుకోదండహస్తాయ సీతారామాయ మంగళం॥ ౩

శ్రీ రామార్పణమస్తు.

